యేఁడు రాజ్యమునకు వచ్చెను. వీరు ప్రఖ్యాతములగు ననేక కార్యముల జరిగించిరి. సంస్థానములోఁగల రథములు, మండపములు, సువర్ణవృషభవాహనము, రజితసింహవాహనము, ఆఱుస్తంభములుగల బంగారపు టంబారీ, మున్నగువానిని జేయించిరి. నగరునకు బశ్చిమభాగంబున గొప్పమసీదునుగూడఁ గట్టించిరి.

క్రీ॥ శ॥ 1790 వ సంవత్సరములో టిప్పుసుల్తాన్‌తోఁ గూడిన యుద్ధము ప్రసక్తముకాఁగా నప్పుడు సంస్థానాధిపతులందఱును నవాబు వారిపక్షములోనున్న యింగ్లీషువారికి సాహాయ్యమునకుఁ బోయియుండిరి. అక్కడ యుద్ధమునకుఁ బోవునపు డింగ్లీషువారి కూచి కాఁగానే వేంకటగిరివారి కూచి కావలసియుండఁగాఁ గాళహస్తివారు ముందుగాఁ దమ నకారాకూచి చేయింపఁగా నీకుమారయాచమనాయఁడు చెన్నపురిగవర్నరుగారి కీసంగతిని దెలిపిరి. అప్పుడు గవర్నరుగా రుభయసంస్థానపు మర్యాదలను విచారించి వేంకటగిరివారి నకారాకూచియే ముందుజరుగవలసినదని తీర్మానించి వ్రాతమూలముగఁ దెలియపఱచిరి. మఱియు నీయుద్ధములో వేంకటగిరివారుచేసిన సాహాయ్యమునకుమెచ్చి గవర్నరుగారు 1790 జులై 17 తేదీగల యినాయతునామాతో వీరికి 200 తుపాకులఁ బంపిరి.

వీరికాలములోనే యార్కాడుసుబా యింగ్లీషువారి వశమగుటచే నంతవఱకు నార్కాడునబాబునకు జెల్లించుచుండిన పేష్కషుహొన్నులు 21,673 ను జంగీశిబ్బందికిబదులుగా నప్పుడేర్పఱచిన హొన్నులుమొత్తము 89,385 వెరశి 1,11,058 హొన్నులుపేష్కష్‌గాఁ జెల్లింపవలసినట్లు 1802 ఆగస్టు 24 తేదీగల యిస్తిమిరారు అను శాశ్వతమైన పట్టానుబొంది తదాదిగ 1,11,058 పూలవరాలను జెల్లించుచుండిరి.

వీరు వేంకటగిరి తాలూకాలోని 'పాలసముద్రము, యాతలూరు' అను గ్రామములను శ్రీకాళీవిశ్వనాథస్వామివారికిని, 'సుబ్రహ్మణ్యము' అను గ్రామమును శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారికిని నిత్యపూ

జానివేదనల్లకై సమర్పించిరి. మఱియు డెబ్బదినాలుగు గ్రామములను నగ్రహారములుగ నిచ్చిరి.

వీరు తమ నలుబదిరెండవయేట ననఁగా (క్రీ॥ శ॥ 1804 సం॥) రక్తాక్షి సం॥ అధికచైత్ర శు 2 నాఁడు కైవల్య మందిరి.

వీరియనంతరమున వీరిదత్తపుత్త్రుఁడగు బంగారుయాచమనాయఁడుగారు సింహాసన మధిష్ఠించిరి. వీరు మద్రాసు గవర్నరు గారైన సర్ థామస్ మన్రోగారి దర్శనముజేసి వారిచే శ్రేష్ఠమైన యొక యింగ్లీషుకత్తిని గొప్పమర్యాదలను బొందిరి. వీరు శ్రీకాశీ విశ్వనాథస్వామివారి కొక వెండియేనుఁగువాహనమును జేయించిరి. వీరు దేవస్థానములకు నెనిమిదిగ్రామములను సమర్పించిరి.

మఱియు నాల్గవతరమువాఁడైన యెఱ్ఱదాచానాయనికి జయలబ్ధమైన పచ్చ పిఠాపురముశాఖవారికి బ్రాప్తముకాఁగా దానిని మఱల బహుళధనమొసఁగి తాము విక్రయమునకుఁ దీసికొనిరి. ఈమర కత మిప్పటివఱకును సంస్థానములో ముఖ్యశిరోభూషణముగ ధరింపఁబడుచుండెను. వీరుడిల్లీచక్రవర్తిచే నొసంగఁబడిన బిరుదంబారీయొక్క యాకృతిలోఁ బంగ్రెండు స్తంభములుగల యొకబంగారపుటంబారిని జేయించిరి. మఱియు వీరు ముప్పదియెనిమిది గ్రామములను దానముచేసి యుండిరి.

వీరియనంతరమునఁ గుమారయాచమనాయఁడుగారు సింహాసనమునకువచ్చిరి. వీరు తమ యాస్థానపండితుఁడగు తర్కభూషణము వేంకటాచార్యులవారిచే 'శృంగారకల్పవల్లి' యను నలంకారగ్రంథమును జేయించి (క్రీ॥ శ॥ 1851) శాలివాహనశకము 1773 సం॥ సాధారణ సంవత్సరాశ్వయుజ బహుళాష్టమిని వేంకటగిరితాలూకాలోని వెదురుగుంటయను గ్రామమును సర్వాగ్రహారముగ నొసంగిరి. వీరు రామేశ్వరయాత్ర జరిగించినప్పుడు దిరువళ్లూరి వీరరాఘవస్వామివారి కొకస్వర్ణమయమైన శఠగోపమును సమర్పించిరి. శ్రీకంచి వరదరాజ

స్వామివారి గరుడవాహన హనుమద్వాహనముల వేంచేపులు తమపే ర నేఁటేఁట జరుగుటకు వాని కయ్యెడు వ్యయము దా మిచ్చుట కేర్పాటు గావించియుండిరి.

వీరు గోపినాథ వేంకటకవియనువానిచే వాల్మీకిరామాయణమును, బ్రహ్మవైవర్తపురాణ మందలి శ్రీకృష్ణజన్మఖండమును, భగవద్గీతలను నాంధ్రీకరింపించి తాము కృతినంది మూరెళ్ళతాలూకాలోఁ జేరిన పెరుగుపల్లిగ్రామమును క్రీ॥ శ॥ 1860 సం॥ లో బహుమతిగా నా కవీశ్వరున కొసంగిరి. వీరు కాశీయాత్రకై చని యనేకపుణ్యక్షేత్రములను దర్శించి బృందావనమునుండి శ్రీ రాధాకృష్ణస్వామివారి పాదములను, అయోధ్యనుండి శ్రీసీతారాములవారి పాదములను స్వర్ణముతోఁ జేయించి తెప్పించి స్వసంస్థానములోని పూజామహాలునందుంచి పూజించుచుండిరి. వీ రీయాత్రలో ననేక గ్రామములను దానము చేసియుండిరి. వేంకటగిరిలోని బ్రాహ్మణసత్రములో భోజనముసేయని స్వహస్త స్వయంపాకులకు సదావృత్తి జరుగునేర్పాటు గావించిరి.

క్రీ॥శ॥ 1866 లో విక్టోరియామహారాణిగారు వీరికి సి.యస్.ఐ. అను బిరుద నీయఁగా దానిని 1867 సం॥ ఫిబ్రవరి నెలలో మదరాసు గవర్నరుగారు బ్యాంక్వెటింగుహాలులో వీ రాజావారివక్షస్థలమందు ధరింపఁజేసిరి. ఈ రాజుగారు గవర్నరుగారి దర్శనముచేసినపిమ్మట గవర్నరుగారు వచ్చి ప్రతిదర్శన మిచ్చిరి.

ఆసంవత్సరము చెన్నపురిలోని మానిగార్ సత్రమునొద్ద నొక యన్నసత్రమును గట్టించి యంగశక్తులగువారలకు దినదినము నూర్గురు కన్నమును నూర్గురకు బియ్యమును నిచ్చు నేర్పాటుగావించి తద్వ్యయమునకై 1870 జూన్ 28 వ తేదీని లక్షరూపాయిల దొరతనమువారి పత్రములను దద్విచారణకర్తల స్వాధీనమందుంచి శాశ్వతమైన ధర్మము జరుగునట్టి కట్టుబాటుగావించిరి.

గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ వారి సన్నిధినుండి 'రాజా ఆఫ్ వేంకటగిరి' అను బిరుదుతోఁ గూడఁ బంచహజార్ మన్సబ్దార్ అను

బిరుదులను జేర్చుకొనవలసిన ట్లుత్తరు వైనదని 1867 ఆగష్టు 19 తేది నెం 25 రు ప్రొసీడింగ్సు వచ్చినట్లు జిల్లాకలెక్టరుగారు రాజాగారికి దెలియఁజేసిరి.

1869 సం॥లో వీరు డ్యూక్ ఆఫ్ ఎడింబరోగారి దర్శనార్థ మాహూతులై చెన్నపురి కేగి వారిదర్శనము జేసిరి. రాకపోకలయందు గవర్నరుగారు దర్శనప్రతిదర్శనాదులను యథావిధిగఁ గావించిరి.

శ్రీరాజాగారు వేంకటగిరిలోను నాయనిపేటలోను బాఠశాలల నేర్పఱచి 1871 సం॥ నెం 4 రు శాసనానుసారముగ స్థాపింపఁబడిన లోకల్ ఫండుబోర్డువారి స్వాధీనము జేసిరి.

1871 సం॥లో గూడూరుతాలూకాలోని మద్దాళి యనుగ్రామమును ముప్పదివేలరూపాయలకుఁ గొని తిరుపతివేంకటేశ్వరులకు సమర్పించి దానివచ్చుబడిచేఁ బ్రతిదినము ముప్పదిమందిబ్రాహ్మణులకు నాదేవుని నివేదితాన్నము నిచ్చున ట్లేర్పాటుగావించిరి. ఆ మఱుసంవత్సరము వీరు నాలవపర్యాయముగఁ గాశికివెడలి యందు 250 జనుల కన్నసత్ర మేర్పఱచిరి. బంగాళాదేశ క్షామనివారణార్థమై చెన్నపురిలో జరిగినసభకు వీరు గవర్నరుగారిచే నాహూతులైయిరువదివేలరూపాయలను విరాళ మొసంగిరి. ఆసమయములో గమనాగమనాదు లందును గవర్నరుగారి దర్శనప్రతిదర్శనము లందును యథాపూర్వక గౌరవములు జరిగెను.

1875 సం॥ డిశంబరునెలలోఁ జెన్నపురికి ప్రిన్సు ఆఫ్ వేల్సుగారు దయచేసిన సందర్భమున వీ రాహూతులైతమ పెద్దకుమారుఁడుగారితోఁ గూడఁ జెన్నపురికి వెళ్లిరి. అప్పుడు శ్రీయువరాజుగారికి మనరాజాగారొక పతాకత్తిని, నబ్బాసికత్తిని దమవంశచరిత్రగ్రంథమును సమర్పించిరి. శ్రీయువరాజుగారును దమదర్శనాభిజ్ఞానమైన యొకపతకము (మెడల్)ను వీరికి దయచేసిరి.

శ్రీయువరాజుగారికి రాయపురములో స్వదేశీయులు జరిగించిన మహాసభాస్థానవేదిక (డైజ్)పై గవర్నరు, కమాండర్ ఇన్-చీఫ్ మొదలైనవారితోఁగూడ ననంతశయనముమహారాజాగారికిని, కొచ్చిరాజాగారికిని, బనగానపల్లినవాబుగారికిని, విజయనగరముమహారాజాగారికిని వేంకటగిరిరాజాగారికిని మాత్రమే కుర్చీ లొసంగఁబడెను.

ఈ కుమారయాచమనాయఁడు బహద్దర్ సి. యస్. ఐ. వారు బారాదరీమహల్, అంబారీమహల్ మున్నగు బెక్కు భవనరాజములను గట్టించిరి. పూర్వము నాలవతరమువారైన యెఱ్ఱదాచానాయని వారికి జయలబ్ధమైన స్వర్ణసింహాసనము 22 వ తరమువారివఱకు సంస్థానములోనేయుండి యప్పు డార్కాటునవాబువశమైన సంగతి చదువరు లెఱిఁగియేయుండిరిగదా! ఈ సింహాసనమును మఱికొన్ని వెలపొడుగు వస్తువులును నార్కాడు నవాబైన గులాంగౌస్ఖాగారు చెన్నపురిలోఁ గాలధర్మమునొందినవెనుక చెన్నపురిదొరతనమువారిచే విక్రయింపఁబడనున్నట్లు దెలిసికొని శ్రీవారు తమ పూర్వోపార్జిత సింహాసనమును నన్యాక్రాంతము గానీయఁగూడదని తామే 26,000 రూప్యములకుఁ గొనిరి. మఱియు నప్పుడు మూఁడేనుఁగులను ఛత్ర చామరాదులను రజతమయవేత్రములను గొనిరి.

శ్రీవారు దేవస్థానముల కాఱుగ్రామములను, నగ్రహారములుగఁ బదునొకండు గ్రామములను దానముచేసియుండిరి.

శ్రీవారికి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులవారు, శ్రీరామకృష్ణయాచేంద్రులవారు, శ్రీ రంగమన్నారుకృష్ణయాచేంద్రులవారు, శ్రీమన్నవనీతకృష్ణయాచేంద్రులవారు, శ్రీముద్దుకృష్ణయాచేంద్రులవారు, శ్రీ వేంకటకృష్ణయాచేంద్రులవారు, శ్రీవేణుగోపాలకృష్ణయాచేంద్రులవారు అను నేడ్గురు పుత్రులును, శ్రీ లక్ష్మీవెంకమ్మగారు, శ్రీరాజ్యలక్ష్మమ్మగారు అను నిరువురు పుత్రికలును జన్మించిరి.

వీరిలోఁ దృతీయపుత్రులైన శ్రీ రంగమన్నారుకృష్ణయాచేంద్రు

లవారిని బొబ్బిలి రాణీగారికి 1871 వ సంవత్సరమున దత్తపుత్రునిగ నొసంగి వెంకటగిరిలోనే మహావైభవముగ దత్తుగావించిరి. వీరిచ్చటి నుండి 1872వ సంవత్సరము డిశంబరు నెలలో బొబ్బిలికివచ్చిరి. ఆమఱు సంవత్సరమనఁగా 1873 లో నీదత్తపుత్రు నవలోకింప నేగుతఱిఁ బిఠాపురపురాజుగారు 'మేము గరంబు రోగార్తులమైతిమనియు మీరెండవ సుతుని నిటకుఁ దోడ్తెచ్చి యవ్యవధానముగా దత్తీయవలెననియుఁ దంత్రీ వార్త నంపఁగాఁ బిఠాపురమునకు రెండవ సుతుని దోడ్కొనిపోయి క్రీ॥ శ॥ 1873 శ్రీముఖసం॥ ఆశ్వయుజ శు 2 నాఁడు దత్తతఁ జరిగించిరి.' మఱియు నాలవకుమారులగు శ్రీనవనీతకృష్ణయాచేంద్రులవారిని 1877 వ సంవత్సరమున శ్రీజటప్రోలురాజాగారగు శ్రీరాజా వేంకటజగన్నాథ రావు బహద్దరుగారికి తిరుపతిలో దత్తుగా నిచ్చిరి.

వీరనేకగ్రంథములను నచ్చొత్తించినదియుగాక మంచినీళ్ళగుంట పై 'మహాస్నాత్యకూట' మను నొక శాలగట్టించి యచట సర్వకాలము వేదాంత పురాణగోష్ఠి జరుగుటకుఁ బదునాల్గువేల రూపాయల నిచ్చి మూలధన మేర్పఱచిరి.

ఇట్లు శ్రీరాజాగారు సిరిసంపత్తులతోఁ దులఁదూఁగుచు ముప్పది యొక్కసంవత్సరము రాజ్యపాలన మొనరించి తమ యఱువదియొకయేట ననఁగా 1892 జూన్ 6 వ తేదీని జెన్నపట్టణమునందుఁ బరమపదము నొందిరి.

స్వర్గీయులైన యీరాజాగారు తమ జీవితకాలములోనే యనఁ గా 1878 అక్టోబరు నెలలోఁ దమ జ్యేష్ఠపుత్రులగు శ్రీరాజగోపాలకృష్ణ యాచేంద్రులవారిపై రాజ్యభారముంచి 1879 సం॥ మార్చి నెలలో నతి వైభవముగఁ బట్టాభిషేకోత్సవమును గావించిరి.

ఇట్లు పట్టాభిషిక్తులైన శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులవారు గావించిన కార్యములు మహోపకారములై యాచంద్రార్క విరాజిత ములై యున్నవి. అందులోఁ గొన్నింటి వివరించెదను—

వేంకటగిరి దేవస్థానముల గ్రామము లీ తాలూకాలోని యన్ని వంటులలో నక్కడక్కడ నుండుటచే దేవస్థానవ్యవహారములకు సౌకర్యము లేమి నెఱింగి యాగ్రామములరాబడిని లెక్కించి యందుకు సమమైన రాబడిగల కలువలపూడివంటు నంతయు దేవస్థానములక్రింద జేర్చి యందందుఁగల దేవస్థానములగ్రామములను అమానిక్రిందఁ జేర్చుకొని వినిమయము గావించిరి.

నెన్నూరు గొల్లపల్లె యను గ్రామములలోఁ దమ తల్లిగారి పేర సత్రముగట్టించి యాగ్రామమునకుఁ దమతల్లిగారిపేరు వచ్చునట్లు 'లక్ష్మీనరసమాంబాపుర'మని పేరిడి 1880 సం॥లో నగ్రహారము గావించిరి.

మఱియు నీమహోదారుఁడు 1885 సం॥లో లక్షరూపాయలిచ్చి చెన్నపురిలో విక్టోరియా గోషాసైద్యశాలఁ గట్టించిరి. 8000 రూప్యములిచ్చి చెన్నపురములోనున్న జంఖానా బంగ్లా గట్టించిరి. నెల్లూరులో హైస్కూలు గట్టుటకు నిరువదివేల రూపాయ లిచ్చుటయుగాక యేబదివేల రూపాయలను మూలధనముగా నిచ్చిరి. దాని వృద్ధివలన శాశ్వతపోషణము జరుగునట్లేర్పఱచిరి. మఱియు 1883 లో నప్పటిగవర్నరుగారగు సర్ గ్రాంట్‌డఫ్‌గారును 1888లో గవర్నరుగారగు లార్డు కానిమారాగారును నీ వేంకటగిరికి రాఁగా వారల నంభారీలో నూరేగించి విందులొనర్చుటయగాక మొదటివారిచే టవున్‌హాలునకును రెండవవారిచే విక్టోరియాజూబ్లి బంగ్లాకును బునాది రాతిని వేయించిరి. గ్రాంట్ డఫ్‌గారే యింద్రమహల్‌గృహప్రవేశోత్సవమును జరిగించిరి.

శ్రీరాజాగారికి శ్రీవిక్టోరియామహారాణిగారివలన 1888 వ సంవత్సరములో కే. సి. ఐ. ఇ. అను బిరుద మొసఁగఁబడెను. ఆసందర్భమందును దదితరసమయములందును గవర్నరుగారిదర్శనమునకై వీరు చెన్నపురి కేగునప్పుడు పూర్వాచారానుసారముగ ధూమశకటపరిసరము (రైలుదగ్గఱకు) నకు శ్రీగవర్నరుగారి రథము (మోటారుకారు) ను ఏడీకాంగు 5 తురుపుసవార్లతో వీరికై తీసికొనివచ్చి యెక్కించు

కొనిపోయి విడిదిలోఁ బ్రవేశపెట్టుటయు మఱల వచ్చునప్పు డదేవిధముగఁ దోడ్కొనివచ్చుటయు, శ్రీరాజాగారు గవర్నరుగారిదర్శనము చేయునప్పుడు వారు మఱల శ్రీరాజాగారిభవనమునకువచ్చి ప్రతిదర్శన మిచ్చుటయు మున్నగుగౌరవములు యథాప్రకారముగ జరుగుచుండెడివి. మఱియు మైసూరు, అనంతశయనము, కొచ్చిమహారాజులును జెన్నపురియందు వీరికి దర్శనప్రతిదర్శనము లిచ్చుచుండిరి.

వీరు రెండుపర్యాయములు చట్టనిర్మాణసభ(లెజిస్లేటివ్ కౌన్సిల్) లో సభ్యులుగ నుండిరి. మఱియుఁ జెన్నపురిలో జమీందార్ల అసోసియేషన్ సభకు వీ రిరువదిరెండు సంవత్సరము లగ్రాసనాధిపతులుగ నుండిరి.

1910 జూన్ 24వ తేదీని నైదవ జార్జిచక్రవర్తిగారిచేఁ దదీయ జన్మదినోత్సవ సమయమునందు శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర బహదరు కె. సి. ఐ. ఇ. గారికి 'మహారాజా' బిరుదము నొసఁగఁబడెను.

శ్రీమహారాజాగారు భాషాపోషకులనుటకు నిదర్శనముగ వీరి కాలమున నాంధ్రకవులు రచింపఁగా నీదిగువ, గ్రంథములు ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.—(1) రాధాకృష్ణసంవాదము. (2) శిశుపాలవధ. (3) దశకుమారచరిత్రము. (4) శృంగారపద్యరత్నావళి. (5) అమరుకకావ్యము. (6) శ్రీకృష్ణాభ్యుదయము. (7) గీతగోవిందము. (8) బ్రహ్మవైవర్తములోని బ్రహ్మగణేశప్రకృతిఖండములు(9)హాలాస్యమహాత్మ్యము (10) కాళిదాసప్రకరణము. (11) వినోదకథాకల్పవల్లి. (12) గోపికథాకౌముది. (13) సుమనోవినోదభాషణము. (14) కథాసరిత్సాగరము. (15) యాచశూరేంద్రవిజయము. (16) ఉత్తర రామచరిత్రనాటకము. (17) సంస్కృతకవిజీవితము. (18) రుక్మిణీపరిణయము మున్నగునవి. మఱియు వీరు చెన్నపురిలో స్థాపింపఁబడిన యాంధ్రపరిషత్తునకు విశేష ద్రవ్య మొసంగిరి.

ఇటుల నాంధ్రభాషాపోషకనామమును సార్థకము గావించియకస్మాత్తుగ శ్రీమహారాజావారు 1916 జులై 23వ తేదీని స్వర్గస్థులైరి.

వీరియనంతరమున వీరిపుత్రరత్నంబగు శ్రీగోవిందకృష్ణయాచేంద్ర బహదరువారు రాజ్యమునకువచ్చిరి. శ్రీరాజావారి పట్టాభిషేక మహోత్సవము 1917 ఫిబ్రవరి నెల 1 వ తేదీని నత్యంతవైభవముతో జరిగెను. తత్సందర్భమున శ్రీరాజాగారి సందేశమును దివాన్జి రావు బహదరు తిక్కాని బాలాజీరావునాయుఁడుగారు ప్రజలకు బ్రకటించిరి. అందు వేంకటగిరి పురాతనపట్టణమగుటచే నాలుగు రాజమార్గములు దప్ప తక్కిన మార్గములు విశాలముగనుండవు గనుక శ్రీవారు వేంకటగిరిపట్టణమును నూతనపద్ధతిని బునర్నిర్మాణ మొనరించునటులఁ బ్రకటించి పౌరుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి. నెల్లూరునందుగల శ్రీమహారాజావారి యున్నతపాఠశాలను రెండవతరగతి కళాశాలఁగ జేసెదమని వాగ్దాన మొనరించి స్వీయవిద్యాభిమానమును వెల్లడించి విద్యాభిమానుల కృతజ్ఞతకును బాత్రులైరి. మఱియు వేంకటగిరిపట్టణమందు శ్రీరాణీగారిపేర నొకకర్మవిద్యాలయమును స్త్రీలకు వైద్యసాహాయ్యలాభమును గలిగించుటకై యొక ఘోషాఆసుపత్రిని నెలకొల్పెదమనియుఁ బ్రకటించిరి. వెండియు బీదరయితుల సాహాయ్యార్థమై పదునాఱువేల రూప్యముల శిస్తు బాకీలను రద్దుసేయ నాజ్ఞయొసఁగి నిరుపేదరైతుల కానందమును గలిగించిరి.

ఇటులఁ బౌరజనంబులయొక్కయు విద్యాభిమానులయొక్కయు హృదయపూర్వకమైన కృతజ్ఞతకుఁ బాత్రులై, యాంధ్రలోకంబునందెల్ల సుప్రసిద్ధులును దొరతనమువారిచేఁ బెక్కుగౌరవాసులందిన వారును రాజకీయధురంధరులును నగు రావుబహద్దరు శ్రీ తిక్కాని బాలాజీరావు నాయుఁడుగారు దివాంజీపదవి నలంకరించియుండఁగా శ్రీరాజావారు ప్రజారంజకంబుగా రాజ్యపాలనంబు సేయుచుండిరి.

ఇట్టి శ్రీ రాజా గోవిందకృష్ణయాచేంద్ర బహదరువారికి కరుణాసముద్రుఁడగు పరమేశ్వరుఁడు శాశ్వతాయురారోగ్యంబులఁ బ్రసాదించుఁగాత.

———:o:———



శ్రీరస్తు.

# ముత్యాలపాటి సంస్థానము.

(నెల్లూరు జిల్లా)

సీ॥ సహజసంప్రీతి వ♦సంతోత్సవంబుల
గాన విద్వాంసుల ♦ గౌరవించు
సంతతాగత బుధ♦సంతతి నాదరా
యత్తచిత్తంబుతో ♦ నాదరించు
నైశ్వర్యయుతుఁడయ్యు ♦ నాడంబరము లేక
పరిచయులను గన్నఁ ♦ బలుకరించు
భాషాభిమానుఁడై ♦ పలుమాఱు నభిరతి
దేశీయసభల కే♦తెంచుచుండు

ఆ॥ వె॥ నట్టి సుగుణధనుఁడు ♦ హైదరాబాదు న
వాబువారిదయకుఁ ♦ బాత్రులగుచుఁ
బూర్వ లంది యున్న ♦ ముత్యాలపాటి జ
మీని యేలుచుండు ♦ ధీనుతుండు.

నెల్లూరు మండలమునందు గొప్ప సంస్థానమని చెప్పఁదగినది వేంకటగిరి సంస్థానముదప్ప మఱియొకటిలేదు. అయినను పురాతనపు జమీలలో నొకటియగుటచే నీముత్యాలపాటి జమీనిగుఱించి యించుక వివరింపవలసియున్నది.

వీరితరములో నాలవవారగు ధర్మభూపాల భాలేరాయనింగారు, జుల్ఫికారుఖాన్ దక్షిణహిందూస్థానమందలి కల్లోలముల నడచుటకు

వచ్చినపుడు వాని సైన్యములో దండనాయకుఁడుగ నుండినట్లు స్థానికచరిత్రాదులవలనఁ దెలియుచున్నది. కావున నీవంశజుల పాలనారంభము రమారమి పదునాఱవ శతాబ్దమునందై యుండవచ్చును.)

ఈ జుల్ఫికారుఖాన్ ఔరంగజేబ్ పాదుషాగారి సైన్యాధీశుఁడుగనుండి పాదుషాగారి రాజ్యావసానకాలమున నాతని ద్వితీయపుత్రుఁడగు అజీమునకు సహాయకుఁడై పాదుషామీఁదికి దాడివెడలెను. కాబుల్ దేశములోనున్న పాదుషా ప్రథమపుత్రుఁడగు ముఅజ్జమ్ అనునతఁడువిని సైన్యముతో వచ్చి రాజపుత్రుల సాహాయ్యమున సోదరుఁడైన అజీమును వధించి జయమందెను. తరువాత నితఁడు జుల్ఫికార్ ఖానుని వశపఱచుకొని వానిసాహాయ్యమున హైదరాబాదునకు దండయాత్రవెడలెను. అచ్చట పాదుషా తృతీయపుత్రుఁడును దనసోదరుఁడును నైన కాంబక్షునుగూడ సంహరించి బహదర్ షా అను నామముతో ముఅజ్జం పాదుషాయయ్యెను. ఈ సందర్భములోనే జుల్ఫికార్ ఖాన్ హైదరాబాదునకును మఱికొన్ని కల్లోలములనడుచుటకై యూర్కాడునకును వచ్చెను. ఇతఁడు పాదుషా మనుమఁడగు ఫరుఖ్సియర్ వలన 1713 సంవత్సరప్రాంతమునఁ జంపఁబడెను. కావున నీతని సమకాలీనుఁడీ వంశములోని నాలవపురుషుఁడగుటచే నంతకుఁ బూర్వమే వీరేర్పడియుందురు.

వీరిమూల పురుషుఁడయిన చిన్నని నర్సారాయునింగారు హైదరాబాదు రాజ్యములోనున్న ఆమలూరుగూడెమను గ్రామమును స్వాధీనపఱచుకొని నవాబునకు సామంతుఁడుగా నుండెను. వీనియనంతరమున వీరికుమారులగు లక్ష్మీకాంతరాయునింగారు ధైర్యస్థైర్యములు గలవారగుటయేగాక నవాబుగారి మన్ననలకుఁ బాత్రుఁడగుటచేఁ గూడ నెక్కుడు ప్రఖ్యాతికి వచ్చెను.

ఆకాలములో వెలిగందల హనుమకొండ తాలూకాల జహాగీరుదార్లు క్రమముగాఁ గప్పంబుల జెల్లింపక తిరుగఁబడుటచే నాయల్ల

రుల నడచుటకై హైదరాబాదునుండి కొంత సైన్యముతో పాదుషాగారి యుత్తరువువలన మన లక్ష్మీకాంతరాయనింగారు బైలుదేరి కలహకారులఁ జెఱబట్టి నవాబువారి సముఖమునకుఁ జేర్చఁగా నవాబు సంతోషించి వారిదోర్బలమును శ్లాఘించుచు స్వాధీనమైన యావెలిగందుల, హనుమకొండ తాలూకాలను వీరికే యొసఁగి 'భూపాల భాలేరావ్' అను బిరుదముతో వారిని గౌరవించి పంపిరి. 'అప్పారావు' అను బిరుదమును నూజవీటిప్రభువులు దరతరములనుండియుఁ దమ నామాంతములఁ జేర్చుకొనుచున్నట్లు వీరును నీ 'భూపాలభాలేరావ్' అను బిరుదమును దమ నామాంతముల నాఁటినుండి నేఁటివఱకును జేర్చుకొనుచుండిరి.

వీరికుమారుఁడు నరసింగభూపాలభాలేరావు తనతండ్రియనంతరంబున హైదరాబాదునకుఁబోయి నవాబుగారి దర్శనముజేసి పూర్వోక్తములైన తాలూకాలకు ఇనాయతునామాఖిల్లత్ అనుసన్నగను సంపాదించుకొని తమజీవితకాలమంతయు సుఖముగాఁగాలమును గడపెను.

తరువాత వీరికుమారుఁడగు ధర్మభూపాలభాలేరాయనింగారు తండ్రితోఁ గలహించి హైదరాబాదునకుఁబోయి యచ్చటివారి నాశ్రయించి పాదుషాగారి యనుగ్రహముచే గండికోటతాలూకాను జహగీరుగా సంపాదించి యచ్చటనే కొన్నిదినములుండి తరువాత జుల్ఫికారుఖానుతో నార్కాటు సుబాకు రావలసివచ్చుటచే గండికోటజహగీరుకుబదులుగాఁ జిత్తూరు, చంద్రగిరితాలూకాలను దీసికొని యచ్చట నవాబువారిపక్షమున ఫౌంజుదారుఁడుగ నుండెను. అయిన నీతాలూకాలైనను స్థిరముగానిల్చినవికావు. పిమ్మట రాపూరును నటుపిమ్మట 'కలవాయి, కుల్లూరు' తాలూకాలనుబొంది జగడములు లేకుండఁ గొంతకాల ముండిరి. ఇంతలో సర్వేపల్లి, కమ్మం, ఉదయగిరి తాలూకాలలోని దేశాయిదేశపాండియాలు హైదరాబాదునకువచ్చి నవాబుగారితోఁ దమతాలూకాలలోఁ గల్లోలము లెక్కుడుగా నుండుటను మనవి చేయఁగా నవాబుగారు మన ధర్మభూపాలభాలేరాయనింగారిని బిలిపించి

'సర్వేపల్లి మున్నగు తాలూకాలకు దేశముఖిమిరాశీ యిప్పించెదము. కల్లోలములను నడచిరావలసిన'దని యుత్తరవుచేసిరి. వీరు తమకుమారుడైన వెంకటకృష్ణభూపాలభాలేరాయనింగారిని, జూపల్లి అప్పారాయఁడను నొకసర్దారును సాహాయ్యముగానిచ్చి పంపించిరి. వీ రిరువురును బైతాలూకాలకుఁ బ్రవేశించి పాలెగాండ్లజగడములను నివారించుటకై యెక్కుడు శౌర్యధైర్యములనుజూపి తుదకు విజయులై హైదరాబాదునకువెళ్లి నవాబునకు వివరించిరి. ఈవార్తవిని సంతసించి వీరికి ఉదయగిరి, చుండి, కయితేపల్లి, కందుకూరు, గుడ్లూరు, కమ్మం, దూపాడు, దురుగోడు, కారెంపూడి, గురిజాల, మాచెర్ల, మారెళ్ల, పొదిలె, కొచ్చెర్లకోట, దర్శి, పెల్లూరు, ఆరికట్ల, చీమకుర్తి, అద్దంకి, అమ్మనబ్రోలు అను నిరువదితాలూకాలకు జెలూసు 44 రంజాన్ 1 వ తేదీని హైదరాబాదునవాబుగారి దివాన్ షఫీఖాన్ గారివల్ల దేశముఖిఫర్మానాను సంపాదించి సుఖముగానుండిరి. ఇంతలో వీరితండ్రి గారగు ధర్మభూపాలభాలేరాయనింగారు స్వర్గస్థులైరి. కావునఁ దండ్రిగారిపేర నున్న కుల్లూరు, కలువాయి గ్రామాదులకును సన్నదునొసఁగ వలెనని విన్నపమును బంపుకొనిరిగాని వీనిని సాదల్ మజితుఖాన్ అనేవానికిచ్చి, యిందులకు బదులు పామూరుతాలూకాలోఁజేరిన కొమ్మి, చోడవరం, గానుగపెంట, తెల్లపాడు, దూబగుంట, పార్లపల్లె, మల్లవరప్పాడు, భీమవరప్పాడు అను నెనిమిది గ్రామములను దనుపరి ముత్యాలపాడు, సత్యవోలు, చినపవని యను మూఁడుగ్రామములను జమీాగా నొసఁగి జులూసు 44-21 వ తేదీని ముస్తఫాసాయిబ్ ఫౌంజుదారుద్వారా సన్నదును బంపియుండిరి. ఇట్లు తమసద్గుణసంపత్తిని, శౌర్యసాహసములను బ్రదర్శించి నవాబుగారి దయకుఁబాత్రులై వర్థమానులగుచుండిరి.

వీరికి సంతానములేనందున సన్నిహితబంధువగు రామచంద్రభూపాలభాలేరాయనింగారిని పెంచుకొనిరి. వీరికిని బైనఁబేర్కొన్న తాలూకాలకు నెల్లూరుఫౌంజుదారయిన అబ్దుల్ ఖాజాఖాన్ ద్వారా సన్నదులు వచ్చియుండెను.

వీరి యనంతరమున వీరిసోదరుఁడు వెంకట్రామభూపాలభాలేరాయనింగారును దరువాత వీరి ప్రథమపుత్రుఁడగు నరసింగభూపాలభాలేరాయనింగారును జమీ కధిపతులైరి. వీరికాలములోనే పైనఁ జెప్పఁబడిన దూబగుంట, మల్లవరప్పాడు, చోడవరము మున్నగు నెనిమిది గ్రామములను గాళహస్తిజమీందారులగు దామెర కుమార వెంకటప్పనాయనింగా రాక్రమించుకొని పామూరుతాలూకాలోఁ జేర్చుకొనిరి.

ఈ నరసింగభూపాలభాలేరాయనింగారికి ముగ్గురు కుమారులు గలరు. వారు బాలురైనందునఁ బై వారిసోదరుఁడగు వేంకటకృష్ణ భూపాలభాలేరాయనింగారు వ్యవహారములఁ జూచుచుండిరి. వీరికాలములోఁ గందుకూరుతాలూకాయందు విశేషమైనబందిపోటుదారులు చెలరేఁగుటచే వారి నడచుటకై ఫౌంజుదారయిన అహమ్మద్ ఖాన్ ద్వారా కొంత సిబ్బంది రాఁగా వీ రాసిబ్బందితోను మఱికొందఱితోను వెళ్ళి బందిపోటుదారులఁ బాఱఁద్రోలిరి.

వీరి యనంతరమున వీరియన్నకుమారులు ముువ్వురిలోను బెద్దవారగు వెంకట్రామభూపాలభాలేరాయనింగారికి నెల్లూరు ఫౌంజుదారు మధ్వపతి శేషగిరిరావుగారిద్వారా సన్నదులు మామూలుప్రకారము వచ్చియుండెను గాని వీరు స్వల్పకాలములోనే యనపత్యులై గతించుటచే వీరిభార్య చెల్లమ్మగారు దత్తుగాఁదీసికొనియున్న రామచంద్రభూపాలభాలేరాయనింగారు బాలుఁడగుటచేఁ గృష్ణాజిల్లాలోని యేలూరు జమీందారులగు వేంకటనరసింహప్పారావుగారు వ్యవహారములఁ జూచుచుండిరి. వీరికాలములోనే కలెక్టరుగారిద్వారా 'రాజా' అను బిరుదము వచ్చియుండెను. వీరు 1890 సంవత్సరములోఁ గాలముచేసిరి.

వీరి కైదుగురుపుత్రులు, నల్వురు పుత్రికలు గలరు. వీరిలోఁ బ్రథమపుత్రికయగు సూరమ్మగారిని నర్సారావుపేట జమీందారులగు మల్రాజు కొండల్రాజుగారికిచ్చి వివాహముచేసిరి. ఆమె గతించుటచే మఱల వారికే తృతీయపుత్రికయగు శ్రీ వెంకయమ్మారావుగారి నిచ్చి వివాహముచేసిరి. వీరి దత్తపుత్రుఁడే ప్రస్తుత శ్రీరాజా మల్రాజు వేంక

ట నరసింహారావు బహద్దరుగారు. ప్రథమపుత్రికయైన సూరమ్మగారి కుమారీరత్నమగు శ్రీ కనకయమ్మారావుగారే కపిలేశ్వరపురపుజమీం దారులగు శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుగారి జనని.

ఇఁక ద్వితీయపుత్రికయైన లక్ష్మీనరసమ్మగారు గుంటూరుమండలములోని యుల్లిపాలెము జమీందారులగు సూరానేని వేంకట్రామా రాయనింగారి కొసంగఁబడిరి. వీరి ప్రథమపుత్రుఁడగు శ్రీరాజా సూరానేని వేంకటనృసింహారావుబహాదరుగారు ప్రస్తుత ముల్లిపాలెపు జమీందారులు. తురీయపుత్రికయగు శ్రీవరదయ్యమ్మారావుగారు కాళహస్తి జమీందారులగు శ్రీరాజా గంగాధరరామారాయనింగారిని బరిణయమైరి.

ఐదుగురుకుమారులలోను బ్రథములగు శ్రీరాజా వేంకటనరసింహ భూపాలభాలేరాయనింగారికి మన యింగ్లీషు దొరతనమువారు మామూలు సన్నదులనిచ్చి జమీందారుగా నంగీకరించియుండిరి. వీరి తరువాత నైదవవారగు శ్రీరాజా శ్రీరంగభూపాలభాలేరాయనింగారు వ్యవహారభారమును వహించి 1911 మార్చి 9 వ తేదీని గతించుటచే రెండవవారయిన శ్రీరాజా వెంకటకృష్ణభూపాలభాలేరాయనింగారి కుమారరత్నమగు శ్రీరాజా సీతారామచంద్ర శ్రీరంగభూపాలభాలేరాయనింగారు జమీందారులై 1911 అక్టోబరు 3 వ తేదీని జమీపాలనభారమును వహించిరి. వీరే ప్రస్తుత ముత్యాలపాటి జమీందారులు. వీరి స్వస్థానము పెదపవని యగుటచేఁ బెదపవనిజమీందారు లనియు వ్యవహరింపఁబడుదురు.

వీరికి పూర్వమునుండియు నున్న ముత్యాలపాడు, సత్యవోలు, చినపవని, దేశముఖియీనాము లేగాక వీరితండ్రిగారికాలములోఁ జుండి జమీందారులనుండి కలవల్ల, సీతారామపురమును గ్రామములను గాళహస్తిజమీందారులనుండి కొమ్మి, చోడవరము, గానుగపెంట, మల్లవరప్పాడు గ్రామములను వుటికొండటినుండి యమ్మవారిపాలెము మున్నగు గ్రామాదులను విక్రయములోఁ దీసికొనిరి.

వీరు సంగీతవిద్యాప్రియు లగుటచేఁ బ్రతిసంవత్సరమును చైత్ర మాసమున వసంతోత్సవమును జరుపుచుఁ బెక్కు గానసభలను గావింపఁజేసి సంగీతవిద్వాంసులను సత్కరింపుచుందురు. ఆదినంబులలోఁ బండితబృందమునుగూడ మిగుల గౌరవింపుచుందురు. వీరి యౌదార్యమును సుగుణసంపత్తియు నాశ్రితుల కానందదాయకముగ నుండును.

ఇట్టి ధనాఢ్యులు భాషామతల్లి కెంతయో యుపకారమును గావింపుచున్నారు. ఇంకను గావింపవలసియున్నారు.

వీరు ప్రస్తుతమున జరుగుచున్న యైరోపా మహాసంగ్రామమున కుచితముగ నేనూఱు రూప్యములను, ఋణముగ రెండువేలరూప్యములను నొసంగి యుండిరి.

శ్రీరాజా సీతారామచంద్రశ్రీరంగభూపాలభాలేరావుగారు కిర్లంపూడి జమీందారులగు శ్రీరాజా ఋనుగంటి వెంకట రాజగోపాల బుచ్చితమ్మయ్యగారి కుమారీరత్నమును బరిణయమై యామెవలన నొక పుత్రికను నొకపుత్రునిగాంచి సుఖముగా నుండిరి. వీరికిఁ బరమేశ్వరుఁడు నాయురారోగ్యంబులఁ గూర్చుఁ గాత.





శ్రీరస్తు.

# వాసిరెడ్డి సంస్థానము.

(ముక్త్యాల; కృష్ణాజిల్లా)

---

—♦ చతుర్దశదళపద్మబంధసీసము ♦—

వినుతరసత్క్రియా ♦ వేశులగయి భవ్య
  విద్యాలయము భువి ♦ వెలయఁ జేసి
గురుప్రేమ సారమా ♦ గుణమిచ్చు దివ్యాష
  ధాళిఁ జేయించి ధ♦ర్మార్థ మిచ్చి
శ్రీకర మాచంద్ర♦సేవితమాకృతుల్
  బల్మరుఁ గొంచుఁ గృ♦పాసముద్ర
ధీరమ్యమా భాగ్య ♦ దేవిచేఁ గవిలోక
  మండలిఁ బ్రోచు రా♦ణ్మౌళి వార

తే.గీ. సుప్రసిద్ధతావకకథా♦సూక్తి వేఱ
  యేల వర్ణింప సాదర♦హృదయ! సర్వ
  జగ మెఱుంగుద్విజాళికి ♦ జంద మేల?
  భూరిరత్నాపరాయణ ♦ భూమిరమణ!.

ఈ జమీాకి ముఖ్యపట్టణముగా నుండిన 'ముక్త్యాల' యందొక దుర్గమును, రాజకుటుంబనివాసమున కొక రమ్యహర్మ్యంబును గట్టబడి యుండెను. ఆపట్టణపార్శ్వభాగంబున నెక్కుడు వైశాల్యంబుగలిగి తన నిర్మలవారిపూరంబుచేఁ జూపరులకు నేత్రానందసంధాయకంబగు

కృష్ణాతరంగిణి ప్రవహింపుచుండును. బెజవాడనుండి హైదరాబాదు నకుఁ బోవుచున్న ధూమశకటకారణంబున వ్యాపార విషయాదుల యందుఁ బ్రస్తుతకాలంబునం దత్యంతమగు తనయశస్సును బోఁగొట్టుకొనినను గొండొకకాలంబున మిగులఁ బ్రఖ్యాతివహించిన జగ్గయ్యపేట కాఱుమైళ్లదూరమునఁగల యొకచట్టునేలపై నిది కట్టఁబడి కృష్ణాభవానిచే ముద్దులాడఁబడు చుండెను.

వ్యాఘ్రభల్లూకాది యాటవికజంతుపాలనాధిగతం బై, వివిధ తరునిబిడం బై, మానవసంచారశూన్యం బై యున్న యొక యారణ్యక ప్రదేశమునందలి పూర్వోక్తవర్ణనంబున కొంకింతవ్యత్యస్తముగల యొక భాగంబున "నల్లుట్ల, వాసివి, కలకట్ట" అను గ్రామంబులను రమారమి యెనమన్నూరు సంవత్సరములక్రిందట వేమనృపాలుని యనుగ్రహం బున 'వాసి' యని పిలువఁబడు నొకరాజకుటుంబీకులు స్వాధీనమొన రించుకొనిరి. ఈ వాసికుటుంబమువారు తమ కేవలసత్వసామర్థ్యంబు లచే మఱికొన్ని గ్రామంబుల నేర్పఱచుకొని సామీప్యమునఁగల కొందఱిరెడ్ల పరిచయమును సంపాదించుకొని తత్సాహాయ్యముచేఁ దమ యేలుబడిని శాంతయుతముగ నేలుకొనఁగలిగిరి.

ఆ రెడ్లును నెక్కుడుజమీలను సంపాదించుకొని యౌన్నత్యదశకు వచ్చుచుండఁగా వారికి లోఁబడియుండిన సమర్థులగు రైతులలోఁ గొందఱు తమశిస్తుదస్తులను జెల్లించుటలోఁ దడవుసేయసాగిరి. ఇట్టిస్థితియందు వారు సమరాభిముఖులై పరస్పరాభిఘాతం బులచే రక్తప్రవాహంబులఁ బాఱింపఁ జేయుటకు మారుగ నిరు కక్షులయందునుగల యోధవరులలో నిరువుర నేరి యాయోధవరు లిరు వురును బోరాడునట్లును, వారిలో జయమునొందిన వానిపక్షమువా రపజయమునొందినవాని పక్షమునఁగల వారిసర్వస్వమును స్వాధీనమొన రించుకొననగునట్లును దీర్మానించుకొనిరి. దీనినే 'తులారణ'మని యం దురు. ఇట్లీరెడ్డినాయకులు రెండుభాగములుగా వీడి నిలువఁబడిరి. కాని యాధభూపతియను ప్రముఖుఁడు తనపక్షమువారియందు సమర్థుఁడగు

యోధవరుఁడు లేకుండుటచే నతఁడు మిత్రసాహాయ్యమర్థింపనుండెను. ఇంతలో వీనిమిత్రుండును, 'వాసి' కుటుంబీకుఁడును నగు 'సదాశివరెడ్డి' యనునతఁడు తనచెైదంబుల నెఱపి తానొక్కఁడ శత్రుమూకలఁ బాఱఁద్రోలఁ గలుగుదునని యభయమిచ్చి తత్క్షణమే సమరసన్నాహాలంకృతుండయి రణరంగంబునందు బ్రవేశించెను. అంతట రెండవ తెగయందుండియు నొకనాయకుఁడే తెంచి సంగరారంభ మొనరించెను. వారిట్లాయుధపాణులై కొంతతడవు పోరుసరికి విజయలక్ష్మి సదాశివుని కరగ్రహణ మాసించెను. కాని పూర్వోక్తనిబంధనలకు వ్యతిరేకముగా నొకరితరువాత నొకరుగా నెనమండ్రుయోధులు మనసదాశివునకు వ్యతిరేకముగావచ్చి పోరియును సదాశివుని బలపరాక్రమాతిశయంబులకు వెన్నిచ్చి పారవలసినవారైరి. అంతటఁ బూర్వనిబంధనానుసారముగ శత్రుసామ్రాజ్యము నెల్ల నొధభూపతి, స్వాధీన మొనరించుకొని సదాశివునిచేఁ జూపఁబడిన యసామాన్య ధైర్యసాహసంబులకు గరంబలరి కొన్ని మిరాశీభూములను, జమీాల నొసంగి, 'భానవశంకర' అనుబిరుదము తోను, సామాజతురంగాది రాజోచితచిహ్నంబులతోను గౌరవించెను. ఈవిధముగ రెడ్డికులనాయకుం డయిన యాధభూపతికి 'వాసి' గొని వచ్చిన మనసదాశివయ్యగారంతటనుండి 'వాసిరెడ్డి' అను గౌరవము నుగూడ వహింపఁగలిగిరి. కావున నాఁటనుండి నేఁటిదనుక నీసదాశివయ్య వంశీకులు 'వాసిరెడ్డివా' రని వ్యవహరింపఁబడు చుండిరి.

సదాశివయ్య కీరీతిఁ దనబాహుబలపరాక్రమముచే నౌన్నత్యము లభించెనేకాని జీవితంబు మేఘమాలలోని విద్యుల్లతవోలె క్షణభంగుర మయ్యెను. అతనిచేఁ దరుమఁబడిన శాత్రవులు దమహృదయగహనంబులందు బ్రజ్వరిల్లుచున్న పరాభవానలంబుచే నుక్కుదక్కియును, బరాక్రమశూన్యులగుటచే సదాశివు నెదుటఁబడి పోరాడఁజాలక యొకానొక నిశీథసమయంబున రహస్యవృత్తిఁ బ్రవేశించి స్త్రీయనక, శిశువనక యాబాలగోపాలమును దమ కఱకుకత్తులకు బలియిడుకొని యందుఁగల సమస్తంబును సంగ్రహించుకొని పోయిరి. ఘోరావహంబగు నీకథతో నీవంశ మంతరింపవలసినదే కాని పవిత్రచరిత్రంబున కాకరుం

డగు ‘ గిరిమల్లి ఖార్జునసాయఁడు ’ అనునామధేయంబుగలిగి రెండేం డ్లయీడుగలయొకపుత్రునితోఁగూడ సదాశివరెడ్డిభార్య, యచ్చటికన తిదూరంబునఁగల తనపుట్టినింటనుండుటచేఁ బ్రాణంబులదక్కించుకొనఁ గలిగి వంశాధారమునకుఁ గారణముగల్పింపఁగలిగెను. ఈ వనితావ తంస మాదుర్భరదుఃఖవార్తను వినుటతోడనే తనభర్తననుగమింప నిశ్చయించుకొనెను ; గాని యట్లు ప్రాణపరిత్యాగమొనరించుకొనుటకు ముందు తనపసిబిడ్డనుజూచి జాలిపడి యదృష్టహీనుఁడగుదన భర్తకుఁ దటస్థించినగతియె వానికిదటస్థించునేమోయని సంశయమొదవుటచేఁ దనకుఁ బ్రాణసమానురాలయి, యాంతరంగికురాలగు నొకబ్రాహ్మణ స్త్రీని బిలిపించుకొని యామెకు దనదురవస్థనెల్ల నెఱింగించి దిక్కులేని తనబిడ్డను, వానిసంరక్షణమునకుఁ జాలిన యాస్తితోఁగూడ నామెచే తిలోఁబెట్టి యాబిడ్డను దనసొంతబిడ్డవలెఁ బెంచుచు విద్యావంతునిగఁ జేసి వానికుటుంబమునకును, రాజ్యమునకును దటస్థించిన యీ యని వార్యమగు దురవస్థను వానికైశవానంతరంబున వానికెఱింగించునట్లా బ్రాహ్మణినుండి వాగ్దానమునుబొందినపిమ్మట శ్మశానవాటికకుంబోయి యందు చితిబేర్చుకొని పంచత్వంబునొందెను.

ఇట్లు దిక్కులేని యాబిడ్డను దయాంతరంగయగు నాబ్రాహ్మణాంగన గుంటూరు జిల్లాలోనిదగు నూతక్కి గ్రామంబునకుఁ గొనిపోయి యందు వానిని దన కన్నబిడ్డకంటె నెక్కుడు ప్రేమానురాగంబులతోఁ బోషింపుచుండెను. కులన్యత్యస్తంబు నైనఁ బాటింపక యటుల రెండేండ్ల యీడుగల యాబాలుని బెంచుటలో నామెకుంగల సహజౌ దార్యగుణంబు లెంతయు స్తుతిపాత్రంబు లగునుగదా ! ఔదార్యగుణ విశేషంబులందేగాక దైవభక్తియందును బెద్ద యగుటచే నట ‘శక్తీశ్వరస్వామి’ పేర నొకదేవాలయంబును గట్టించి యందు సుఖజీవనంబు సేయుచుఁ, దన పాల్బడియున్న గిరిమల్లిఖార్జునుని మిగుల జాగరూకతతోఁ బెంచి పెద్దవానినిగఁ జేసి విద్యాప్రావీణ్యునిగఁ గూడఁ జేసెను. ఇట్లు క్రమక్రమాభివృద్ధిగాంచిన వానికి, వానికుటుంబీకులకుఁ దటస్థించిన దుర్భరానర్థకంబు నెఱింగించి, వానికడనే యామె తనజీవితావసా

నంబును గడపెను. అంతట మల్లికార్జుననాయఁడు తనవంశక్షయం బునకును, రాజ్యభగ్నత్వంబునకును గారకు లగు శత్రురాజిని నిర్మూలించి తమపూర్వప్రతిష్ఠను బ్రతిష్ఠింప స్వస్థానంబున కేఁగఁ గృతనిశ్చయుఁ డగు చుండెను. ఇంతలో వాని యిష్టదైవం బగు శక్తీశ్వరస్వామి యొకనాఁటిరాత్రి వృద్ధబ్రాహ్మణాకారంబున స్వప్నావస్థ యందు సాక్షాత్కరించి "... ఇట్టి సాహసోద్యమంబుల కిది సమయంబుగాదు. ఇంక నీస్థలంబునందే నివసించి యుంటివేని, నీవును, నీకుటుంబీకులును నభ్యున్నతస్థితికి రాఁ గలరు. మఱియు నీ వైకరాజ్యంబున కధీశుండ వును గాఁ గలవు. ..." అని భక్తవత్సలుం డగుభగవంతుఁ డాజ్ఞాపించి యంతర్హితుం డయ్యె. అంత నతండు మేల్కాంచి దైవాజ్ఞలను శిరసా వహించి తననిశ్చితంబులను విడిచిపెట్టి యందే నివసించు చుండెను. అంత నచిరకాలంబుననే తనదైవభక్తితోఁ గూడిన సచ్ఛీలత్వంబునను, యోగ్యవర్తనంబునను బురోభివృద్ధి గాంచఁ గలిగి తత్ప్రాంతంబునఁ గల యొకకన్యారత్నంబును బరిణయమై సుఖంబుగఁ గాలంబును గడపు చుండెను.

ఈ వాసిరెడ్డికుటుంబీకులలోఁ గొందఱు కొండవీడుసీమలోని కొన్ని గ్రామంబులను స్వాధీన మొనరించుకొని తమలోఁ దా మైకమత్యముం గలిగి తమకార్యక్రమమును జక్కగ నెఱవేర్చుకొను చుండిరి.

కొన్ని సంవత్సరములు గతించినపిమ్మట నీ వాసిరెడ్డికుటుంబీకులలోఁ బ్రాముఖ్యుండును, ధైర్యోత్సాహంబులు గలవాఁడును నగు చంద్రమౌళీశ్వరుఁడుగా రొకశాశ్వతరాజ్యంబును స్థాపింప నుత్సుకంబు గలవాఁ డయి పట్టణరాజంబుగ నుండిన హైదరాబాదునకుఁ బోయి యచ్చటఁ గొంతసైన్యమును సమకూర్చుకొని నవాబుగారిసుబేదారుని దర్శించి యుచితగౌరవాదులర్పింపుచు వానికడ యోధవీరోచితకృత్యంబులనుష్ఠింపు చుండెను. ఆసుబేదారుఁడును వీనియనువర్తనంబున కానందించి యమితానురాగంబు గలవాఁ డయి కొన్ని బహుమానంబులతోను, నూతక్కి, తాటికొండ, మఱికొన్ని గ్రామంబులును గలిగిన

యొకజాగీరుతోడను సత్కరించి పంపెను. ఈవిధముగాఁ బాలనాధికారంబును వహించిన మన చంద్రమౌళీశ్వరునికుటుంబములోఁ గొన్ని తరంబులు గడచినపిమ్మట వీరప్పనాయఁడనునతఁడు ప్రాముఖ్యుఁడును బుత్రవంతుఁడును నై యుండెను. వీనిపుత్రులలో 'రాఘవయ్య, రామన్న, చంద్రమౌళి' అనువారలు కార్యనిర్వాహణసామర్థ్యంబు గలవా రయి ధైర్యసాహసోత్సాహాదులం దద్వితీయు లై యుండుటచే విస్తీర్ణంబైన సామ్రాజ్యంబును స్థాపింప నెంచి యెట్టిశ్రమల కైన వెనుదీయనిపట్టుదలతోఁ బ్రయాణోన్ముఖు లై తమకుం గలస్వల్ప సైన్యంబుతో ఢిల్లీపట్టణంబునకుఁ బోయిరి. అట్లు మన రాజసోదరులు ముప్వురును ఢిల్లీపట్టణము నందు 1628 సంవత్సరమునుండి 1658 సంవత్సరము వఱకును బరిపాలించు చుండిన షాజహాన్‌చక్రవర్తిని దర్శింపఁ బోయి యచ్చటఁ జక్రవర్తిదర్శనార్థ మై బహుకాలము నిలువవలసినవా రైరి. ఈమధ్యకాలంబులో వా రచ్చటఁ గల గొప్ప యుద్యోగియులతోడను, నధికారులతోడను, సేనాధిపతులతోడను మైత్రి సంపాదించుచుండిరి. ఇట్టి సందర్భమునందు చక్రవర్తియొక్క సుబేదారులలోఁ గొందఱు తాము జెల్లింపవలసిన కప్పంబులను సరిగఁ జెల్లింపక తిరగబా టొనరించుటచే షాజహాన్‌చక్రవర్తి తన సైనికులకు వారిపై దాడి వెడలుట కాజ్ఞాపించెను. చక్రవర్తియాజ్ఞచే యోధవీరులు బైలుదేరిరి. వారితోఁ గూడఁ దమస్వల్పసైన్యమును వెంట నిడుకొని చంద్రమౌళి, రామన్న, రాఘవయ్యలు ప్రభ్వాజ్ఞను దమకుఁదామే పైనిడుకొని సైనికోద్యోగియుల కావంతేని శ్రమ గలిగింప కుండ రణోన్ముఖు లై వెడలి శత్రురాజిని నెల్ల దునుమాడఁ గలిగిరి. అంత చక్రవర్తియుద్యోగియులు జయజయధ్వనులతోఁ దమ మిత్రత్రయంబును వెంట నిడుకొని ఢిల్లీకి వచ్చి చక్రవర్తి కీ ముప్వురపరాక్రమంబును విశదీకరించిరి. షాహుషాయును మిగుల సంతసించి వారి కమూల్యంబు లగు బహుమానంబులును, గొన్ని రాజోచితాలంకారంబులును గాక నందిగామపరగణానుగూడ నొసంగి వారి ననేకరీతుల గౌరవించి పంపించెను. అంత వారు స్వపురాభిముఖు లై యేతెంచి

సంస్థానంబును జక్కఁగఁ బాలించుకొనుచు, నూతనగ్రామంబులను నెలకొల్పుచు, దుస్తరంబయిన దారుణాటవులను ఛేదించి నివాసార్హంబులగున ట్లొనరింపుచు, నింక నెన్నియో దేశక్షేమకరంబు లగునను పాయంబుల నొనర్చిరి.

వీరు, హైదరాబాదుసుబేదారుని దర్శించి తమజమీలోఁ దమ ముగ్గురకును సమానభాగాధికారము లుండునట్లు పట్టాలను బొంది 1686 వ సం॥లో నందిగామజమీని దమముగ్గురకును మూఁడుభాగములుగ భాగించుకొనిరి. అందులో రాఘవయ్యగారు మాగల్లునందును, రామన్నగారు రాఘవపురమునందును, చంద్రమౌళిగారు చింతలపాడునందును బలిష్ఠములైనకోటలను గట్టుకొని చక్కఁగఁ దమ సామ్రాజ్యంబు నేలుకొనసాగిరి. కావున వాసిరెడ్డివారిచరిత్రము నన్గాఁ బరస్పరసంబంధ ముండుటచే నీముగ్గురచరిత్రములును వర్ణింపవలసి యున్నది; కాని ద్వితీయుఁడును రాఘవపురాధిపతియును నగు రామన్నగారికుటుంబ మల్పకాలములోనె యంతరించి పోయెను. వీని కార్వురుపుత్రులు గలరు. వారిలో నగ్రజుఁ డగువీరపనేఁడు సూరన్న యను నొకకుమారుని గాంచెను. ఈయనకుఁ జినసరసింహము చినరామలింగము నను నిరువురుపుత్రులు గలరు. ఈ చినరామలింగమే చల్లపల్లి జమీందారు లగు యార్లగడ్డకోదండరామన్నగారి జామాత యని తెలియవచ్చెడిని. ఈ చినరామలింగన్నగారు సంతానహీనులై 1760 వ సంవత్సరమున స్వర్గస్థు లయిరి. అంత వీరిసంస్థానము, మాగల్లున కధిపతి యగు రాఘవయ్యగారి సంతతికిని, చింతలపాడు నేలు చంద్రమౌళిగారి సంతతికిని సంక్రమించెను.

(ఇఁక మాగల్లుసంస్థానమునుగురించి విచారింతము. అసమానపరాక్రమవిక్రమవంతుఁడును, జగద్వ్యాపితచరిత్రుఁడును నగు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు బహదర్, సర్ దేశముఖ్ మన్నె సుల్తాన్ గారు పాలించిన దీసంస్థానమునే. కావున నిదియుఁ గొంత విపులచరిత్రమే యగును. అట్లగుటచే దీనిని; దమ 'వాసి' కొంచెఁతవడకుండున ట్లిప్పటివఱకు వాసిరెడ్డివంశపయోధిసుధాకరు లనం దగు మనప్రస్తుత

శ్రీరాజావాసిరెడ్డి చంద్రమాళీశ్వరప్రసాద్ నాయఁడు బహద్దర్ సర్ దేశముఖ్ మన్నెసుల్తాన్‌గారుపాలించుచున్న చింతలపాటివంతు సంస్థాన చారిత్రంబును వర్ణింపవలసియున్నది.

మాగల్లును బాలించు రాఘవయ్యగారి యేకపుత్రుఁ డగు పెద పద్మనాభుఁడు ఢిల్లీశ్వరునియొద్దకు ప్రతిభువు (Hostage) గఁ గొంపో వఁబడి యచటనే బహుకాల ముంపఁబడె ననియు, నంత నొకనాఁ డీ యన యంతికోద్యానంబునఁ గురుల సవరించుకొనుచు విహరించుటను గవాక్షమార్గంబునుండి కాంచిన రాణివాసజనంబులో నొకతె వాని సహజసౌందర్యంబున కచ్చెరు వొంది యుండుటచేతనో, లేక దేదీప్య మానంబులగు నమూల్యరత్నవితతిచే రచితమైన యొక చక్కనియం గీని నంతఃపురస్త్రీజనంబునకు బహుమతిగఁ బంపుటచేతనో, వారి చే ఫాదుషాను దర్శింపఁ గలిగి, పిమ్మట ఫాదుషాచే నొసఁగఁబడిన యొక యస్వాధీనతురంగంబును దనసామర్థ్యంబుచే స్వాధీన మొనరిం చుకొని యొక్క యహోరాత్రము దానిపై స్వారిజేయ నది నురుగులు గ్రక్కుచు మడియుటచే ఫాదుషా ఏని నిరుపమాన సామర్థ్యంబున కబ్బురపడి 'పెనుగంచిప్రోలు' బేతవోలు గ్రామములకును, బూర్వపు మాగల్లునకును బట్టా నొసఁగి పంపె ననియు నొకచిత్రకథ యున్నట్లు మెకంజిదొరగారు వ్రాసి యున్నారు.)

1710 వ సంవత్సరమునందు, కొండవీడుసర్కారు నందుఁ గల సత్తెనపల్లిజమీందారులకును, రేపల్లిజమీందారులకును గలహములు ప్రబల మగుటచే దక్కనుసుబేదారు (Governor of Duccan) తన మొకిమీ డగు నార్కాటునవాబున కెఱింగింప నాయన యీమండల మునుండి పోవుచు రేపల్లిజమీందారుఁ డగుమాణిక్యారావుగారియొద్ద నుండి కొండవీడుసర్కారును దీసికొని దానిలో మూఁడవభాగమునకు మన వాసిరెడ్డివారి నఫీశులుగఁ జేసి నవాబు తన యార్కాటునకుఁ బోయెను. ఇట్లు (కొండవీడుసర్కారునందలి మూఁడవభాగము మన పెదపద్మనాభునకే వచ్చె ననియు, నీయనయే చింతపల్లియొద్ద నొకకో టను గట్టెననియుఁ జెప్పుదురు.

మాగల్లు నేలిన రాఘవయ్యగారి పుత్రుఁ డగు నీయనను మె కంజిదొరగారు 'చినపద్మనాభుఁ'డని వాకొనిరి, కాని "తే. గీ. వారిలో పల శ్రీరాఘు♦వయ్యసుతుఁడు। దనరఁ బెదపద్మనాభుఁ డర్ల ♦ధరణివిభుఁ డు।చంద్రచందనకుందాబ్జ♦సదృశకీర్తి। యగుచు విలసిల్లెభూవల♦యం బునందు॥" అను పద్యమువలనఁ బెదపద్మనాభుఁ డనియు, ఖ్యాతి మం దిన రాఘవపురీశుఁ డగు రామయ్యగారి తృతీయపుత్రుఁడు—"ఉ. నీర పనీడురాఘవుఁడు♦విశ్రుతుఁ డౌ చినపద్మనాభుఁడుర్" అను పద్య పాదమువలనఁ జినపద్మనాభుఁ డనియుఁ దెలియు చున్నది. కావున మన మును బైపద్యానుసారంబుగనే వ్యవహరింతము.

అట్లభ్యున్నతస్థితికి వచ్చిన పెదపద్మనాభన్న కార్వురుపు త్రులు గల రనియు, వారిలో నాగన్న యనునాయన రాజ్యభారము వహించె ననియు నీక్రిందిపద్యము చెప్పు చున్నది:—" ఉ॥ ఆ పరవీర సంహారున ♦ కార్వురుపుత్రులు పెద్దరాఘవ । త్క్ష్మాపతి చంద్రమౌళి యరి♦మర్దనరామనృపాలకుండు,లి।క్ష్మాపతి, నాగనాహ్వయుఁడుఁ♦జెల్వ గు బుచ్చన నాగ వారిలో। భూపతియౌచు నాగన ప్ర♦భుత్వముచేసెఁ జిరంబుగా ధరన్." ఖ్యాతి మందిన రాఘవపురమున కధిపతి యై నట్టియు, 1760 వ సంవత్సరమునందు గతించి నట్టియు రామలింగన్నగారి కీనాగన్నగారు దత్తపుత్రుఁ డగుటచేతనో లేక తన బాహుబలపరా క్రమముచేతనో యెక్కుడు ప్రఖ్యాతినివహించి రాజ్యవిస్తారమును గాం చఁ గలిగెను.

ఇఁకఁ జింతలపాటిచరిత్రమునకు వత్తము. ఈ చింతలపాటివంశ న కధీశ్వరులు చంద్రమౌళిగా రని చదివి యుంటిరిగదా! వీరికి రాఘ వయ్య యనునొకపుత్రుఁడు గలఁడు. ఈ రాఘవయ్యగారు కత్తిసామునం దును, విలువిద్య యందును, గుఱ్ఱపుస్వారియందు నేగాక శరీరవ్యాయా మసంబంధ మగుమహదద్భుతకార్యంబులందును మిగులసామర్థ్యంబును గలిగి యుండెను. ఈయన ఢిల్లీకి పోయి యచ్చటి జేబుచక్రవర్తిని దన వ్యాయామనైపుణ్యప్రదర్శనంబుచే సంతసింపఁజేసి యనేకబిరుదములను




బహుమానంబులను జంతలపాటివంతుపై స్వతంత్రాధికారము ముందునట్లొక పట్టాను సంపాదించుకొని వచ్చెను. ఈయన పదుమూడు సంవత్సరములు పాలించెను. వీని యనంతరమున రాజమౌళి, అచ్చయ్య లేక లక్ష్మీపతి యనునిరువురుకుమారులలో రాజమౌళిగారు పరిపాలకులయ్యిరి. ఈయన యెనిమిదివత్సరములు జమీకధీశుఁడుగ నుండెను. సేద్యానుకూల మగున ట్లొక పెద్దకాలువను నందిగామనుండి త్రవ్వించెను. ఏలుబడి కనుకూలంబు లగుకార్యంబులనేగాక ధర్మచింతనపరాయణుండై యొనర్చిన పుణ్యకార్యంబులును బెక్కులుగలవు. ఈయనపిమ్మట అచ్చయ్య యను లక్ష్మీపతిగారు పాలకులైరి. ఈయన మాగల్లుపురాధిపతి యైననాగన్నగారితోఁ గొంతకాలము కలసిమెలసి యేకముగా రాజ్యపాలన మొనరించినట్లు తెలియవచ్చుచున్నది. ఆకాలములో ననఁగా 1761 వ సం॥ నందు వీ రిరువురకును షాహాఆలమ్ (Shah Alam) చక్రవర్తినుండి నైజాముగారిద్వారా కొల్లూరు, కేతవరము, బెల్లంకొండ, వినుకొండ, రాయపూడి మహాలులును; రావూరు, కూచిపూడి వఱకు గల హవేలి మహాలులును జేర్చి వీనిపై 'మన్నవార్'

అధికారము లభించెను. కాని కొలఁదికాలములోనే యీ యధికార మంతయు నొక్కనాగన్నగారికె చెందెను.

మాగల్లుపురాధిపతి యైన నాగన్నగారికి రామన్న, జగ్గయ్య, నాయడమ్మ లేక వేంకటాద్రి యను ముప్పురుపుత్రులు గలరు. వీరిలో రామన్న నందిగామపరగణాకును, జగ్గయ్య చింతపల్లిపరగణాకును బరిపాలకులుగ నుండి బాహుపరాక్రమములోఁ బాలింపఁ దొడఁగిరి. కాని, వీరికాలములోనే జ్ఞాతివైరము ప్రబల సాగెను. చింతలపాటివంతును బాలించిన లక్ష్మీపతియనంతరము, వీనియగ్రజుఁ డగురాజమౌళియొక్క తనయుఁ డైన చంద్రమౌళియు, వీని యనంతరమున వీని సుతద్వయం బగు రామలింగన్న, వీరపనీ డను నిరువురుసోదరులును జంతలపాడును నేలుకొను చుండిరి.

ఈ రామలింగన్నగారు ముక్త్యేశ్వరపుర మను నామాంతరము గల ముక్త్యాలయం దొకదుర్గమును గట్టుకొని యందే నివాస మేర్పఱచుకొనిరి. వీరపనీడుగారికి వీరన్న యనువాడుకపేరుగలదు. వీరు జగ్గయ్యగారిచే వధింపఁబడిరి. ఈజగ్గయ్యగారును నీ వధజరిగిన పై సంవత్సరములోనే యనఁగ 1764 వ సంవత్సరములో దక్కనుసుబేదారుఁ డగు సాలబత్ జంగుయొక్క సోదరుఁ డగు బసాలత్ జంగుచే నిట్టి యదృష్టమునకే పాల్పడెను.

వీరన్నగా రిట్లు వధియింపఁబడినపిమ్మట రామలింగన్నగా రీవిషయ మై వినినప్పుడు మిగులఁ గ్రోధోద్గ్రమానసుం డై దివాకర సుబ్బన్న యను నొకవకీలును హైదరాబాదునకుఁ బంపెను గాని పాప మీ న్యాయవాదిగారును దురాశావేశు లై యున్న యరివర్గముచే మార్గమధ్యంబుననే నిరోధింపఁబడి నిష్కారణంబుగ వధింపఁ బడిరి. లోభగుణ మెట్టిపాపకార్యంబుల కైన వెనుదీయ నీయదు కదా! అట్లు ఘోరారణ్యాంబున వధింపఁబడి కళేబరము సమీపమునఁ బాఱుచున్న కృష్ణానదిలోఁ బాఱవేయఁ బడెను. భర్తమరణంబు నాలించిన మీనాక్షు




మ్మ బిట్టు వగచుచుఁ దానును దనభర్తతోఁ పాటు జీవయాత్రను గడపఁ నిశ్చయించుకొనెనుగాని దయార్ద్రహృదయుం డగు రామలింగన్నగారు ప్లీడరు సుబ్బన్నగారికిని వారికుటుంబమువారికిని వాటిల్లిన యనర్థకంబునకు మిగులఁ జింతించి మీనాక్షమ్మతో 'నిన్నును నీసంతతివారిని శాశ్వతముగ సంరక్షించుచుండెద' మని వాగ్దానమొనరించి యాదరించిరి. రామలింగన్నగారికి తరువాతవచ్చినవారు కూడ నీ వాగ్దానమును నేఁటివఱకును నెఱవేర్చుచుండిరి. ఇట్లా సుబ్బన్న

గారియనంతరము రామలింగన్నగారు బందరువిస్సన్న యనుమఱియొ కవకీలును డిల్లీకి ప్రయాణము జేసి పంపించిరి; కాని యీప్లీడరున కును బూర్వోక్తదుస్థితియే తటస్థించెను. ఇట్లు కల్లోలములు ప్రబల ముగ నున్నకాలంబున రామలింగన్నగారి యైదుగురు పుత్రుల లోఁ బ్రథముఁడగు రాజమౌళిగారు దక్కనుసుబేదారుఁడగు సాలబత్ జంగును దర్శించి తమకష్టదశను విన్నవించుకొనిరి. ఆసందర్భములో నే నవాబుగారి పశ్చిమతీరవాసు లగు కొందఱు జమీందారులు తమక ప్పములు సరిగ నొప్పగింపక తిరుగఁబడుటచేఁ దత్క్షణము వారిని శిక్షిం చుటకై సంపూర్ణాధికారంబుతో మనరాజమౌళిగారిని నవాబు పంపు టచే నారాజమౌళిగారును సంపూర్ణవిజయులరయి తిరిగివచ్చి నందున నవాబానందపరవశుఁడై రాజమౌళిగారికిఁ 'రాజా, బహదర్' అనుబిరు దములను గొన్ని రాజలాంఛనములను భ్రష్టమైనజమీపై నొకపట్టా ను నొసంగెను. అంత రాజమౌళిగా రొకసంవత్సరముమాత్రమె రాజ్య మేలి పిమ్మట యవివాహితుఁడుగనే స్వర్గముఁ జేరెను.

* 1761వ సం॥ ఫిబ్రవరి నెలలో 'ప్యారిస్' (Paris) పట్టణము నందుజరిగిన యొడంబడికవలన సాలబత్ జంగు డక్కన్ సుబేదారుఁ డగుటను విని వీనిసోదరుఁడగు నైజామ్ ఆలి 1761 జూలై 18వ తేదిని సాలబత్ జంగును వధించుటచే నీ రాజమౌళిగారును బాదాపుగ 1761 సంవత్సరప్రాంతము నందే గతించియుందురు.

అట్లా బసాలత్ జంగుచే వధింపఁ బడిన జగ్గయ్యగారి మరణవా ర్తను విని వీరిసహధర్మచారిణియుఁ బరమపతివ్రతామణియు నగు అచ్చ మ్మ నిశ్చేష్టితురాలయి తనచేతిలో నున్న సువర్ణకంఠహారమును నావలఁ బాఱవైచి తాను సహగమన మొనరించెను. ఇదియే మన కృష్ణాజిల్లాలో జరిగిన కడసారిసహగమనము. ఈ పతివ్రతామణి స హగమనజ్ఞాపకార్థముగ నీవంశమువా రిప్పటికిని గంఠహారముల ధరింప కుందురు. మఱియు నీసాధ్వీమణి పవిత్రనామ మవనిపై నాచంద్రా

* Kristna District Manual Page 71.

ర్కంబుగ నుండున ట్లీ యమ్మగర్భశు క్తిముక్తాఫలం బనం దగిన శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగా రీమెపేర గుంటూరుజిల్లాలో 'అచ్చమ్మపేట' అను నొకగ్రామమును గట్టించిరి. మఱియు నీయన తనతండ్రి పేరఁ గూడ 'జగ్గయ్యపేట' యనుగ్రామమును గట్టించెను. మఱియుఁ దనపేరిటఁ గూడ 'రాజాపేట, మన్నెసుల్తాను పేట, నాయనిపేట లను గట్టించినట్లు శ్రీకాంచీమహాత్మ్యములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియు చున్నది—

"సీ. తతదానధర్మాస్ప♦దం బౌచు లక్ష్మిచే
ఘనతరం బైన జ♦గ్గయ్యపేట
తనతండ్రిపేరిటఁ ♦ దనరారఁ గట్టించి
తల్లిపేరిట మహా♦దానధర్మ
సదనమై నట్టి యా♦చ్చమ్మపేటను వేడ్కఁ
గట్టించి నిజనామ♦కలితముగను
ఘనతరాజాపేట♦యును మన్నెసుల్తాను
పేటయు నాయని♦పేట యనఁగఁ
తే. గీ. బట్టణంబులఁ గట్టించి ♦ ప్రబలఁ జేసె
నాలు గాశ్రమధర్మముల్ ♦ నడపి యంత
స్వర్ణగోపుల నిర్మించి ♦ సద్ద్విజాళి
కవి యొసంగెను శ్రీవేంక♦టాద్రివిభుఁడు."

పిరివిషయ మై ముందు చెప్పఁబడును. అట్లు జగ్గయ్యగారియనంతరమున నీనియగ్రజుఁ డగు రామన్నగారు రాజ్యవిశేషము నంతయుఁ దనస్వాధీనములోనే యుంచుకొని కనిష్ఠసోదరుఁ డగు వేంకటాద్రిగారికి నందిగామ నిచ్చి తాను చింతపల్లియం దుండెను; గాని కొలఁది కాలములోనే యనఁగా 1770 సంII లో సాలబత్ జంగుసోదరుఁ డగుబసాలత్ జంగున కయిష్టుఁ డగుటచేఁ జింతపల్లికోట ముట్టడింపఁ బడెను. ఈ బసాలత్ జంగు తత్కాలంబునందు, ప్రబల మైనఫ్రెంచిసైన్యముతో గుంటూరునందు మహోన్నతదశ యం దుండెను. ఇట్లుండ ఫ్రెంచి సైన్యాధిశుఁ డగు 'బోన్ ఎన్ఫాన్టు' (Bon Enfant) అనువానిచే

ముట్టడింపఁ జేసిన చింతపల్లిని, మన చింతలపాటి సంస్థానాధిపతులును 1763 వ సం॥లో వధింపఁ బడిన వీరన్నగారి యగ్రజులును నగు రామలింగన్నగారి పుత్రపంచకములో నగ్రజుఁడగు రాజమౌళిగారికి 1771 వ సంవత్సరములో నొసఁగుటయేకాక 'రాజా' యనుబిరుదము నొసంగి, దాదాపుగ వాసిరెడ్డి సంస్థానమున కంతకును జమీందారునిగఁ గూడఁ జేసెను. ఇదియె, యీ రెండుశాఖలవారికిని గల వైరానలంబున కొక యింధనంబుగఁ బరిణమించెను.

బసాలత్ జంగున కిష్టుఁడైన రామన్నగారును, వాని కనిష్ఠ సోదరుఁ డగు వేంకటాద్రిగారును బ్రిటిష్ రాజ్యములోని దగు నందిగామయందె యుండి యాపరగణామాత్రమె పాలింపుచుండిరి. అంత వేంకటాద్రిగారు 1772 సం॥లో నందిగామయందే యనఁగాఁ దాను బాలింపుచున్న తనసంస్థానమునందే గతించిరి. అంత నాలు సంవత్సరముల వయస్సుగల వేంకటాద్రిగారితనూజుఁ డగుచంద్రమౌళి యను నొక బాలుఁ డుండినను రామన్నగారు నందిగామకు తానే యధిపతిగాఁ జూచెను. మదరాసుదొరతనమువారుకూడ సోదరసంతతికి ననువృత్తి నిచ్చు నొడంబడికమీఁద రామన్నగారిని నందిగామ కధీశులుగఁ జేసిరి. కాని యీరామన్నగారు 1778 వ సంవత్సరమునఁ బరమపద మందిరి. పిమ్మట రాజ్యమునకు రాఁ దగినది వీనియాత్మజుఁ డగు నాగన్న యనెడి పాపయ్యగారే యయినను జగద్విఖ్యాతచారిత్రుఁడును, నిరుపమానపరాక్రమవంతుఁడును నగు రాజా వేంకటాద్రినాయఁడు రాజయ్యెను. ఈయన రామన్నగారి ద్వితీయసోదరుఁ డగుజగ్గయ్యగారికుమారుఁడు. ఈయన రాజ్యమునకువచ్చిన తోడనే తనయధికారమును నిరంకుశముగ సాగింప నెంచి తన పిన పెద తండ్రులతనయులగు చంద్రమౌళి, నాగన్న యనెడి పాపయ్యగార్ల నస్వాతంత్ర్యులుగఁ జేసి చింతపల్లికోటయందుంచెను: గాని పిమ్మట వీరితనయులనే దత్తపుత్రులనుగ స్వీకరించి తన యశేషసామ్రాజ్యంబు నొసంగి యుండుటచే వీరికి శత్రుఁడుగాక మిత్రుఁడే యయ్యెను.

శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారు తన బాహుబలపరాక్రమముచే నసహాయశూరుఁడై నలుదెసలఁ దన ప్రతాపానలంబును బ్రవేశపెట్టఁ జూచు చుండెను. ఇంతలో నీకుటుంబమునకుఁ దొలినుండి యుఁ గంటకుఁడుగ నుండిన బసాలత్ జంగ్ సమసిపోయెను. ఇఁక నైజా మన్ననో దూరస్థం బగు సికందరాబాదునం దుండును. కావున నీవేంకటాద్రినాయఁడుగారి ప్రతాపానలము ప్రచండముగఁ బ్రజ్వరిల్ల సాగెను.

చింతలపాడుసంస్థానాధీశు లగురాజమాళిగారు, బసాలత్ జంగుచే 1771 వ సంవత్సరములోఁ జంతపల్లి సంస్థానములోని విశేష భాగమునకును ప్రభు వయ్యె నని చదివి యుంటిరిగదా! ఈరాజమాళిగారి యనంతరమున వీని ద్వితీయసోదరుఁ డగు లక్ష్మీపతిగారు రాజ్యపాలనమునకు వచ్చిరి. ఈ రాజా లక్ష్మీపతినాయఁడుగారికిని, జింతపల్లి పురాధీశ్వరుఁ డగు శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారికిని బ్రబలకలహములు జరుగ సాగెను. వేంకటాద్రిగారు బసాలత్ జంగుచేఁ దాము గోలుపోయిన ముర్తజనగర్ (కొండపీడు) సర్కారులోనిభాగము నీయ నిర్బంధించెను. లక్ష్మీపతిగా రిందుల కియ్యకొన కుండుటచే వేంకటాద్రిగారు ముస్తఫనగర్ (కొండపల్లి) ప్రవేశించి ముక్త్యాల యందుఁ గలకోటను భూమికిమట్టముగఁ జేసి 1785 సం॥న సంస్థానమును స్వాధీన మొనరించుకొనిరి. లక్ష్మీపతిగా రీ సమాచారమును ఆలోచన సభయం దగ్రపులుగ నుండిన షడ్డర్ (Mr. Shudder, Acting Chief-in-Council)దొరగారికి విన్నవించుకొనఁ గ వారిరువదిమూఁడు గ్రామములతోఁ గూడియున్న చింతలపాడుసంస్థానమునుమాత్రము వీరిస్వాధీన మొసరించిరి.

లక్ష్మీపతిగారి యనంతరము శ్రీరాజా రాఘవయ్యనాయఁడుగారు రాజ్యాధిపత్యమును వహించిరి. వీరు లక్ష్మీపతిగారి సోదరులును రామలింగన్నగారి తృతీయపుత్రులును నై యుండిరి. చింతలపాటివంతెకను గుంటూరునకు సంబంధించి నైజాము రాజ్యములోనిదే యయి

యుండెను. అంత వేంకటాద్రినాయఁడుగారు తిరిగి యవకాశమును జిక్కించుకొని ముక్త్యాల ప్రవేశించి యెదిరించినవారిని వధించుచు శాద్‌షాహిసన్నదులను, మఱికొన్ని ప్రాణతుల్యమైనపట్టాలను దీసికొని పోయిరి. అట్లు ముక్త్యాలగూడ వాని యధీనమేయయ్యెను; గాని వాని నిరోధింపఁగలవా రెవరును లేకపోయిరి. అంత రాఘవయ్యగారు మిగిలినరాజ్యమునే యెనిమిదిసంవత్సరములవఱకుఁ బాలించిరి. తన రాజ్యకాలములో నీయన యనేకతటాకంబులను, నూతులను ద్రవ్వించి గ్రామాదులలోఁ బెక్కు రాజమార్గంబుల నేర్పఱచి జనోపయోగంబులగు మహాకార్యంబుల నెన్నియో యొనరించెను. మఱియుఁ దత్కాలంబునఁ గలిగినకఱవునం దెందఱకో బీదసాదల కన్నోదకంబు లిచ్చి కాపాడెను. ఈ విషయమునుగుఱించి కాంచీమాహాత్మ్యము నందు:—
"కం॥ వాపీకూపతటాకో।ద్దీపితవనరాజి నిలిపి ధృతి సుర్భిక్షు। వ్యాపితకాలం బందున। నోపికతో నన్న మొసఁగెను క్ష్వాప్రజకుల్॥" అనికలదు.

ఈ రాఘవయ్యగారి యనంతరమున వీని యనుజుఁడును రామలింగన్నగారి చతుర్థపుత్రుఁడును నగు చంద్రమౌళిగారు రాజ్యారూఢులైరి. వీరు తమపెద్దలచేఁ బోఁగొట్టుకొనఁబడిన చింతలపాడుసంస్థానములోనిమిగిలినగ్రామములను దిరిగి స్వాధీన మొనరించుకొనఁ నెంచుచుండ నీయుదంతంబును వేంకటాద్రినాయఁడుగా రాలించి తన పాలనమున నప్రమత్తులై యుండిరి. చంద్రమౌళిగారును దమదుస్థితిని మచిలీపట్టణమునందు కలెక్టరుగ నుండిన జాన్ రీడ్ (Mr. John Reid) దొరగారికి నివేదించిరి. కాని పర్యవసానము దెలియకమునుపే చంద్రమౌళిగారు 1803 వ సం॥లో స్వర్గాభిముఖులైరి.

ఇంతకుమును పసఁగా 1788 వ సం॥ నందు కొండవీడుసర్కారుగూడ నింగ్లీషువారి యధీన మయ్యెను. అంత వారు; వేంకటాద్రినాయఁడు తమయెడఁగృతజ్ఞుఁడై యుండుసట్లు బెల్లముకొండ వినుకొండసంస్థానములమీఁది యాధిపత్యము నొసంగిరి.

పిమ్మటఁ జింతపల్లియందు రాజా వేంకటాద్రిగారిచే బంధింపఁ

బడి యున్న పినపెదతండ్రుల కుమారు లగు చంద్రమౌళి, పాపన్న యను నాగన్న గార్లను యథేచ్ఛముగ విడిచిపెట్టుటయేగాక వారికిఁ దగినంత మనువృత్తిగూడ నిచ్చునట్లు జేసిరి. మఱియు వేంకటాద్రినాయఁడుగారు కొంతకాలమువఱకు గుంటూరునం దుండ నియమింపఁబడుటచే వారు తమరాజధానిని జంతపల్లినుండి యమరావతికి మార్చుకొనిరి. ఈ యమరావతియందు రాజాగారు హృద్యంబు లగు నుద్యానవనంబులను, సుందరము లగు దేవళంబులను నెలకొల్పిరి. మఱియుఁ బెక్కండ్రు వర్తకుల రప్పించి యుందు వసింపఁజేసి విశాలము లగు రాజవీథుల నేర్పఱచి యెంతయో యభివృద్ధికిఁ దెచ్చిరి. ఇంతియేగాక మనోహరం బగు నొకహర్మ్యరాజంబును గూడ నిర్మింపఁజేసి యుపరిభాగమును మెఱుగుబెట్టిన రాగిరేకులచేఁ గప్పించిరి. ఈ సౌధమును గట్టునప్పుడు రాళ్ళకై నేలను త్రవ్వుచుండఁగా బౌద్ధచిహ్నంబు లనేకములు గనుగొనఁబడెను.

1803 వ సంవత్సరము నందు జీవయాత్రను విరమించిన చంద్రమౌళిగారికి చినవేంకటాద్రినాయఁడుగా రను నొకతనయుఁడు గలఁడు. తమ పూర్వసామ్రాజ్యమును గుఱించి యింతకుఁ బూర్వమే తేఁ బడిన వ్యాజ్య మీ చినవేంకటాద్రినాయఁడుగారి రాజ్యకాలములోఁ బరిష్కరింపఁ బడి ముక్త్యాల చింతలపాడుసంస్థానముల కధీశుఁడుగఁ జేయఁబడెను; కాని యీ సంస్థానాధిపతుల కష్టంబు లింతటితో నంతరింపక వీరితరువాత రాజ్యపాలకు లైన వీరి పుత్రరత్న మనఁ దగు శ్రీ రాజా భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడు బహదరుగారి రాజ్యకాలంబులో నదృశ్యము లయ్యె నని చదువరులు ముందు గ్రహింపఁ గలరు.

చినవేంకటాద్రినాయఁడుగారికి 'అబ్బయ్య' యను నొక వాడుక పేరుగూడఁ గలదు. ఈయన రాజ్యమునకు వచ్చినంతనే జనోపయోగము లగు సత్కార్యంబుల నెన్నియో చేసెను. కృష్ణానదికి వేదాద్రి చెంత సోపానములను శ్రీ స్వామివారిదేవాలయమునకుఁ బ్రాకారంబునుఁ గట్టించి, నూతనజనపదంబుల నేర్పఱచి ముక్త్యాలకోటను బాగు

చేయించి, పెక్కు కాసారంబులను, కూపంబులను నిర్మింపఁజేసి, జనులను వాత్సల్యముతోఁ జూచుచు మహదైశ్వర్యముతోఁ బ్రజాపాలన మొనరించి దొరతనమువారికిఁ జెల్లింపవలసినకప్పము లెప్పటి వప్పుడే నిశ్శేషంబుగఁ జెల్లింపుచు నుండెను. ఈ రాజాగారి భక్తివైరాగ్యంబులును సత్కార్యవిధానంబులును క్రిందిపద్య మొకింత సూచింపఁగలదు.

"సీ॥ పరధరాధీశులఁ ♦ బరిమార్చి నిత్యాన్న
దానషోడశమహా♦దానసమితి
నమితభూదానాగ్ర♦హారప్రదానగో
దానాదిధర్మముల్ ♦ దగ ననేక
పర్యాయములు జేసి ♦ భాసురసద్ధర్మ
శాలి యై దేవతా♦సదనములను
గోపురప్రాకార♦కుట్టిమమండప
కలితంబులుగఁ బెక్కు ♦ గతులఁ జేసి
తే॥ గీ॥ ప్రకటకృష్ణాఖ్యనదికి సో♦పానపటలి
నుభయపార్శ్వంబు లందును ♦ నునిచి కీర్తి
సాంద్రచంద్రిక దశదిశా♦సరణిఁ బర్వ
నలరె భూస్థలిఁ జినవేంక♦టాద్రివిభుఁడు॥"

ఇంక శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారిచరిత్రమునకుఁ బోవుదము. శ్రీవేంకటాద్రినాయఁడుగారు తన దానధర్మంబులచేతను, సహజౌదార్యంబుచేతను, జనవశీకరణుఁ డై గ్రామోద్యోగీయు లగుకరణములను దదితగులను తోఁ బుజ్జగించుకొనుచుండిరి. ఇంతలో ననఁగా 1802 వ సంవత్సరము నందు దొరతనమువారిచే 'శాశ్వతజిరాయితీహక్కు' (Permanent Settlement) స్థిరపఱుపఁ బడెను. ఇట్లు స్థిరపఱుపఁబడుటలో శ్రీ భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారి సంస్థాన మగు శ్రీచింతలపాడుసంస్థానమునుగూడ దీనితోఁ జేర్చి యొకటిగనే జిరాయితీహక్కు నిచ్చిరి. అందువలనఁ జింతలపాటిసంస్థానాధి

పతులు దమ పేష్కష్ (కప్పము)ను దొరతనమువారికిగాక యీ యమరావతీ (వేంకటాద్రినాయఁడుగారినూతనరాజధాని) ప్రభువులకుజేర్ప వీరు తమ పేష్కష్నుగూడఁ గలిపి మొత్తమును దొరతనమువారికి బాపున ట్లయ్యెను. ఇందువలనఁ గలిగినయనర్థకము ముందు తేటపడఁ గలదు.

శ్రీ వేంకటాద్రినాయఁడుగారు తమ దానధర్మాదికార్యంబు లధికంబులుగ నుండినను స్వసామర్థ్యంబుచే ధనాగారంబున నధికధనంబును జేర్పఁ గలిగిరి. రేపల్లిజమీందారు లగు మాణిక్యారావుగారికుటుంబీకులు ఋణగ్రస్తులయి విక్రయించిన వంగిపురమును, మఱియు దొరతనమువారి కప్పమునిమిత్తమై విక్రయింపఁ బడిన కొల్లూరు, నిజామ్పట్నములను గొనుటయే గాక వినుకొండజమీలోని గొప్పభాగమును గూడ గుత్తకుఁ దీసికొనిరి. ఇవియేగాక మచిలీపట్నప్రాంతమందలి యినుగుదురు, ఆకులమన్నాడు, ఆఱుదీవులు, కలిదిండి యనువానిని, మేడూరుఘాట్ జమలవాయిపరగణాలలోని కొంతభాగమును గూడ విక్రయమునఁ గొనిరి. ఇట్లు రాజ్యవిస్తారమును సంపాదించి మహోన్నతైశ్వర్యవంతుఁడై భూలోకదేవేంద్రుఁ డని యనిపించుకొనుటకుఁగాఁబోలు నమరావతి యను పేరిటి రాజధానియును నందనవనమనుపేరు గలయుద్యానవనమును నైరావత మను గజమును గలిగియుండెను. ఈ శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారు తన యసమానరాజ్యసామ్రాజ్యమున దొరతనమువారి కీయవలసి యున్నకప్పము నత్యంతజాగరూకతతో నిర్ణీతకాలమునకుఁ దప్పకుండఁ నొసంగుచు నుండిరి. ఈ రాజాగారి దిగంతవిశ్రాంతయశస్సును వర్ణింపుచు 1846 సంవత్సరము ఏప్రియల్ 14 వ తేదిని దొరతనమువారికి బాపఁ బడిన రిపోర్టునందు సర్ వాల్టర్ ఇల్లియట్ (Sir. Walter Elliot) దొరగారీదిగువయభిప్రాయము నుదహరించిరి:— "వాసిరెడ్డిసంస్థానాధిపతి యగు వేంకటాద్రినాయఁడు తనకుటుంబసంస్థాన మగు చింతపల్లియెస్టేటునకుఁ దోడు రేపల్లిసంస్థానములోనిభాగ మగు వెంగిపురమును, కొల్లూరు, నిజాంపట్నములనుగొని కారణాంతరములచే నమరావతిని రాజధానిగ

నేర్పఱచుకొని యచ్చట దివ్యభవనములను శృంగారోద్యానంబులను నిర్మించెను. చేబ్రోలు మున్నగు మఱికొన్ని గ్రామంబు లందుగూడ సౌధ రాజంబుల నెలకొల్పెను. మఱియు మంగళగిరియం దత్యున్నతమగు నొక గోపురమును నమరావతి చేబ్రోలు మున్నగుతావులయం దనేక దేవాల యంబులను గట్టించెను. తనరాజ్యమునఁ బ్రాముఖ్యము లగుపుణ్యస్థలము లయందు ముప్పదియంగుళుల యెత్తుగలిగి బంగారుమలాము చేయఁబడిన 180యిత్తడిస్తంభముల స్థాపించెను. ఇంతియేగాక రెండుసారులు రజితము తోను, నొకసారి సువర్ణముతోను తులాభారముఁ దూఁగి బ్రాహ్మణు లకు బంచి పెట్టెను. రామేశ్వరము మొదలుగాఁ గల దివ్యక్షేత్రము లకుఁ బోయి పెక్కుయాత్రలను సేవించి కాశికి బోవునపుడు పేష్వా బాజీరావుగారి కమూల్యము లగుకానుక లనేకముల నర్పించెను. తన పేష్కష్‌ను ముందుగనే చెల్లించి తన మార్గవ్యయములకుఁగాను రెండులక్షలరూపాయలను దొరతనమువారిధనాగారమునందు నిలువ యుంచెను. బందిపోటుగాండ్ర నుక్కడచినందున నైజాము నుండి 'మన్నె సుల్తాన్' అనుబిరుదమును బడసి కానుకగా లక్ష పెగోడాలు (నా లుగులక్షల రూపాయలు) నైజామున కర్పించెను.

వీరినిగుఱించి కాంచీమాహాత్మ్యమునం దిట్లు వర్ణింపఁబడినది-

"సీ. సేతు కాశీ మధ్య♦సీమాంతరస్థిత
గురుతర శ్రీరంగ ♦ కుంభకోణ
పాశనాశక జంబు♦కేశ చిదంబర
కాంచీమహాపురీ ♦ కాళహస్తి
శేషావనీధర ♦ శ్రీగిరి శ్రీజగ
న్నాథాదిదేవతా♦స్థలుల కరిగి
యచ్చోటఁ దనపేర ♦ హరిహరమూర్తుల
నిలిపి ముందట హేమ♦నిర్మితంబు

తే. గీ. లైన కీర్తిధ్వజంబుల ♦ నచ్ఛ్రితముగ
స్థాపనముఁ జేసి తనకీర్తి ♦ దశదిశావ

దేశముల నెల్ల నిండించె ♦ వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డసదృశ♦విభవుఁ డగుచు.

క. తగమత్స్యపురాణోదిత
మగు నట్టి హిరణ్యగర్భ♦మను నధ్వరముల్
మిగులగ ధర్మతనూజుని
యగణితసద్రాజసూయ ♦ మట్లుగఁ జేసెన్."

ఈ రాజా వేంకటాద్రినాయఁడుగారు సంతానహీను లగుటచే, 1794 వ సంవత్సరములో బంధవిముక్తు లైన చంద్రమౌళిగారియొక్కయు, నాగన్న యనెడి పాపయ్యగారియొక్కయు జగన్నాథబాబు రామనాథబాబు అను కుమారుల నిద్దరను పెంచుకొనిరి. జగన్నాథబాబుగారు చంద్రమౌళిగారికి 1797 వ సం॥ లో జన్మించిన ద్వితీయకుమారులు. వీరు 1798 వ సం॥లో దత్తస్వీకారు లైరి. అటులనే 1806 వ సం॥లో జన్మించిన నాగన్న యనెడి పాపయ్యగారిద్వితీయపుత్రులగు రామనాథబాబుగారుకూడ 1807 సం॥లో దత్తపుత్రులయిరి.

అంత 1815 వ సంవత్సరమునందు జ్యేష్ఠపుత్రుఁ డగుజగన్నాథబాబు యుక్తవయస్కుఁ డగుటచే శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారు తన యపారరాజ్యసామ్రాజ్యమును విభజించి 314 గ్రామములు చేరిన యొకభాగమును జగన్నాథబాబుగారికిని 237 గ్రామములు చేరిన చేబ్రోలుభాగమును రామనాథబాబుగారికిని 1816 వ సం॥ ఫిబ్రవరి జులై నెలలలోఁ బంచి యిచ్చి 1816 ఆగష్టునెల 17 వ తేదిని బరలోకప్రాప్తులైరి.

అటుపిమ్మట దత్తపుత్రు లగుసోదరులకిరువురకును సంస్థానాధిపత్యములను గూర్చి ప్రబలకలహములు ప్రారంభ మయ్యెను. సమయముదొరికెఁ గదా యని యుభయపక్షముల యందును సలహాదారులు గుమిగూడిరి. సబ్బనీసు అనంతన్న పంతులనువాఁడు జగన్నాథబాబుపక్షము జేరెను. పొత్తూరి కాళిదాసు రామనాథబాబు పక్షము జేరెను. అంతజగన్నాథబాబు ద్వితీయదత్తస్వీకార మశా

స్త్రీయ మనియు, సంస్థాన మంతకును దానే యధిపతియనియు దావా తెచ్చెను. రామనాథబాబుగారు వేంకటాద్రినాయఁడుగారిచే జగన్నాథబాబువలెఁ దానును దత్తస్వీకారు డయినట్లును, చేబ్రోలుభాగము వేంకటాద్రినాయఁడుగారివల్లనే తనకు నిరూపింపఁ బడిన దనియుఁ బ్రతివాదింపఁ దొడఁగిరి. ఇట్లుభయులకును వ్యాజ్యకారణములు గన్పించుచుండెను. ఇంతలోఁ గృష్ణాగుంటూరుమండలము లందలి కలెక్టరు లీసంస్థానముపై దొరతనమువారికి రావలసినకప్పములు దిగఁబడుటచే విశేషభాగమును స్వాధీనపఱచుకొనిరి. పూర్వోక్తకారణంబులచే నీ యమరావతీసంస్థానసామ్రాజ్యలక్ష్మి చంచలభావ మంద సాగెను.

వ్యాజ్యము లటులనే వచ్చుచుండెను. గృహకల్లోలములు ప్రబలసాగెను. 1824 జూన్ 16 వ తేదిని జగన్నాథబాబుపక్షమున ప్రావిన్షల్ కోర్టువారు తీర్పు చెప్పిరి. అంత రామనాథబాబుగారు చెన్నపురిలో సాదర్ కోర్టున కప్పీలు చేసిరి. ఇదియిట్లుండఁగా 1825 సం॥ ఫిబ్రవరి 28 వ తేదిని జగన్నాథబాబుగారు స్వర్గస్థులగుటచే సంస్థానమునకంతకును దానే వారసుఁడ నని రామనాథబాబు దావా తెచ్చెను. ఈ దావాకూడ ప్రావిన్షల్ కోర్టువారిచే 1825 సం॥ డిశంబరు 22 వ తేదిని జగన్నాథబాబుగారి ప్రథమభార్య యగు అచ్చమ్మగారిపక్షమునఁ దీర్పుఁ జెప్పఁ బడెను. జగన్నాథబాబుగారి కీయచ్చమ్మగారుగాక రంగమ్మగారను మఱియొకభార్యగలదు. ఈమెవలనఁ బెంచుకొనఁబడిన లక్ష్మీపతి యను నొక కుమారుఁడును గలఁడు.

ప్రావిన్షల్ కోర్టువారితీర్పు మీఁద రామనాథబాబు తిరిగి సాదరుకోర్టువారి కప్పీలు చేసి యుండుటచే నిప్పటికి రామనాథబాబుగారి యప్పీళ్ళు రెండు విచారణలో నుండెను. అంతట రంగమ్మగారు, తన భర్తజీవితములోనె పెంచుకొనఁ బడిన లక్ష్మీపతి యను నొకపుత్రుఁడు గలఁ డనియు వేంకటాద్రినాయఁడుగారి సర్వస్వమున కీయనవారసుఁ డనియు 1826 సెప్టెంబరు 6 వ తేదిని దనమఱఁదిగా రగు రామనాథబాబుగారిమీఁదను అచ్చమ్మగారిమీఁదను దావా తెచ్చిరి కాని ప్రావిన్షల్ కోర్టువారీమెసాక్ష్యమును విచారించుటకు సైత మనంగీకారు లై

వ్యాజ్యమును గొట్టివేసిరి. అంతట రంగమ్మగారు మదరాసులోని సాదరు కోర్టునకు 1829 అక్టోబరు 22 వ తేదీని అప్పీలు చేసికొనఁగా వారు సాక్ష్యమును విచారింపవలసిన దని తిరిగి ప్రొవిన్షల్ కోర్టువారి కాజ్ఞాపించిరి. ఈదావాలో లక్ష్మీపతిగారి దత్తతవిషయమై మచిలీపట్నముకలెక్టరు గారగు రాబర్ట్సు (Mr. Roberts) దొరగారి సన్నిధికి జగన్నాథబాబు గారు బాలుఁడుగా నుండిన లక్ష్మీపతిగారిని గూడ నేఁగి యాబాలుఁడు తనదత్తపుత్రుఁడుగా నెఱింగించినట్లును నాసంగతిని రాబర్ట్సుదొరగారు రెవిన్యూబోర్డువారికి రిపోర్టు చేసి యుండినట్లును జెప్పఁబడు నంశములు ప్రబలాధారములయి యుండెను; గాని కృష్ణాగుంటూరుమండలముల కలెక్టరు లగు రుసెల్, ఓక్సు, విష్ (Russell, Oakes and Whish) దొరగార్లీవిషయమై యెఱుఁగ రఁట.

1830 జులై 5 వ తేదీని లక్ష్మీపతిగారిదత్తతకుఁ బ్రతికూలముగ నొకవిస్తీర్ణమైనతీర్మానమును జేసిరి. అంత రంగమ్మగారు మదరాసులోని సాదరుకోర్టున కప్పీలు చేసికొనిరి. సాదరుకోర్టువారుకూడ 1832 మార్చి 14 తేదిని జగన్నాథబాబుగారిచే లక్ష్మీపతినాయఁడుగారు దత్తస్వీకారులు కాఁబడలేదనియు, ద్వితీయపుత్రుఁ డగు రామనాథబాబుగారు వేంకటాద్రినాయఁడుగారిచే నిశ్చయముగాఁ బెంపు చేసికొనఁబడిరనియు, సోదరు లగు జగన్నాథబాబురామనాథబాబు లిరువురు నవిభక్తులనియుఁ, గావున భర్తృవియోగప్రభృతి వారికళత్రములయినయచ్చమ్మ రంగమ్మగార్లు మనువృత్తికిమాత్రమే యర్హులనియుఁ దీర్మానించిరి. ఈతీర్మానముచే రామనాథబాబుగారు వేంకటాద్రినాయఁడుగారిచే విడువఁబడిన సంస్థానము సకల్లకు నధినాథుఁడయ్యెను, గాని యప్పటికే దొరతనమువారికి చెల్లింపవలసిన పేష్కష్ చాల దిగబడియుండెను. సంస్థానపు టుద్యోగస్థు లెల్లరు ధనాధిసతులైరి. ఈ విషయమును గుఱించి గుంటూరు డిప్యూటితహశీల్దా రగు చిరుమామిళ్ల లక్ష్మీనారాయణప్రసాద బి. ఏ. గా రాంధ్రపత్రికయొక్క 1912 వ సంవత్సరపు సంవత్సరాది సంచికయం దిట్లు వ్రాసిరి:—"కేవల స్వోదరపోషణార్థమై పయోముఖవిషకుంభముల వలె నక్కవినయములతోఁ గొలు వు

నర్చు చుండిన దివానులయొక్కయు గుమాస్తాలయొక్కయు గృహముల యందు ధనరాసులు నిండ దయ్యెను. సంస్థానపునౌకర్లు స్వామిద్రోహులై మోసగించి సంస్థానపుధనముతోఁ దమపేరను, దమభార్యల పేరను బెక్కు సినాములను బంటభూములను సంపాదించిరి. ఇంటి యందు వంటజేసి తద్దినములను బెట్టించెడి పౌరోహితులుసయితము సమయము వేచి వెండిబంగారులను హరించి లక్షాధికారు లయిరి. ఇన్ని కారణములనుబట్టి 1844 వ సంవత్సరమువచ్చుసరికి నవరత్న రాసులతో నిండి యుండిన సంస్థానపుబొక్కసమున పైసాకూడ కఱ వయ్యెను".

గోరుచుట్టుపై రోకటిపో టనునట్లు 1832 వ సంవత్సరమందు దారుణమైనక్షామబాధయుఁ దటస్థ మయ్యెను. అందుచే రైతులు కడుంగడు క్షీణించిరి. వితంతువు లిరువురును సామ్రాజ్యమునకై శ్రీచక్రవర్తిగారికి దిరిగి అప్పీలు చేసికొని యుండుటచే సంస్థానాధిపతి గాఁబడిన రామనాథబాబుగారు దొరతనమువారిపక్షమున కొంతకాలమువఱకు సంస్థానమున కింతకు మధ్యస్థుండు (Manager) గ నుంపఁబడెను. అయినను వీరి కార్యనిర్వాహకత్వ మంత జయప్రదముగ నుండకపోయెను. వీరు 1842 వ సంవత్సరములో, దొరతనమువారి వలన ఋణములు తీరిన పిమ్మట సంస్థానమును దిరిగి యిచ్చి వేయునట్లును, ఈమధ్యకాలములో సొంతగానికి వేయిరూపాయల మనువృత్తి నిచ్చునట్లును లిఖితపూర్వక మగు వాగ్దానమును స్వీకరించి సంస్థానమును దొరతనమువారి కిచ్చివేసిరి. ఈ నిర్ధారణము కోర్టు ఆఫ్ డైరక్టర్సువారి 1842 జూన్ 21 వ తేది 14 నంబరుగల లేఖ ననుసరించి యుండెనుగాని మరి యేవిధమునైనను ఋణములు దీరుటసంభవ మని గ్రహించి దొరతనమువారు విధాయకప్రకారము 1846 వ సం॥ నందువిక్రయింప నిశ్చయించి జమీని స్వాధీనమొనరించుకొని నదిమొదలప్పటివఱకిచ్చుచు వచ్చిన రు 1000 ల మనువృత్తినిమాత్రమె స్థిరపఱచి దొరతనమువారు సంస్థానమునుగొని శాశ్వతాధికారులైరి.

ఇంతలో జగన్నాథబాబుగారి కళత్రము లిరువురును ప్రీవీకౌ

న్సిలులోఁ దెచ్చినయప్పీలు విచారణలోనికి వచ్చి 1848 సం॥ ఫిబ్రవరి 29 వ తేదిని ద్వితీయసోదరుఁడగు రామనాథబాబుగారి దత్తత శాస్త్రానుగుణ్యము కాదనియు నాయన రాజా వేంకటాద్రినాయఁడుగారి పూర్వార్జితమైనసొత్తున కేవిధమయినహక్కుదారుఁడు గాఁజాలఁడనియు, నాసామ్రాజ్యమంతయు జగన్నాథబాబుగారికే చెందవలసిన దనియు, వేంకటాద్రినాయఁడుగారి స్వార్జితమై యొసఁగఁబడిన దేదియైనఁ గలదేని దానికే యధికారియగు ననియు, మఱియుఁ దమకుయుక్తమని తోఁచినరీతిని దీర్పుచెప్పు దేశీయసభల (Native Courts) ననుసరించు సివిల్ యుద్యోగీయులవలెఁ గాక యీకోర్టువారు సాక్ష్యవిమర్శనమువల్లనే తీర్మానించువారగుటచే జగన్నాథబాబుగారిచేఁ బెంచుకొనఁబడిన లక్ష్మీపతిగారిదత్తత యుక్తమైనదే యనియుఁ దీర్మానించి, దానిని మదరాసులోని హైకోర్టువారి కీతీర్మానముప్రకారము జరిగింపఁ బంపిరి.

అంత లక్ష్మీపతినాయఁడుగారు సంస్థానమును స్వాధీనమొనరింప దొరతనమువారికి విన్నవించుకొనిరి; కాని సంస్థానమిదివఱకే విక్రయింపఁబడి తత్సామ్రాజ్యముగా దొరతనమువారిచే నంగీకరింపఁబడి రామనాథబాబుగారి కొసఁగఁబడుచున్న వేయిరూపాయల మనువృత్తిమాత్రము మిగిలి యుండెను. లక్ష్మీపతినాయఁడుగారు తిరిగి యప్పీలుచేసికొనిరిగాని యీ సహస్రరూప్యముల మనువృత్తిమాత్రమె మిగిలి యుండుటచే లక్ష్మీపతినాయఁడుగారామనువృత్తిమాత్రమె స్వీకరింపవలసినవారైరి. వీరియనంతరమున వీరిభార్యాగారగు వాసిరెడ్డి వేంకటలక్ష్మమ్మగారికీ వేయిరూపాయలమనువృత్తియుఁ దొలఁగింపఁబడి 750 రూపాయల మనువృత్తిమాత్ర మామె జీవితమువఱకు దయఁదలంచి యిచ్చునట్లును బదంపడి యామె కుమారులగు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటలక్ష్మీనరసింహమునాయఁడుబహదరుగారు దత్తపుత్రులను మిషచేసి మనువృత్తికూడ నంతరించునట్లును బరిణమించెను; గాని వేంకటలక్ష్మమ్మగారెంతయో శ్రమజేసి యొనర్చిన విశ్వప్రయత్నమువలన వారికేగాక వారివంశపారంపర్యముగ మొదటి వేయిరూపా

యల మనువృత్తియే స్థిరపఱుపఁబడెను.

ఈ శ్రీరాజా వాసిరెడ్డి వేంకటలక్ష్మీనరసింహామునాయఁడు బహాదరు మన్నె సుల్తాను గారు కంచిమైన రను వాడుకనామము గలిగి సుప్రసిద్ధు లై యుండిరి. వీరి దానశీలత్వమును గుఱించి గుంటూరు డిప్యూటితహాశీలుదారు మ॥రా॥శ్రీ చిరుమామిళ్ల నారాయణ ప్రసాద్ బి. ఏ. గా రిట్లు వ్రాసిరి.—"వీరి దాతృతాస్వభావమును ధైర్యగాంభీర్యాదిగుణములును లోకవిదితంబులు గావున వేఱుగ వక్కాణింపఁ బని లేదు." వీరియనంతరమునఁ జింతపల్లి దొరసానిగారను శ్రీరాజా వాసిరెడ్డి వేంకటలక్ష్మీనరసమ్మ బహాదరు మన్నె సుల్తానుగా రిప్పుడు గుంటూరునందు నివసింపుచుఁ దమకు వచ్చుమనువృత్తి వేయిరూపాయలే యైనను నవరాత్రము లందును దదితరసందర్భము లందును నా సద్వీమతల్లి యొనర్చు ధర్మకార్యము లత్యంతశ్లాఘనీయము లై యుండెను.

ఇచ్చట మఱియొక విషయమునకై యించుక సింహావలోకన మొనరింపవలసి యున్నది. వాసిరెడ్డి రామనాథబాబుగారు 1859 సం॥లో గతించిరి. వీరి మున్నూఱు రూప్యముల మనువృత్తి కొంత కాలమువఱకు మాత్ర మందులోసగము వీరిభార్యాగారికి వచ్చుచుండెనుగాని పిమ్మట దాశరథనాయఁడు శివప్రసాదనాయఁడు ననువీరిపుత్రుల కిరువురకును మొదటి 300 ల మనువృత్తియే వచ్చుచుండెను.

రామనాథబాబుగారితండ్రిగా రగు నాగన్న యనెడిపాపయ్యగారికిని జగన్నాథబాబుగారితండ్రిగా రగు చంద్రమౌళిగారికిని దొరతనమువారిప్రేరేపణచే శ్రీరాజా వేంకటాద్రినాయఁడుగారు రూ 385 ల మనువృత్తి నిచ్చుచుండిరి. కాని వారియనంతరమున నీమనువృత్తిని గుంటూరుమండలపు కలెక్టరుగా రిచ్చుచు వచ్చిరి. పాపయ్యగారియనంతరమున వారిపుత్రుఁడును రామనాథబాబుగారియగ్రజుఁడును నగు రామన్నగారి కొసంగ బడుచుండెను. ఈయన యపుత్రకుఁ డగుటచే నీరిమనువృత్తి వీరితోనే యంతరించి పోయెను. ఇఁకఁ జంద్రమౌళి

గారి రు 385 ల మనువృత్తి వారిపుత్రుఁడగు పద్మనాభరామన్న గారికిని బిమ్మటఁ బౌత్రుఁడగు నాయుడమ్మగారికిని నటుపిమ్మటఁ బ్రపౌత్రులగు పద్మనాభరామన్న చంద్రమౌళిగార్లకును వచ్చుచుండెను.

ఇఁక మన ప్రస్తుతకథాస్థానంబును, వాసిరెడ్డిసామ్రాజ్యవిభాసితంబును నగు చింతలపాటిసంస్థానచారిత్రంబును వర్ణించుదము. ఈ సంస్థానమునకుఁ జిన వేంకటాద్రినాయఁడుగారియనంతరమున శ్రీరాజా భవానీ ముక్తీశ్వరప్రసాదనాయఁడు బహదరుగారు రాజ్యాధిపతు లైరి. వీరు తమరాజ్యకాలములోఁ దమసోదరు లగు చంద్రమౌళిప్రసాద్‌గారికిని, సదాశివప్రసాద్‌గారికిని మనువృత్తి నిచ్చుచుఁ బాలింపఁ జొచ్చిరి. వీరి బాల్యమునందు సుఖోపవిష్టంబున కవకాశము లేనిసందర్భ మయ్యును వీరి జనని సంరక్షకురాలుగ నుండి రాజ్యభారమును వహింపవలసిన దయ్యెను. ఈమె తనకార్యక్రమంబు నెట్టిసామర్థ్యంబునఁ నిర్వహించుచుండినను నీమెకడఁ గలయుద్యోగియులచేఁ గొనిరాఁబడిన వ్యాజ్యములవలన నెక్కుడు ఋణగ్రస్తురాలు గావలసివచ్చెను. ఈ శ్రమలనేఁ గూడ దేశంబునందు 1832-33 సంవత్సరములయందు దుర్భర మగు క్షామబాధయుఁ దటస్థించెను. పూర్వోక్తకారణంబులచే రాజ్య మత్యంతశైథిల్యదశకు రాఁ జొచ్చెను; గాని పాప మామె తన యాస్తిని విక్రయించి యైనను దొరతనమువారికిఁ జెల్లింపవలసినకప్పమును నెప్పటి దప్పుడ తప్పక చెల్లింపుచు వచ్చుచుండెను. అయిన నొకప్పుడు మాత్ర మట్లు చెల్లించుట కొకింతకాలహరణ మగుటచే సంస్థానము దొరతనమువారిస్వాధీనములోనికి బోయెను. ఈ యనర్థకంబునకు మిక్కిలి చింతాక్రాంతురా లయి యామె తనజమీావిషదలకొఱకుఁ బెక్కుసారులు కలెక్టరుగారికి విన్నవించుకొనెను, గాని ప్రయోజనము లేకపోయెను.

ఇంతకుమున్ను వాసిరెడ్డిసంస్థానముమీాఁద ననఁగాఁ జింతపల్లి సంస్థానముమీాఁదఁ దత్కాలమునకుమాత్రము దొరతనమువారిచే నాధిపత్య మొసఁగఁబడిన రామనాథబాబుగారి కీచింతలపాడుసంస్థానాధికారముగూడఁ బొరపాటున నొప్పగింపఁబడి పిమ్మట నాయనపై నీయధి

కారంబు శాశ్వతముగ నిల్చి పోయెను. పిమ్మట శ్రీభవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారు పాలనార్హ వయస్కు లై రాజ్యమునకు వచ్చిరిగాని తమహ స్తగతంబగుసంస్థాన మించు కేనియు లేకుండు టెఱింగి తమ యుదంతంబు నెల్ల నప్పటికలెక్టరగు బ్లెన్‌గ్రాంటు (Mr. Blengrant) దొరగారికివిన్నవించుకొనిరి. దయాళుయుఁలగుశ్రీకలెక్టరుగారు తత్క్షణమే యీ విషయమును బోర్డువారికి విశదీకరించి వారి యాజ్ఞ చే సంస్థానమును మన భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారికి తిరిగి యొప్పగించిరి. వీరు తమసామ్రాజ్యాభివృద్ధి కయి మిక్కిలి శ్రమచేసి నైజాము రాజ్యము నుండి పెక్కండ్రు రైతులను గొనివచ్చి వారికి భూవసతిని గల్పించి తనరైతులుగఁ జేసికొనిరి. ఇంతలోఁ దిరిగి మఱియొకయనర్థకంబు వాటిల్లెను. నందిగామ (చింతపల్లి) సంస్థానాధిపతులు చెల్లింపవలసిన కప్పములు చాలవఱకు దిగబడి సంస్థానము విక్రయస్థితికి వచ్చినప్పుడు దొరతనమువా రీసంస్థానముతోఁబాటు చింతలపాడు సంస్థానమునుగూడ స్వాధీన మొనరించుకొనిరి. ఇది యక్రమమే యైనను నిందులకుఁ గారణము లేకపోలేదు. చింతపల్లిసంస్థానాధిపతు లగు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారికి 1802 వ సంవత్సరములోఁ దత్సంస్థానము పై శాశ్వతజిరాయితీహక్కు నిచ్చునప్పుడీ చింతలపాటి సంస్థానము ప్రత్యేకసంస్థాన మని భావింపక యంతయు నొకటిగనే యెంచి పొఱబాటున నొసఁగఁబడిన పట్టావలన, 1846-48 సంవత్సరములలో పేష్కిష్ చెల్లింపఁబడక నిలచియుండుటవలనఁ జింతపల్లిసంస్థానమును విక్రయములోఁ దీసికొనుచు మనచింతలపాటిసంస్థానమునుగూడ లాగుకొనిరి. కప్పముల దిగబాటుల (arrears) వలన నీరెండు సంస్థానములును దొరతనమువారి హస్తగత మయి పిమ్మట చింతపల్లిసంస్థానముయొక్క ఋణాధిక్యతవలన నిట్లు పరాక్రాంత మయ్యెను.

కావున శ్రీభవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారు తమ సంస్థానపునస్స్వీకారమున కై యెంతయో శ్రమ పడవలసివచ్చెను. శ్రీవారమితభక్తిపరాధీను లగుటచేఁ దమసామ్రాజ్యము దైవసాహాయ్య ముండినఁగాని క్రమ్మఱ లభింపఁజాల దని నిశ్చయించి కాంచీత్యాది దివ్య

క్షేత్రముల సందర్శించి కేవలభగవదనుగ్రహంబునలనఁ బునరైశ్వర్యం బు నొందిన ట్లీదిగువపద్యముల యందుఁ జెప్పంబడియె:—

"సీ॥ పూర్వరాజ్యము హూణ♦భూపాలవశ మౌట
బునరుద్ధరణబుద్ధి ♦ వృడమి మిగుల
బహుళయత్నములు జేసి ♦ ఫడయఁ జాలక యన్య
శరణుఁ డైశంకరు ♦ శరణ మంద
సర్వేష్టసిద్ధులు ♦ సమకూఱు నని యెంచి
శివనివాసపురీవి♦శేష మైన
కాంచికాపురిక నే♦కామ్రనాథుని గొల్వ
జన నిశ్చయించి యా ♦ జనవిభుండు
తే॥ గీ॥ తనకు నగ్రకుమారుఁ డై ♦ తనరు నట్టి
యిష్టసద్వర్తనుఁడుమామ♦హేశ్వరప్ర
సాదనాయనితోఁ గూడి ♦ యాదరమున
ముక్తిలింగంబు సేవించి ♦ ముదము గదుర॥

శా॥ ఆ ముక్తీలపురీస్థలిన్ వెడలి వే♦దాద్రీంద్రదివ్యస్థలం
బామోదంబునఁ జేరి యందు నరసిం♦హస్వామి సేవించి కృ
ష్ణామేయాపగ దాటుమార్గమున దే♦వావాసముల్ జూచుచున్
శ్రీమన్నిర్మలకోటిలింగమును మున్ ♦ సేవించి యామోదతన్॥

* * * *

తే॥ గీ॥ అచట నేకామ్రమూల మం ♦ దలరు చున్న
దివ్యతేజస్స్వరూపుని ♦ దేవదేవు
బోధమయుఁ డగు నేకామ్ర♦నాథుఁ గాంచి
యే డహోరాత్రములు నిల్చి ♦ యేకనిష్ఠ
నచటఁ బద్మాసనస్థుఁ డై ♦ యంగకముల
భసిత ముద్ధూళనము జేసి ♦ ఫాల మందు
మూఁడురేఖలుగాగఁ ద్రి♦పుండ్ర మునిచి
చారురుద్రాక్షమాలికా♦ధారుఁ డగుచు॥"

ఇట్లు పరమేశ్వరుని తదేకనిష్ఠాగరిష్ఠుఁడై యారాధించు నంత భక్తవత్సలుఁ డగుభగవంతుఁడు—

"మ॥ పొడచూపెన్ శతకోటిభాస్కరకర♦స్ఫూర్జప్రభాశాలియై
యుడురాడర్ధకిరీటుఁడై సురనదీ♦యుంజజ్జటాజూటుఁడై
కడిమిన్ బన్నగభూషణుం డయి శుభా♦కారుండునై దిక్కులన్
గడువేడ్కన్ బ్రమథాళి గొల్వ నట నే♦కామ్రేశుఁ డంచత్కృపన్॥

తే॥ గీ॥ అట్లు దృశ్యత్వ మొంది యే♦కామ్రనాథుఁ
డీవు కోరినకోరిక ♦ లిపుడె యగును
జెన్నపురి కేఁగు మని చెప్పి ♦ చిన్మయాంబ
రమునఁ గలిసెను బార్వతీ♦రమణుఁ డపుడు॥"

అంతఁ జెన్నపురికి వచ్చి రాజకీయవ్యవహారంబులం జరిపి పదంపడి—

"తే॥గీ॥ పూర్వరాజ్యంబు బడసి తా ♦ ముందు మఱలఁ
బుత్రపౌత్రపరంపరా♦పురుషతతికి
రాజ్యహాని యొకింతయు ♦ రాక యుండఁ
గా, నపుడు శాశ్వతం బగు♦కౌలు వడసె॥

క॥ తనపూర్వనృపులకంటెన్
ఘనసామర్థ్యమున నిట్లు ♦ కష్టించి ధరన్
బునరుద్ధరణం బొనరిచి
తనయునితో మరలి వచ్చెఁ ♦ దనపురమునకున్॥"

ఇట్లు కంచి యేకామ్రేశ్వరుని కారుణికంబుననే తమ పూర్వవైభవము సంప్రాప్తమైన దని శ్రీరాజాగారు తమయంకితమున 'శ్రీకాంచీమాహాత్మ్య' మును రచింపఁజేసి రని యీక్రిందిపద్యము నుడువుచున్నది—

"తే॥గీ॥ కాంచియేకామ్రనాథుని ♦ కరుణచేత
మాకుఁ గ్రమ్మఱ సామ్రాజ్య♦మహిమ గలిగె
నందుచేఁ గాంచిమాహాత్మ్య ♦ మాంధ్రభాష
కృతిని జేయించుబుద్ధి మా ♦ కిపుడు బొడమె॥"

శ్రీ భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగా రీకాంచీమాహాత్మ్య మునేగాక 'ద్రౌపదీవస్త్రాపహరణము'ను గూడ సంస్కృతమునుండి తెనిగింపఁ జేసి తాము కృతిపతులై యుండిరి.

బ్రిటిష్ దొరతనమువారు 'మన్నేసుల్తాన్' అనుబిరుదమును వంశపారంపర్యముగ వచ్చునట్లొసంగిరి. మఱియు నైజాము దొరతనమువారు "రాజబహద్దరు, షహామత్ మర్తబత్ వ అలి మన్జిలత్, సల్లమహూ అల్లాహుతల్లా" అనుబిరుదములను వారి కుటుంబమున కొసంగిరి.

శ్రీరాజా ముక్తీశ్వరప్రసాదనాయఁడుబహదరుగారికి యుమామహేశ్వరప్రసాదనాయఁడుగారు, వేంకటాద్రినాయఁడుగారు నను నిరువురుపుత్రులుగలరు. తన యనంతర మీయిరువురుపుత్రులును దమలోఁ దాము కలహింపకుండునట్లు శ్రీరాజాగారు పుత్రులయనుమతిచేత నే చరాస్తి నంతయు నిరువురకుఁ బంచిపెట్టి చిన్నకుమారుఁడగు వేంకటాద్రినాయఁడుగారికి వారిమనువృత్తినిమిత్తమై రెండుగ్రామంబుల నొసంగి వారిని సంతోషపఱచెను. ఈ రెండుగ్రామంబులపై వచ్చునాదాయ మావేంకటాద్రినాయఁడుగారి వ్యయంబునకుఁ జాలినదై యుండెను. మఱియు వారి నివాసార్థ మొకదివ్యభవనంబుగూడ నిర్మించి యొసంగెను. ఈవిధముగా శ్రీరాజాగా రంతఃకలహంబులు జనింపకుండునట్లు తమ బుద్ధివైశద్యముచే నన్నియుఁ జక్కఁజేసి యంతటితో నూరకుండక తమవార్ధికదశయందు తన రాజ్యభారమునుగూడఁ దొలగించుకొనఁ గోరెను. కావున శ్రీ భవానీముక్తీశ్వర ప్రసాద నాయఁడు బహదరుగారు శ్రీకృష్ణాకలెక్టరుగారికి 1887 వ సంవత్సరము జూలై నెల 12 వ తేదీయందు, "నేను వృద్ధవయస్కుఁడ నగుచున్నాఁడను గావున నాపెద్దకుమారుఁడు తక్షణమే నాస్థానంబున బ్రవేశించి నాజమీాయొక్క పాలనాధికారంబును వహింపవలె నని కోరుచున్నాను; గనుక జమీాని వానిపేర రిజిష్టరుచేయవలయు నని విన్నవించుకొనుచున్నాఁడను" అను నభిప్రాయంబుగల యర్జీ నిచ్చుకొనఁగ శ్రీ కలెక్టరుగారు 1887 వ సంవత్సరము నవంబరు 26 వ తేదీయందు

శ్రీ యుమామహేశ్వరప్రసాదనాయఁడుగారికి "ఎస్టేటు మీతండ్రిగారి కోరికప్రకారము మీపేర మార్పఁబడినది. నేఁటినుండి మీరు పేష్కష్‌ను మామూలుప్రకారము చెల్లింపుచుండవలెను" అని యాజ్ఞాపించిరి. ఇట్లు భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారు తమ జీవితమధ్యంబుననే యెస్టేటును దమ తనయునిపేర రిజష్టరు చేయించిరి. మఱియు నీ ముక్తీశ్వరప్రసాదనాయఁడుగారి రాజ్యారంభకాలముననే వ్యాపించిన దారుణమైనక్షామంబువలనఁ బెక్కండ్రు రైతులు భూములను సేద్య మొనరించుకొనలేక విడిచిపెట్టుటచేఁ బెక్కుభూములు పాడుపడి యుండుటను జూచి చెంతఁగల బ్రిటిష్‌నైజాములలోని పెక్కండ్రురైతులను గొనివచ్చి వారికి స్వల్పమైన శిస్తుమీఁద భూములనొసంగి వెంటవెంటనే విడుదలకైకొ ళ్ళొనరించుకొనుట కనువగుపద్ధతిమీఁదఁ బట్టాల నిచ్చివేసిరి. దీనివలన రైతులును, భూస్వామియుఁ గ్రమక్రమాభివృద్ధి నొంద నవకాశము గల్గెను. మఱియు వీరు 1283 వ ఫసలీయందైదేండ్ల కొకసారి పట్టాలను ముచ్చిలికాలను మార్చుపద్ధతి నేర్పఱచి ప్రతిపర్యాయమును శిస్తు నభివృద్ధిసేయుచు రైతులకు భారము లేకుండ నభివృద్ధికి తేఁ గలిగిరి. ఈ శ్రీరాజా ముక్తీశ్వరప్రసాదనాయఁడుగారు పాడుబడి యున్నమునియేరుయొక్క కాలువలను సేద్యానుకూలమగునట్లు జక్కగ బాగుజేయించి నందిగామతాలూకాలో గొప్ప భూభాగమును సస్యవంత మగుదానినిగఁ జేసిరి. వీరిజమీలో నుండి పాఱుచున్న యీమునియేటినీటిని దొరతనమువారుగూడ వాడుకొను చుండుటచే గవర్నమెంటువారే మనజమీందారుగారికి నీటితీరువ నీయవలసినవారైరి. ఈ యేటినీటివలన విశేషభూభాగము సాగగుచుండుటచే దేశ మెక్కు డభ్యున్నతస్థితికి రాఁ గలిగెను. చింతలపాటిలోని తటాకములును మిగుల సంస్కరింపఁబడుటచేతఁ గూడ మంచిరాబడి రాఁ గలిగెను.

శ్రీరాజాగారి పరిపాలనకాలంబున సంప్రాప్తమైన 'మహోదయ' పుణ్యావసరంబున శాస్త్రీయపద్ధతిని ధర్మకార్యంబు లెన్నియో యొనరించిరి. పుష్పగిరిమఠమునందలి చంద్రమౌళీశ్వరస్వామికి చింతలపా

డునం దైదుకత్తుల మెరకభూమిని ధర్మముచేసిరి. వీరు నిత్యశివపూజా ధురంధరు లైనశివభక్తు లయ్యును, శివకేశవులయెడ భేదభావము లేని వారయి విష్ణుభక్తులు గూడ నైరి. ఆకారణంబున వీరిజమీలోని నగు పెంట్యాల, కొనతమాత్మకూరు, బొబ్బిళ్ళపాడు అను గ్రామంబు లందు శివాలయంబులనే గాక విష్ణ్వాలయంబులనుగూడఁ బ్రతిష్ఠించిరి. అయినను:— తే. గీ. జగదధీశ్వరుఁ డగు మహే♦శ్వరుని యందు। సకల జగదంతరాత్ముఁ డౌ ♦ శార్ఙ్గి యందు । భేదవిజ్ఞాన మెయ్యెడ ♦ లేదు మాకు। నైనఁ సురుణేందుశేఖరు ♦ నంద భక్తి॥ యను భర్తృహరి యోగీంద్రుని మతానుసారంబుగ శివకేశవులం దభేదబుద్ధి గలిగి యుండియును శివభక్తియం దెక్కుడు ప్రీతిగలవా రగుటచే నిత్యశివ పూజాధురంధరులై విభూతిరుద్రాక్షమాలికలచే నలంకృతు లై విరా జిల్లు చుండిరి. మఱియుఁ బూర్వోక్తదేవాలయంబులకై యీనాము లేర్పఱచి యభివృద్ధికి వచ్చున ట్లొనర్చిరి. ఇంతియేగాక ముక్త్యాలలోఁ గల తమయిష్టదైవం బగు శ్రీముక్తీశ్వరస్వామికి వినుకొండతాలూకాలోఁ గల గుమ్మడంపాడుగ్రామములో నొక సగపాలుభూమిని, దూబాడు గ్రామములో నొకకొంతభూమిని గొని యీనాముగనిచ్చిరి. ఒక కొండ పైఁ గట్టబడిన వేదాద్రికోవెల నధిరోహించు తైర్థికాళికి సౌఖ్యద మగు నట్లు కృష్ణానదీతీరంబున నుండి యాలయద్వారము వఱకును గల యష్టోత్తరశతసోపానతతిని మిగుల దృఢంబుగఁ గట్టించిరి. వెండియు:—

"తే.గీ. తరుతటాకాదిసంతతుల్ ♦ ధరణి నెచట
నిలిపి రచటనె యుండు వా♦నికిని గృతిము
ఖంబుననె విశ్వవిఖ్యాతి ♦ గాంచుఁ గృతియె
సంతతివతంస మదిమాకు ♦ సంఘటింపు॥"

అని మున్ను దిరుమలరాయభూపాలుఁడు గోరినట్లే మన యీ శ్రీరాజాగారును గోరి సంస్కృతమునుండి యనువాదింపఁబడిన "ద్రౌపదీవస్త్రాపహరణము, కంచిమాహాత్మ్యము" అను గ్రంథద్వయంబున కుఁ గృతిపతు లై:—

"క॥ ధర్మములలోన నుత్తమ। ధర్మముగాన్యము నిజంబు♦ ధర నెవ్వనికా
ధర్మముచేకుఱునతడసు।ధర్మనువసియించుఁ బెక్కు♦దైవతయుగముల్ ॥"

అను శాస్త్రానుసారంబుగ నిష్కల్మషచారిత్రులై శివసాయుజ్యంబు నొందిరి. ఈ భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడుగారు వారి కుశాగ్రబుద్ధిచే గృహచ్ఛిద్రంబులు గలుగకుండునట్లు జేసిన యేర్పాటు ననుసరించి చినకుమారుఁడుగా రగు వేంకటాద్రినాయఁడుగారికి తమ జమీనుండి రెండుగ్రామంబులను దానవిక్రయాదుల కర్హతలే కుండున ట్లనఁగ వారసులు లేకుండినయెడలఁ దిరిగి జమీలోనే సంక్రమించున ట్లొసంగి తనరాజ్యభారమును విరమించుకొనిరి.

వీరియనంతరమున నుమామహేశ్వరప్రసాదనాయఁడుగారు పరిపాలనంబునకు వచ్చిరి. వీరును దమతండ్రిగారి శిక్షణమునఁ బెఱిగినవారగుటచే నెంతయుఁ బాలనక్రమంబున నసమాననైపుణ్యంబును గలిగి యెస్టేటును మంచి యభ్యున్నతస్థితికిఁ దేఁగలిగిరి. ఐదుసంవత్సరముల కొకసారి పట్టాలను దిరిగి వ్రాసికొనుపద్ధతి యుండుటచేఁ బ్రతితడవయును శిస్తును హెచ్చించుచు జమీ నభివృద్ధిపఱచుకొను చుండినను రైతులకు శ్రీవారి సహజానురాగకారణమున వారివిశ్వాసంబును నభివృద్ధి జెందఁజొచ్చెను. ఈ యుమామహేశ్వరప్రసాదనాయఁడుగారి రాజ్యకాలంబున నైజామురాజ్యము నందు గల వీరి సంస్థానభూములను గుఱించి కలిగిన వ్యవహారికవిషయాదులందు విశేషధనము హెచ్చింపవలసివచ్చినను మంచిధనాఢ్యులుగనే పరగణింపఁ బడిరి. వీరితండ్రిగారివలె వీరును నిత్యశివపూజాధురంధరులును మతాభిమానులును నగుచుఁ బెక్కుధర్మకార్యంబు లొనర్చిరి. వీరితండ్రిగారికాలంబులోఁ గట్టఁబడిన వయి కృష్ణాతీరంబునుండి వేదాద్రికొండపైఁ గల నృసింహస్వామియాలయంబువఱకును గల సోపానవితానంబు విశేషధనవ్యయంబుచేఁ దిరిగి దృఢంబుగ నుండునట్లు సంస్కరింపఁబడెను. మఱియు వీరు వేదాద్రిలోని దేవాలయంబును జక్కగా బాగుచేయించి యాత్రికులకు సౌఖ్యంబును గలిగించిరి. వీరు కాశీయాత్రను సేవించి తిరిగి వచ్చునప్పు డచ్చటనుండి యొక బ్రహ్మాండ మైనవిగ్రహంబును గొని

వచ్చి చింతలపాడునందుగల యొక దేవాలయంబు నందు బ్రతిష్ఠించి మనో హరంబులైనయుత్సవాదులను జరిగింపుచుండిరి. శ్రీరాజాగారు తమయవ సానప్రాప్తంబునకుముందే తమసోదరుఁడగు శ్రీరాజా వేంకటాద్రినాయఁ డుగారి పుత్రరత్నం బనఁ దగు శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాదనాయఁడు గారిని దత్తపుత్రునిగ స్వీకరించి పిమ్మటఁ గొంతకాలంబునకనఁగ 1901వ సంవత్సరము డిశంబరు 15వ తేదిని దమజీవయాత్రను విరమించిరి.

అంతట శ్రీరాజా చంద్రమౌళీశ్వరప్రసాదనాయఁడుబహద్దరు గారు రాజ్యారంభమునకు వచ్చిరి. వీరికి యాంధ్రభాషాభిలాష మెండు. ఈ శ్రీరాజాగారాయుర్వేదౌషధంబుల నెక్కుడు వ్యయప్రయాసలచే శాస్త్రానుసారంబుగఁ జేయించి రోగపీడితు లగువారికి శక్తివంచనలే కుండఁ బంచిపెట్టుచుఁ దమకుంగల పరోపకారపరాయణత్వంబును వెల్లడింపుచుండిరి. ఈ రాజాగారు దేవరకోటజమీందారుగారగు శ్రీమల్లిఖార్జునప్రసాదనాయఁడుబహదరుగారి ద్వితీయపుత్రికను బరిణయ మైరి. మఱియుఁ జల్లపల్లి కుమారరాజాగారగు శ్రీ యంకినీడు ప్రసాదబహదరు, బి.ఏ., గారు శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదనాయఁడుగారి తృతీయసోదరీరత్నంబును 1904వ సంవత్సరంబున వివాహమైరి.

వీరి పెంపుడుతండ్రిగారగు శ్రీయుమామహేశ్వరప్రసాదనాయఁ డుబహదరుగారి కాలంబునఁ దటస్థించిన ఋణమును దీర్ప నెంచి 1902—03 సంవత్సరప్రాంతమున మామూలుగ ముచ్చిలికాపట్టాలను దిరిగి వ్రాసియిచ్చు సందర్భమున నూటికిరువదియైదువంతున శిస్తును హెచ్చించిరి. ఈకారణంబున రైతులయందించుక వ్యతిరేకభావములు దటస్థించెనుగాని యవి దీర్ఘకాలము నిలిచియుండలేదు. ఈజమీలో, భూమిని హక్కుపఱచుకొని మామూలుశిస్తుమాత్ర మిచ్చు నట్టి పద్ధతిగాక భూస్వాములసమ్మతిలేకుండినచో నియమితకాలానంతరమున భూమిని వదలుకొనవలసినపద్ధతి యగుటచే రైతులు తమభూస్వాముల నతిక్రమించి నడుచుకొన వలనుపడదు. ఇట్టిపద్ధతు లుండినను శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాదనాయఁడుగారు తమరైతుల నెన్నఁడును నిరసన భావమున జూడ కుండుటయేగాక యెక్కుడు దయార్ద్రహృదయులయి

యాదరభావంబునఁ జూచు చుండుటచే రైతు లెల్లప్పుడును మిగుల భక్తివిశ్వాసంబులతో సేవింపుచుందురు. వీరి కుశాగ్రబుద్ధిచేతను, బరిపాలనయందలిదక్షత్వముచేతను దివానుగాని మేనేజరుగాని లేకయే స్వయముగా జమీాని బాలించుకొను చుండిరి.

ఈజమీా మిగుల దట్టమైన యడవులచేఁ గప్పఁబడి యుండుటచేఁ జాల భాగము బీడుగా నుండెను. కాని శ్రీవారి కాలంబునం దాభూమిని సుక్షేత్రంబుగ నొనర్పఁ దలఁచి తగు ప్రయత్నంబులకు జాగ్రత్తను దీసికొనిరి. ఈవిధముగా వ్యవసాయాభివృద్ధికి మిగుల శ్రద్ధదీసికొని తమయెస్టేటునకును, రైతులకును గడు నభ్యున్నతస్థితిని గల్పించిరి. విద్యాభివృద్ధికై శ్రీవారి పూర్వీకులు సలిపినట్లే యీరాజాగారుకూడ ముఖ్యాలయం దొక ప్రైమరీస్కూలును స్థాపించిరి. నదిగామయందు నెలకొల్పఁబడిన పాఠశాలాభవనము శ్రీవారి యౌదార్యముననే స్థాపింపఁ బడినది. ఈభవనమునకై యిరువదివేల రూప్యములు వ్యయపఱచిరి. ముఖ్యాలలోను, కంచెలలోను గల సౌధవితానమును సంస్కరించి మఱికొన్ని నూతనభవనములకై యేబదరువదివేలరూప్యములకుఁ బైన వెచ్చించిరి. శ్రీరాజాగారికి చిత్రలేఖనమునం దత్యంతాభిలాషగలదు. ఇందుకొఱకై చిత్రలేఖనమునం దత్యంతసామర్థ్యంబుగలిగి ప్రఖ్యాతినిగాంచిన శ్రీ రామమోహనరావుగారిని సకుటుంబముగా శ్రీ రాజాగారు తమసంస్థానమునం దుంచుకొని, చిత్రలేఖనకళాకౌశల్యముచేఁ దమహర్మ్యరాజము నలంకరింపఁ జేయు చున్నారు.

ఇటులనే శ్రీ రాజాగారు ధనవ్యయమును బాటింపక సంస్థానమునకు శ్రేయోభివృద్ధికరములగు నెన్నియో పనులను జేయింపుచు, జననుతి కెంతయుఁ బాత్రులైరి. వీరు పర్వదినంబులందును, దదితర సమయము లందును నన్నదానాదికముల నత్యంతసంతృప్తిగఁ జేయు చుండిరి. శ్రీ రాజాగారికిని వారికుటుంబమునకును భగవదనుగ్రహంబుచే శాశ్వతాయురారోగ్యంబులు లభించుఁగాక.

---



శ్రీరాజా నాయని వేంకట గంగారావు బహదరుగారు,
మునగాల.



శ్రీరస్తు.

# మునగాలసంస్థానము.

(కృష్ణాజిల్లా)

షోడశదళపద్మబంధసీసపద్యము:—

ప్రీతిన్పొఁ జేయించె ♦ శ్రీకృష్ణదేవరా
యులముఖ్యజీవిత ♦ మలరు నట్లు
ప్రాయించె నవనిపై ♦ వర్ణిత మాగాథ
లా జపార్ చారిత్ర ♦ మాంధ్రభాష
వెలయఁ జేసె వదాన్య♦విపులత విజ్ఞాన
చంద్రికామండలి ♦ సడల కుండ
వరకీర్తిమీఱ నా♦దరమనస్కుం డయ్యె
సుకవీశులకును వ♦శ్యుం డనంగఁ

తే. గీ. గాన నీభూపు భాషాభి♦మాన మెవరు
తనర వర్ణింప జాలరో ♦ యనుచు నిచ్చఁ
దలఁచు చుందురు శ్రీవసు♦ధావరా! క
వీశు లప్పుర మీకుఁ జిరాయు♦విచ్చి శ్రీశుఁ
డేలుఁ గాక వర్ధిల శ్రీలు ♦ నెలమి నిటులె॥

మునగాలజమీందారుగా నైన జుబ్దాతుల్ అక్రాన్ శ్రీనాయని వేంకటరంగారాయ బహదరుగారు తమసుగుణసంపత్తిచేతను, ప్రతిభావిశేషముచేతను గృష్ణామండలమునందేగాక యాంధ్రలోకమునందంతటను సుప్రసిద్ధులై యున్నారు.

ఈసంస్థానాధిపులు రెడ్డివంశజులు "రెడ్డిశబ్దము రాట్ శబ్దము నుండి యేర్పడినది. కావున రాజశబ్దంబునకు నీశబ్దాంబునకు నర్థభేదంబు లేదు. రాట్‌శబ్దమునుండియే యీశబ్దంబు నిష్పన్న మైనది. దీనింబట్టియె సంస్కృతశిలాశాసనంబుల భీమరెడ్డి కామిరెడ్డి మొదలగునామములకు భీమరాజు కామరాజు శబ్దములు ప్రయోగింపఁబడెను." అని వెలుగోటి వారివంశచరిత్రమునందు వ్రాయఁబడి యున్నది. మఱియు నీగ్రంథము యొక్క యాఱవపేజీయం దుదాహరింపఁబడి యున్న మార్కండేయ పురాణవాక్యానుసారంబుగ శూద్రాచారులై యున్నను వీరును బూర్వము క్షత్రియులై యుండి మహాపద్మునికారణమున 'రాట్' శబ్దభవ మగు రెడ్డినామముతో వ్యవహరింపఁబడు చుండిరి.

ఈ మునగాలసంస్థానము కృష్ణామండలములోని నందిగామతాలూకాలో నున్నది. దీనివిస్తీర్ణము నూఱుచదరపుమైళ్ళు. విస్తీర్ణము నందు స్వల్ప మైనను స్థానమునుబట్టి యిది మిగుల ప్రాముఖ్యతను వహించి యున్నది. ఈజమీ బ్రిటిష్‌రాజ్యపు సరిహద్దులయందుండినను నలువైపులను నైజాంరాజ్యముచేఁ జుట్టుకొనబడి యుండెను. మచిలీపట్నమునుండి హైదరాబాదునకుఁ బోవుచున్న రాజమార్గము బందరునకు నూటయిరువదిమైళ్ళదూరమునఁగల యీజమీలోనుండియే పోవు చున్నది. ఈజమీయం దీమార్గముయొక్క నిడివి పంద్రెండుమైళ్ళుండును. పదునెనిమిదవశతాబ్దాంతమునందును బందొమ్మిదవ శతాబ్దారంభమునందును నీబాట మహమ్మదీయమహారాష్ట్రసైన్యంబుల చేతను, ఆంగ్లఫ్రెంచిసైన్యంబులచేతను నుపయోగింపఁ బడు చుండుట చేత నీమార్గమున కిరుప్రక్కల నుండు విశాలప్రదేశములు తత్సైనికులకు విశ్రమస్థానంబులుగ నుండెను. అట్లు విడియు చుండిన యా సైనికులను గుఱించియుఁ బూర్వ మీ మార్గముననే పోవు చుండిన పండారీలయొక్కయు, రోహిలాలయొక్కయు దోపిడీలనుగుఱించియుఁ జెప్పఁబడు గాథలు చరిత్రకారుల కంతె యుపయుక్తములుగాక పోయినను జమీకొకనూతనశోభను గలిగించు చుండెను.

(పదమూఁడుపదునాలుగు శతాబ్దములయం దాంధ్రదేశమును

పాలించిన శూరవరు లగు రెడ్లయొక్క వంశజులును నీజమీనుపాలకులును నొక్కరే యయి యుండిరి. మహమ్మదీయులు దక్షిణదేశమును జయించుటకుఁబూర్వమె యీ మునగాలజమీను ప్రత్యేకరాజ్యముగ నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈజమీనునిగుఱించి మెకంజిదొరగారు— "కృష్ణామండలజమీనుందారులలో మహమ్మదీయాక్రమణమునకుఁ బూర్వమునుండియు భూములను పాలించు చున్నవారు బహుశః యీకుటుంబమువారు నొక్కరే." యనియును మఱియు— "వీరు రెడ్డివంశస్థులు. మఱియొక రెడ్డివంశ మనుముకొండనువదలి కొండవీడునందు రాజ్యస్థాపన మొనర్చినప్పటినుండి నేఁటివఱకును మునగాలయందే యెడతెగక నివసించుచుండినట్లు నుడివెద" రనియును వ్రాసి యున్నారు. ఇట్లనుముకొండను వదలి కొండవీడునందు రాజ్యస్థాపన మొనర్చినది దొంతియలియరెడ్డి. ఈ దొంతియలియరెడ్డి ప్రథమమునఁ గాకతీయ ప్రతాపరుద్రుని ప్రభుత్వకాలములో నొకసేనాధిపతిగ నుండెను.

పిమ్మట 1323 వ సంవత్సరమునందు ప్రతాపరుద్రుఁడు తురుష్కులచేఁ గారాగారబద్ధుఁడు గాఁబడుటయుఁ గొలఁదికాలములోనే తద్రాజ్య మంతరించుటయుఁ దటస్థించుటచే నీదొంతియలియరెడ్డి స్వతంత్రుఁడయి వినుకొండరాజ్యమునాక్రమించుకొని కొండవీడునందు నూతన రాజ్యస్థాపన మొనరించెను. వీనియనంతరమునఁబోలయ వేమారెడ్డి 1339 వఱకును రాజ్యపాలన మొనరించెను. ఈపోలియ వేమారెడ్డి కొండపల్లి దుర్గమును గట్టించెను. ఈయన ధరణికోటవఱకుఁగల రాజ్యమునాక్రమించుకొనెను. ఒరిస్సారాజులకోటల నెన్నిటినో సాధించెను. శివభక్తిపరుఁడయి యష్టోత్తరశతాలయములను శివునకు గట్టించెను. ఈపోలయ వేమారెడ్డికి తరువాత వీనికుమారుఁడన వేమారెడ్డి 1340 మొదలు 1369 వఱకును రాజ్యము చేసెను. ఈయన రాజమహేంద్రవరము వఱకును గల తెలుఁగుదేశము నంతయును జయించుటచేతనే గాక యమరుకకావ్యమునకు సంస్కృతవ్యాఖ్యను వ్రాసి సుప్రసిద్ధుఁడయ్యెను. ఎఱ్ఱాప్రగడకృతహరివంశమున కీ యనవేమారెడ్డియే కృతిభర్త. ఇట్లీ

రెడ్డిప్రభువు లేకధ్వజముగా నూఱుసంవత్సరములకు పైగా రాజ్యపాలన మొనరించి తాము కృతికర్తలును గృతిభర్తలునునై కీర్తిఁగాంచిరి.

ఇట్లు దొంతియలియరెడ్డి పోలయవేమారెడ్డిగార్లచేఁ గొండవీడునందు రాజ్యస్థాపన మొనరింపఁబడినది మహమ్మదీయాక్రమణమునకుఁ దరువాతిదియేమైనను సూయెల్‌దొర (Mr. Sewell) గారిచేఁ గనుఁగొనఁబడిన రెండుశాసనములవలన మునగాలజమీందారుల వంశస్థులు మహమ్మదీయాక్రమణమున కెంతయో పూర్వమునందే యోరుగల్లు రాజులైన కాకతీయవంశస్థులకు సమకాలీను లనియు, సామంతులనియు, దెలియవచ్చు చున్నది. ఈశాసనములను గుఱించి దొరగారు తమలీస్టుల (Lists of Antiquities in Southern India) యందు ' తాడువాయి ' గ్రామములోఁగల మల్లిఖార్జునాలయములోని రెండుశాసనములను గుఱించి "యొకటి శాలివాహనశకము 1228 (క్రీ॥ శ॥ 1306) వ సంవత్సరమునందుగల యన్నయరెడ్డికాలములోని" దనియు రెండవది "శాలివాహనశకము 1222 (క్రీ॥ శ॥ 1300) వ సం॥న గల ప్రతాపరుద్రదేవునికాలములోని" దనియు వానిలో "నీ రెడ్లు ప్రతాపరుద్రుని మరణానంతరము సర్వాధికారమును వహించి" రని యుండినట్లును వ్రాసియున్నారు.

ఈశాసనములను బట్టి యన్నయరెడ్డి ప్రతాపరుద్రదేవుని సామంతుఁ డనియు, మునగాల కాకతీయప్రభువుల కాలమందునుగూడఁ బ్రత్యేకసామంతరాజ్యముగ నుండినట్లును దెలియవచ్చు చున్నది. కావున నిజమీ యోరుగల్లురాజులచే స్థాపింపఁబడినదో లేక వారభివృద్ధికివచ్చుటకుఁ బూర్వమె స్థాపింపఁబడినదో నిరూపించుట కష్టతరము. ఏలయనఁగాఁ గృష్ణాజిల్లా మ్యాన్యూలు (Manual of Kistna Dt.) వలన:— "మునగాల మహారాష్ట్రులు మున్నగు బందిపోటుదొంగలు రాకపోకలు జేయుమార్గమం దుండుటచే నెన్నియోపర్యాయము లింగ్లాండు స్కాట్లండు సరిహద్దులయం దుండు పట్నములందువలె దోపిడిసేయఁబడి యుండుటచేఁ దత్పాలకుల చరిత్రాంశములను దెలియఁజేయఁగల యాధారములు దుర్లభ్యము లయ్యె" నని తెలియుచుం

డెను. అయినను మనకుఁ దొల్త నీజమీని బాలించిన సామంతరాజుల వంశమునుగుఱించి తెలియవచ్చు చున్న యీస్వల్పమువలననే యీవంశము పదునాలవ పదునైదవశతాబ్దములలోఁ గొంత ప్రాముఖ్యతకు వచ్చిన ట్లెఱుంగ నగును. డాక్టరు హైన్ (Dr. Hyne) దొరగారు 1714 వ సం॥ నందు వ్రాసిన దానియం దీవంశమునుగుఱించి—"అతఁడు తెలంగాన్ రాజచరిత్రమునందుఁ బేరుగాంచిన రెడ్డివంశస్థుఁ" డని యుదహరించి యున్నారు.

(ఈ 'తెలంగాన్' శబ్ద మోరుగంటిరాజ్య మను నర్థమున హిందూదేశమం దంతటను బ్రఖ్యాతివహించి యుండెను.) ఓరుగంటి రాజు లయిన కాకతీయులు పన్నెండవ పదమూఁడవ శతాబ్దములయందు మిక్కిలి ప్రబలులై తెలుఁగుదేశము నంతయు నాక్రమించుకొనుటచే నారాజ్యమున కీపేరు వచ్చినది.

(ఈజమీ నొకటిరెండు శతాబ్దములవఱకు నిరంకుశాధికారము తో నేలిన రెడ్లవంశము గోలకొండరాజ్యనాశనమునకు సమకాలమునం దంతమందినట్లు కనఁబడు చున్నది.)

(ఈకాలమునకు సమకాలీనుఁ డగు గుర్లపాటి యయ్యన్న దేశాయి 1693 వ సం॥ లో స్వర్గస్థుఁ డైనట్లు మెకంజిదొరగారు వ్రాసియున్నారు.) ఈయనకుమారుఁడు వీరికిఁబూర్వమె గతించుటచే నిఁక వీరి వంశములో 'సుభద్రమ్మ' యను వీరికోడ లుండెను. ఈమె రాజధర్మముల నిర్వహించుట కశక్తురా లగుటచే నీపెసోదరుఁడగు కేసర ముకుందప్ప యీపరగణాకుఁ బ్రభువుగఁ జేయఁబడెను. 1687 వ సంవత్సరములో గోల్కొండరాజ్యనాశనము జరిగినపిమ్మటిఁ దిరగఁబడిన కొందఱు సామంతరాజులను శిక్షించుటకై యౌరంగజీబుచే నాజ్ఞాపింపఁబడిన యీముకుందప్ప పాదుషాచేఁ దిరిగి యీజమీపై నధికారము వహించి యుండినట్లు తెలియవచ్చెడిని.

ముకుందప్ప యనంతరమున వీని ప్రథమపుత్రుఁడు సూరన్నయును, దదుపరి ద్వితీయపుత్రుఁడు నరసన్నయును జమీపాలనమునకు

వచ్చిరి. ఈనరసన్న గారియనంతరమున వీరిగృహిణి యగు లక్ష్మమ్మ యను నామె తన చిన్న (మైనరు) కుమాళ్ళకుఁ బోషకురాలుగ నుండి జమీని బాలించు చుండెను. ఆమెక్రింద మూఁడుకోటలును నాలుగువందలశిబ్బందియు నుండెను. ఇంతియగాక మున్నూరుసైనికు లాపత్కాలమునందుఁ దోడ్పడుటకు సిద్ధముగా నుండిరి. ఈమె పట్టుదలగలదియుఁ, బరాక్రమవంతురాలు నైనట్లు ప్రసిద్ధిని గాంచెను. ఈమె తన పరగణాలోని దుర్మార్గులును రాజద్రోహులును నైన కరణములను దేశముఖులను గఠినశిక్ష లొనరించి వశీకృతులుగఁ జేసికొనె నఁట. నైజాము సేనానాయకుఁ డగు అబ్దుల్ రహిమాన్ ఖానుని సైన్యమును రేపాల యొద్ద నెదిరించి యెంతయో ధైర్యముతోఁ బోరాడెను. అప్పుడు పోరు భీకరమై యుండుటచే నాఫౌజుదా రాపెశౌర్యసాహసాదులకు మెచ్చుకొని యుద్ధమును జాలించి యాపెను దనపక్షమునకుఁ ద్రిప్పుకొనెను. ఈమె తదనంతర మీపెజ్యేష్ఠపుత్రుఁడగు వేంకటరామన్న గారు పాలనమునకు వచ్చిరి. వీరి పుత్రపంచకములో జ్యేష్ఠుఁ డైన వేంకటనరసింహారావు 1802 వ సం॥ లో ఈస్టుయిండియాకంపెనీ వారినుండి 'సన్నద్ - ఇ-మిల్కియట్ ఇస్తిమిరార్' ను గ్రహించెను. వీరియనంతరమున వీరికుమారుఁడు కోదండరామయ్యగారు రాజ్యమునకు వచ్చి 1814వ సం॥లో గతించిరి. అప్పుడు వేంకటనరసింహారావను వీరికుమారుఁడు బాలుఁ డగుటచే నాజమీని కోర్టు ఆఫ్ వార్డ్సువారు తమస్వాధీనములోనికి దీసికొని తిరిగి 1818 వ సం॥లో నొప్పగించిరి. వీరు తమదానధర్మములకును మతాభిమానమునకును మిగులఁ బేరొంది 1836వ సం॥లో స్వర్గస్థులైరి. వీరిపిమ్మట రాజ్యమునకు రాఁదగిన వీరి దత్తపుత్రుఁడు కోదండరామయ్య బాలుఁ డైనందునఁ దిరిగి కోర్టు ఆఫ్ వార్డ్సువారా జమీని దమపాలనములోనికి దీసికొని 1850 వ సం॥లో నిచ్చివేసిరి. ఈయన నాలుగుసంవత్సరములు మాత్రమే జమీంభారమును వహించి పిమ్మట రుక్కమ్మ యను తనభార్య వశము జేసి 1854 వ సం॥లోఁ బరమపద మందెను. రుక్కమ్మయును బదునాలుగుసంవత్సరములు జమీపాలనమును వహించి 1868 సంవత్స

రములో గతించెను. అంతఁ గొంతకాలహరణము జరిగినపిమ్మట నీపె పుత్రికయగు లక్ష్మమ్మ 1873 వ సం॥లో నాపరగణాకు జమీందారిణిగ నేర్పడెను. ఈలక్ష్మమ్మగారు నైజామురాజ్యమునందు ఖ్యాతిగాంచిన దేశముఖుఁడగు నాయని వేంకట్రామయ్యగారిని వివాహమాడిరి. ఈమె దైవభక్తియందేగాక ధర్మాచరణమునందును మిగులఁ బేరుగాంచెను. తనరైతులను బిడ్డలవలెఁ గాంచుచు సుగుణసంపత్తిచే జనశ్లాఘ్యమునకుఁ బాత్రురా లయ్యెను. ఇట్టిసాధ్వీమణి యిరువదినాలుగువత్సరములు జమీపాలనాధికారమును వహించి 1892 వ సంవత్సరమున స్వర్గస్థురాలయ్యెను. ఈమెయనంతరమున నీపెదత్తపుత్రులును, మనప్రస్తుత రాజాగారును నగు శ్రీ వేంకటరంగారావుబహదరుగారు త్రయోదశ వర్షవయస్కులగుటచే జమీరక్షణము కోర్టు ఆఫ్ వార్డ్సువా రవలంబించిరి. శ్రీ రాజాగారు నైజామురాజ్యమునంగు ధీరాగ్రేసరు లనియు ధర్మపరాయణు లనియుఁ బే రొందినఁ యొకగొప్పవంశములోనివారు. వీరు నాయనివంశపయోధిచంద్రు లయి 1879 సం॥ న జన్మించిరి. 1883వ సం॥ న దత్తస్వీకారు లయిరి. వీరు నోబిల్ కాలేజియందు చక్కని విద్యను గ్రహించి 1900 సం॥ లో జమీపాలనమును స్వీకరించిరి.

వీరు; "పరోపదేశసమయే సర్వ యేవహి పండితః" అనినట్లు బోధనాసామర్థ్యముగలిగి యాచరణశూన్యు లగునట్టివారివలెఁ గాక కేవల మాచరణముచేఁ దదితరులకు మార్గదర్శకులుగ నుండిన గొప్పదేశాభిమానులు. వీరు చాలమట్టుకు దేశీయములైన యుడుపులనే ధరించుచుందురు. తమజమీలో నున్న నేఁతగాండ్రలోఁ గొందఱను దూరదేశముల కంపి వారి నచ్చట నూతనవిధము లగు నేఁతపనుల నేర్చుకొనునట్లు చేసిరి. మఱియు బెజవాడయం దొకస్వదేశిషాపును, నొక మరమగ్గములకార్ఖానా (Fly-shuttle loom factory) ను స్థాపించిరి. నేఁత నేయుట, రంగులు వేయుట మున్నగుపనులు నేర్చుకొనుటకై యొకరిని దమఖర్చులమీఁద జపానుకుఁ బంపిరి. వీ రీరీతిగ దేశాభివృద్ధికరము లగుపనులకును భాషాభివృద్ధికిని మిగులఁ దోడ్పడు చుండిరి. శ్రీవారి ముఖ్యవాసస్థలమగు నడిగూడెము నందు విద్యాభివృద్ధికై యొకప్రైమ

రీస్కూలును స్థాపించిరి. అం దుచితముగఁ దెలుఁగు, ఇంగ్లీషు, ఉరుదు నేర్పఁబడును. ఇంతియగాక హైదరాబాదు గుంటూరు బెజవాడ బందరు మదరాసులం దున్నతపాఠశాలలయందు విద్యాభ్యాసము సేయు విద్యార్థులకెందఱకో సాయ మొనర్చు చుండిరి. వీరి కాంధ్రభాషాపోషణమునం దత్యంతానురాగము గలదు. వీరి యాద రణముక్రిందనే శ్రీయుత ఆదిపూడి సోమనాథరాయప్రణీత మగు కృష్ణదేవరాయచరిత్రము ప్రకటింపఁబడినది. జఫార్ చరిత్రకూడ శ్రీవారల యాదరణముననే ప్రకటింపఁబడెను. శ్రీరాజాగారు హైదరా బాదులో నుండినప్పు డచ్చటఁ దెలుగున నొక పుస్తకభాండాగారమును నెలకొల్పిరి. మఱియు నీరాజాగా రాంధ్రభాషాపోషకు లనుట కాంధ్రప్రపంచమునం దశేషజనసంస్తూయమాన మగు విజ్ఞానచంద్రికా గ్రంథమండలిస్థాపనమే ప్రబలనిదర్శనము. ఈమండలికి శ్రీవారే యగ్రాసనాధిపతులు. ఎఱుకపడని గుప్తదానముల నటుంచి శ్రీవారి దానధర్మముల నెంతసంగ్రహపఱచివ్రాసినను జదువరులచే నవి యతి శయోక్తులుగ భావింపఁ బడక పోవు. విద్యావిషయమునందు వెనుకఁ బడి యున్న సంఘమువారికి ప్రోత్సాహము గలిగించుటయే శ్రీరాజా గారి ముఖ్యాభిప్రాయము. కావున శ్రీకృష్ణాగుంటూరుమండల విశ్వ బ్రాహ్మణమహాజనసంఘమువారిచే స్థాపింపఁ బడిన పుస్తకభాండా గారమునకు మున్నూరురూప్యముల విరాళము నొసంగి తత్సంఘము వారి కృతజ్ఞతకుఁ బాత్రు లైరి.

శ్రీరాజాగారికి తమరైతుల యెడఁ గలసంబంధము ప్రీతిపూర్వ కము. వీరికి రైతులయెడఁ గలప్రేమయు రైతులకు వీరియెడఁ గల గౌరవభావమును గడు శ్లాఘనీయములు. వే యేల? రైతులపై శిస్తు విషయ మైనతగవు లొకప్పుడును నీజమీనుయందు వచ్చి యుండలేదు. ఇదియే శ్రీమునగాలరాజాగారి యౌదార్యపరిపాలనమునకు ముఖ్య తార్కాణము. ఇంగ్లీషుశాస్త్రపద్ధతి ననుసరించి వ్యవసాయాభివృద్ధి వీరిపాలనమునం దెంతయో సంస్కరింపఁ బడినది.

"జుబ్దాతుల్ అక్రాక్, బహద్దర్" అనుబిరుదము లీకుటుంబీ

కులకుఁ దురుష్క ప్రభువులచే నొసఁగఁబడెను.

ఈ శ్రీరాజాగారిగుణగణములను గుఱించి యిందు విపులవర్ణన మొనరించుటకంటె హిందూదేశకథాసంగ్రహాది బహుళగ్రంథకర్తలును సుప్రసిద్ధులును నగు శ్రీయుత కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు యం. ఏ. గారే వీరిదివాను లని వ్రాసినఁ జాలును. సుగంధయుక్త సువర్ణముం బలె విరాజిల్లుచు నీదివాన్‌గారును నీరాజాగారును నాంధ్రలోకంబున కెంతయు శోభస్కరులై వెలయుచుండిరి.

శ్రీరాజాగారిగుణగణంబులు కృష్ణరాయవిజయములోను దదితరకవిపుంగవులవల్లను నిట్లు వర్ణింపఁబడి యున్నవి:—

"సీ॥ ఇమ్మహీపాలుండు ♦ హితహర్షలోలుండు
బుధజనా ... తుండు
దీనమందారుండు ♦ ధృతమహా
పావనచారిత్ర.
మందస్మితాస్యుండు ♦ మధురవా
బాంధవహృ
పరసతీవిముఖుండు ♦ భవ్యస్వ
దేశభక్త

తే॥ గీ॥ సతతవిద్యా
వరదయాపు
న్యాయ జేగీయమా
విమలనామ

సీ॥ విజ్ఞానచ ... ♦ విమల ... ♦ ... లక్ష్
... తుఁ ... డైన
యాంధ్రభాషాప్రచా ♦ రాదికావశ్య
కార్యసంత
బాలకబాలికా ♦ భ్యసనవిద్యాప్ర
కృంతరాయమ

యత్యంతదుఃఖయుక్తానాథరక్షణా
లయపోషణమ్ముకై లావు జూపి
తే॥ గీ॥ నీవు మునగాలరాజ్యరమావిభూతి
నెగడు చుంట సమస్తావనీప్రజాప్ర
థానభ్రాతృత్వ మెవ్వోడఁ దనరు చుంటఁ
గాక యన్యము గలదె రంగక్షితీంద్ర॥

చ॥ సిరులకు నెల్లదావల మశేషజగద్ధితధర్మసత్క్రియా
దరణగుణైకకారణము దైన్యజనోద్ధరణప్రచార మీ
శ్వరుకరుణాకటాక్షము భవద్విభవంబులఁ బెన్చుఁ గాత సుం
దరవిలసద్యశోవిభవ నాయనివేంకటరంగభూధవా॥"



శ్రీమంతు రాజా యేర్లగడ్డ అంకినీడు ప్రసాద్ బహాదరుగారు, బి. ఏ.,

కుమారరాజా ఆఫ్ చల్లపల్లి.



శ్రీరస్తు.

# దేవరకోటసంస్థానము.

(చల్లపల్లి, కృష్ణాజిల్లా.)

సీ॥ ఆంధ్రగీర్వాణభా♦షాభిలాషుం డయి
విద్వాంసులను గౌర♦వించు నెవరు?
సాదరాన్వితచిత్తు ♦ లై చల్లపల్లిలో
గొప్పసత్రము నెల♦కొల్పి రెవరు?
పేదలయెడఁ గల ♦ ప్రేమ స్వస్థానమం
దుచితౌషధాలయం ♦ బుంచి రెవరు?
కరుణాళు రగుచు లో♦కల్ ఫండుస్కూలున
కొకదివ్యభవనంబు ♦ నొసఁగి రెవరు?

తే॥గీ॥ అట్టి శ్రీమంతు యార్లగ♦డ్డాన్వవాయ
మహితపాథోధిశీతాంశు ♦ మల్లిఖార్జు
నప్రసాదబహద్దరు ♦ నాఁ బ్రసిద్ధిఁ
గాంచు శ్రీవారి నభ్యుందు ♦ గాచు చుండు॥

శ్రీదేవరకోటసంస్థాన ముత్తరసర్కారులలోఁ గల మిక్కిలి ప్రాచీన మగుజమీనాలలో నొకటి యై యున్నది. ఇది యదృష్టము ననుసరించిన యవస్థాభేదములను బెక్కింటి ననుభవించి ప్రస్తుతము ఘనతవహించిన గొప్పజమీనాగాఁ బరిగణింపఁబడు చున్నది. దీనియధీశులు "జుబ్దాతుల్ ఆక్రాణ్ శ్రీమంతు రాజా యార్లగడ్డ మల్లిఖార్జునప్రసాదనాయఁడుబహా దరుగారు. వీరు కమ్మవంశజులు. పూర్వచాళుక్యరాజగు మంగియువ రాజుయొక్క చెందలూరుశాసనమున "కమ్మరాష్ట్ర" మని లిఖింపఁ

బడి యుండుటచేతను, బల్లవవంశమహారా జగు కుమారవిష్ణువు, కౌం డిన్యసగోత్రోద్భవుఁడును నభిరూపనివాసియు నగు భావస్కందత్రాత యనుబ్రాహ్మణునకు కర్మకరాష్ట్రములోని దగు చెందలూరుగ్రామములో నెనమన్నూరుపట్టికల పొలమును దానముచేసి నట్లొకానొక శాసనముయొక్క లిపిని డాక్టరు హాల్ట్జుగారు పరిశోధించినదానిని బట్టియుఁ జూడఁగా "కర్మక, కర్మంక, కమ్మంక" అను పేరులచే వ్యవహరింపఁబడు చున్న రాష్ట్రమే రాను రాను కమ్మరాష్ట్ర మనియుఁ బదంపడి కమ్మనా డనియు వ్యవహరింపఁబడు చుండి నట్లును—"క॥ ఇలఁ గమ్మనాటిలో పల। విలసిల్లిన పావులూరి ♦ విభుఁడను సూత్రా। కలితాపస్తంబద్విజ। కులతిలకుఁడ వినుతగార్గ్య ♦ గోత్రోద్భవుఁడన్ ॥" అని గణితశాస్త్రకారుఁ డగుపావులూరిమల్లన్న పద్యమువల్లను స్పష్టమగు చున్నది. కాని నెల్లూరుజిల్లాలోఁ గల చెందలూరుశాసనమునుబట్టి యీకమ్మనాడు నెల్లూరుప్రాంతమునందే కల దనియు, రావు బహద్దరు కందుకూరివీరేశలింగముపంతులుగారు కవులచరిత్రలోఁ బావులూరు, గోదావరిమండలములోని దనుటచే గోదావరిప్రాంతమునందు గూడ మఱియొకకమ్మనాడు గలదేమోయనియు, నభిప్రాయపడుచు నెల్లూరుమండలప్రాంతము నందు గలదే ప్రాచీన మైన దనియు నీకమ్మనాడునకు సంబంధించినవారే కమ్మవారుగఁ గన్పట్టుచుండి రనియుఁ దలఁచుచు నీకమ్మవారు క్రీస్తుశకారంభము నుండియు నున్నట్లు చరిత్రకారులు చెప్పు చున్నారు. (ఆంధ్రులచరిత్ర; పేజ 232).

మరియు నీజమీపూర్వచారిత్ర మీాదిగువ నుదహరింపఁబడుచుండిన దొరతనమువారి తీర్మానాంశములను బట్టియు నెఱుంగనగును:—

కృష్ణాజిల్లాకలెక్టరుగా రగు రాబర్ట్సు దొరగారు 1824 అక్టోబరు 30 వ తేదిని రెవిన్యూబోర్డువారికి వ్రాసినయుత్తరములో నిట్లు నుడువు చున్నారు:—"... ఈకారణములవలన నీజమీా వంశపారంపర్యముగా వచ్చుచుండిన ట్లెంచవచ్చును. వీరిపూర్వీకులు 1640 సం॥లో అబ్దుల్ కుతుబ్షా యొద్ద నుండి యొకసన్నదును సంపాదించిరి."

ఈ పైవిషయమును గుఱించి బోర్డువా రంగీకరించక రాబర్ట్సు దొరవారి పైయుత్తరమునకు 1825 ఏప్రిల్ 4 వ తేది నెదిరుచెప్పి దమనిశ్చితమును స్థిరపఱచిరి—

"కలెక్టరుగారు జమీనుయొక్క పూర్వచారిత్రమును గురించి చక్కఁగాఁ జాటించినట్లు కనఁబడదు. మఱియు నీజమీనుల పూర్వచారిత్రములను గుఱించియు, నుత్పత్తులను గుఱించియుఁ దఱచుట యనవసరము. ఆకాలమునందు వారధికారులుగా నుండినందుననే హక్కుదారులుగా నిశ్చయింపఁబడిరి. అందువలననే గొప్పజమీందారులుగ నెంచఁబడి సర్వస్వాతంత్ర్యములు గల పట్టా లొసఁగఁబడి జమీందారులుగాఁ బరిగణింపఁబడిరి. ఈనిర్ధారణమే యింతవఱకు వ్యవహరింపఁబడు చున్నది. దీనిప్రకారమే 1822 జూన్ 28వ తేదిని గవర్నమెంటువారి యుత్తరములోఁ గొన్ని విషయములందు 'మొహాతర్ఫా' లలోఁ బ్రతిఫలము లొసఁగఁబడి నప్పుడు పర్మనెంటు సెటిల్‌మెంటునకుఁ బూర్వము స్వాధీనములోఁ గల జమీందారులుమాత్రమె పురాతనమైన జమీదారులుగ నెంచఁబడిరి. ఈవిషయము తరువాత జమీదారీ హక్కులను గొనుటవలన సంపాదించినట్టివారిని బూర్వపు జమీదారులనుగా నిర్ణయించుటకు బాధించు చున్నది."

"ఈ విషయమై కలెక్టరుగారు వ్రాయుటలో; బ్రిటీషుగవర్నమెంటువారు రాజ్యమునకు వచ్చునప్పటికే యుత్తరసర్కారులలో మిక్కిలి బలవంతులైనట్టి సరదారులు పరిపాలించు చుండి రనువిషయమును గమనించినట్లు లేదు. అప్పటి జమీదారులయొక్క రాజనీతి ననుసరించి వారినే యుంచి మహమ్మదీయుల రాజ్యకాలములో నెట్టి స్వాతంత్ర్యములతో నుండిరో యట్టి స్వాతంత్ర్యములతోనే యుంచి వారికి పట్టాల నొసఁగుట యుచిత మని తోఁచినందున వారిని బురాతను లగు జమీదారులుగా నిశ్చయించిరి. ఈకారణములను బట్టి యింకను బూర్వచరిత్రంబులను విమర్శించు టనవసర మని యెంచిరి."

బందరు కలెక్టరుగా రగు టి. వి. స్టేన్‌హౌస్. (Mr T. V. Stanhouse) దొరగారు 1831 ఆగస్టు 3 వ తేదిని, అప్పటికి గవర్న

మెంటువారి యధికారములో నుంచఁ బడిన దేవరకోటజమీని బరిపాలనార్హవయస్కుఁ డగు దుర్గాప్రసాదనాయఁడుగారికి తిరిగి యొప్పగించు సందర్భములో రెవిన్యూబోర్డు వారికి తనయభిప్రాయము నిట్లువ్రాసిరి.

“ఈ జమీ యొక్క ప్రస్తుతదుస్థితిని బట్టి చూడఁగ మిక్కిలి చిరకాలము నుండి వచ్చుచున్న వంశపారంపర్యపు హక్కులను నిలవఁ బెట్టి జమీని గాపాడుట ముఖ్యమార్గము. కావున దీనిని దిరిగి సొంతదారుల కొప్పగించుటయె నాయభిప్రాయము.”

ఇందుకు రెవెన్యూబోర్డు సబ్ సెక్రటరీగా రగు డబ్లియు' హుడ్డెల్ స్టన్ (Mr. W. Huddleston) దొరగారు వ్రాసిన దానిలోఁ గూడఁ బైవిషయ మొప్పుకొనఁ బడుటయేగాక దేవరకోటజమీందారులకు మహమ్మదీయరాజ్యకాలమునకుఁ బూర్వము గూడ జమీందారీ హక్కు లుండినట్లు చెప్పిరి.

ఈ పై నుదహరింపఁబడిన వివిధవిషయములం బట్టి యీ జమీ యీమధ్యకాలములో నుద్భవ మైనది కాక మిక్కిలి పురాతనకాలము నుండియు స్థిరీభూతముగా నిల్చియుండిన జమీయని నిశ్చయింపబడ వచ్చును.

ఈ కుటుంబకూటస్థుం డగు యార్లగడ్డ గుర్వినీడుగారు 986 ఫసలీ యనఁగా 1596సం॥న నీజమీని సంపాదించిరి. తదాది ముప్పదియొక్క సంవత్సరము లనగా 1627 వఱకు నధిపులుగా నుండిరి. వీరికి తిరుమలనీడు, గంగినీడు, కంచినీడు నను మువ్వురుపుత్రులు గలరు. ఈ ముప్వరిలోఁ బ్రథమపుత్రుఁ డగు తిరుమలనీడుగారు తమతండ్రియనంతరము జమీ కధిపతు లయి శ్రీకాకొల్లిటిపట్టాలెఁకోఁడనే పాలించు చుండిరి. అయినను 1640 సంవత్సరములో మొగలాయిచక్రవర్తి యైన కుతుబ్షా నుండి తిరిగి షట్టాను (sannad) సంపాదించి దేశముఖీహక్కులను గూడఁ దమ కుటుంబీకుల కెల్లరకు నుండునట్లు స్వీకరించి తరువాత నీయన 1665వ సం॥న స్వర్గస్థుఁడయ్యెను. వీరితరువాత వీరికి పుత్రులు

లేమిం జేసి వీరిసోదరుఁ డగు గంగినీడుగారు 1666వ సంవత్సరమున జమీాభారమును వహించి తిరిగి పైనఁ బేర్కొనఁ బడిన కుతుబ్షాకు దరువాత వచ్చిన అబ్దుల్ హుస్సేను నుండి మఱి యొక సన్నదును గ్రహించిరి. పదంపడి వీరి యనంతరమం దనఁగా 1682 వ సంవత్సరము మొదలు 1695 సంవత్సరమువఱకు ద్వితీయుఁ డగుకంచినీడు జమీా నేలి యంతరించెను. ఈ కంచినీడుగారికి పాపినీడు, నాగినీడు రామనీడు, గంగినీడు, వీరప్పనీడు నను పుత్రపంచకముగలదు. వీరిలోఁ గ్రమముగా మొదటి నల్వురు కొలఁదిమాసములే యనఁగా 1696, 1697, 1698 సంవత్సరముల వఱకు జమీాపాలకులుగా నుండిరి. తరువాత నాలవకుమారుఁడగు గంగినీడు 1699 సంవత్సరములో జమీాదారుఁ డయి యాసంవత్సరముననే యౌరంగజేబు చక్రవర్తినుండి యొక సన్నదును బొందెను. ఇంతకుఁబూర్వ మనఁగా నీగంగినీడు గారికి పూర్వము జమీా నేలు చుండిన నాగినీడుగారు 1695 సంవత్సరములోఁ బరగణా యంతకును టోగ్లాకుఖాన్ నుండి కవులును సంపాదించి యుండిరి. పాపినీడుగారును, నాగినీడుగారును మహల్ యొక్క ధనీషు లై నందున నొక లక్షరూప్యములను జెల్లించుటకు గోరఁ బడిరి. పాపినీడుగారికి చినగంగినీడను తనయుఁడు గలఁడు. ఈ గంగినీడుగారు 1708 సంవత్సరములో స్వర్గస్థు లైరి. అప్పుడు వారి యిరువురుకుమారులలోను బెద్దవారగు నాగన్న నాయఁడుగారు జమీాపాలకు లైరి; కాని మతిభ్రష్టత్వము తటస్థించినందువలన 1710 సంవత్సరాంతమున జమీాభారము నుండి తొలంగింపఁ బడుటచే వీనిసోదరుఁ డగు అంకన్నగారు 1711 మొదలు 1723 వఱకును జమీాదారులుగ నుండిరి. ఈ అంకన్నగారికి వేంకటరామన్న, హనుమన్న నాగన్న కోదండ రామన్నయను నలువురు సుతులు గలరు. ఈ నలువురిలోఁ బ్రథములగు వేంకట్రామన్నగారు 1723 సంవత్సరము మొదలు 1734 వఱకుఁ బాలకులుగ నుండిరి. ఈ వేంకట్రామన్నగారు పూర్వపు సన్నదుల తోనే పాలించుచు నైజామునుండి 1726వ సంవత్సరములో నొక సన్నదును దిరిగి సంపాదించిరి. రెండవవారగు హనుమన్నగారు

మతిస్థిమితము లేనివారయి గతించుటచే దృతీయు లగు నాగన్నగారు జమీంభారమును వహించిరి. వీరు 1735వ సంవత్సరమునం బ్రారంభించి 1745 వ సంవత్సరమువఱకు జమీ నేలిరి. అంతట మిక్కిలి ఘనతవహించి నట్టియు, వర్ణనీయచరిత్రు లైనట్టియుఁ గోదండరామన్నగారు 1746 సంవత్సరమున జమీంపదవి నధిష్ఠించిరి.

ఈ కోదండరామన్నగారు కార్యనిర్వహణము నందు ధైర్యశాలియు, సమర్థుఁడు నై నంగున బందరు నందు గల యప్పటి ఫ్రెంచి ముఖ్యులలోని వాఁ డగు 'మన్సియర్ మోర్సీవ్' (Monsieur Morrecieve) గారి యొద్ద నుండి గూడూరు ఆకులమన్నాడులకును, దీవి పరగణాలోని యాలులంకలకును, సెంటునకు మూఁడువరహాల రుసుమును జెల్లించునట్లు నొకపత్రమును (పర్వానా Parvana) సంపాదించిరి. 1760వ సంవత్సరములో నీకవులు తిరిగి యింగ్లీషుదొరతనము వారి నుండి స్వీకరింపబడెను.

1788 సం॥ జూలై 30వ తేదిని రివిన్యూబోర్డువారికి; వల్లూరు, చీకూరు మఱికొన్ని లంకలను దాను కవులుకు కంపెనివారినుండి 1779 మొదలు 1787 వఱకును దీసికొని యా భూములను దాను పలువిధము లగు సేద్యానుకూల మైన యభివృద్ధుల నొనర్చి కృష్ణానదీసంబంధ మగు వరదలవలని యపాయములు తటస్థింప కుండు నట్టి సదుపాయము లొనర్చి మఱియు వరిపొలముల కనువగు కాలువలను ద్రవ్వించిరి.

అప్పటి జమీందారులలో వీరు మిక్కిలి కుశాగ్రబుద్ధిగలవా రై జమీయొక్క పురోభివృద్ధికొఱ కై ఫలదాయకము లయిన పెక్కుకార్యము లొనర్చిరి; అనఁగాఁ బొలములకు జక్కని నీటిపారుదల కనువగు కాలువలను గొప్పతటాకములను జమీలోని పలుభాగముల యందు ద్రవ్వించి భూమి నంతయు సస్యవంత మగుదానినిగా నొనర్చిరి. వీరు తమ యస్టేటుపొడవునను గృష్ణానదియొక్క వఱదల వలని యపాయములు తటస్థింపకుండు నట్లు నదియొక్క తూర్పువైపున వేయించిన కట్ట యిప్పటికిని గన్పట్టుచు నదీసంబంధము లైన యుపద్రవములఁ గాపా

డుచున్నది. ఇట్టి దేశక్షేమంకర మగు కార్యములను గాక సర్వజనోపయోగము లగు సత్రములను గట్టించిరి. కల్లేపల్లి శ్రీకాకుళము లందు సుందరము లై నట్టియు, మహోన్నతము లై నట్టియు దేవళముల ననూనవ్యయములతోఁ గట్టించిరి. ఈ దేవాలయముల స్థిరత్వమున కై పెక్కులైన యీనాముభూము లొసంగిరి. శ్రీకాకుళములోని దేవాలయమునందు * గాకుళేశ్వరస్వామిని బ్రతిష్ఠించిరి.

---

* ఈ కాకుళేశ్వరస్వామిని గుఱించి జను లొక కథను జెప్పుకొను చుందురు. శ్రీ రాజావారు కాకుళేశ్వరస్వామికి నిరంతరమును సాయంకాలమున నొక పుష్పమాలికను బంపు చుందురు. ఆ మాలను స్వామి కలంకారముగాఁ గంఠమున ధరింపఁ జేయుదురు. ఇట్టి యాచారమును సరిగా జరపక యర్చకుఁడు పుష్పమాలను స్వామికంఠమునుండి తీసి తనపటకత్తె కంఠమున నలంకరించు చుండును. రాజాగా రెప్పుడేని సుస్నాతు లై దేవళమున కేతెంచి సభక్తికముగా దేవు నారాధించి స్వామికంఠంబునఁ బూర్వదినంబున నలంకరింపఁ బడి యున్న పుష్పమాలను బూజారినుండి స్వీకరించి కన్నుల నద్దుకొని మాలిని ధరించు టలవాటై యుండెను. అటులనే యానాఁడును మాలికను దేఁ గోరఁగా నర్చకుఁ డదివఱకే తనప్రియురాలి మెడనుండి తీసికొని వచ్చి స్వామి మెడలో వైచి యున్నవాఁ డగుటచే వెంటనే మాల నొసంగెను; కాని యామాలయం దొక నిడు పైన వెండ్రుక కనిపించుటచే రాజాగా రది యెక్కడిది దని క్రోధరస మొలక నాయర్చకుని బ్రశ్నించిరి. అంతట నతఁ డతిభయంబునఁ గాళ్ళు గజగజ వడకు చుండ దగ్గుత్తికచే నేమియుఁ దోఁపమి నో రాడక తుదకు స్వామికి శిరోజము లుద్భవించె ననియుఁ, సెల పచ్చినచో నవియు నాఁడు మాపఁ గల ననియుఁ బొంకెను. శ్రీ రాజాగా రటులనే మాప కలసిన దని చెప్పి వారు నియమితదినంబున కేతెంచి పరిశీలించిరి. ఈలోగా నర్చకుఁడు స్వామిసన్నిధిఁ జేరి మెడకు గండకత్తెరను వేసికొని "శంకరా! యీసమయమునఁ బ్రసన్నుండవై మామానధనంబును గాపాడవేని నీచరణసన్నిధి నే నాప్రాణములను గోల్పోవుట నిశ్చయ" మని నిశ్చలభక్తితోఁ బ్రార్థింపుచు భగవంతుఁడు ప్రసన్నుఁడు గాకుండినఁ దనప్రాణములను గోల్పోవుటకు నిశ్చయుం డై యుండెను. భక్తవత్సలుం డగు భగవంతుఁడు శ్రీరాజాగారు పరీక్షార్థమై స్వామిశిరఃప్రదేశమునఁ గల శిరోరుహములలోఁ గొన్నింటి నూడఁ బెఱుకుసమయంబునఁ గొన్ని రక్తబిందువులను జిందించి భక్తుని ప్రాణమును గాపాడెనఁట.

* ఓక్సు దొరగారును, గ్రాంటు దొరగారును బోర్డునకు వ్రాసిన జాబులలో వీరిని గుఱించి మిక్కిలి సంస్తుతించి వ్రాసిరి. కోదండరామన్న గారికి వేంకటరామన్న గారు, అంకన్న గారు, నాగేశ్వరుఁడుగారు, వేంకటాద్రిగారు నను నలువురుపుత్రులు గలరు. వారిలో ద్వితీయసుతుఁడగు అంకన్న గారిరువదిమూఁడుసంవత్సరములుమాత్రమే జీవించిరి. 1791 వ సంవత్సరములో వీరితండ్రిగారు స్వర్గస్థులగుటచే జమీపాలనమును గుఱించి ప్రథమతృతీయులకు జగడములుతటస్థించెను. దుడుకుస్వభావుఁడును గోపియు నగు నాగేశ్వరుఁడుగారు జమీని దనకు లోఁబఱచుకొనవలె నని యనేకములయిన శ్రమలను గలిగించిరి.

వేంకటరామన్న గారు తనసోదరుని యల్లరులను గుఱించి బందరు కలెక్టరుగారికి విజ్ఞాపన మంపుకొనఁగా శ్రీకలెక్టరుగారు రక్షకసైన్యమును బంపి చల్లపల్లియందు శాంతమును నెలకొల్పిరి. నాగేశ్వర నాయఁడుగారును; తన యగ్రసోదరుఁడు జమీపాలనమున కశక్తుఁ డగుటచేఁ దన్ను జమీయొక్క పాలనభారమును వహింపవలె నని తమతండ్రిగారే తన్ను నియమించి నట్లు చెప్పుకొనిరి. అంతట వేంకటరామన్న గారిని, ప్రథముడే జమీని బాలించుచుండిన యాచారము వంశపారంపర్యముగా వచ్చుచుండిన దని తెలుపఁ గల వంశవృక్షమును గనపఱచవలసినదిగాఁ గోరి యావంశవృక్షమును బరిశీలించి దొరతనమువారు వేంకటరామన్న గారికే పాలనాధికార మొసంగి నాగేశ్వరనాయఁడుగారికి నెలకు నూఱువరహాల మనువృత్తి నిప్పించిరి.

ఈ వేంకటరామన్న గారు 1792 వ సంవత్సరములో లోకాంతరగతు లగుటచే వీరిదత్తపుత్రుఁడును నాగేశ్వరనాయఁడుగారి ప్రథమ పుత్రుఁడును నగు నంకినీడుగారు జమీపాలకు లైరి.

నాగేశ్వరనాయఁడుగారు మఱియొకజమీలోని దగు పెడనపరగణాను గొనిరి. 1813 జులై 12 వ తేదిని తనసతీతిలకము లగు

* See ' The Aristocracy of Southern India, part II.

వెంకమ్మ సత్యప్రసూనాంబ లను నిరుపురను దాముకొనిన పెడనపరగ ణాకు యజమానురాండ్రనుగాఁ జేసి యది తమస్వార్జిత మగుటచేఁ దనకుమారుఁడైనయంకినీడుగారి కెంతమాత్రము దానిపై నధికారము లేదనియును దొరతనమువా రంకినీడుగారివలన నెలమనువృత్తిగాఁ దమ కిప్పించుచుండిన నూఱువరహాలు దనభార్యలకే చెందవలసినదనియు నాగేశ్వరనాయఁడుగా రవసానకాలమం దొక మరణశాసనమును వ్రాసిరి.

1815 ఏప్రిల్ 16 వ తేదీని నాగేశ్వరనాయఁడుగారు దేహవిముక్తు లగుటచే నంకినీడుగారు తా మదివఱకు నెలసరాసరిగ నిచ్చు చుండిన నూఱువరహాల మనువృత్తి నిచ్చుట మాని నందున వారు (వితంతువులు) జిల్లాకోర్టులోఁ నొక వ్యాజ్యమును దెచ్చిరి; కాని యందులోఁ దమకు వ్యతిరేకముగాఁ దీర్పు చెప్పఁ బడుటచే నున్నతన్యాయస్థానంబున కప్పీలు చేసిరి. అందు సైతము క్రిందికోర్టుతీర్పునే స్థిరపఱచుచు నట్టి వాగ్దానము నంకినీడుగారిచే నెన్నఁడు వ్రాతమూలముగా నేర్పఱుపఁబడి యుండలే దని సిద్ధాంతీకరణ మొనర్చిరి.

నాగేశ్వరనాయఁడుగారికి గల యంకినీడు, గంగాధరనాయఁడు నను నిరుపురుపుత్రులలోఁ బ్రథములగు నంకినీడుగారు జమీందారులుగ నుండిరి కదా. పిమ్మట గంగాధరనాయఁడుగారి సుతునే యంకినీడుగారు పెంచుకొనిరి. ఈ దత్తపుత్రుఁ డప్పటి కెనిమి దేండ్లవయస్సుగలవాఁడై నుర్గాప్రసా దనుపేరఁ బరగు చుండెను. ఈయన మిక్కిలి చక్కనివాఁ డని చెప్పుకొందురు. పెడన యస్టేటు తాలూకు పేష్కష్ బాకీపడినందున దొరతనమువారు జమీని వేలము వేసి తామే కొట్టి వేసికొనిరి. గంగాధరనాయఁడుగారికిమాత్రము నెలకు కొంతమనువృత్తి నొసఁగిరి. తరువాత నీ గంగాధరనాయఁడుగారి వంశము సమాప్త మయ్యెను.

1802 వ సంవత్సరమున నంకినీడుగారికి "మిల్కియట్ ఇస్టిమిరార్" (Milkiyat Istimirar) దయచేయఁబడినది. దీనివలన దొరతనమువారి కీయవలసిన పేష్కష్ శాశ్వతముగా స్థిరపడెను.

అంకినీడుగారొనర్చిన కార్యవిశేషములు:—వీరు చల్లపల్లి కోట యందు సుక్కిలి మనోహర మైనట్టియు, నద్భుత మైనట్టియు నొకసౌధ రాజమును మూఁడులక్షలరూప్యములకు మించినదై కాశీలోఁగల గొప్ప రాజమందిరమును ననుసరించునట్లు కట్టించిరి. బందరుపట్టణమునకు సామీప్యమునఁ గల శివగంగయందు కాశీలోఁగల గొప్ప దేవాలయము వంటి యొక దేవాలయమును గట్టించి వారి యిష్టదైవ మగు మహిషాసురమర్ధని నందు బ్రతిష్ఠించిరి. ఇక్కడనే నిత్యధూపదీపనైవేద్యాదులను జరపుటకు బ్రాహ్మణుల కొక యగ్రహారమును గూడ గట్టించి యిచ్చిరి. మఱియు నాదేవాలయమునందు విశాల మగు నొకసరోవరమును గూడ ద్రవ్వించి దానిని గంగానదీపవిత్రోదకముచే నింపించిరి. అందువలననే యాసీమకు 'శివగంగ' యనుపేరు కలిగెను.

అంకినీడుగారు కాశీయాత్రను జేయుచుఁ దమ మార్గమధ్యమునందు పునహాపీష్వాగారిని దర్శించి వారియొద్దనుండి "శ్రీమంతు" అను బిరుదమును బడసిరి. వీరు హైదరాబాదు మొగలాయిచక్రవర్తి యొద్ద నుండి "రాజా, బహద్దర్, జుబ్దాతుల్ అక్రాణ్" అను బిరుదులను సైతము సంపాదించిరి.

ఈ జమీందారుగారు 1819వ సంవత్సరములో దేహయాత్రను గడపుటచే నెనిమిదిసంవత్సరముల వయసు గల వీరిదత్తపుత్రుఁ డగు దుర్గాప్రసాదనాయఁడుగారు బాలు రైనందునఁ గోర్టు ఆఫ్ వార్డ్సు క్రింద జమీ యుంచ బడెను. వీరి బాల్యము దీరిపోయినపిమ్మట జమీ నొప్పగించుకొనిరి. అయినను దురదృష్టవశమున స్వల్పకాలములో ననఁగా 1835వ యేట స్వర్గాభిముఖు లైరి. తరువాత వీరిగృహిణీరత్న మగు దుర్గాభవానమ్మగారు తనభర్త యగు శ్రీమంతు దుర్గాప్రసాద నాయఁడుగారు తనకు దత్తపుత్రస్వీకారమున కధికార మిచ్చి రనియుఁ, గావునఁ దాను దివిపరగణాలోఁ జేరిన మొరకనపల్లిలంకనివాసి యగు యార్లగడ్డ వేంకటరామన్నగారి యాఱుసంవత్సరములయైదుమాసముల వయసుగల్గి అంకన్న యను నామధేయముగల తృతీయపుత్రుని దత్తస్వీకారము చేసికొనుటచే నా దత్తతను స్థిరపఱచి ప్రాయము

వచ్చుదనుక జమీని కోర్టు ఆఫ్ వార్డ్సు క్రింద నుంచి తనకును దత్తగారికిని సరియైన మనువృత్తి నిప్పించ వలసిన దనియు దొరతనమువారిని గోరుకొనెను. అందులకు దొరతనమువారు దత్తతను స్థిరపఱచి యామెకు మాత్రము నెలకు 700 రూప్యముల మనువృత్తి నిచ్చుటకు నిర్ణయించి తదితరులకుమాత్ర మీయ నంగీకారము లేనట్లు తెలియపఱచిరి. మఱియు జమీ విషయములో నది యిదివఱకే పన్నులను సరిగాఁ జెల్లింప కుండి నందున జప్తులో నుండి నట్లును దెలియపఱచిరి.

ఈయంకిసేటుగారు 1846వ సంవత్సరమున బాలనార్హావయస్కులై నందున జమీపాలనము నొప్పగించుకొనిరి. 1864 వ సంవత్సరమున జమీలోని విస్తారప్రదేశమున కుప్పెనవలన మిగుల వినాశనము తటస్థించుటచే రైతులనుండి పన్నులు సరిగా వసూలు గాకుండుట తటస్థించెను. ఈ యంకిసేటుగా రొనరించిన మహాత్కార్యములవలనను, వారి యసమానధర్మకార్యముల వలనను మిక్కిలి ప్రాశస్త్యము గాంచిరి. అప్పటి కాచారముగా నుండిన పంటలోని భాగమునే కిస్తీగాఁ జెల్లించు నట్టి "అమానిపద్ధతి, వారాంగేట్సు" అనువానిని దొలంగించి "వీసపడిసిస్టం" అనఁగా గిస్తీని రొఖ్ఖపూర్వకముగాఁ జెల్లించునట్లొనర్చిరి. వీరు పాత సాగుబడిచేయుభూములను వృద్ధి పఱచిరి. మఱియుఁ బలుజాతులుగల మామిడితోఁటలను, గొబ్బరితోఁటలను వేయించి వానివలన నిప్పటికిని గొప్ప యాదాయము వచ్చునట్లు చేసిరి. వీరు పలువిధము లగు చెఱకు, పొగాకు, వడ్లు మున్నగు వానిని సేద్యము చేయించుచు వ్యవసాయాభివృద్ధికి మిక్కిలి ప్రోత్సాహమును గలిగించిరి. ఇంతియగాక లాభకరము లగుకార్యములను వృద్ధిపఱచుటలో మిక్కిలి యుత్సాహులై యుండిరి. వీరికి పశుగణంబులను వృద్ధిపఱచుటయందుగాక పశువులను సుందరము లైనవిగను బలాఢ్యములైనవిగను బోషించుటయందు మిగుల నభిలాష గలదు. వీరు పెంచిన పశువులు జిల్లాయంతటిలో మిగుల మేలైనవిగ నెంచఁబడినవి. ఉప్పెనవలన వీరితాతగారికాలము నందు గట్టింపఁబడిన శివగంగలోని దేవా

లయమునకును, జల్లపల్లిలోని సౌధరాజమునకును జాల చెఱుపు గలిగి నందున వాని సంస్కారములకును జల్లపల్లి, కళ్ళేపల్లి, శివగంగ యీ ప్రదేశము లందు నుతికొన్న నూతనగృహనిర్మాణమునకును మిగుల ధనవ్యయ మొనరింపవలసివచ్చినది. శివగంగలోని దేవాలయ సంస్కారమునకుఁ గొండపల్లినుండి రాళ్లను దెప్పించి కట్టించిరి. చల్లపల్లిలోఁ గోట నేర్పాటుచేయుటకునై యిరువదియడుగుల యెత్తు గల ప్రాకారమును గట్టించిరి. మెండియు వీరి యౌదార్యభావము మిగుల వర్ణనీయము. వీరు చల్లపల్లిలో నొకసంస్కృతపాఠశాలను స్థాపించి యందలి విద్యార్థుల భోజనాదిసౌకర్యములను దమసత్రము నందే యేర్పఱచిన విషయము వీరిభాషాపోషకత్వమును జెప్పక చెప్పుచున్నది. ఈ రాజాగారు సంస్కృతాంధ్రపండితవర్యులతోఁ స్వయముగా సంభాషింపుచు నుచితసత్కారములచే గౌరవించిరి. వీరికి శివుఁడిష్టదైవ మగుటచే నిరంతరశివపూజాధురంధరులై వెలసిరి. వీరికిఁ గల మతాభిమానముచే శివగంగ, కళ్ళేపల్లి, శ్రీకాకుళము లనుస్థలత్రయమునందు గల దేవాలయములలోఁ బ్రతియేట నుత్సవములను జేయింపుచుండెడి వారు. వీరు మిగుల నౌదార్యహృదయు లగుటచేఁ దమ రాబడికంటె మించిన ధనంబును ధర్మకార్యాదులకు వినియోగించుటచే ఋణగ్రస్తులు గావలసి వచ్చెను. కొందఱిస్నేహితులసాహాయ్యమునఁ గాకుండినచో వారిజమీ పేష్కష్ చెల్లింపఁబడని కారణముచే దొరతనమువారి యధీన మయ్యెడిదే. ఎవ్వరేవిధముగాఁ దోడ్పడినను వారు రెండు లక్షలరూప్యముల ఋణముతోఁ బరలోకాభిముఖులైరి. వీరు 1875 వ సంవత్సరములో స్వర్గస్థులైరి. ఈ జమీందారుగారికి ముగ్గురుపుత్రులును, ముగ్గురుపుత్రికలును గలరు. వీరిలో నగ్రజు లగు శ్రీమంతు రాజా యెర్లగడ్డ మల్లిఖార్జున ప్రసాదనాయఁడు బహదరుగారికి 1876 వ సంవత్సరము నందు జమీ స్వాధీన మొనరింపఁబడెను.

శ్రీరాజాగారి సోదరు లగు దుర్గాప్రసాద నాయఁడుగారును, వేంకట్రామలింగన్న నాయఁడుగారును జమీలోఁదమకె హక్కుగలదని జిల్లాకోర్టులో జమీవిభాగమునకై వ్యాజ్యమును దెచ్చిరి. కాని

జమీా యవిభక్తమని వారికి వ్యతిరేకముగాఁ దీర్పుచెప్పఁబడెను ; గాని హైకోర్టున కప్పీలును జేసికొనఁగ నందు జిల్లాకోర్టుతీర్పునురద్దుపఱచిరి. అంత శ్రీమంతు రాజా మల్లిఖార్జునప్రసాదనాయఁడుగారు ప్రివీకౌన్సిలున కప్పీలు చేసికొనఁగా నందు జిల్లాకోర్టుతీర్పు ననుసరించుచు హైకోర్టు తీర్పును రద్దుపఱచి జమీా యవిభక్త మనియే 1890మే 1వ తేదీన స్థిర పఱచిరి. మఱల 1891వ సంవత్సరమున శ్రీ రాజాగారి సోదరు లిరువు రును మనువృత్తి కై బందరు జిల్లాకోర్టులో వ్యాజ్యము వేయఁగా నెలకు చెరియొక 750 రూప్యములను నిలవ యున్న బాకీలతోఁ గూడ నిచ్చునట్లు తీర్పు చెప్పిరి. ఇాగామీాఁద వీరు మనువృత్తి చాలదని హైకోర్టులో నప్పీలు చేయఁగా మనువృత్తిమాత్రమె యిచ్చు నట్లును నిలువబాకీల నీయవలసిన యవసరము లే దనియుఁ దీర్పు చెప్పిరి; కాని ప్రివీకౌన్సిలువారు జిల్లాకోర్టుతీర్పుప్రకారమే మనువృత్తిని నిలువబాకీ లను నిచ్చు నట్లుగాఁ దీర్పు చెప్పిరి.

శ్రీమంతు రాజా యేర్లగడ్డ మల్లిఖార్జునప్రసాదనాయఁడుబహా దరుగారు 1847వ సంవత్సరములో జన్మించిరి. వీ రాంధ్రమునందే గాక గీర్వాణభాష యందును మంచిపాండిత్యమును సంపాదించిరి. వీరు సంగీతమునం దభిరుచిగలవా రగుటచే సంగీతవిద్యను గూడఁ గొంతవఱకు నేర్చిరి. శ్రీరాజాగా రాయుర్వేద పద్ధతులుప్రకారము మంచి విలువగల యౌషధములను దయారుచేయుటయందు మిక్కిలి ధనవ్యయ మొనరించి చల్లపల్లిలో నొక యాయుర్వే దౌషధశాలను నెలకొల్పి మంచివైద్యుల నియమించి యుంచిరి. వీరు విలాసార్థముగా ఛాయాపటములను దీయుటయందలి నేర్పును గూడ గలిగి యుండిరి. ఇంతియగాక దేహపరిశ్రమల యందుఁ గడు నుత్సాహముగలవా రై మల్లయుద్ధము జేయు నట్టిజట్టీలను రప్పించి బహుమతు లిచ్చుచు దేహ పరిశ్రమసంబంధ మగు నొకశాలను గొంతకాలమువఱకును నెలకొల్పి యుంచిరి.

శ్రీ రాజాగారు 1876 వ సంవత్సరములో జమీాపాలనమునకు వచ్చిరి. పదునేనువత్సరముల వఱకు నొక దివానుయొక్కగాని మేనే

జరుయొక్కగాని సాహాయ్యము నపేక్షింపకయే కార్యభారమును నిర్వ హింపుకొనుచుఁ దమకును, దమజమీాకిని మిగుల లాభకరముగా నుండున ట్లు జేసికొనఁ గలిగిరి. తరువాతఁ గొన్ని న్యాయవిధుల ననుసరించినచిక్కులు తటస్థించుటచే బాదరుపురవాసులును, శాంత మనస్కులును నగు శ్రీ కోపల్లె కృష్ణారావుపంతులుగారిని వ్యవహారిక విషయాదులందు దోడ్పడుటకై దివానుగా నేర్పఱిచికొనిరి. ఈ జమీాందారుగారు పాటుబడి కార్యనిర్వహణమును స్వయముగాఁ జేసికొనెడివారు. వారితండ్రిగారికాలమున జమీాయప్పులపాలుగ నుండి నను నట్టిఋణములను నిశ్శేషముకాఁ దీర్చివేయుటయగాక న్యాయసభల యందు విశేషధనంబును వెచ్చించుటకుఁ గూడ సమర్థులైరి. తమజమీా లోని చెరువుల ననేకములను బాగుచేయించి నీటిపారుదలకై యను వగు కాలువలు త్రవ్వించి సాగుబడిపొలములను వృద్ధిపఱిచిరి. మఱియు వీరు చుండీజమీాదారునుండి చెరుకూరుగ్రామమును గొనిరి. ఇంతియగాక భూవసతిమీాఁదను గో (బ్యాంకు)లలోను నిలవచేయ గలిగి నంతధన మును సంపాదించిరి. బాటసారుల సౌకర్యముకొఱకయి చల్లపల్లిలో నొక గొప్పసత్రమును నిర్మించిరి. చెన్నపురిలోని ఘోషా ఆస్పత్రిలో వీరిపేర రోగుల కొక శయ్య నేర్పఱిచిరి. బందరులోని విక్టోరియాచక్రవర్తిని గారిజ్ఞాపకార్థమై కట్టఁబడినపురమందిరమునకు రూ. 3500లనుజందాగా నిచ్చిరి. సప్తమెడ్వర్డుచక్రవర్తిగారి జ్ఞాపకచిహ్నమునకై రు 2000ల నొసంగిరి. చల్లపల్లిలో లోకల్‌ఫండు పాఠశాల కొకభవనము నిచ్చిరి. చల్లపల్లిలోఁ బూజానమస్కారములు లేకయుండిన దేవళమును దిరిగి సంస్కరించిరి. వీరి రాబడి ప్రప్రథమములో ననఁగా వీరిపాలనారంభము నందు రెండులక్షల డెబ్బదివేలకువే లైనను బ్రస్తుతము మూఁడులక్షల యేబదివేలవఱకు నుండెను. ఇట్టి యభివృద్ధికి వీరి కుశాగ్రబుద్ధితోఁ గూడిన పాలనక్రమమే ముఖ్యకారణము. వీరు దీర్ఘాలోచనమునందు మంచి సమర్థులును, ధైర్యశాలురును నిశ్చలచిత్తులును నైయున్నారు. వీరు తమభృత్యుల యందును మిగుల ననురాగమును వహించి యుందురు. ఈ దేవరకోటనామకమహావృక్షబీజస్థాపనమునకు శ్రీకోదండరామన్న

గా రెట్లుకారకు లని చెప్పుకొనుచున్నారమో యట్లే న్యాయసభాంతర ధనవ్యయాత్మకవాతపరంపరాహతుల నెన్నింటి నైనన నోర్చి యీమహా వృక్షము స్థిరత్వము గాంచుటకు వీరే కారకు లని చెప్పుకొన నగును.

వీరు దొరతనమువారి గృహరాజప్రవేశస్వాతంత్ర్యములు గల వారై రాజకీయావసరములం దాహ్వానము లందుచు నుందురు. వేల్సు యువరాజుగారును వారి సతీమణియుఁ జెన్నపురి కేతెంచి నప్పుడు శ్రీ వారలను దర్శించుట కాహూతు లైనవారిలో మనరాజా గా రొకరు.

వీరిగృహిణీమణి ప్రస్తుతముక్యాలరాజాగారితాతగా రగు శ్రీరాజా వాసిరెడ్డి భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడు బహదరు మన్నెసుల్తాను గారి పుత్రిక. శ్రీ రాజాముక్తీశ్వరప్రసాదనాయఁడుగా రప్పటిజమీ దారులయం దగ్రగణ్యులుగ నుండిరి. జమీందారుగారు రాజ్యము నకు వచ్చినపిదప నీయమ గృహనిర్వాహకురా లయి నాఁటి నుండి నేఁటిదనుక గృహిణీధర్మంబులను జక్కఁగా నిర్వహింపు చుండెను. శ్రీ మంతు రాజాగారు వ్యవహారవిషయాదులచే గ్రామాంతరము లం దుండి నపుడు శ్రీరాణిగా రొంటిపూట భోజన మొనర్చుచు ధర్మశాస్త్రా నుసారముసైన పాతివ్రత్యధర్మముల ననుసరింపు చుండును. ఈమె మిక్కిలి మతాభిలాషిణి. ఏకాదశీత్యాదిపర్వదినంబు లం దుపవసిం పుచు శాస్త్రీయవ్రతాదుల ననుష్ఠింపు చుండును. ఈమె యర్థిజన మందార మై యమందాదరముతో బీదసాదలఁ గాపాడు చుండును. అగ్రగణ్యు లయిన యుత్తరసర్కారుజమీందారులలో మన శ్రీ రాజా గారుగూడ నొక రని మెంచఁబడి పూనికతోడను జాగరూకతతోడను గార్యభారమును నిర్వహించుకొనుటచే నిట్టి ధనేశు లై రని చెప్ప నగును. వీరికి "శ్లో॥ ఏకోపి గుణవాన్ పుత్రో। నిర్గుణేన శతైరపి ।ఏకశ్చంద్రప్రకాశేన । నక్షత్రైః కిం ప్రయోజనం॥ అనునట్లు సుగుణనిధియు, వంశవర్ధనుఁడు నగు నొకపుత్రుఁడును నల్వురు పుత్రికలును గలరు. వీరిలోఁ బుత్రకునిపేరు శ్రీమంతు కుమారరాజా యేర్లగడ్డ యంకినీడుప్రసాద్ బహాదరు గారు.

సీ॥ ఏపుణ్యమూర్తి బి. ఏ. పరీక్ష నొసంగె
సంస్కృతాంగ్లేయభాషాద్వయమున
ఏలసత్కీర్తి పే రోలగంబుల నిల్చె
మంజువాఙ్మాధురీమహిమకతన
ఏ సద్గుణాఢ్యుఁ డనేకసత్కృతు లందె
భాషాభిలాషావిశేషమునను
ఏ రమ్యతముఁడు సంస్కారాభిరతుఁ డయ్యెఁ
దదితరులకు మార్గదర్శకుఁ డయి

తే॥ గీ॥ అట్టి శ్రీమంతు డెల్లగ జ్ఞానవాయ
నీరధిసుధాకరుం డంకినీడ్రప్రసాద
బహదరున కాయు రున్నతుల్ వరలఁ బ్రోచుఁ
గాక కారుణ్య మూని పినాకపాణి॥

వీరు 1877 వ సంవత్సరమున జన్మించిరి. సుందరవిగ్రహముగుటయేగాక వంశాంకురంబుగూడ నగుటచే మిగుల గారాబమునఁ బెంచఁ బడిరి. ఇట్లు పెఱుగుచు విద్యాభ్యాసమును దమబాల్యమునందు స్వీయసౌధముననే యొనరించి పిమ్మట బందరులోని హిందూహైస్కూలులోఁ బ్రవేశించిరి. ఇచ్చట మెట్రిక్యులేషను పరీక్ష నిచ్చువఱకును జదివి పిమ్మట నోబిల్ కళాశాలలో యఫ్. ఏ. తరగతియందు బ్రవేశించిరి; కాని యీ తరగతియం దిచ్చట నాఱుమాసములు మాత్రమె చదివి పదంపడి చెన్నపురిలోని పచ్చయప్పకాలేజీలో మిగిలిన యాఱుమాసము లుండి యాతరగతి యందు కృతార్థులయిరి. సీనియర్ క్లాసును జదువుటకై రాజధానీకళాశాలలోఁ బ్రవేశించిరి. అచ్చట వీరు స్టూయర్టు, బిల్డరుబేక్, బోరన్, శేషగిరిశాస్త్రి, మున్నగు మహాశయులశిక్షణమున విద్య గఱచిరి. వారివిద్యార్థికాలమద్వితీయమై యుండెను. శ్రీకుమారరాజాగారు విశేషధనాఢ్యకారులైనను మిక్కిలి పట్టుదలతో నెట్టి యాయాసములకైన నోర్చి విద్య నభ్యసించిరి. ఇందులకు శ్రీవారికి గలవిద్యాభిలాషయే ముఖ్యకారణము. వీరు; తమయుపాధ్యాయుల యెడఁ జూపిన గౌరవప్రవర్తనము

వారిసహపాఠకులకు మార్గదర్శకముగ నుండెను. గౌరవస్వభావము, విద్యాసక్తి, కార్యనిర్వాహకత్వము, నిష్కల్మషవర్తనము, మున్నగు సద్గుణగణంబులు వీరిజననీజనకు లొసంగిన శిక్షణముయొక్క ఫలితములు. ఇట్లు శ్రీకుమారరాజాగారు చెన్నపురియందుండి 1903 వ సంవత్సరమునఁ బట్టపరీక్షయందును గృతార్థులై 1904 వ సంవత్సరమందు బట్టానుస్వీకరించిరి.

శ్రీమైసూరుమహారాజాగారిచేఁ దెఱవఁబడిన వై 1903 డిశంబరు 1904 జనవరిప్రాంతము లందు మదరాసులో జరిగిన వస్తుప్రదర్శనమున కాహుతులై ప్రదర్శనమును దిలకించి కొన్ని యరటినార యంత్రములను జల్లపల్లికి గొనితెచ్చి వాని యుపయోగములను జనులకు బోధించి పరోపకార మొనరించిరి. మఱియుఁ దత్ప్రదర్శన సందర్భమున శ్రీమైసూరుమహారాజాగారితోఁ గలసిమెలసి యెంతయో విశ్రాంతిగ సంభాషించిరి.

ఇట్టులనే నాఁటినుండి నేఁటిదనుక శ్రీకుమారరాజాగారు తమ వైదుషీవిశేషము సార్థక మగునటుల విదేశస్వదేశప్రముఖుల నెంద ఱనో సమావేశ మగుచుఁ దత్తత్సమయోచితసంభాషణములచే హృదయరంజక మొనరించుచుండిరి. మఱియు స్వీయసాఖ్యంబులఁ బాటింపక పట్టణముల యందును, బల్లెల యందును జరుగు విద్యావిషయిక మహాసభలకును, స్వసంఘసంస్కరణసభలకును వేంచేయుచుఁ బెక్కు తడవ లగ్రాసనాధిపత్యమును వహించి గంభీరోపన్యాసంబు లిచ్చుచుఁ దమజీవితమును బవిత్రవంతముగఁ జేయు చుండిరి.

జనవరిమాసాంతమునం దప్పటిగవర్నరుగా రయిన లార్డు ఆంప్తిహిల్ గారిని దర్శించి తాము బి. ఏ. పరీక్షయందు గృతార్థతఁ గాంచఁ గలిగి యుండుటచే వారియభివందనముల నందుకొనిరి. ఈవిధముగాఁ జెన్నపురియం దుండి పట్టపరీక్ష యందు జయ మందు నంతదనుక, నిరుపమానద్రవిణేశుపుత్రు లయ్యు నవివాహితులుగనే యుండిరనుటచేఁ బ్రకృతకాలంబున సామాన్యశ్రీమంతులగృహంబు లందు జరుగు చుండిన బొమ్మలపెండ్లిండ్లవంటి యతిబాల్యవివాహములపై

నిరసనభావ మప్పటికే శ్రీవారికుదయించి యుండెను.

ఇట్లు సకలకళాప్రావీణ్యమును దన్మ్యాలమున యుక్తాయుక్తవిచక్షతయును బడయఁ గలిగి యనంతరమున గార్హస్థ్యధర్మ మవలంబింపం గోరి శ్రీముక్త్యాలపురవరాధీశ్వరు లయిన శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమహాలీశ్వరప్రసాదనాయఁడు బహదరు మన్నెసుల్తానుగారి సోదరీరత్న మగు శ్రీమతి భవానీదేవమ్మగారిని 1904 వ సంవత్సరము మే నెల 8 వ తేదిని స్వస్థాన మగు చల్లపల్లిలో నమితవైభవముగఁ బరిణయ మైరి. ఈవివాహమహోత్సవమునకు శ్రీవల్లూరురాజాగారు, కలెక్టరగు పార్సన్సుదొరగారు మఱికొందఱు ప్రముఖులు విచ్చేసిరి. అప్పటి మఱియొక దర్బారునం దాగంతికులలోఁ బ్రముఖులగు శ్రీ వావిలాల శివావధానిగారు, బుట్టాయిపేట నేషనల్ థియేటర్ పక్షమున దాసు నారాయణరావుగారు మఱికొందఱు ప్రీతిపూర్వకముగ నభినందించిరి. ఈ కల్యాణోత్సవమునకుఁ బిమ్మట ననఁగా నాగస్టునెలలోఁ దిరిగి ముక్త్యాలకు నాలుగు నేనుంగులతోడను, గొన్నితురంగములతోడను గతిపయపరిజనంబుతోడను నేఁగిరి. ఆ దినములలోనే చింతపల్లికి వేంచేసి శ్రీ వేంకటాద్రినాయఁడుగారిచేఁ గట్టింపఁబడిన కోటబురుజులను, దదితరచిహ్నంబులను జూచి యానందించిరి. ముక్త్యాలనుండి స్వస్థానమునకుఁ దిరిగివచ్చునప్పుడు బౌద్ధస్థాపితంబులైన యమరావతిలోని స్తూపంబులను, ధరణికోటలోని ప్రసిద్ధశిల్పములను, నెక్కుడాసక్తితో విలోకించిరి. భరతమాతయొక్క పూర్వసామ్రాజ్యచిహ్నములను పీ లగునపు డెల్లఁ జూచి యానందించి తన్మహిమాతిశయంబుల స్మరించుట ప్రతిభారతీయునకును నర్హ మేగదా! అటుపిమ్మట స్వపురాభిముఖు లై బెజవాడయం దచటకు రాఁ దటస్థించిన సర్ అరండేలుగారికి శ్రీరాజా రంగయ్యప్పారావు బహదరుగారు, శ్రీ వల్లూరు చినరాజాగారు, శ్రీ రాజా పార్థసారథ్యప్పారావుబహదరుగారు, మఱికొందఱు ప్రముఖులతోఁ బాటు శ్రీకుమారరాజాగారుకూడ స్వాగత మొసంగి యటుపిమ్మటఁ జల్లపల్లిలో గృహప్రవేశోత్సవమును జరిగించిరి.

వీరికి పశుగణంబును వృద్ధిజేయుట యందుఁ గల కుతూహల మసమానము. అందువలననే 1905 ఫిబ్రవరి నెలలో వంగవోలు నందు జరిగిన పశుప్రదర్శనమున కేఁగి తజ్జాత్యభివృద్ధి కై వేయిరూప్యముల పశువులను జల్లపల్లికి గొనివచ్చిరి. మార్చి నెల మూఁడునాలుగు తేదీల యందు కృష్ణాజిల్లాలోని పెదకళ్ళేపల్లియందు జరిగిన వ్యవసాయికపశు ప్రదర్శనమున కధ్యక్షులుగా నుండిరి. ఈ ప్రదర్శనమునకుఁ బెక్కండ్రు ప్రముఖు లరుదెంచి యుండిరి. అమెరికాలోని కనడానుండి యొక మిషనరీకూడ వచ్చి యుండెను.

ఈ ప్రదర్శనానంతరమునఁ గుమారరాజాగారు పంగిడిగూడెమునకుఁ బోయి వల్లూరురాజాగారిని దర్శించిరి. అచ్చటనుండి వారితోఁగూడ శీతానగరము, అలమంచెర్ల గ్రామాదులమీఁదుగా భద్రాచలారణ్యములకుఁ బోయి మృగయావినోదంబులఁ దిలకించిరి. శ్రీవల్లూరురాజాగారికి వేటాడుటయందుఁగల సామర్థ్య మసామాన్యమును దద్విషయము వర్ణనాతీతమును నగుట జగదైకవిదితము. శ్రీరాజాగారు సజీవములోఁ బట్టుకొనివచ్చిన పెద్దపులులకు లెక్కయే లేదు. వీరికి యాటవికజంతువులనేగాక భయంకరము లగు జలచరంబులను గూడ వేటాడుశక్తి గలదు. ఈ విషయ మై వారిచరిత్ర యందు వివరింపఁబడును. అట్లు శ్రీకుమారరాజాగారితోఁగూడ వెడలిన నాఁటి వేటయందు రెండు చిరుతపులులును, నొక పెద్దపులియుఁ గొట్టఁబడెను. అలమంచెర్లలో నొకకొండను దొలిచి కట్టిన దేవాలయమును శ్రద్ధతోఁగాంచిరి. ఏ క్షేత్రాంతముల కేఁగినను శిల్పకళానైపుణ్యంబును గూర్చి తత్తత్ప్రదేశంబుల నెక్కుడాసక్తితో నరయు చుందురు.

ఏప్రిల్ నెలలోఁ జల్లపల్లియందు శ్రీవారితృతీయసోదరీవివాహము జరిగెను. అటుతరువాతఁ గోటలో రూ 3500 లు కొక గజరాజము గొనఁబడియెను.

జులై నెలలో యూనివర్సిటీకమీషన్ వారితో విద్యాశాఖాధ్యక్షు లగు ఏ. జి. బోర్న్ దొరగారు బందరునకు వచ్చి యుండుటచే నా

రితో నెక్కుడు స్వాతంత్ర్యమును గలిగించుకొని ప్రాథమికయుత్తమ విద్యలను గుఱించి ప్రస్తావించిరి. ఆ సంవత్సరమునందే యనఁగా 1905 సెప్టెంబరు 20 వ తేదీని వీరికి పుత్రికోదయ మయ్యెను. చిరంజీవియు, సౌభాగ్యవతియు నగున ట్లాశీర్వాదరవంబులు సెలంగ నవంబరు నెలలో 'వరదరాజేశ్వరి' యను నామకరణ మొనరింపఁబడెను.

శ్రీ యంకినీడుప్రసాద్ బహదరుగారికి గుఱ్ఱపుస్వారీ చేయుట యందుఁ జాల యిష్టమును మంచి యనుభవమును గలదు. అయినను డిశంబరు రెండవతేదీ నొక యున్నతాశ్వంబుపై స్వారీ చేయుచుండఁగా లక్ష్మీపురాటవిలో గుఱ్ఱ మకస్మాత్తుగఁ బడిపోయెను. ఆ పాటు వలన రాజాగారి యెడమచేతిలో నొక పెద్దయెముక సంపూర్తిగ విరిగిపోయెను. చికిత్స కై బందరులోఁ జాలాకాల ముండి శ్రమ నొందిరి కాని ప్రయోజనము లేకపోయెను. అంత 1906 జనవరి 17 వ తేదీని మదరాసునకు వెళ్ళిరి.

మదరాసునకు నిజసతీయుతముగ నేతెంచిన శ్రీ యువరాజు (Prince of Wales) గారితోఁ గూడ నూరేగింపు టుత్సవమునకు హార్బరునుండి గవర్నరుగారి సౌధమువఱకు మన చల్లపల్లి కుమారరాజాగారు తమ తండ్రిగారితోఁ గూడ నేతెంచి యాసందర్భ మాదలి యుత్సవముల నన్నింటిని దిలకించిరి; కాని చేతిచికిత్స యవసరమగుటచే డాక్టర్ బ్రౌనింగ్ దొరగారివలన నిరువదిదినములు చికిత్స జేయించుకొనుచు శ్రమనొందిరి. ఈ శ్రమతోఁబాటు విద్యార్థికాలంబునఁ బరపట్టణము లందు నివసింపవలసివచ్చినట్లే గార్హస్థ్యకాలంబునఁ గూడ స్వసౌధ స్వేచ్ఛావిహార మరుదయి, పరపట్టణము లందే వసింపవలసివచ్చెను. మదరాసునుండి జూన్ 8 వ తేదిని కుమారరాజాగారు చల్లపల్లికి తిరిగి వచ్చిరి. కాని యచ్చటఁ గారణాంతరములవలన నుండుటకు వీలు కలుగకపోవుటచేఁ గోటను విడిచి బందరుసమీపమునఁ గల గూడూరునందలి శ్రీ వల్లూరురాజాగారి మేడలోఁ బ్రవేశించిరి. పిమ్మటఁ జల్లపల్లినుండి వారిసతీమణియు గూడూరునకే యేతెంచెను.

ఆగస్టునెలలో మదరాసువెళ్ళి రెవిన్యూబోర్డుమెంబరగు కేసిల్ స్టువర్టుస్టువర్టుగారిని జూచి వ్యవసాయికసంఘమును గుఱించి కొన్ని ముఖ్యవిషయములు ప్రస్తాపించిరి. ఆతరుణములో జరిగిన "సెంట్రల్ అగ్రికల్చరల్ కమిటీ"సభకు వేంచేసిరి. సెప్టెంబరు 29 వ తేదీమధ్యాహ్నము 1 గంటకు గూడూరునందు పుత్రోదయ మయ్యెను. ఆసంతోషముచే బడిబాలురకుఁ బెద్దలకు ఫలములు, పంచదార పంచిపెట్టించి 16వ రోజున నిచటఁ బేదలకు సంప్రీతికరముగ నన్నప్రదానము జరిగించిరి. తాతగారగు పెదరాజాగారుకూడ మదరాసులో ఫలములు మన్నగువానిని బంచిపెట్టించి పురజనులకు వినోదొసంగిరి.

1906సం॥లోఁ దమనివాసమును గూడూరునుండి ఫ్రెంచిపేటకు మార్చుకొనిరి. 1907 సం॥లోఁ దండ్రిగారి కనారోగ్యము దటస్థించుటచే మదరాసునకువెళ్ళి సమావేశ మయిరి; కాని తమసోదరియు, శ్రీ ముక్త్యాలరాజాగారికళత్రమును నగు శ్రీ రాణీ వేంకట దుర్గాంబగారు బెజవాడలో 18 వ ఫిబ్రవరియందు స్వర్గస్థురా లగుటను విని మిగుల ఖేద మంది వెంటనే బెజవాడకు వచ్చిరి. మఱికొన్ని మాసములు గడచిన పిమ్మట నన౹గా మే నెల 22వ తేదీని కుమారునకు 'శివరామప్రసాద్' అని నామకరణ మొనరించిరి. ఈరాజాగారు ప్రతిశుభకార్యమునందును బేదలకుమాత్ర మన్నదానము విశేషముగ జరిగించుచుందురు. అట్లే యిప్పుడు నొనరించిరి.

వీరు రాజకీయవిషయములకుఁ దఱచుగ నాహ్వానింపఁబడుచుండుటచే సమావేశ మగుచుందురు. 1907 సెప్టెంబరు 21వ తేదీని బందరురైలుస్టేషనుకు శంఖుస్థాపనము జరుగుసందర్భమున వేంచేసిరి. కలెక్టరగుమారిస్‌దొరగారు కోరినందున దొరతనమువారికి చట్టనిర్మాణసభ్యుల నధికపఱచుటను గుఱించియు, సలహాల నిచ్చు సంఘముల నేర్పఱచువిషయమును గుఱించియుఁ దమయభిప్రాయమును మెమోరాండముద్వారా తెలియపఱచిరి. సహకారసంఘముల రిజస్ట్రారుగువారగు దివాన్‌బహాదరు ఆ. రామచంద్రరావుగారు బందరు వచ్చినందున వారిని సమావేశ మయి సహకారసంఘముల నీప్రాంతము లందు స్థాపిం

చుటకై ప్రస్తావించిరి. ఈసంవత్సరాంతము నందే మదరాసు వెళ్ళి స్టోక్సు, అట్కిన్‌సన్, ఆండ్రూ, బ్రాడ్లీ దొరగార్లను జూచి, వారితో రాజ్యతంత్రవ్యవహారములను గుఱించియుఁ జట్టనిర్మాణసభ్యుల నధికపఱచుటనుగుఱించియుఁ బ్రసంగించిరి.

1908 జనవరినెలలో గవర్నరుగారిచే నొసఁగఁబడిన (State Reception) పాలకులచే గౌరవార్థ మొసఁగబడు నాతిథ్యమునకు నాహ్వానింపఁబడిరి. మదరాసు యెస్టేటుల ల్యాండుహోల్డర్లు చట్టనిర్మాణసభ జరుగు చుండుసమయములో బహుకాలము ప్రేక్షకులుగ వెళ్ళి యావిషయముల నెల్లఁ జక్కఁగ గమనించిరి. జనవరి 20 వ తేదిని ఠాకర్‌దొరగారిచే శ్రీమైసూరుమహారాజాగారి కొసఁగఁబడిన యాతిథ్యమునకు మనకుమారరాజాగారు నాహూతు లగుటచే వెడలి శ్రీమహారాజాగారితో సంభాషించిరి. శ్రీ బొబ్బిలిమహారాజాగారిని దర్శించి 'ఋనిన్సిబిల్లు'ను గుఱించి ప్రస్తాపించి, భూస్వాముల కపాయకర మైన చట్ట మైనట్లు వారియభిప్రాయమును దెలిసికొనిరి. ఫిబ్రవరి 4వ తేదీని గవర్నరగు సర్ ఆర్థరు లాలిగారు విలోకనార్థ మై బందరు వేంచేసిన సందర్భమందు పురమందిరమున జరిగినసభకు శ్రీ యంకిసీడుప్రసాద్‌గారును నాహ్వానింపఁబడిరి. వీరేగాక యాసభకు శ్రీమునగాలరాజాగారును, గురజజమీందారుగారును వచ్చియుండిరి. నాఁటిసాయంత్రము కలెక్టరగు మారిస్‌దొరగారు తోటవిందు జరపఁగా నాఁడందఱు వెళ్ళుట తటస్థ మయ్యెను. ఫిబ్రవరినెలలో జరిగిన వల్లూరురాజాగారి పుత్రికావివాహమునకుఁ బంగిడిగూడెము వెళ్ళి యచ్చటివినోదములను విలోకించిరి. వల్లూరురాజాగారి సంస్థానములో వంగవోల్, గుజరాత్, అమృతమహాల్, పండారము మున్నగుజాతుల పశుగణము గలదు. అచ్చటినుండి రాజా పార్థసారథి అప్పారావుబహదరుగారి యాహ్వానము మీఁద శనివారపుపేట వెళ్ళి యాదినములలోనే యేలూరులోని తివాచికార్ఖానా, జనపనారమిల్లు మొదలగు దేశీయపరిశ్రమలను దిలకించి ప్రోత్సాహపఱచిరి. జులై మాసాంతరమున శ్రీకుమారరాజాగారి కుటుంబము నందును వారిపరిజనముందును గలిసి నలువదియిరువురకు

మిక్కిలి క్రూర మైనయనారోగ్యదశ సంప్రాప్త మయ్యెను. దేశీయ వైద్యులును, హూణభిషగ్వరులును స్వస్థతపఱచలేక పోయిరి. ఈ వ్యాధికి కారణము కూపోదకము నందుఁ గలిగినయనర్థకమే యని యెన్నియో దినములు గడచినపిమ్మట గ్రహింపఁబడెను. అంతటఁ దమనివాసమును దిరిగి గూడూరునకు మార్చుకొనిరి. దైవానుగ్రహమున నొక్కరొక్కరుగ స్వస్థతఁ గాంచు చుండిరి; కాని దైవబలము గల నిరుపేదలకంటె దైవబలముచాలని సంపన్నులు దుర్బలు లనునట్లు సెప్టెంబరు 5 వ తేదీ యుదయమున శ్రీకుమారరాజాగారి సతీవతంసము స్వర్గస్థురాలయ్యెను. ఈ విపత్సమయమున వీరిజననీజనకులు మిగుల విచారమనస్కులై వచ్చి యోదార్చిరి. వల్లూరిరాజాగారు తమ హృదయ పూర్వకమైనసానుభూతిని దెలియపఱచిరి. కుమారరాజాగారుకూడ మూఁడు నెలలవఱకును స్నానముచేయుట కైనను వలనుపడని దీర్ఘవ్యాధిపీడితు లైరి. ఈ 1908 వ సంవత్సర మంతియుఁ గష్టదాయకముగనే యుండినను 1909 వ సంవత్సరముయొక్క మధ్యభాగమునుండి వ్యవహారపుఁజిక్కులు కూడ సమసిపోయి యించుక విశ్రాంతి లభించెను. వీరికి 1909 సం॥ జూన్ 13 వ తేదీ యుదయమున మదరాసునకు సమీపమునఁగల తిరువత్తూరు నందు ద్వితీయవివాహము జరిగెను. పూర్వము తెనాలితాలూకాకాపురస్థులయ్యును గొంతకాలమునుండి మదరాసువాస్తవ్యులై యందు గొప్ప భూస్వాములుగ నుండిన మ. రా. శ్రీ గెడ్డిపాటి వీరయ్యనాయఁడుగారి ద్వితీయపుత్రిక యగు శ్రీమతి రమణాంబమ్మగారిని బరిణయ మైరి. ఈవివాహమహోత్సవమునకు శ్రీరాజా పార్థసారథిఅప్పారావుబహాదరుగారు, శ్రీముక్త్యాలరాజాగారు మఱికొందఱు ప్రముఖులును విచ్చేసిరి. ఈ పరిణయదినములలో నుభయపక్షములవారును బీదసాదలకు విశేషముగ నన్నదాన మొనరించిరి. శ్రీకుమారరాజాగారు ప్రత్యేకముగ నొకకవిపండితసభను జరిపించి విద్వాంసులకు దుశ్శాలువలచే గౌరవించిరి. శ్రీమంతులు శుభకార్యసమయములం దిట్టిసభలఁ గావించి పండితులను, గవులను బహూకరించి ప్రోత్సాహముగలిగించు టెంతయు

వారి భాషాపోషకత్వమునకు నిదర్శనముగ నుండఁ గలదుగదా! ఈ వివాహసందర్భమున జరిగింపఁబడిన నితరవేడుకలకంటె నన్నదానమును, బండితగౌరవమును బరిగణనీయమై యుండెను. 1909సం॥ నవంబరు 17వ తేదీని కాస్మోపాలిటన్‌క్లబ్బున కేతెంచిన విశాఖపట్నముజిల్లాలోని జయపూరుమహారాజాగారిని సమావేశమయి యెంతయో విశ్రాంతిగ సంభాషించిరి. ఈకుమారరాజాగారు నిరంతర మితరులతోఁ జోక్యము కలిగించుకొనుటలో వానధారులై యున్న కుండువారుగాక దొరతనోద్యోగులతోడను, నైరోపీయప్రముఖులతోడను, మహారాజాలతోడను గలసిమెలసి సంభాషించు చుందురు. కావున గౌరవనీయ మయిన ప్రతిబహిరంగవిషయమునకును నాహ్వానింపఁబడు చుందురు. రాజప్రతినిధి యగు లార్డు మింటోగారు సతీయుతముగ మదరాసున కేతెంచి నప్పుడు జరిగిన ప్రవేశోత్సవము, ఆతిథ్యము, గౌరవార్థమై సేనాదళమునకు నూతనపతాకముల నొసఁగినతరుణము, రిపన్‌ప్రభువుగారి పేర నవీనముగ నిర్మింపఁబోవు చున్న మ్యునిసిపల్ భవనముల శంకుస్థాపనము, కాస్మోపాలిటన్‌క్లబ్బునందు జరిగిన విందు, ప్రిన్సు ఆఫ్ ఆర్కాటుగా రొసఁగినతోఁటవిందు మున్నగు సమస్తవిషయములకును నాహ్వానింపఁబడిరి. 1910 సం॥ ఫిబ్రవరి నెలలో శ్రీబొబ్బిలిమహారాజా గారిని దర్శింపఁగా శ్రీమహారాజాగారు తిరిగి వీరి సౌధమునకువచ్చి సమావేశ మయిరి.

ఆమాసమునందే 20వ తేదీని గూడూరునకు వచ్చి గృహప్రవేశ మొనరించుసందర్భమునందును బీదల కన్నవస్త్రదానాదు లొనరింపఁ బడెను. మే నెల 8 వ తేదీని ప్రాగ్భాగమందు దయిదుగజముల పొడవుగల తోఁకయుఁ జిన్నితలయుఁగల హాలిస్‌కామిట్ (Halley's comet) అనుతోఁకచుక్కను జూచుట తటస్థ మయ్యెను. దీనివలన దేశారిష్టమని కలవరపడు చున్న జనాభిప్రాయమునకుఁ దగినటులే యాఱవ తేది రాత్రి 11-3/4 గంటలకు స్వర్గాభిముఖులైన సప్తమెడ్వర్డుగారి మరణవార్తను నాఁడు వినవలసి వచ్చెను. ఆమరునాఁడు రాజకుటుంబమునకుఁ దమహృదయపూర్వకసానుభూతిని గవర్నరుగారిద్వారా

తంత్రీవార్త నంపి చక్రవర్తిగారిజ్ఞాపకచిహ్నముగఁ బరిశ్రామికపాఠశాలల నెలకొల్పు టుచిత మని వార్తాపత్రికలకు వ్రాసిరి. సప్తసంతానములలో నుత్తమసంతాన మని చెప్పఁబడు గృతిస్వీకారమునం దభిరతిగలవా రయి 'సుశీల' యనునొకనాటకగ్రంథమునకుఁ గృతిభర్తలు గూడ నయిరి.

శ్రీవారికీర్తిచంద్రిక దశదిశవ్యాపిత మై స్వసంఘమునందును, బరసంఘమునందును విజృంభించి యుండుటచే ఫిబ్రవరి 25 వ తేదిని యేలూరులో జరిగినవ్యవసాయపరిశ్రామికపశుప్రదర్శనము శ్రీకుమారరాజాగారిచేఁ దెఱవఁ బడునట్లు గోరఁబడిరి. అందున కంగీకరించి యొసంగిన యుపన్యాసములో వ్యవసాయాభివృద్ధికి వలయు ప్రాముఖ్యవిషయములను విమర్శించుచుఁ దమకుఁ గల శాస్త్రపరిజ్ఞానాభినివేశముచే డెన్మార్కు, జపాను మున్నగు విదేశపరిశ్రామికవిషయాదులను గుఱించి దృష్టాంతముగ వివరించుచు నుపన్యసించిరి.

శ్రీవా రగ్రాసనాధిపత్యమును స్వీకరించి యొసంగిననాఁటి యుపన్యాసమును గలెక్ట రగు బ్రెయిడువుడ్డుదొరగారును, పేట్రియట్ పత్రికాధిపతులును మిగుల శ్లాఘించిరి. ఈ ప్రదర్శనమునకుఁ గొంత విరాళము గూడ నొసఁగఁబడెను. చివరిదినమున కరుదెంచిన లార్డుబిషప్పుగారును సముచితముగ సంభాషించిరి. ఏలూరులోఁ బశువుల కొఱకొకనీటికుండు గట్టుట కై మఱికొంతవిరాళ మొసంగిరి. పిమ్మట గూడూరునకువచ్చి యచ్చటినుండి మఱికొంతకాలమునకు దమ నివాసమును మచిలీపట్నమునందు 'గోవిందభాగ్' అను మందిరమున కేప్రిల్ నెలలో మార్చుకొనిరి. మే నెలలో మదరాసువెళ్లి యచ్చట శ్రీ పిఠాపురము రాజాగారి దర్శనప్రదర్శనము లందిరి. రెవిన్యూబోర్డు మెంబ రగు గౌరవనీయు లైన మిస్టర్ ఏ. బట్టర్ వర్తుగారు వచ్చి దర్శించినందున వారితో మదరాసుప్రాంతము లందుఁ గలచెట్లనుగుఱించియు రాజధానిలోఁ బెచ్చుపెఱుగు చున్న వ్యాజ్యములను గుఱించియు సంభాషించిరి. ఆ దినములలోనే కృష్ణాజిల్లాబోర్డుమెంబరుగ నుండుటకు కలెక్ట రగు బ్రెయిడువుడ్‌దొరగారు ప్రస్తావింపఁగా నంగీకరించిరి.

గౌరవనీయు లగు గోకేల్ గారి నిర్బంధప్రారంభవిద్యనుగుఱించియు, మఱి కొన్ని ముఖ్యవిషయములను గుఱించియు నొసంగిన యుపన్యాసములకును, వారికొఱకేర్పఱచఁబడిన తోటవిందునకును బోయి వారితోఁ జాలసేపు సంభాషించిరి. మదరాసునం దుండఁగానే పుత్రికాపుత్రులకు శ్రీరాజా పార్థసారథిఅప్పారావు బహదరుగారి దౌలత్ మహాలునందక్షరాభ్యాసము, చౌలము నొనరింపఁబడెను. ఈ సందర్భమునందును నన్నదానమే ముఖ్యముగ నొనరింపఁబడెను. సెప్టెంబరు 2 వ తేదీని దివాన్ బహదరు పి. రాజరత్నము మొదలియార్ గారి యాధిపత్యముక్రింద 'శాస్' గారిబిల్లు జరుగఁ గూడదని జరిగినసభకును శ్రీకుమారరాజాగా రాహ్వానింపఁబడుటచే సమావేశమైరి. క్రొత్తగవర్నరుగారగు కార్మికేల్ ప్రభువుగారికి భూస్వాముల సంఘముపక్షమున సన్మానపత్రము(అడ్రెస్)నొసఁగిన సమయమున నిర్ణీతసభ్యు ( Deputation members) లలోఁ ప్రముఖులుగా నుండిన శ్రీ వేంకటగిరిమహారాజాగారు మనకుమారరాజాగారిని గవర్నరుగారితో సమావేశ పఱచిరి.

శ్రీ యంకినీడుప్రసాద్ బహదరుగారు నవంబరు నాలవ తేదీని మదరాసు సెనిట్ హాలులో జరిగిన సెంట్రల్ అగ్రికల్చరల్ మీటింగునకును, 25-26-27 తేదీలయందు కృష్ణాజిల్లాలోని కేసరపల్లిగ్రామమున జరిగిన ద్వితీయకమ్మమహాజనసభకును నగ్రాసనాధిపతులుగ నుండిరి. ఈ మహాజనసభకు నాలుగువేలమంది ప్రేక్షకులును ప్రతినిధులును విచ్చేసిరి. గోదావరిజిల్లాలోని కపిలేశ్వరపురరాజాగా రగు మ॥రా॥రా॥ శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడుగారును వచ్చి యుండిరి.

ఆసభయందుఁ దమసంఘమును గుఱించి సాంఘికాచారాదుల విషయమై కన్పట్టు స్వల్పభేదములు వారు నివసించు నయ్యాదేశ భేదములనుబట్టి యేర్పడి యుండవచ్చు ననియు వీరు (ఈ కమ్మవారు) పదునాఱవ శతాబ్దమున నాంధ్రమండలము నేలిన శ్రీకృష్ణదేవరాయని కొలువున సైనిక వృత్తిచే జీవించు చున్నకాలమునందు గొందఱు విజయనగరాధీసుని సైన్యముతో మధుర, తిరునల్వేలి మండలములకుం బోయి యచ్చట నిల్చిపోయి పదంపడి హిం

దూరాజ్యములు మట్టువడుటచే యుద్ధపుగోల్యున కవకాశము లేక కత్తి విడిచి, నాగలిచేపట్టి రనియు, నట్టిస్థితిగతులలో సగౌరవముగ జీవయాత్ర నడపుటకై తగినవృత్తి యదియేగదాయనియు నుపన్యసించిరి. 1911 వ సం॥ డిశంబరు 11 వ తేదీని డిల్లీలో జరిగిన శ్రీచక్రవర్తిగారి పట్టాభిషేకసమయమునఁ దమయానందపూర్వకమైన వందనముల నర్పించి, తిరిగి ప్రయివేటుశ్రకటరీగారినుండి స్వీకారవందనముల నందికొనిరి. పిమ్మట 12 వ తేదీని గౌరవనీయులగు అట్కిన్సన్‌గారి యాధిపత్యముక్రింద జరిగిన పట్టాభిషేకపు దర్బారున కాహ్వానింపబడుటచే నచటకు వెళ్లిరి. అప్పుడు పెదరాజాగారు బందరులో జరిగిన దర్బారున కాహ్వానింపబడుటచే నేతెంచిరి. 1912 జనవరి 8 వ తేదీని గవర్నరుగారి భవనమునందు గౌరవార్హమై యొసఁగఁబడిన యాతిధ్యము (State Reception) నకు వేంచేసి యటుపిమ్మట కార్మికేల్ ప్రభువుగారికిని వారిసతీమణిగారికిని శ్రీకుమారరాజాగా రొసంగిన తోఁటవిందున కాహ్వానింపఁ బడుటచే నచటకును వెళ్ళి వారింక సంభాషించిరి. మదరాసుపౌరులు శ్రీజార్జిచక్రవర్తిగారికి దమకృతజ్ఞతను జూప నెంచి శ్రీగవర్నరుగారియాధిపత్యముక్రింద బ్యాంక్వెటింగు హాలులో జరిపించిన సభ కింకొకపరి శ్రీకుమారరాజాగా రాహ్వానింపఁబడిరి.

నూతనముగఁ గట్టఁబడిన చెన్నపురిలోని చట్టనిర్మాణసభాభవనమునందు ఫిబ్రవరి 14 వ తేదీని జరిగిన ప్రథమసభకుఁ బ్రేక్షకులుగను నా మాసాంతమునందే విక్టోరియాపురమందిరములో జరిగిన మిస్ గూర్జార్ యొక్క సభ (Entertainment) కును వెళ్ళియుండిరి. ఇట్లు శ్రీకుమారరాజాగా రనేకపర్యాయములు ప్రసిద్ధికెక్కిన మహాసభలకును, పాలనోద్యోగులగు నాంగ్లేయప్రముఖుల సందర్శనంబునకును బలుమా రాహ్వానింపఁబడు చుండుటయేగాక సాంఘికసభలయందును విద్వత్సభలయందును నగ్రాసనాధిపత్యమును వహించుచుఁ గార్యభారమును జక్కగ నిర్వహించు చుందురు.

1912 మార్చి 25వ తేదీని కార్మికేల్ ప్రభువుగారి యాధిపత్యము క్రింద జరిగిన చెంగల్‌పట్టు సహకారసాంఘికసభ కాహ్వానాధ్యక్షులుగ నుండి ప్రతినిధులకు స్వాగతోపన్యాస మిచ్చు సందర్భమునఁ "బూర్వము వ్యాపించి యున్న పరపతిసంఘములేగాక, యితర సంఘము లనఁగా సరకులను గూడఁబెట్టుట, యుత్పత్తి చేయుట మున్నగునవి యేర్పాటుకావలసియుండు" నని నుడివిరి. అందును గురించి శ్రీగవర్నరుగారు తమయభిమతమును వెల్లడించి సంతసించిరి. అటుపిమ్మట 29 వ తేదిని శ్రీగవర్నరుగారు కలకత్తా కేఁగుచు, సాగనంపవచ్చిన శ్రీకుమారరాజాగారితో — "సహకారోద్యమమునందు మీకుంగల కుతూహలమును బట్టి యీయుద్యమము త్వరలోనే దేశమునందు వ్యాపింపఁగల దని నమ్ముచున్నా"నని హెచ్చరిక గలుగఁజేసిరి.

ఏప్రిల్ 6 వ తేదిని శ్రీపీఠికాపురవరాధీశ్వరుల యాధిపత్యము క్రింద జరిగిన యాంధ్రసాహిత్యపరిషత్సంవత్సరికోత్సవమునకుఁ బోయి, కొన్ని తీర్మానముల నుపపాదించిరి. పచ్చప్పాస్ కాలేజిలో 16 వ తేదీని వ్యవహారికభాషాప్రయోగౌచిత్యము, సంధి, అర్ధానుస్వారము, శకటరేఫము, అన్యదేశపదప్రయోగము—వీనిం గూర్చి శ్రీపురాణం నాగభూషణముపంతులు ఎం.ఏ., బి.యల్., గారు, వేదము వేంకటరాయశాస్త్రులుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిపంతులు బి.ఏ.యల్.టి., గారు, శతావధానులు దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు మున్నగు విద్వద్గరిష్ఠులు వక్తలుగ నుండి జరిగించిన మహాపండితసభకును మన శ్రీయంకినీడుప్రసాద్‌బహదరుగారే యగ్రాసనాధిపత్యమును వహించి పండితజనసమ్మతంబు లగు తీర్మానములచే నాసభను జయప్రదముగ నెరవేర్చిరి.

ఈసంవత్సరములోనే యెస్టేటునకు సంబంధించు గ్రామాదుల లోని దైన యయోధ్యయందలి కృష్ణానదియొక్క కరకట్ట తెగుటచే ననేకగ్రామంబులకును, బశువులకును జాల నష్టము గలిగెను. రైతులకు వాటిల్లిన యీయవస్థను విని పెదరాజాగారు ధాన్యమూలము నను గుమారరాజాగారు విరాళమూలమునను సాహాయ్యము జూపిరి.

డిశంబరు 21, 22 తేదులయందు పచ్చప్పాస్ కాలేజిలో జరిగిన ప్రథమరాజధానిసహకారసంఘముల కాన్ఫరెన్సునకు లార్డు పెట్లండుగారొసంగిన ప్రథమోపన్యాసాంతమున సర్ జార్జ్ అట్కిన్సన్గారగ్రాసనాధిపత్యమును వహించి యుండఁగ శ్రీకుమారరాజాగారు వ్యవసాయసహకారోద్యమమును గుఱించి యుపపాదించి, సభాంతమున నగ్రాసనాధిపతిగారి కభివందనము లర్పించిరి. 1913 జనవరి 1 వ తేదీని లార్డు పెంట్లండుగారొసంగిన తోఁటవిందునకు వెళ్ళి యచ్చటఁ గల పబ్లిక్ సర్వీస్ కమిషన్ మెంబర్లతోడను; వ్యవసాయసంఘమును గుఱించి ప్రధానవ్యవసాయసంఘమును గుఱించి గౌరవనీయు లగు పి. శివస్వామి అయ్యర్ గారితోడను విపులముగ సంభాషించిరి. 6 వ తేదీని పబ్లిక్‌సర్వీసుకమీషన్‌వారికి కాస్మోపాలిటన్‌క్లబ్బు నందొనర్పఁబడిన విందునకు శ్రీవారును వెళ్ళి వారితోఁ బాలనాసౌకర్యమును గుఱించియు; 8 వ తేదీని శ్రీగవర్నరుగారిని ప్రత్యేకదర్శన మొనర్చి వారితో వ్యవసాయాభివృద్ధిని గుఱించియుఁ బ్రాథమికవిద్యావ్యాప్తిని గుఱించియుఁ జక్కఁగ వివరించిరి. జనవరినెలలో జరిగిన పబ్లిక్‌సర్వీస్ కమీషన్ వారి సభలకుఁ బ్రేక్షకులుగఁ బలుమారేఁగి యుండిరి. ఇట్లే మండలసభలకును నుత్సాహముతో నరుదెంచు చుండెడివారు. ఈదినములలోనే సంస్థానమున కరిష్టదాయకముగఁ బరిణమింపఁ గల టెనెన్సి ఆక్టును గుఱించిన గ్రంథమును సాకల్యముగఁ జదివిఁ దీనిచే సంస్థానమునకు వాటిల్లు నష్టములను గుఱించియుఁ దన్నివారణమును గుఱించియు దొరతనమువారికొక విజ్ఞాపనమును బంపి యుండిరి. మఱియు దీనిప్రతులను మఱికొందఱుభూస్వాములకును బంపి వారికృతజ్ఞతకుఁ బాత్రులైరి. మఱియుఁ జెన్నపురిలో నవంబరు 24 వ తేదీని రాజప్రతినిధి యగుహార్డింజిప్రభువుగారి యాగమనసందర్భమున జరిగిన సన్మానపత్రస్వీకారము, యూనివర్సిటీ లైబ్రరీ కొనరింపఁబడిన శంఖుస్థాపనము, రిప్పన్ ప్రభువుగారిపేర మ్యునిసిపాలిటీవారికై కట్టఁబడినభవనములందలి నూతనప్రవేశోత్సవము, కాస్మోపాలిటన్ క్లబ్బులో నొసఁగబడిన గౌరవాతిథ్యము, మున్నగుసమస్తవిషయములకును శ్రీకుమార

రాజాగా రాహ్వానింపఁబడిరి. 27 వ తేదీని జరిగిన భూస్వాములసభయం దీటెనెన్సీ ఆక్టును గుఱించి విచారించుట కొఱక కమీషనరును నియమించుట కై యొనరింపఁబడిన తీర్మానమును బలపఱచిరి. మఱియు నాసభయందే రాజకుమారకాకాలేజి నొకదానిని స్థాపించుట కై దొరతనమువారి కొఱక విజ్ఞాపనము బంపఁబడినది.

1914 జనవరి మూఁడునాలుగు తేదీలయందు గౌరవనీయు లగు శివస్వామిఅయ్యర్ గారి యాధిపత్యముక్రిందజరిగిన రాజధానిసహకార సాంఘికద్వితీయసభకుం బోయి వ్యవసాయసహకారములను గుఱించి తిరిగి యొకతీర్మానము నుపపాదించిరి. అందుమీఁద నగ్రాసనాధిపతిగారు తమయుపన్యాసాంతమునం దీయుద్యమమును గుఱించి శ్రీకుమారరాజాగారు వహించిన శ్రద్ధను శ్లాఘించుచుఁ దదితరులగు జమీందారులకు వీరు మార్గదర్శకు లనఁదగు నని నుడివిరి. గత సంవత్సరమం దేర్పడిన రాజధానిసహకారసంఘమునకు మన కుమారరాజాగారే యుపాధ్యక్షులుగ నెన్నుకొనఁ బడిరి. ఈసభయందు గొంత విరాళముగూడ నొసంగఁబడెను. మఱియు వీరి కీవ్యవసాయికసహకారోద్యమము లందుఁ గల పరిపూర్ణాభిరతిచే ఫిబ్రవరి 7 వ తేదిని పెంట్లండుప్రభువుగారిని ప్రత్యేకముగ దర్శించి వారికి నీ తెలుఁగుదేశమున సహకారసంఘము లెక్కుడుగ వ్యాపించుప్రయత్నము లొనరించుటకును; ఉత్తరసర్కారు లందును, దత్తమండలములందును గొన్ని యుత్తమవిద్యాశాలలను,బదిగ్రామికపాఠశాలలను, నౌషధాలయములను నెలకొల్పుటకును విన్నప మొనరించిరి. ఆమాసాంతమునందే సహకారోద్యమమును గుఱించి యొకచిన్నిపొత్తమును రచించి దానిని వలయువారి కుచితముగఁ బంచిపెట్టెద మని ప్రకటించి యట్లొనర్చిరి. మఱియు మార్చి 7, 8, 9 తేదీలయందు గోదావరి జిల్లా కపిలేశ్వరపురమునందు జరిగిన నాలవకమ్మమహాజనసభయందీపొత్తములు విశేషముగఁ బంచిపెట్టఁబడినవి. ఆ సభయందు శ్రీకుమారరాజాగారు గ్రామ పంచాయితీసభలు, సహకారోద్యమము మున్నగు విషయములనుగుఱించి చర్చించి తుదకిట్లుపన్యసించిరి:—

"ఈసభాభవనమునందు జమీందారు లనేకు లేతెంచి యలంకరించి యున్నారు. సంఘము నుద్ధరించుటకై వలయు ధనము నంతయు వారే యొసంగఁగలుగుదురు. కావున సభికులను వేఁడియడుగనేల? అని శంకింతురేమొ! అందునకు సమాధానము వినుఁడు. స్వసంఘమని ధనాధికులు గల యీసంఘమునకే యాధనమును వినియోగించుచుండినయెడల ద్రవ్యలోపముచే నెంతయో వెనుకబడియుండి యన్యసహాయ మపేక్షించుచుండిన యితరసాంఘికుల కెవరుసాహాయ్యమును జేయుదురు? కావున సాహాయ్యార్థులగు ప్రతిసంఘమువారిని మే మాదరింపవలసియున్నది. కనుక ద్రవ్యాధికులు గల మనసంఘమువారు తమ సంఘమును బోషించుకొనుట తమవిధియని యెఱుంగవలయును."

గతమహాజనసభయందువలెనే యీసభయందును శ్రీకుమారరాజాగారు నూఱురూప్యముల విరాళ మొసంగిరి. ఆతనాహ్వానసంఘాధ్యక్షులును గపిలేశ్వరపురాధిపతులును నగు శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడుగారును మఱికొందరును నీమార్గమునే యనుకరించిరి.

ఇట్లు రాజకీయసాంఘికవిషయములం దెంతయుఁ బూనికతోఁ బాటుపడుచున్న శ్రీయుంకినీడుప్రసాదు బహదరు బి. ఏ. గారికిని నిట్టి పుత్రరత్నముం బడసిన వీరిజననీజనకులకును భగవంతుఁడాయురారోగ్యంబు లొసంగుఁగాత.





శ్రీరస్తు.

# నూజవీడు సంస్థానము.

(కృష్ణాజిల్లా.)

సీ॥ ఎవ్వారిపూర్వీకు ♦ లెంతయో రణవీరు
లని చరిత్రములఁ బ్ర♦ఖ్యాతిఁ గనిరో!
ఎవ్వారిపూర్వజు ♦ లిల రాజబహాదర
ప్పారాయబిరుదాళిఁ ♦ బరగినారో!
ఎవ్వారిపూర్వు ల♦హీనభాషారతి
సత్కృతుల్ గొని యశ♦స్కాము లయిరో!
ఎవ్వారిపూర్వులు ♦ శ్రీవిరాజిల బుధా
వళి కాశ్రయం బిచ్చి ♦ నిలిపినారో

తే॥ గీ॥ అట్టి శ్రీనూజవీడుపు♦రాధిపులకు
వారిసంతానమునకు నా♦భాస్కరేందు
తారకం బాయు రున్నతుల్ ♦ దనరఁ బ్రోచుఁ
గాక రంగధాముండు కృ♦పాకరుండు॥

కృష్ణాజిల్లాలోఁ గలజమీాల కెల్ల నూజవీడుజమీా చాల సుప్రసిద్ధ మైన దనియు, మిగులఁ బురాతనమైన దనియుఁ బూర్వకాలమం దీ సంస్థాపకులలోఁ గొందఱు యుద్ధనైపుణ్యంబునఁ బ్రాముఖ్యులై విజయము లొందుటవలన వృద్ధిలోనికివచ్చిరనియుఁ జరిత్రములవలనఁ దెలియుచున్నది. వీరు; దేశ మల్లకల్లోలముగ నుండినకాలమునఁ గలహాకారుల ప్రతాపాగ్నుల నార్పి తమ స్వచ్ఛందకీర్తివైభవమున కెల్ల రచ్చెరువొందు నట్లు నిజశౌర్యసాహసాదులచే రాజ్యస్థాపన మొనరించి పరిపాలకు లయిరి.

ఈ సంస్థానాధిపతులకు మూలపురుషుఁడు మేకా బసవన్న గారు. వీరు పద్మనాయకవంశజులును, విప్పర్లగోత్రజులును నైయుండి నట్లీదిగువపద్యద్వయమువలనఁ దెలియఁ గలదు:—

"క॥ ఆవిష్ణుపదాంబుజమున
నావిర్భవ మై చతుర్థ ♦ మగుజాతి ధరన్
శ్రీవెలయన్ విమలసమా
ఖ్యావృత మై, పద్మనాయ ♦ కాన్వయ మలరెన్॥
తే॥ గీ॥ గంగసైదో డనంగఁ బ్ర♦ఖ్యాతి గాంచు
నమ్మహాన్వయ మెంతయు ♦ నతిశయించు
నం దుదయ మంది, చెలు వొందె ♦ రమితరీలఁ
జిత్రమహిమల విప్పర్ల♦గోత్రు లనఁగ॥"

ఈ బసవన్నగారు మిగులపరాక్రమవంతులును, జయశాలురును నై బదియాఱవశతాబ్దారంభ మందు దక్షిణదేశమునం నుండివచ్చి కృష్ణానదీవామభాగమునందుఁ గల 'గొల్లపల్లి' యను గ్రామము నందు దుర్గమును గట్టి సంస్థానస్థాపన మొనరించిరి. ఈ గొల్లపల్లి యాకాలమున కొక్కింతపూర్వ మొరిస్సారాజులకును, సుప్రసిద్ధుఁ డై 1509 మొదలు 1530 వఱకు మహోన్నతిచేఁ బ్రజాపాలన మొనరించిన విజయనగరాధీశుఁ డగుశ్రీకృష్ణదేవరాయలకును, బ్రప్రథమమునఁ గోల్ కొండరాజ్యమునకు సుబేదారుఁడుగ (Governor) నుండి పిదప 1512 మొదలు 1543 వఱకు నవాబుగనుండిన పరాక్రమవంతుఁ డగు 'కులీ కుతుబ్ షా' కును యుద్ధరంగముగ నుండెడిది. కావున నాకాల మందు గొల్లపల్లియొద్దఁ గోటనుగట్టి యధికార మేర్పఱచుకొనుట మిగుల దుర్ఘట మైనదియె యగును గాని, యీరాజ్యసామ్రాజ్యంబు లింతకుఁ బూర్వమె యంతరించెను; ఎట్లనఁగ:—గోల్ కొండనవాబు లలో నొకఁ డగు 'అబ్దుల్లా హుసేన్ కుతుబ్ షా' కాలమున 'మీర్ జుమ్లా' అను నొకపారశీకుఁడు హిందూదేశమునకు వచ్చి, ఢిల్లీపాదుషా యగు షాజహాన్ యొక్క సైన్యములోఁ బ్రవేశించి, యచ్చట పాదు షాసుతుఁ డగు 'దారా' తో వైరము వచ్చినందున గోలకొండ జేరి,

క్రమక్రమముగ నవాబునకు ముఖ్యమంత్రియై, పదంపడి కొన్ని దు స్తంత్రములచే నవాబునకుఁ గూడ వ్యతిరేకుఁడై యవురంగజేబునకు వ్రాసిన లేఖవలన గోలకొండరాజ్యనాశనమునకు ముఖ్యకారకుఁడయ్యెను. ఆలేఖయందు— "* హిందూదేశములోని యత్యంతధనసంపన్నమైనరాజ్యమును మీరు స్వాధీన మొనరించుకొనుసమయము వచ్చినది. నేను మొదటినుండియు మొగలులసేవకుఁడను. వారికి మేలు సేయవలయునని యే నేను గోలకొండకువచ్చితిని. ఇప్పుడు గోలకొండనవాబుతల్లి మనకు ననుకూలముగ నున్నది. కర్ణాటకసైన్య మంతయు నాచేతిలో నున్నది. గోలకొండసైన్య మంతయు నాకుమారుఁడగు మహమ్మద్ అమీన్ ఖానుని స్వాధీనము. ఇట్టిస్థితిలో మీరు గోలకొండమీఁదికి దండెత్తి వచ్చినయెడల రాజ్యము మీ కవలీలగ స్వాధీనమగు" నని యున్నది. ఈలేఖను నాలతాబాదుపట్టణములోఁ దండ్రి యగు షాజహాన్ చక్రవర్తికి ప్రతినిధిగ నుండిన యవురంగజేబు చూచుకొని, యపరిమితానందభరితుఁడై బైలుదేరి, గోలకొండను ముట్టడించి, తండ్రి యగు షాజహాను యొక్క యుత్తరప్రచోదనమున నెంటనే తిరిగిపోవలసినవాఁడయ్యె, గోలకొండను సామంతరాజ్యముగఁ జేసికొని యేఁగెను. ఇట్లు గోలకొండనవాబులు పదియాఱవశతాబ్దమునందే సామంతు లగుట చేతను; విజయనగరాధీశులలో సుప్రసిద్ధుఁడును గృష్ణదేవరాయల యల్లుఁడును నగు రామరాజుయొక్క రాజ్యకాలము (1541—1565) లోఁ దురుష్కరాజు లెల్లప్పుడును దన్నే సాహాయము గోరుచుండుట చేతను దన (రామరాజ) రాజ్యవిస్తీర్ణ మత్యంతోన్నతంబుగ నుండుట చేతను గర్వించి, రామరాజు క్రమక్రమముగాఁ దురుష్కరాజ్యముల నాక్రమించుకొనుచు వారిరాయబారుల నగౌరవపఱచుచు నున్నందునచే నవాబు లందఱు నేకీభవించి హిందూరాజ్యవైభవ మంతరింపఁ జేయ నిశ్చయించుకొని దాడి వెడలి తుదకు (25వ డిశంబరు 1564) తాళికోట దగ్గఱ నాలుగులక్షలకాల్బలముతోను, లక్షగుఱ్ఱపు రౌతులతోను గాచుకొని యున్నశత్రుసైన్యముల నిర్మూలము జేసి విజయనగర

* హిందూదేశకథాసంగ్రహము II పేజి 219

రాజ్యభాస్కరు నస్తమింపఁ జేయుటచేతను, దదనంతరము మనబసవన్నగారిచే గొల్లపల్లియొద్ద నీదుర్గము గట్టఁబడుట కేయాటంకమును లేకయుండెను.

మఱియు నీబసవన్నగారు తమ బాహుబల పరాక్రమముచేఁ * గరికాలచోళవిభునివలనఁ గొన్ని బిరుదముల నొందిన ట్లిందుమతీపరిణయములోని యీక్రిందిపద్యము నుడువుచున్నది:—

"మ॥ అతఁ డాతేఁ గరికాలచోళవిభుచే ♦ నాత్మీయశక్తిన్ సము
న్నతిమైఁ గాంచెను నెల్లుడాల్ గొడుగు, వింతల్ గా హనూమద్ధ్వజా
న్వితశంఖంబు మొదల్ మహాబిరుదముల్ ♦ బెంపొందసామ్రాజ్యపూ
జ్యతరైశ్వర్యధురంధరుం డగుచు ని♦చ్చల్ మెచ్చ ధాత్రీస్థలిన్."

ఈబసవన్నగారి యనంతరమున వీరికుమారుఁ డగుతిమ్మన్నగారును, దరువాత మనుమఁ డగు బాపన్నగారును రాజ్యపాలన మొనరించిరి. ఈబాపన్నగారు నిజకళత్ర మగు 'అమ్మమ్మ' గారివలన 'కోనప్ప, పెదయప్పన్న, చినయప్పన్న' యనుపుత్రకులఁ గాంచిరి. ఈముప్వురిలోఁ గోనప్పగారు రాజ్యపాలకు లైరి. నాఁటినుండి నేఁటిదనుక

---

* ఈకరికాలచోళవిభుఁ డెవ రని యోజింపఁగా హిందూదేశకథాసంగ్రహము యొక్క ప్రథమభాగము నూటతొంబదియెనిమిదవపుటయం దిట్లు గలదు.— "ఇతఁడు రాజనరేంద్రుని ప్రథమపుత్రుఁడు. ఇతఁడే రాజేంద్రచోళుఁడు. ఇతని మొదటి పేరిదియే యయినను నితఁడు వేగిదేశరాజ్యభారమును వహించిన మొదటిసంవత్సరములోనే చోళదేశముపై దండెత్తి దానిని జయించి స్వాధీనపఱచుకొన్న తరువాతఁ గులోత్తుంగచోళదేవుఁ డనఁబడుచు వచ్చెను. ఇతనికి రాజనారాయణుఁ డనుబిరుదుగలదు. ఇతనిని గరికాలచోళుఁ డనియుఁ బిలుచుచువచ్చిరి. ... కులోత్తుంగచోళదేవుఁడు 1063 మొదలు 1112 వఱకు నలువదితొమ్మిది సంవత్సరములు రాజ్యపాలన మొనరించెను." అనియు, గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారిచే రచింపఁ బడిన శ్రీ రావువంశీయులచారిత్రము నందును "...తద్వంశమునకు మూలపురుషుం డగుబసవన్న యను నతఁడు కాకతీయప్రతాపరుద్రునకు నైదారువందలసంవత్సరములు పూర్వుం డగు గరికాలచోళునివలన విశేషబహుమానముల నందినవాఁడు" అనియుఁ గలదు. ఈకరికాలచోళునివలన గౌరవాదు లందిన బసవన్నగారు వీనికి సమకాలికుఁ డై పండ్రెండవశతాబ్దాది నుండవలెఁ గదా. కాని స్థానికచరిత్రాదులందు వీనిరాజ్యకాలము 1520 వ సంవత్సర ప్రాంతమని చెప్పఁబడి యున్నది. ఈవిషయ మింకను యోచనీయము.

వీరిసంతతియె పాలన మొనర్చు చుండెను. ఈకోనప్పగారు—

ఆ॥ వె॥ వెలయఁ గోనవిభుఁడు ♦ వేంగమాంబాసరో
జాక్షియందుఁ దిరుమ ♦ లాఖ్యనృపతి
వేంకటాద్రి రామ♦విభుఁడు బాపన్నయు
ననఁగఁ దనరు సుతుల ♦ ఘనులఁ గనియె॥ ”

వెంగమాంబవలనఁ ‘ దిరుమలయ్య ’ వేంకటాద్రి, రామన్న, బాపన్న, యను నల్వురుపుత్రులఁ గాంచిరి. వీరిలోఁ బ్రథములు తండ్రికిముందే గతాయుష్కు లగుటచే ద్వితీయు లగువేంకటాద్రిగారు పాలనమునకు వచ్చి గొల్లపల్లిపరగణాలోని యయిదు గ్రామము లను గుత్తకు దీసికొనిరి. ఈవేంకటాద్రిగారి ప్రథమకుమారులే జయ శీలత్వముచే రణసింహుఁ డని పేరొందిన యీవంశమున కెంతయుఁ గీర్త్యైశ్వర్యములఁ దెచ్చిన యప్పారావుగారు. తమ పూర్వికులకన్న మిన్నగ వీరును యుద్ధకౌశల్యమునందు మిగులఁ బ్రాశస్త్యమును వహించి, నైజాముసర్దారులతోడను, దత్ప్రాంతస్థపరిపాలకులతోడను ననేకయుద్ధములను జేసి గొల్లపల్లిపరగణాయొక్క చరిత్రమును గీర్తి శోభితముగఁ జేసిరి.

ఈయప్పన్నగారు క్రీ॥ శ॥ 1667 వ సంవత్సరములో గోలకొండ నవాబునొద్ద నుండి యాకాలంబున రాజోచితచిహ్నంబు లగు డంకా, నగారా నౌబత్, జాలందరుపల్లకి ము న్నగు గౌరవ వాచులను గాక ‘ విజయుఁ ’ డను ప్రసిద్ధనామము సార్థక మగు నటుల ‘ రాజా ’ బహాదరు, అప్పారావు, తహవ్వార్, వజులాలత్ దస్తుగహా ’ అనుబిరుద ములను బొందెను. కావున నీశూరాగ్రణిసంతతివా రెల్లరును దదా దిగ నీ ‘ రాజా ’, అప్పారావు, బహాదరు, ’ అనుబిరుదములను దమనామ ములకుఁ జేర్చుకొనుచు, హేమస్థగితరత్నంబులం బోలె భాసిల్లఁ జేయు చుండిరి. ఈ రాజా విజయప్పారావు బహాదరుగారే నూజవీడుదుర్గ ప్రతి ష్ఠాపకులు. ఈ యూరున కీపేరు వచ్చుట కొకజనశ్రుతి గలదు. అదేదన శ్రీరాజాగా రొకనాఁడు కొంద అనుచరులతో మృగయార్థ మై బైలు దేరి యొక నువ్వుచేనునం దొక శుష్కమేషము బలసంపన్నం బగు

నొకతోఁడేలుతోఁ నెదుర్కొని పోరాడు చుండుటను గాంచి, సాశ్చర్యులై యొకహీనజంతువు మఱి యొకబలిష్ఠ మగుజంతువుతోఁ బోరాడుటను జూచు టెంతయు శుభశకున మనియు, నాప్రదేశము జయప్రద మనియుఁ దలంచి, యచ్చోటనే కోటను గట్టి దానిని తనరాజధానిగఁ జేసికొనిరి. అప్పటినుండియు నాప్రదేశము 'నువ్వుచెట్లవీడు' అను పేర వ్యవహరింపఁ బడుచు క్రమశః నూజవీడుగ మారెను.

వీరియనంతరమున వీరిపుత్రు లగు శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు బహాదరుగారు పాలనమునకు వచ్చిరి. శ్రీవిజయాప్పారావుగారికిఁ గల నరసమాంబ, జగ్గమాంబ యనుకళత్రద్వయములో వీరు నరసమాంబాకుమారులు. ఈవేంకటాద్ర్యప్పారావు బహాదరుగారు భుజపరాక్రమమునందును దానశీలత్వము నందును మిగులఁ బ్రఖ్యాతి గాంచి యుండిరి. ఈ విషయమై వర్ణింపఁ బడిన పద్యము లెంతయు మనోహరంబులుగ నుండుటచే నిం దప్రస్తుత మయ్యును నొకటిరెంటిమాత్ర ముదహరించు చున్నాఁడను—

సీ॥ ఆశ్రితరాజహం ♦ సారోహణము సేయు
చతురాస్యుఁ డేరీతి ♦ సాటి వచ్చు
సకలపుణ్యజనశి♦క్షణము సేయుచు నుండు
జలజాక్షుఁ డే లాగు ♦ సాటి వచ్చు
నిరతభిక్షాటన♦ స్థిరత మానఁగ లేఁడు
స్మరవైరి యె ట్లింగి ♦ సాటి వచ్చు
గురువంచనాయత్న♦పరతమై వర్తించు
జలజారి యే రీతి ♦ సాటి వచ్చు

తే॥ గీ॥ శేముషీబుధరక్షణ ♦ శ్రీయశోమ
హత్త్వముల నీనృపాలున ♦ కనఁగ వెలసె
నంచితనిజప్రతాపశో♦భాధరితవి
రాద్ధనుఁడు వేంకటాద్ర్యప్ప♦రాయఘనుఁడు॥

శా॥ తెప్పల్గా ధనరాసు లెల్లపుడు న♦ర్థివ్రాతముల్ వేఁడినన్
మెప్పుల్ మీఱ నొసంగి సత్కవినుతుల్ ♦మీఱంగ బ్రహ్మాండముల్

గప్పం జాలిన కీర్తివైభవములన్ ♦ గన్పట్టు నవ్వేంకటా
ద్ర్యప్పారాయని పాటిదాత గలఁడే ♦ యాత్మన్ వితర్కించినన్॥"

ఈ వేంకటాద్ర్యప్పారావుగారు, దేశము నందలి కల్లోలముల నిర్మూల మొనర్చి ప్రజలను శాంతయుతులుగను, న్యాయబద్ధులుగను నొనర్చుటచే నైజాముగారు వీరిసామర్థ్యమునకు సంతసించి కొండపల్లి సర్కారులోఁ బది, యేలూరుసర్కారులో నేడు జాగీరులను బహుమతిగ నొసంగిరి. వీరు రమణాంబయందు నరసింహాప్పారావుగారు, శోభనాద్ర్యప్పారావుగారు ననునిరువురఁ కుమారుల గాంచిరి. ఈసుతద్వయములో జ్యేష్ఠు లగు శ్రీరాజా నరసింహాప్పారావుబహాదరుగారు జమీపాలనమునకు వచ్చిరి. ఈ రాజాగారు పరిపాలనాసామర్థ్యమును హృదయవైశాల్యమును గల గొప్పయోధవీరు లని ప్రశస్తి గాంచిరి. శ్రీరాజాగారు భాషాభిలాషు లై పెక్కుగ్రంథములకు గృతినాయకులుగ నుండి తత్తత్కవిపుంగవుల నెక్కుడుగ నాదరించి యుండిరి. ఈవిషయ మై కొలఁదికాలముక్రిందట స్వర్గాభిముఖు లైన శ్రీరాజా రంగయ్యప్పారావు బహాదరుగారు రచింపఁ జేసిన పారసీకధరాధీశచరిత్రములోని—కం॥ "ఇందుమతీ పరిణయముఖ । సుందరకావ్యములు పెక్కు ♦ సుకవులు గొని రా । నందెఁ గృతినాయకత్వ మ । మందానందమున వారి ♦ మన్నించి తగన్॥" అనుపద్యము చాటుచున్నది. ఇట్లు కృతినాయకత్వ మందిన కృతులలో 'అప్పారాయయశశ్చంద్రోదయము, ఇందుమతీపరిణయము' అను రెండుగ్రంథములుమాత్రము గన్పించుచున్నవి. వీనిలో నిందుమతీపరిణయము సుప్రసిద్ధఁ డయిన కుమారధూర్జటిప్రణీతము. ఇంతదనుక నుదహరింపఁ బడినపద్యము లన్నియు నిందులోనివే యగుటచే నీగ్రంథప్రాశస్త్యమును గుఱించి వేఱ వర్ణింపఁ బని లేదు. ఈప్రభువరున కొకనాఁటిరాత్రి స్వప్నమందు హరిహరులను, సరస్వతీదేవియుఁ బ్రసన్ను లై నట్లును, శ్రీరాజాగా రభివాదన మొనర్ప, భారతీదేవి యొకనవీనగ్రంథము నొసంగినట్లును, బదంపడి మేల్కాంచి ప్రాజ్ఞులతో యోజింపఁగ, వా రిది కృతినాయకత్వంబు వహించుటకు ద్యోతకం బగు నని పు డీయిందుమతీ

పరిణయమును రచింపఁ జేసి కృతి నందినట్లుగు నీదిగువగల పద్యగద్య ములవలనఁ దెలియుచున్నది:—

" కం॥ కలలోన రత్నకాంచన
కళ లోఁ గొను నగరిలోనఁ ♦ గలమణిపీఠిన్
గల లోలాక్షులలోఁ జు
క్కలలోఁ జంద్రుఁ డనమెప్పు ♦ ఘనుఁ డొకఁ డుండెన్॥

క॥ ఆనృపుని చెంత నొకచం
ద్రానన క్రొ మ్మొయిలు డాయు ♦ నమ్మోముఁ గనఁగాఁ
గానఁగ నయ్యె న్నే నపు
డానంద మెసంగఁ జేసి ♦ యభివాదనమున్॥

గీ॥ అంత నతని చెంత ♦ నత్యంతశశికాంత
కాంత హైమపీఠి ♦ కాంతరమున
శాంతహృదయు నొక్క ♦ సంయమీంద్రుని గంటిఁ
గెలన నొక్క ధవళ♦లలన దనర॥

వ॥ అమ్మహాపురుషుని యనుమతంబున నొకముద్దియ ముద్దు మోముసఁ జిరునవ్వు దళుకొత్తఁ గ్రొత్త యగు నొక్క పాత్రమ్ము మదీయహస్తమ్మునం జేర్చినన్ గైకొని మేల్కాంచితిని ... ... "

శ్రీరాజాగారు కృతికర్తయయిన కుమారధూర్జటికవీంద్రునకు బంగరుఁగరములును, నుత్తుంగతురంగములును, సువర్ణహారములును, నగ్రహారములును నొసంగినపిమ్మట సంతుష్టాంతరంగుం డై కృతిపతి నిట్లు వర్ణించెను:—

"సీ॥ మృదుకవిత్వప్రౌఢి ♦ మెచ్చ నేరరు గాని
ధరలోన నీవంటి ♦ దొరలు లేరె
భూప్రజారంజన ♦ స్ఫూర్తిఁ జెందరు గాని
ప్రణుతింప నీవంటి ♦ ప్రభులు లేరె
హెచ్చి పాత్రత్యాగ ♦ మియ్య నేరరు గాని
నృపులలో నీవంటి ♦ నృపులు లేరె

అన్నదానప్రౌఢి ♦ నలర నేరరు గాని
గణుతింప నీవంటి ♦ ఘనులు లేరె
గీ॥ రమ్యచారిత్ర! విజయాప్ప♦రాయపౌత్ర
వేంకటాద్ర్యప్పరాయభూ♦విభునిపుత్ర!
బంధుజనగేయ! సత్కవి♦భాగధేయ!
యాశ్రితవిధేయ! నారసిం♦హాప్పరాయ!"

శ్రీరాజా నరసింహాప్పారావుగారికాలములో ననఁగా క్రీ॥ శ॥ 1707 వ సంవత్సరములో ఢిల్లీఫాదుషా యగు నౌరంగుజేబు గతించుటచే ఫాదుషాపక్షమున హైదరాబాదు నేలుచున్న ధైర్యపరాక్రమహీనుఁ డగు సుబేదారుఁడు దూరస్థసామంతరాజన్యులను దనస్వాధీనములో నుంచుకొనలేక పోయెను. కావున మన శ్రీరాజా నరసింహాప్పారావుబహదరుగారికి 'తీన్ హజార్ మన్సబ్దార్' అనుబిరుద మొసఁగి, వలసినప్పుడు మూఁడువేలసైన్యముతోఁ దమకు సాహాయ్యార్థముగ రాఁ గలసామంతరాజునిగఁ జేసికొనెను. ఇదియే వీరు పాలించుచున్న పరగణాలపై నైజామునకు వచ్చుప్రతిఫలము.

శ్రీరాజాగారిసతీవతంస మగు జానకమ్మగారు, తననిర్మలపాతివ్రత్యముచేతను, సుగుణసంపత్తిచేతను జరిత్రప్రఖ్యాతిగాంచి, భర్తృవియోగానంతరమున—

*"క॥ మహిఁ బ్రాణనాథతేజో
మిహిరుఁడు గడ చనఁగఁ గఁడుఁ ద♦మిస్రావృత యై
యహితముగఁ దోఁపఁ బతితో
సహగమన మొనర్చె నెంత ♦ సాధ్వియొ తలఁపఁగ"

అనునట్లు సహగమన మొనర్చి కీర్తిశోభిత య య్యెను. వీరియనంతరమున వీరిసోదరుఁ డగు 'తహవ్వార్ వజులాలత్ దస్తుగహ శ్రీరాజా శోభనాద్ర్యప్పారావు బహదరు' గారు జమీాపాలకు లైరి. ఆకాలమున నూజివీటిసంస్థానమునకు (1) గుండుగొలను (2) పెంటపాడు (3) నిడదవోలు (4) బహారుజల్లీ (5) ఏలూరుహవేలి (6) ఉయ్యూరు

* పాగసీకథరాధీశచరిత్రము

(7) మేడూరు (8) నున్నస్థలము (9) చాట్రాయి (10) విజయరాయి (11) గొల్లపల్లి (12) గుడివాడ (13) కలిదిండి (14) విన్నకోట (15) బిత్తరుజల్లి (16) రాయగుడి (17) కుడికొండ (18) కపిలవాయి యనుపరగణాలు చేరి యుండెను. † "వీరికాలములో నూజవీటి సంస్థాన మదివఱ కెన్నఁడు లేని యత్యున్నతస్థితియం దుండె' నని మెకంజిదొరగారు వ్రాసిరి.

ఈరాజాగారికిఁ గల కళత్రత్రయములోఁ బట్టపుదేవి భర్తతోఁ గూడ సహగమన మొనరించిన ట్లీదిగువపద్యము నందుఁ జెప్పఁబడియె—

"చ॥ అటు నుతిగాంచు నాముగుర ♦ యందును బట్టపుదేవి యెప్పును
త్కటపతిభక్తిచే నలరి ♦ కాంతుఁడు కాలవశమ్ము నొందఁ దాఁ
బటుతరసాహసం బెనయ ♦ భర్తను వీడఁగఁ జాల నంచు ను
క్కటఁ బతితోఁ జితానలశి♦ఖాతతి కాహుతిఁ జేసె దేహముం॥"

ఈశోభనాద్ర్యప్పారావుగారును, సింతకుమున్న బాలన మొన రించి గతించిన వీరియగ్రజు లగు నరసింహాప్పారావుగారును బుత్రహీనులై స్వర్గస్థు లగుటచే వీరిజ్ఞాతివర్గములోని వారయిన యప్పన్నాప్పారావుగారికిని, బిమ్మట రామచంద్రాప్పారావుగారికిని నీ విస్తీర్ణరాజ్యభాగము లభించెను. ఈయప్పన్నాప్పారావుగారును, రామచంద్రాప్పారావుగారును గోనప్పగారి చతుర్థపుత్రుఁ డగు బాపన్నగారి సంతతివా రని తెలియుచున్నది. ఈ రామచంద్రాప్పారావుగారికాలములో దక్కనుసుబేదారుఁ డైన అసఫ్ జా (Asof Joh) తిరిగి తమ ముఖ్యాధికారమునకు దెచ్చుకొనుట కై యీప్రాంతమునకు దండెత్తి వచ్చెను, గాని రామచంద్రాప్పారావుగారు తమ సహజశౌర్యస్థైర్యములచేఁ గోటను మూఁడునెలలవఱకుఁ గాపాడి, తమయసమానపరాక్రమమును జూపిరి. అయిన నేమిప్రయోజనము? సుప్రసిద్ధుఁ డగు రుస్తుమల్లిఖాన్ (Rustam Ali Khan) అను సేనాని (ఫౌంజుదార్) విజయుఁడై కోట నాక్రమించుకొని పండ్రెండు సంవత్సరములవఱకుఁ దన

---

'† In whose days the prosperity of the family was at its height'

యధికారముక్రిందనే యుంచుకొనెను ; కాని వీనితరువాతి ఫౌజుదారింతపరాక్రమవంతుఁడును, రాజ్యభారవహదక్షుఁడును గాకపోవుటచేఁ దిరిగి యీపరగణాలను మఱియొక్కరికి గుత్త కిచ్చుటకుఁ గృతనిశ్చయుఁ డగు చుండెను.

నూజవీటిజమీందారుల బంధువర్గములోనివా రయిన కమదనకుటుంబమునందు గల 'అప్పన్న' 'రాయన్న' యనునిరువురును శిస్తు వసూలుచేయుట మొదలగు నుద్యోగములందు నియమింపఁబడినవారగుటచేఁ దురుష్కాధికారులతోఁ గొంతపరిచయముగలిగి మెలఁగుచుండిరి. వీరు, తమచేత నైనకొలఁది నూజవీటి సంస్థానముయొక్క పూర్వౌన్నత్యమును దిరిగి ప్రతిష్ఠాపింపవలయు ననుగట్టిపట్టుదలతోఁ బ్రయత్నించి కోనప్పగారితృతీయపుత్రుఁ డైన రామన్నగారి సంతతిలోనివా రగు వేంకటాద్ర్యప్పారావుగారికి పరగణా లన్నింటిని గుత్తకిచ్చునట్లు ఫౌజుదారును బ్రోత్సాహపఱచిరి. అంత 1738 వ సంవత్సరములో విజయరాయి, చాట్రాయి, 1740 సం॥ లో గుండుగొలను, పెంటపాడు 1741 సం॥లో నున్నస్థలము గొల్లపల్లి 1742 సం॥లో నుయ్యూరు, మేడూరు 1743 సం॥లో దివి, చార్‌మహాల్ 1745 సం॥లో అంబారుపేటముఠా 1746 వ సం॥లో నిడదవోలు, బహాదరుజల్లి పరగణాలు మన వేంకటాద్ర్యప్పారావుగారికి సక్రమముగ స్వాధీనములగుటచే నూజవీటిసంస్థానములోని యధికభాగమువీరి కే చెందియుండెను.

అటుపిమ్మటఁ గమదనమువారు హైదరాబాదునకువెళ్లి మన వేంకటాద్ర్యప్పారావుగారిపేరఁ బరగణాల కన్నింటికి సన్నదు నిచ్చుటకై వారిశక్తి నంతయుఁ జూపి సుబేదారువలనఁ బట్టాను గ్రహించి యమితానందముతోఁ దిరిగి వచ్చిరి ; కాని, యంతకుఁ బూర్వమె వేంకటాద్ర్యప్పారావుగారు స్వర్గస్థులగుటచే వారిసోదరు లగు జగన్నాథాప్పారావుగారిని బరిపాలకులుగ నేర్పఱచిరి. వీరు కొంతకాలమువఱకు జమీని శాంతయుతముగ నేలిరి.

అట్లు శాంతయుతముగ నేలు చున్న జగన్నాథాప్పారావుగారు కొన్నికారణములచేఁ దమ కుపకారకారు లైన కమదనమువారితోఁ

గలహించి, తమసంస్థానము నుండి వెడలఁ గొట్టుటకు బ్రయత్నించినందున జరిగినకలహాములో జగన్నాథాప్పారావుగారు వారిచేతులలో బందీకృతులు గాఁబడిరి. అంతటఁ గమదనమువారు నిడదవోలు పెంటపాడు పరగణాలపై నధికార మిచ్చునట్లుగ వాగ్దానమును బొంది జగన్నాథాప్పారావుగారిని విడుదల చేసిరి; కాని, యట్లు తమ వాగ్దానమును నెఱవేర్చుకొన కుండుటయగాక వారిని దమసంస్థానము నుండి నిర్భయముగఁ బారఁ ద్రోలిరి. అందులకుఁ గమదనమువారు మిగులఁ గినిసి, తిరిగి హైదరాబాదునకుం బోయి నూజవీటిసంస్థానమున కంతకును దమపేర సన్నదు (పట్టా) లనుబుట్టించుకొని, యుత్సాహముతోఁ దిరిగి వచ్చిరి. ఆనంతరంబ, జగన్నాథాప్పారావుగారు కమదనమువారికి హైదరాబాదునందుఁగల స్వాతంత్ర్యమునకు వెఱ పంది వారితో "మీరు గొనివచ్చినపట్టాలను రద్దుచేసికొని వచ్చిన యెడల 'చార్ మహాల్ యెస్టేటు'ను మీ కొసఁగెద" నని నమ్మించి వా రట్లొనరించినపిమ్మట నప్పారావుగారుమాత్ర మెప్పటివలెనె మిన్నకుండిరి.

ఈదినములలోనె ఫరాసులు (French) దక్కనులోఁ బ్రాజాపత్యమునువహించి మచిలీపట్నమునందు దమ సామ్రాజ్యమును స్థాపించి యుండిరి. దివిలోఁ గోటనుగూడ గట్టి నేలపన్నుగా (Quit-rent) మనజమీందారుగారికి మూఁడు పెగోడా (పూలవరహా)లను నిచ్చుచుండిరి. ఈఫరాసుల కా కాలములోఁ బ్రబలరాజ్యము లేకపోయినను గొంత యధికారమును జూపుచునే యుండిరి. కావున నీకమదనము వారు వారి (ఫ్రెంచి) సాహాయమును గోరఁగా ఫ్రెంచివారు కమదనమువారితో సంధి యొనర్చుకొనుటుచిత మని జగన్నాథాప్పారావుగారికి దెలియపఱచిరి; కాని యప్పారావుగా రిందుల కంగీకరింపనందున నుభయపక్షములవారు యుద్ధసన్నద్ధులైరి. ఆయుద్ధములో ఫరాసులు జగన్నాథాప్పారావుగారిని జెఱపట్టిరి. తుదకు జగన్నాథాప్పారావుగారు 1756 వ సంవత్సరములో బుస్సీదొరగారు విడిసి (Camp) యున్న 'కల్బర్గ' లోఁ గాలధర్మము నొందిరి. పిమ్మటఁ గొంతకాలమువఱకు నీసంస్థానము ఫ్రెంచివారియధీనములో నుంచుకొనఁబడెను.

అనంతరంబ విశ్వాసపూరితహృదయు లయిన కమదనమువారు తిరిగి యప్పారాయకుటుంబములోనివా రగు వేంకటాద్రిగా రనుమతియొకరి నాస్థానమునం దుండునట్లు చేసిరి. ఈవేంకటాద్ర్యప్పారావుగారు, కోనప్పగారి చతుర్థపుత్త్రు డైన బాపన్నగారి వంశీకులలో నైదవవారు. వీరియెడ సదుద్దేశము గల హాసన్ ఆలీఖాన్ 1759 సంవత్సరప్రాంతములో ఫౌంజుదారునుండి అమల్దారీసన్నదును 1763 వ సంవత్సరములో సుబేదా రయిన నైజామాలీఖాన్ వలనఁ బదు నెనిమిదిపరగణాలకు జమీాందారీసన్నదులను నిప్పించెను. (ఈరాజా వేంకటాద్ర్యప్పారావుగారు కమదనమువా రొనరించు చున్న మహోపకారములకు మిగుల సంతుష్టాంతరంగు లయి కృతజ్ఞతాపూర్వకముగ గుడివాడ, విన్నకోట, కలిదిండి, బత్తరుజల్లియనుతాలూకాలుగల 'చార్మహాల్' సంస్థానము నొసంగిరి. నాఁటి నుండి కమదనమువారీసంస్థానమును ప్రత్యేక మగు జమీాగఁ బాలించుకొనున ట్లయ్యెను; కాని స్వసామర్థ్యముచే సంస్థానస్థాపన మొనరించుకొనిన జమీాందారు లందఱివలెనె తామును జమీా నేర్పఱచుకొని చిరకాలము నుండియుఁ జమీాపాలకులుగ నుండినట్లు వారి స్థానికచారిత్రాదులవలనఁ దెలియుచున్నది.) వీరినిగుఱించి చార్మహాల్ సంస్థానచారిత్రమునందుఁ జెప్పఁబడును.

1763 వ సంవత్సరములో నైజామాలీఖానుచే నొసఁగఁబడిన సన్నదులు వేంకటాద్ర్యప్పారావుగారిపేరనే పుట్టినను దమసోదరు లగు నరసింహప్పారావుగారిని గూడఁ జేర్చుకొని పాలన మొనరించినందున 1765 వ సంవత్సరములో నేలూరువద్ద జనరల్ కెయిలాడ్ (General Caillaud) గారితో జరిగిన యొడంబడికపత్రమునం దిరువురపేర్లును గనఁ బడుచున్నవి. వేంకటాద్ర్యప్పారావుగారు తమసోదరు లగు నారసింహప్పారావుగారి కర్ధరాజ్యము బంచి యిచ్చినట్లు— "గీ॥ తమ్ముఁడగు నారసింహభూధవున కెలమి నర్ధరాజ్య మొసంగె నత్యద్భుతము గ॥" అను పద్యార్థమువలనఁ దెలియుచున్నది. 1766 వ సంవత్సరములో నింగ్లీషువారికిని నైజామునకును జరిగిన యొడంబడికలవలనఁ గొండపల్లి యేలూరుసర్కారులు బ్రిటీషువారిపాలనమునకు లోఁబడెను.

ఈసంస్థానమునకు వలయు నేర్పాటులను జరిగించుటలో బందరు నందు గల యాలోచనసభలోని ముఖ్యుఁడు (The Chief in Council) వీ రి రువురతోను వ్యవహరించు చుండి నట్లు తెలియవచ్చెడిని. ఈ వేంక టాద్ర్యప్పారావుగారి పరిపాలనములోనే నైజాముగారిచేఁ గోరఁ బడిన సహస్రత్రయసైన్యసాహాయ్యమునకు మారుగధనపూర్వకమగు పేష్కష్ చెల్లింపవలసి నట్లు నిర్ధారింపఁ బడెను. ఈరాజాగారు 1771 వ సంవ త్సరములోఁ బరలోకప్రాప్తు లగుటచే వీరిసోదరు లగు నరసింహాప్పా రావుగారు సంస్థాన మంతకును సర్వాధికారు లైరి.

ఈవేంకటాద్ర్యప్పారావుగారి సతీవతంసమునుగుఱించి యించుక ప్రశంసింపవలసి యున్నది. ఈమెపవిత్రనామము సీతమ్మ. పతుల జీవితాంతమున సహగమన మొనరించి, తమపతుల ననుగమించిన నూ జవీటిసంస్థానదేవేరులలో నీమె యొకరెత యని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది:—

"చ॥ మిహిరుఁడు గ్రుంకఁ బద్మము నిమీలిత మైనవిధమ్మునన్ మహా
మహితుఁడు వేంకటాద్రినృపమౌళి మహిన్విడనాడు నంత న
ర్థిహృదయముల్ మురింగెను బతిన్విడనాడఁగఁ జాల నంచుఁ దా
సహగమనంబు జేసె జనసన్నుత సీతమ యెంత దాంతయో."

మనఃపూర్వకముగఁ దమభర్తలఁ బ్రేమించుచు, భక్తిమై హృ దయార్పణంబు గావించి యెల్లవిషయంబు లందును దమపతుల నను గమించుటయే సహగమన మనంబరఁగుఁ గాని యిట్టిఘోరకర్మముచే దేహమును దహింపఁజేసికొను టెంతయు నయుక్త మనియకాక ; పదం పడి, భర్తృవియోగదుఃఖభరంబు భరింపఁ జాలకయో, కైవల్యప్రా ప్త మగు ననుదృఢవిశ్వాసముచేతనో స్వయంసిద్ధముగ సహగమనార్థ మై యేతెంచు సాధ్వీమతల్లులంబోలెఁ గులాచార మనునెపంబున బల వంతముగ నిట్టికట్టడికిం బాల్పడనున్న బాలవితంతువుల విలాపంబులం గాంచి సహింపఁ జాలక, జాలివహించిన శ్రీ రాజా రామమోహనరా యలవారి ప్రయత్నమువలన నీయాచారము రూపుమాయుటచే నీసం

స్థానచారిత్రమునందు సహగమన మొనరించిన సుశీలలనామము లిఁక మఁము వినఁ జాలము. అయినను నీసంస్థానాధిపులయొక్కయు, వారి దేవేరులయొక్కయుఁ జరిత్రము లెంతయుఁ బవిత్రవంతము లై సుకవి స్తోత్రంబులకుం బాత్రము లయి యిప్పటికిని బరమానందదాయకములుగ నలరారు చున్నవి.

ఇఁక నూజవీటిసంస్థానచారిత్రములోఁ గొంత విచారకర మగు సంగతి జెప్పవలసి యున్నది. 1771వ సంవత్సరములో రాజ్యభార మ తయు వహించిన రాజా నరసింహాప్పారావుగారు ధనవిషయములోఁ దగు మెలకువ గలిగి యుండకపోవుటచే రానురాను జెన్నపురిదొర తనము వారి కీయవలసి యున్న పేష్కష్ బాకీపడు చుండెను. ఈ కారణముచే 1773 వ సంవత్సరములో సంస్థా మును స్వాధీన మొన రించుకొనుట కై బందరునుండి కొంతసైన్యము పంపఁబడెను. అంత జమీందారుగారు బందరులో నున్న కంపెనీయుద్యోగీయుల యొద్ద నుండి కొంతఋణము దీసికొని దొరతనమువారికి జెల్లించిరి. 1775వ సంవత్సరములో మచిలీపట్నమునం దాలోచనసభలోని ముఖ్యుఁడుగ (Chief in Council) నున్న వైటిహిల్ (Mr. Whitehill) దొరగారే మనరాజాగారి క ప్పొసఁగినది. ఈదొరగా రింగ్లాండులోఁ గూడ నిట్లే యప్పు లిచ్చి యెందఱనో దురవస్థలపా లొనరించుటచేఁ బార్లమెంటు వా రీదొరగారిని 1783 వ సంవత్సరములో నేరముమోపి శిక్షించిరి. ఆలోచనసభ్యుఁ డగు (Member of Council) హాడ్జస్ (Mr Hodges) దొరగారుకూడ మనరాజాగారికి ఋణ మిచ్చిరి. వీ రిరువురును గలిసి యితరు లిచ్చినఋణములనుగూడఁ దమస్వాతంత్ర్యమునకే తెచ్చుకొనిరి. ఇట్లు మనరాజాగారిని ఋణార్ణవములో ముంచివేసిరి. ఋణ మిచ్చు నప్పుడు మిత్రులుగ నుండి తుదకు శత్రువులుగఁ బరిణమించు ఋణ దాత లెంతనిర్దయులు!

శా॥ ఇచ్చెడిమొత్త మొందు లిఖియించుట పత్రమునం దొకంతుగా
హెచ్చుగువడ్డినిర్ణయము నియ్యాదియుక్ ప్రబతివత్సరాదిలోఁ
జెచ్చెరఁ దొంటిమొత్తమునఁ జేర్పవలెక్ గడు వేఁగ కుండఁ జె

ల్లిచ్చుచుఁ దీర్పుమీ గుఱువ ♦ కిచ్చినవస్తువు రాదు క్రమ్మఱన్
బ్రముచ్చుల కన్న మిన్న లయి ♦ మోసమునందుఁ గుబేరు నైననున్
బిచ్చము నెత్తఁ జేయుదురు ♦ వింటివె నిర్దయు లీఋణప్రసుల్॥
(వాసంతిక)

ఇట్లు ఋణగ్రస్తులై యున్న నరసింహాప్పారావుగారు చెన్నపురికిం బోయి దొరతనమువారికి తమయుదంతంబు నెఱింగించుకొనిరి. కాని గవర్నరుగ నుండిన సర్ తామస్ రంబోల్డు (Sir Thomas Rumbold) దొరగారి యాలోచనసభలో ముఖ్యులుగ నున్నవారు మన రాజాగారికి ఋణ మిచ్చిన వైట్ హిల్ దొరగారే యగుటచే నేమియుఁ బ్రయోజనము లేక పోయెను. అందువలన రాజాగారు నూజవీటికి వచ్చి కంపెనీయుద్యోగీయుల నెదిరింప సాగిరి. అంత మేజర్ కాసమాజర్ (Major Casamajor) దొరగారు నూజవీటికి వెళ్ళి జమీందారుగారిని బందరునకు వచ్చునట్లు బలవంతపఱచుటచే రాజాగారు బందరునకు వచ్చిరి. అప్పుడు హాడ్జస్ దొరగారు తన కీయవలసి యున్న యప్పుల కన్నింటికి గలిపి మనయప్పారావుగారిచే నొకపత్రిమును వ్రాయించుకొనిరి. ఇంతలో ననఁగా 1781వ సంవత్సరములో సర్ తామస్ రంబోల్డు, మిస్టర్ వైట్‌హిల్‌గార్లు తమస్థానములనుండి తొలగింపఁ బడి నందున మదరాసు గవర్నరుగఁ దత్కాలమునకు నియమింపఁబడిన ఎ. సాడ్లియర్ (Mr. A. Sadleir) దొరగారు జమీందారుగారి విన్నపమును లండనుకు బంపిరి. అక్కడ కోర్టు ఆఫ్ డైరక్టర్సువారు తగుజాగ్రతతో నర్జీని విచారించుటకై తిరిగి గవర్నరుగారి కుత్తరు విచ్చిరి. ఇంతలోఁ గ్రొత్తగవర్నరుగ వచ్చిన లార్డు మెకార్ట్నె (Lord Mecartney) దొరగారియుత్తరువును స్వీకరించిరి. కాని యిప్పటికి చాల కాలాతీత మగుటచే నప్పారావుగారర్జీలవలనఁ బ్రయోజనము లేదని యెంచి, యంతకుఁబూర్వ మనఁగా 1783 వ సంవత్సరములోఁ దమ కోటరక్షణార్థమని కొంతసైన్యమును బోగుచేసికొను చుండిరి. అంత బందరునుండి కొంతసైన్యముతో మేజర్ జాన్సు దొరగారు బైలుదేరి కోటను ముట్టడించిరి. కాని పరాజయు లగుటచే మేజర్ లాసేజి (Major Lasage) దొరగారు

వీరికి సాహాయ్యులుగా వచ్చి కోటను బట్టుకొనిరి. ఈసందర్భములో మున్నూఱు ఱేబంద్రులుగల పరివారముతోఁ గోటను గాపాడు చున్న చెలి కాని వెంకయ్యగా రెంతయో ధైర్యోత్సాహములఁ జూపి వీరస్వర్గమం దిరి. జమీందారుగా రెట్లనో తప్పించుకొని నైజాము రాజ్యమునకుఁ బారిపోయిరి. అంత దొరతనమువారు నైజామువారితో జమీందారు గారిని బట్టియిచ్చువిషయమై సందేశములు జరుపుచుండఁగా జమీందా రుగారే రాజమహేంద్రవరములో నున్న దానియేలు (Mr. Danial ) దొరగారిని స్వయముగ వచ్చి దర్శించి "నా తిరస్కారమును మన్నించి యెప్పటియట్ల నాజమీ నా కొసఁగిన యెడల దిగఁబడిన కప్పము నంత యును దీర్చెద" నని విన్నవించిరి. దొరవారందులకు సమ్మతించి మొదటివాయిదాసొమ్ము చెల్లించినవెంటనే జమీని స్వాధీనపఱచిరి. అయినను రాజాగారు రెండవవాయిదాసొమ్మును జెల్లింప లేక పోయిరి. కావునఁ దిరిగి బాదరునుండి కేప్టన్ మాంటుగోమరి (Captain Montgomerie) దొరగారు కొంతసైన్యముతో నూజవీటికిబోయి యొక్క యహోరాత్రము విరామములేకుండ దుర్గరక్షకులతో సంగ్రామ మొనర్చి తుదకు గోటను సాధించిరి. ఈ రణరంగములో మూవు రుద్యోగీయులును నెనుబదిమంది సిపాయిలును హతులైరి. జమీందా రుగారు కోటనుండి మారువేషముతోఁ దప్పించుకొని పోయిరి. అంతఁ గోటగోడ లన్నియుఁ బగులఁ గొట్టఁబడెను.

మదరాసు దొరతనమువారు 1784 వ సం॥ నవంబరు నెలలో నరసింహాప్పారావుగారిని నూజవీటి సంస్థానము నుండి తొలఁగించితి మనియు, వారి జ్యేష్ఠపుత్రు లగు వేంకటనరసింహాప్పారావుగారిని జమీం దారుగ నియమించితి మనియుఁ బ్రకటించిరి. నరసింహాప్పారావు గారికి పెదవెంకమ్మ చినవెంకమ్మయను నిరువురుభార్యలు గల రని కొంద ఱందురు కాని పారసీకధరాధీశచరిత్రమునం దేవురుపత్నులు గల రని 'గీ॥ ఇట్టు లేవురఁ బెండ్లియై యెసఁగె నితఁడు' అనుపద్యపాద ము చెప్పుచున్నది. అందు మూఁడవభార్యయగు పెదవెంకమ్మగారి వలన వేంకటనారసింహాప్పారావుగారిని యైదవభార్య యగు చినవెంక

మ్మగారివలన రామచంద్రాప్పారావుగారు, నరసింహాప్పారావుగా రను సుతద్వయమును గాంచిన ట్లీదిగువపద్యములు నుడువు చున్నవి—

"తే॥గీ॥ రాఘవంశాబ్ధిపూర్ణ చంద్రప్రభాయ
మాన సూడవభార్య సన్మానచరిత
వేంకమాంబిక సకలసాధ్వీమతల్లి
యెలమి వేంకటనారసింహేంద్రుఁగనియె.

సీ॥ తే॥గీ॥ ......నారసింహాభూతలమహేంద్రు
నైదవవధూవరేణ్య పుణ్యాఖ్యగణ్య
వేంకమాంబిక చెలువొందు విభుత మెఱసి

సీ॥ అన్నారసింహేంద్రుఁ జత్తలోదరి యందు ......
తే॥గీ॥ రామచంద్రాప్పరాయభూరమణతిలకు
మఱి నృసింహాప్పరాయధీమహితుఁ గనియె."

ఈ కుమారత్రయములో వేంకటనారసింహాప్పారావుగారికి ధర్మాప్పారావుగా రనుసార్థకనామ మొుండు గలదు. వీరియశశ్చంద్రిక దశదిశవ్యాప్తమై నేఁటిదనుక మహోన్నతంబుగఁ గీర్తింపఁ బడు చున్నది. వీరికింగలభూతదయను దెలిసికొనుట కీక్రిందిపద్యద్వయమె చాలును—

"సీ॥ కొల్లేటిధరణి నెక్కొనుమహామశకవి
క్షతిజాతకండూతి గాఢపీడ
నలమటఁ జెంది యా యవనివృక్షవిహీన
యగుటఁ గండువు బాయ ననువుపడక
మహిషాదిసత్వముల్ మల్లడి గొను చుండఁ
బరికించి మది కనికరము వొడమి
నున్నతశిలల నా యుర్వి నం దందుల
నాటించి వాటి మైఁ దీట లుడిపె

తే॥గీ॥ సహహా వేంకటనారసింహాప్పరాయ
భూతలేంద్రున కెంతటి భూతదయయొ

యిమ్మహోదారుసత్కథ లెల్ల దినల
గాన మొనరించెదరు పుణ్యకరము లనుచు.
తే॥గీ॥ యాత్ర కై యేఁగుదెంచెను నాస్తిరాహ
సాధుజనులకు నారాజ చంద్రుఁ డపుడు
కలశములు వస్త్రములు మఱి కంబళములు
నొసఁగి మృష్టాన్నమిడి తృప్తి నొందఁ జేయు."

ఇఁకఁ జారిత్రాంశమునకు వత్తము. ఇట్లు ధర్మాప్పారావుగారును వేంకటనరసింహాప్పారావుగారు దొరతనమువారిచే సంస్థానపాలకులుగ నియమింపఁబడి రని చదివియుంటిరి గదా! పెదరాజాగా రగునరసింహాప్పారావుగారు భద్రాచలారణ్యంబులలోఁ జేరి జనుల కపాయకర మగునట్లు గ్రామములను దగలఁ బెట్టుచు, దోపిడి సేయుట మున్నగు విధముల శ్రమల గలిగింపఁ జొచ్చిరి. అంతఁ గంపెనీయుద్యోగీయులును విసికి, వీరితో సంధి జేసికొని 1785 వ సం॥ లో నూజవీడునందు వారి పుత్త్రులతోఁ గూడ నివసించుట కంగీకరించిరి. కాని యిట్లు దీర్ఘకాలము జరగ లేదు. యువరాజాగా రంతసమర్థులు గాక పిన్నవయస్కు లగుటచేఁ దండ్రిగారిని స్వాతంత్రము గలిగించుకొనకుండ నాప లేక పోయిరి. అంతఁ బెదరాజాగారు బందరునకు బిలిపింపఁబడిరి; అయినను రాజాగారు కొంద అనుచరులతోఁ జేఁగియుండుటచేఁ గంపెనీవా రాయనను దమయుద్దేశప్రకారము తొలుతఁ జెఱపెట్ట లేక పోయిరి. కాని తుదకుఁ గృతకృత్యు లైరి. ఈరాజాగారి పరిజను లెల్లరును జినవెంకమ్మారావుగారి పక్షమువా రగుటచే వీరు, పెదవెంకమ్మారావుగారిని, వారికుమారు లగు మన ధర్మాప్పారావుగారిని మిగులఁ గలవరపఱుచ సాగిరి. అందువలనఁ దఱచుగా వీరు బందరులో నివసింపవలసి వచ్చెను. ఇంతలో ననఁగా 1789 వ సంవత్సరములో నరసింహాప్పారావుగారు (పెదరాజాగారు) కొంతకాలము బందరునం దాలోచనసభలో ముఖ్యుఁడుగ నుండిన ఫ్లోయర్ (Mr. Floyer) దొరగారిపైఁ దేఁబడినఁ లంచపుకేసునందు సాక్ష్య మిచ్చుట కై మదరాసునకుఁ బోయి యచ్చటనే కాలధర్మము నొందిరి. ధర్మాప్పారావుగారిజనని యగు పెదవెంక

మ్మారావుగారు గతించిన భర్తయొక్క ప్రతిమతోఁ దాను సహగమన మొనరింప సంసిద్ధురాలయ్యెనుగాని యూరోపియా ప్రవర్గముయొక్కయు, దొరతనమువారియొక్కయు నిరోధకారణమునఁ గృతకృతురాలు గాఁజాల దయ్యెను.

రాజా వేంకటనరసింహాప్పారావుగారు బందరునుండి నూజవీటికి వచ్చి, తిరిగి సంస్థానమున కంతకును జమీందారుగఁ బ్రకటింపఁబడరి. చినవెంకమ్మగారుకూడ 1792 వ సం॥లో దేహయాత్రను విరమించిరి. కావున ద్వితీయసోదరుఁడగు నరసింహాప్పారావుగారు మన ధర్మాప్పారావుగారి పోషణమునకే వచ్చిరి. చినవెంకమ్మగారి ప్రథమపుత్రులగు రామచంద్రాప్పారావుగారు, తండ్రిగారియనంతరమున నన్నగారగు వేంకటనరసింహాప్పారావు (ధర్మాప్పారావు) గారికి కొంత యుపద్రవమును గలిగింప సాగిరి. అందువలనఁ దిరిగి వీరు బందరు ప్రవేశింపవలసివచ్చెను. రామచంద్రాప్పారావుగారును, వారి జననిగారి పరిజనమును, జాం మహాల్ జమీనుండి వచ్చి చేరిన కమదనపు వేంకట్రాయణంగారును గలిసి జరిగించుకల్లోలములు నణచుటకై లెప్టినెంటు హింగింబాతం దొరగారును, పిదప కల్నల్ ప్రైస్‌దొరగారును గొంత కృషిచేసిరి; కాని గోదావరిమండలమునందును గొన్ని కల్లోలములుండుటచేతను, టిప్పుసుల్తానుతో నాకాలమందే యుద్ధములు తటస్థించుటచేతను బందరు కౌన్సిలువారు రాజాగారికి విశేషసాహాయ్యము జేయ లేక, రామచంద్రాప్పారావుగారిని, లోఁబడిన వారిసైనికులను మన్నించి నట్లు ప్రకటించిరి. అంత రామచంద్రాప్పారావుగారు తమ యనుచరుల నెల్లరఁ దగ్గించి, తగుపాటిపరిజనముతో నూజవీడునకు వచ్చిరి; కాని తమతండ్రిగారు సంస్థానములో సగము భాగము తమకుఁ బంచి యిచ్చునట్లు మరణశాసనమును (Will) వ్రాసి యిచ్చిరని యట్లు జరిగించుటకై దొరతనమువారిని బలాత్కరించు చుండిరి. తుదకదియు నిష్ప్రయోజన మగుటను దెలిసికొని నాఁటనుండి జమీకేవిధమయిన కలవరమును గలిగింప కుండిరి.

1792-93 సంవత్సరములలో దారుణ మైనక్షామబాధ దేశము నందు ప్రబల మయ్యెను. జమీందారుగా రగు రాజా వేంకటనర సింహాప్పారావుగారు బొక్కసము నిండించుట కంతగా శ్రద్ధ వహింపక పోవుటచేతను, ధర్మకార్యపరతంత్రులై యాదాయవ్యయముల నంతగా గణింపకుండుటచేతను దదితరకారణములచేతను దొరతనమువారికి చెల్లింప వలసినకప్పము (పేష్కష్) నిలిచిపోయెను. ఈహేతువులచే జమీ 1793 సం॥ జులై 22వ తేదిని దొరతనమువారి పాలనములోనికి దీసికొని పోఁబడెను. ఇట్లు కొంతకాలమువఱకు దొరతనమువారు, వేంకటనరసింహాప్పారావుగారికిని, రామచంద్రాప్పారావుగారికిని గొంత మనువృత్తి (Allowance) నిచ్చుచు, సంస్థానమును దమ యేలుబడిలో నుంచుకొనిరి. ఇంతలో రామచంద్రాప్పారావుగా రెట్లనో యగ్రజు లగువేంకటనరసింహాప్పారావుగారిని లోఁబఱచుకొని, జమీ తిరిగి స్వాధీన మగునెడల విభజనమున కంగీకరించున ట్లొనర్చిరి. 1800 వ సంవత్సరములో దొరతనమువారు, సంస్థానమును దదధీశుల కీయ నిశ్చయించి కొందఱుకలెక్టరుల యభిప్రాయము లడుగఁగా వారు విభజనమున కంతగా నంగీకరింప రైరి. కాని సెప్టెంబరు 11 వ తేదీని కోర్టు ఆఫ్ డైరక్టర్సువారికి తమ యధీనములో నున్న జమీని దిరిగి జమీదారులకిచ్చుటనుగుఱించి-పేష్కష్ చెల్లింపలేకపోవుటచేజమీతీసి కొనఁబడినది. కానిదొరతనమువారిపైతిరగబాటుమున్నగుకారణములచేఁ గాదని స్థిరపడుచున్నదనియు; దొరతనమువారు జమీపై జమీందారుల కధికారము పోయిన దని యెచ్చటను జెప్పి యుండలేదనియుఁ, గావున జమీని దిరిగి జమీదారున కొప్పగించుట కేవిధ మైనయభ్యంతరము లే దనియు వ్రాసిన బ్రేన్ఫిల్ (Mr. Branfil) దొరగారు సంస్థానవిభ జనమునుగుఱించి రామచంద్రాప్పారావుగారికి కొంతభాగ మిచ్చినఁగాని లేక యస్వతంత్రునిగఁ జేసినఁ గాని కల్లోలము లడఁగఁ జాల వని చెప్పిరి. రీడ్. (Mr. Read) దొరగా రాకారణముసఁ గాకపోయినను సంస్థాన మును విభజించుటయె యుచితమని యభిప్రాయము నిచ్చిరి. ఈ యభి మతమునే దొరతనమువా రంగీకరించిరి. మఱియు సంస్థానవిభాగమునకు

మూఁడవ జార్జిగారి 24 వ చట్టముయొక్క 25 వ యధ్యాయము (Chapter 25 Statute 24 of George III) కొంతసాహాయకారి యయ్యెను. కావునఁ బూర్వోక్తకారణంబులచే సంస్థానమును విభజించి యొసఁగఁ గృతనిశ్చయులై దొరతనమువారు పరిపాలనాసౌకర్యార్థమై యింతకుమున్న సంస్థానమును విడదీసి రీడ్ (Mr. Read) దొరగారి యధీనములో నుంచఁబడిన యేలూరు సర్కారులోని పంద్రెండు పరగణాలకు నిడదవోల్ సంస్థాన మనుపేర రాజా వేంకట నరసింహాప్పారావు గారికిని బ్రాన్‌ఫిల్ (Mr Branfil) దొరగారి యధీనములో నుంచఁబడిన కొండపల్లిసర్కారులోని యేఁబదిపరగణాలకు నూజవీటిసంస్థాన మనుపేర రాజా రామచంద్రాప్పారావుగారికిని 1802 వ సంవత్సరపు రెగ్యులేషన్ ఆక్టు ననుసరించి పట్టాల నొసంగిరి. విస్తీర్ణమునందు నిడదవోలుసంస్థానము నూజవీటిసంస్థానమున కంటె రెట్టింపుగ నుండినను నాదాయమునందు రెండును సమానముగనే యుండెను. కనిష్ఠు లగు నరసింహాప్పారావుగారు బాలురై నందున వారి కేమియుఁ దత్కాలమున కొసఁగఁ బడి యుండ లేదు. దొరతనము వారు తమకు రావలసిన కప్పమును వదలుకొనుటచే 1803 వ సం॥లో వారివారి సంస్థానముల కధీశులై నప్పుడు బాకీచిక్కు లేమియు లేక యుండెను. ప్రథమమున నెంత యుద్రేకమనస్కులై యుండిరో పిమ్మట నంత శాంతమనస్కులై శ్రీరాజా రామచంద్రాప్పారావుగారు తమపాలనములో నున్న నూజవీటిసంస్థానమును బ్రజామోదకరంబుగఁ బాలించుచు నభ్యున్నతస్థితికి వచ్చిరి.

తృతీయసోదరు లగునరసింహాప్పారావుగారిని గుఱించి యిచ్చటఁ గొంతచెప్పవలసియున్నది. వీరు కొంతకాలమువఱకు నన్నగా రగు రామచంద్రాప్పారావుగారితో నేకలిసిమెలసి యుండిరి. కాని 1805వసం॥న నూజవీడుసంస్థానమునందును, ధనాదులందును నర్ధభాగము తనకు రావలసి యున్న దని మండలన్యాయసభ (District Court)లో నొక యభియోగమును దెచ్చిరి; కాని వారిబాధ్యతల నిరాకరించి కోర్టు వారు 1809 జనవరి నెలలోఁ గొంత మనువృత్తిని మాత్ర మిచ్చున

ర్లేర్పాటు చేసిరి. అందుమీఁద రామచంద్రాప్పారావుగారు ప్రొవిన్షల్ కోర్టున కప్పీలు చేయుఁగాఁ గోర్టువా రీమనువృత్తినే కొంత తగ్గించిరి. అందునకుఁ దృప్తిలేక నరసింహాప్పారావుగారు 1811వ సం॥లో సాదరు కోర్టున కప్పీలు చేసికొనిరి. అం గుభయసోదరులమీఁదను దేఁ దగిన వ్యాజ్యము నొక్కసోదరునిమీఁదనే తెచ్చుటచే నీమనువృత్తినిగూడ నియరా దని తీర్మానింపఁ బడెను. దైవబలము చాల నప్పు డన్నియు నిటులనే వచ్చును గాఁబోలు! అంతఁ దిరిగి నరసింహాప్పారావుగా రుభయసోదరులమీఁదను బూర్వ సంస్థాన మంతటిలోను మూఁడవభాగము నకై దావాను దీసికొని రాఁగా 1817 వ సం॥లో సోదరు లిరువురును దమతమసంస్థానములలో మూఁడవభాగమును ద్వితీయసోదరున కిచ్చు నట్లు ప్రొవిన్షల్ కోర్టువారు తీర్మానించిరి.

మొదటిమనువృత్తినే తగ్గించినకోర్టువా రిప్పుడు భాగమునకే యనుజ్ఞ నిచ్చిరి. ఈ తీర్మానముప్రకారము జరిగిన యెడల నెట్లుండెడిదో! ఏల యన— రామచంద్రాప్పారావుగారికి వచ్చిన మూఁడవవంతుభాగములోఁ దిరిగి మూఁడవవంతును సోదరున కిచ్చినయెడలఁ బూర్వ సంస్థానములో వారిభాగము ( $\frac{1}{3} \times \frac{1}{3} = \frac{1}{9} \therefore \frac{1}{3} - \frac{1}{9} = \frac{2}{9}$ ) తొమ్మిదింట రెండువంతులై యుండును. నరసింహాప్పారావుగారి కీ తొమ్మిదవ భాగమే కాక యగ్రసోదరునివలన వచ్చెడి ( $\frac{2}{3} \times \frac{1}{3} = \frac{2}{9}$) తొమ్మిదింట రెండుభాగములును గలిసి మొత్తము ( $\frac{1}{9} \times \frac{2}{9} = \frac{3}{9}$ or $\frac{1}{3}$) తొమ్మిదింట మూఁడుభాగములై యుండును. అనఁగాఁ బ్రథమసోదరునకుఁ ( $\frac{2}{3} - \frac{2}{9} = \frac{4}{9}$ ) తొమ్మిదింట నాలుగుభాగములును, ద్వితీయసోదరునకు రెండుభాగములును దృతీయసోదరునకు మూఁడుభాగములును నగును.

1802 వ సం॥లో దొరతనమువారిచేఁ జేయఁ బడిన విభాగమును గ్రిందికోర్టులవారు మార్చుట కేవిధ మైన యధికారమును లే దని చెప్పుచుఁ బై తీర్మానమును 1819 వ సం॥లో సాదరుకోర్టువారు గ్రొట్టిసి వేసిరి. ఇఁకఁ జేయవలసిన దేమి? ప్రీవి కౌన్సిలున కప్పీలు చేసికొనుట కెంతయో ధనము కావలసి యుండును. కావున నరసింహాప్పారావుగారు

నిష్ఫలమనోరథులై యూరకుండవలసి వచ్చెను. గవర్నరైన సర్ తామస్ మన్రోగారు పురాతనపు జమీలను విభాగించుటకు లాకోర్టు వారికి స్వతంత్రము లుండఁగూడదను ధృఢాభిప్రాయము గలవారయి 1802 వ సం॥లో జరిగినవిభాగమునందే కొంత యాధారమును దొరతనమువారు చూపింపవలసిన దనియుఁ, గ్రిందికోర్టుల కెక్కుడు స్వాతంత్ర్యము లుండఁజాల వనియుఁ జెప్పుచు వీరికిఁ దటస్థించిన దుస్థితికి తమకుఁ గలసంతాపము మాత్రము వెలిబుచ్చిరి.

1814 వ సం॥ నవంబరు 20 వ తేదీని రాజా రామచంద్రాప్పారావుగారు స్వర్గస్థులైరి. వీరికి సుబ్బమ్మగారు, సీతమ్మగా రనునిరువురుభార్యలు గలరు. వీరిలో—"సీ॥ రామచంద్రమహీపుఁ డందరుం డలసీత మాంబికయందు...... గీ॥ శోభనాద్ర్యప్పరాయ భూసురవిధేయుఁ గనియె......" సీతామాంబవలన శోభనాద్ర్యప్పారావుగారు జన్మించిరి. వీరి మొదవ యేటనే రామచంద్రాప్పారావుగారు స్వర్గస్థులైరి. అందువలన నూజవీడుసంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సువారి సంరక్షణమునకుఁ దీసికొని పోఁబడెను. వార్ధకదశయందుండిన రాజా వేంకటనరసింహాప్పారావుగారు కనిష్ఠసోదరద్వితీయపుత్రు లగు నారయాప్పారావుగారిని దత్తపుత్రునిగ స్వీకరించిరి; కాని కొలఁదికాలములోనే (1827 జూన్ 5 వ తేదీని) వారును స్వర్గస్థు లగుటచేతను దత్తపుత్రు లగు నారయ్యాప్పారావుగారు బాలు రగుటచేతను విడదవోలుసంస్థానముకూడ కోర్టు ఆఫ్ వార్డ్సువారి సంరక్షణమునకుఁ బోయెను.

ఈసమయములోఁ గ్రిందికోర్టుల స్వాతంత్ర్యమున కిష్టము లేనట్టియు నరసింహాప్పారావుగారి మనువృత్తి లేమికి సంతాప మందినట్టియు మన్రోదొరగారు నెలకు రు 800 ల చొప్పున నరసింహాప్పారావుగారి కిచ్చి సొమ్ము నంతయుఁ జివరకు సంస్థానధనాగారము నుండి తీసికొనున ట్లొకపద్ధతి నేర్పఱచిరి. కాని తుద కదియు నెఱవేరినదికాదు. కోర్టు ఆఫ్ డైరక్టర్సువారెట్టకేలకు మొదట నిర్ణయింపఁబడిన రు 800ల మనువృత్తిని మాత్రము స్థిరపఱచిరి. అయినను నరసింహాప్పారావుగారు

స్వల్పకాలములోనే గతించుటచే వారి యిరువురుపుత్రులకు సన్నాలు రూప్యములచొప్పున నొసఁగఁ బడెను.

నిడదవోలుసంస్థానాధీశు లగు రాజా నారయ్యాప్పారావు గారును, నూజవీటిసంస్థానాధిపతు లగు రాజా శోభనాద్ర్యప్పారావు గారును బాలనాశ్మవయస్కు లగుటచే 1831 వ సంవత్సరము మార్చి యొకటవ తేదీని నూజవీడుసంస్థానమును, 1835 వ సంవత్సరమున నిడద వోలుసంస్థానమును దదధీశుల కొప్పగింపఁ బడెను. ఆసంవత్సరము లోనే యనఁగా 1835 వ సం॥ లో మనదేశము నుండి ప్రయాణము సేయుచుండిన గవర్నరగు సర్ ఫ్రెడరిక్ ఆడమ్ (Sir Frederick Adam) దొరగారి ప్రేరేపణచే నరసింహాప్పారావుగారి పుత్రులును, సన్నాలు రూప్యములమనువృత్తి నొందు చున్నవారును నగు సింహాద్ర్యప్పా రావుగారు, వేంకటాద్ర్యప్పారావుగారు నను నిరువురుసోదరులకుఁ బూర్వము నూజవీటిసంస్థానమునకుఁ జెంది యుండి తత్కాలమున దొర తనమువారి యధీనములో నుండిన 'రావిచెర్ల, శ్రీరామవరము 'అను రెండుగ్రామములు 1840 వ సంవత్సరములోను, నిడదవోలునూజవీడు సంస్థానాధిపతు లీయ నంగీకరించి యున్న ధనరూప మగుమనువృత్తికి మారుగఁ దంగెళ్ళమూడి, చేవెంద్రముతాలు 1846 సంవత్సరములోను లభ్యము లయ్యెను. (1868 వ సం॥ లో శ్రీరామవరమునకు మాఱుగఁ 'జనుబండ' యనుగ్రామ మొసఁగఁ బడెను.) ఇప్పుడు చెప్పఁబడిన సింహాద్ర్యప్పారావుగారును, వేంకటాద్ర్యప్పారావుగారును నరసింహా ప్పారావుగారి ప్రథమ తృతీయపుత్రు లగుదురు. ద్వితీయపుత్రు లగు నారయప్పారావుగారు నిడదవోలుసంస్థానాధీశు లగు వేంకటనరసింహా ప్పారావుగారిచే దత్తస్వీకార మొనరించుకొనఁబడి రని చదువరు లిది వఱకే చదివి యుండిరిగదా! సోదరు లిరువురలో సింహాద్ర్యప్పారావు గారు 1863 వ సంవత్సరములో నపుత్రకులుగ స్వర్గాభిముఖు లగు టచే వీరివంతునకు రాఁబడిన తంగెళ్ళమూడియెస్టేటు వీరి దౌహిత్రు లగు వేంకటగిరిమహారాజాగారికి లభ్యమయ్యెను. వేంకటాద్ర్యప్పారావు గారు చేవెంద్ర, రావిచెర్లముతాల కధీశు లయిరి. మఱియు వీరి

పుత్రరత్నము లగు శ్రీ శ్రీ రాజా పార్థసారథ్యప్పారావు సవై అశ్వారావు బహాదరుగారు మాతామహుల యాస్తియగుభద్రాచలము, పాలవంచ యెస్టేటులనుగూడ సంపాదించి యఖండైశ్వర్యముతో విరాజిల్లు చుండిరి.

ఇంత నిడదవోలుసంస్థానాధిపతులగుఱించి యించుక వివరించి పిదప నూజవీడుసంస్థానమునకు వచ్చెదము. అట్లు దత్తస్వీకారు లయిన నారయ్యాప్పారావుగారు 1864 వ సం॥ డిశంబరు 7 వ తేదీని బరమపద మందిరి. వీరికి పాపమ్మారావుగారు చిన్నమ్మారావుగారను నిరువురుపత్నులు గలరు. వీరు కొంతకాలము కలసియే రాజ్యపాలన మొనరించిరి కాని 1881 వ సం॥ ఏప్రిల్ 15వ తేదీని రాణీచిన్నమ్మారావుగారు లక్ష్మీసాన్నిధ్యము జేరిరి. అంతటఁ బాపమ్మారావుగారు 1831 వ సంవత్సరమున నూజవీడు సంస్థానాధిపత్యమును స్వీకరించిన శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారి సప్తమపుత్రులును, మేడూరుసంస్థానమున కధిపులుగా నున్నవారును నగు వేంకట్రామయ్యాప్పారావుగారిని, వీరియనంతరమున వీరిపుత్రు లగు నారయ్యాప్పారావుగారిని దత్తస్వీకార మొనరించుకొనిరి. వీరును రాణీగారిజీవితములోనే (1895 సం॥ అగష్టు 4 వ తేదిని) గతించిరి. మఱి నాల్గుసంవత్సరముల కనంగా 1899 సం॥ డిశంబరు 5 వ తేదీని నీమెయుఁ దనజీవయాత్రను విరమించుటచే నిడదవోలుసంస్థానమువారి వారసు లగు శ్రీరాజా పార్థసారథ్యప్పారావుబహద్దరుగారికిని, శోభనాద్ర్యప్పారావుగారిద్వితీయతృతీయపుత్రు లగు శ్రీరాజా రంగయ్యాప్పారావుబహాదరు శ్రీరాజా వేంకటనరసింహాప్పారావుబహాదరు గార్లకును సమానభాగములుగఁ బంచిపెట్టఁబడెను. ఈతుదివా రిరువురును వ్యాజ్యమధ్యముననే స్వర్గస్థులగుటచే నీరెండుభాగములు శ్రీరాజారంగయ్యాప్పారావుగారి స్వీకృతపుత్రులగు శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరు గారికిని, శ్రీరాజా వేంకటనరసింహాప్పారావుగారిపుత్రులగు శ్రీరాజా వేంకట్రామయ్యాప్పారావు, శ్రీరాజాపార్థసారథ్యప్పారావుగార్లకును లభిం

చెను. అంతటనుండి నిడదవోలుసంస్థానమనునామ మదృశ్య మయ్యెను. ఇఁకఁ బ్రస్తుత మనుసరింతము.

శోభనాద్ర్యప్పారావుగారు నూజవీడుసంస్థానాధిపతు లసియింతకుమున్నె యెఱుంగుదుముకదా! వీరు మిగుల భాషాభిమానులని శ్రీరాజాగారి ప్రేరణముచే రచింపఁబడిన ‘పల్లవీపల్లవోల్లాస’ మను ప్రబంధమే ప్రబలసాక్ష్యము. శ్రీరాజాగారు పండితపక్షపాతు లను ప్రఖ్యాతిని గాంచిరి; కాని ధనార్జనాసక్తులు గాకపోవుటచే రాజ్యారంభకాలమునఁ బహునాల్గులక్షల యాదాయమును గలిగియుండి తుదకాఱులక్షల ఋణమునకుఁ బాలయిరి. ఈ శోభనాద్ర్యప్పారావుగారు 1868 అక్టోబరు 28 వ తేదిని బరలోకప్రాప్తు లైరి. వీరికి సుబ్బమాంబగారు, రమణమాంబగారను నిరువురుభార్యలు గలరు. సుబ్బమాంబిక యందు—

“సీ॥ ఆసుబ్బమాంబిక • యందు దల్లశ్రీశోభ
నాద్ర్యప్పరాయ ధ•రాధనాథుఁ
డనఘు నారయ్యధ•రాధిశు రంగభూ
నాథు జగన్నాథ•నరవరేణ్యు
వెంకటనరసింహా•విభు వేంకటాద్రినృ
పాలు సింహాద్రిభూ•నాథతిలకు
వెంకటరామకృ•ష్ణనాథుఁ డనియెడు
నేన్వురుసుతులఁ ము•హీంద్రనుతులఁ
తే॥గీ॥ దతసురాహారహారహా•రసితసితాభ్ర
హీరతారాగతారేశ•సారతరసు
పర్వరాడర్వకరిగర్వ•ధూర్వహప్ర
శస్తకీర్తులఁ గనియె స•త్సమితి వొగడ.”

ఈపద్యమునందుఁ బేర్కొనఁబడిన యేనుగురుసోదరులలోఁ దురీయులగు వేంకటనరసింహాప్పారావుగారు తండ్రిగారు గతించిన మొదటినెలకే యనఁగా 1868వ సం॥ నవంబరు 30వ తేదీని సంస్థానమును

విభాగించుటకై దొరతనమువారి కొకవిజ్ఞాపనమును బాపుకొనిరి. కాని యది నిరాకరింపఁ బడెను. తిరిగి 1871 నవంబరు 2వ తేదిని, నిలువ యున్న యాస్తియంతటిలోను, సంస్థానములోను దనయొక్కభాగమునకై సోదరు లందఱిమీఁద నొకదావాను దెచ్చిరి. ఇట్లు దావాను దెచ్చుటకు వారి కనేకాధారములు గనిపించు చుండెను. ఇదివఱకనఁగా 1802వ సం॥లో సమానముగఁ గాకపోయినను నిడదవోలు నూజవీడు అను రెండుసంస్థానములుగ విభజింపఁ బడు టొకటి. 1840-46 సం॥లలోఁ గనిష్ఠసోదరు లగు నరసింహాప్పారావుగారి బాధ్యత (హక్కు) లను నిరాకరింపక, వారివంశపారంపర్యముగ నుండునట్లు కొన్ని గ్రామము లీయఁబడుట మఱి యొకటి. ఇంతియకాక తమ తండ్రిగా రగు శోభనాద్రియప్పారావుగా రొకానొక కారణమున 1866వ సం॥లోఁ దమయార్గురుతనయులకు సంస్థానమును సమముగాఁ బంచి యిచ్చెద నని తమయభిప్రాయమును వెలిబుచ్చినట్లు చెప్పు కారణ మింకొకటి. ఇత్యాదికారణములను బురస్కరించుకొని యీవ్యాజ్యము దేఁబడెను. ఈదావా కృష్ణాజిల్లాకోర్టులో విచారింపఁబడి 1802 సంవత్సరములో జరిగినవిభాగకారణమున మాత్రము పూర్వమునుండి వచ్చుచున్న పద్ధతిని మార్ప నవకాశములే దని జె. సి. హెనింగుటన్ (J. C. Hannington) దొరగారిచే 1873 సం॥ ఆగస్టునెలలోఁ దీర్మానింపఁబడెను. అంత హైకోర్టున కప్పీలు చేసికొనఁగా న్యాయమూర్తులగు సి. జె. మార్గన్ (C. J. Morgan), హాలోవె (Halloway), జె. జె. ఇన్నిసు (J. J. Innes) దొరలును బైవిధముననే నిరూపించి త్రోసివేసిరి. ఈకాలమునందే మిగిలినసోదరులలో ముప్వురు 1873వ సం॥ ఫిబ్రవరి 6వ తేదిని దమతమభాగములకై మఱియొకదావాను దెచ్చిరి. 1877వ సం॥లో కృష్ణామండలన్యాయాధిపతి యగు హెచ్. జె. స్టోక్సు (H. J. Stokes) దొరగా రిదివఱలో నాల్గవవారిదావాను గొట్టివేసిన హెనింగ్టన్ దొరగారివలెనె యీముప్వురిదావాలనుగూడఁ గొట్టివేసిరి. అంత వీరు హైకోర్టున కప్పీలుచేసికొనఁగా నచ్చటఁ గూడఁ గ్రిందికోర్టుతీర్పుప్రకారమె 1879వ సం॥ జనవరి 31వ తేదీని దీర్మానిం

పఁబడెను. ఇంతలోఁ జతుర్థసోదరు లగు వేంకటనరసింహాప్పారావుగారు శ్రీవిక్టోరియాచక్రవర్తిని గారికిని, వారిసభ్యులకును దిరిగి యప్పీలు జేసికొనిరి.

ఈసందర్భములో నతికొన్ని ముఖ్యవిషయములను జెప్పవలసి యున్నది. 1874వ సంవత్సరములో గౌరవనీయు లగు సర్ వాల్టర్ మార్గన్ (Honourable Sir Walter Morgan) అను ముఖ్యన్యాయాధిపతిగారు ఆర్. ఏ. నం 36 రు మదరాసు హైకోర్టుతీర్పులో.........“బ్రిటిషుపాలనము రాకముందే నూజవీడు సంస్థానము (యుద్ధముచేయుటకు గాను) మిలటరీజాగిరుగ నొసఁగఁబడిన” దని నుడివిరి. న్యాయమూర్తి హాలోవే (Justice Holloway) దొరగారు — “ఇది మిక్కిలి ప్రాచీన మైనవానిలో నొకటి. ఈసంస్థాన ముత్తరసర్కారులు బ్రిటిష్‌వారికి రాక ముందే వీరిపూర్వీకుల యధీనములో నుండెను. మనకు లభింపఁగల చరిత్రాంశములవలన వీరు నైజాముగారి కొల్కొండ కసమయమున సామంతులుగను, నతికొన్ని సమయములందు స్వతంత్రులుగను నుండి” రని నుడివిరి. గౌరవనీయు లగు న్యాయమూర్తి ముత్తుస్వామయ్యరుగారు తమ 1877వ సం॥ ఆర్. ఏ. నం 121 రు మదరాసు హైకోర్టుతీర్పులో “ఈజమీ ప్రాచీన మయిన దనుటకు సంశయము లేదు. ఈవిషయ మై యేవిధ మైన వివాదమును లేదు. ఈజమీ యన్నివిధములచేతను బహునేనిమిదశతాబ్దము నకుఁ బూర్వము గాకపోయినను దచ్ఛతాబ్దారంభమునం దైన నుండిన దగును. కొన్ని నిదర్శనములను బట్టి చూడఁగా నిది మిలటరీజాగీ రనుట నిస్సంశయ మని చెప్పక తప్పదు. ఈసంస్థానము బ్రిటిష్‌పాలనమునకు రాకముందే యది తత్కాలమునం దొసఁగఁబడి నట్టిదియో లేక యంతకుబూర్వమె యొసఁగఁబడి యప్పుడు స్థిరపఱుపఁబడి నట్టిదియో యైన మిలటరీజాగీ రై యున్నది.” అని తీర్మానించిరి ప్రీవీకౌన్సిలువారి తీర్పులోఁగూడఁ బై విషయము నే స్థిరపఱచుచు.........“నూజవీడుసంస్థానము మిలటరీజాగీరుగ నుండినట్లును, స్వతంత్రాధికారముగల జమీందారులచేఁ బాలింపఁబడు చుండి నట్లును, బ్రిటీషువారి యధీనముక్రింద దాని మిలటరీ స్వభావము పోయి కప్పము జెల్లించునట్టి జమీగ నేర్పడినట్లును స్థిర మగుచున్న” దని నుడివిరి. ఇఁకఁ బ్రస్తుత మనుసరింతము.

వేంకటనరసింహాప్పారావుగారు తమదావాను శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారి కప్పీలు చేసియుండిరికదా! అందుమీఁద 1879 సంవత్సరమున విచారణ ప్రారంభ మై మండలన్యాయాధిపతులచేతను, నున్నత న్యాయస్థానాధిపతులచేతను (High Court Judges) తీర్మానింపఁబడిన తీర్మానములు ప్రీవీకౌన్సిలువారి కంతగా నచ్చకపోవుటచే 1879వ సం॥ డిశంబరు 13వ తేదిని; ఈసంస్థానము 1802వ సం॥లో

జరిగినవిభాగమువల్లనే దానిపూర్వపు యవిభక్తస్వభావము పోయి విభజనీయ మైన దయ్యె ననియు, నిదియు హిందూధర్మశాస్త్రాను సారముగనే యుండుననియుఁ దీర్మానించిరి. ఈతీర్మానానుసారముగ రాజా శోభనాద్ర్యప్పారావుగారి తనయులలోఁ బ్రతివారును దమతమ భాగముల కధీశు లైరి. ఋణములుగూడ భాగింపఁబడెను. అంత 1880వ సం॥లో మండలన్యాయాధిపతిగారు కలెక్టరుగారికి సంస్థానమును విభాగింప ననుజ్ఞ నిచ్చిరి. పాలనార్హవయస్సులో లేని యగ్రసోదరతనయులముఖ్యరను నీ సుస్థితినుండి తొలఁగింపఁ గొంత ప్రయత్నించిరి. అందువలన నీముఖ్యరకు సంస్థానములోని సమభాగముతోఁ బాటు మఱికొంతద్రవ్యరూపమునఁ గూడ నొసఁగఁబడెను తృతీయ సోదరు లగు జగన్నాథాప్పారావుగారు తండ్రిగారిజీవితములోనే యవివాహితులుగ నుండి స్వర్గస్థు లై నందున మిగిలిన సోదరపంచకమునకు సమభాగములుగ సంస్థానమును ద్రవ్యాదులును బంచిపెట్టఁబడెను.

కొండొకకాలమునఁ గృష్ణాజిల్లాకలెక్టరుగను, రెవిన్యూబోర్డునందుఁ బ్రథమసభ్యుఁడుగను నుండిన జార్జి తార్నహిల్ (George Thornhill) దొరగారిచే......"కృష్ణాజిల్లాయందుఁ గల సంస్థానముల కన్నింటిలోను నూజవీడుసంస్థానము మిగుల ఘన మైనది. ఉత్తరసర్కారు లందు దీనితో సమానము లయినవి చాల యరు" దని కొనియాడఁబడిన నూజవీడుసంస్థాన మిట్లు—(1) వెంట్రప్రగడ (2) ఉయ్యూరు (3) మీర్జాపురము (4) కపిలేశ్వరపురము (5) తేలప్రోలు (6) మేడూరు అను నామములచే నాఱుసంస్థానములుగ విభాగింపఁబడెను. ఇఁక నొక్కొక్కసంస్థానమును గుఱించి ప్రత్యేకప్రత్యేకముగ వివరించెద.

---

## 1 వెంట్రప్రగడ.

శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారి పుత్రసప్తకములో శ్రీరాజా నారయ్యప్పారావుబహదరుగా రగ్రజులు. వీరు తమతండ్రిగారియనం

తరమునఁ దా మగ్రకుమారుల మఱియు, నూజవీటిసంస్థాన మంతయుఁ దా మొక్కరే పాలింపవలసినవా రనియు దొరతనమువారికి 1868 వ సం॥ డిశంబరు 10 వ తేదీని 134 నెంబరు గల విన్నపముద్వారా తెలియఁబఱచి తమపేరిటనే సంస్థానమున కంతకును నధిపులుగ రిజిష్టరీ చేయించుకొని పాలింపఁ దొడఁగిరి. వీరు దొరతనమువారి పేష్కష్ సరిగఁ జెల్లించుటలోను, నొకానొకప్పుడు చెన్నపురిరాజధానిలో జనాభాను గణితిజేయుసందర్భమున దొరతనమువారికోరికపైఁ దమ యుద్యోగీయులఁ బంపి సాహాయ్యపడుటలోను వీరు దొరతనమువారి మన్ననలకుఁ బాత్రు లైరి.

వీరిపరిపాలనాదినంబులలో దేశమునందు దారుణమగు క్షామము దటస్థించుటచే బీదలఁబోషింప నదియ యదను నని వారికి పనిపాటలు గల్పించుటకును దేశక్షేమముకొఱకును గ్రామమునఁ జెఱ్ఱువులు త్రవ్వించి గ్రామస్థు లది వఱకు ముఖ్యముగ వర్షఋతువున సరియైన మార్గములు లేకపోవుటచేఁ బడు చున్న బాధలను దొలఁగించిరి. దీన బీదలకుఁ బనిపాటలు గలిగి యన్నోదకములకొఱత దీరెను. ఆదినములలోనే యాగిరిపల్లియందుఁ గల శ్రీశోభనాచలస్వామివారియుత్సవ దినంబులలోఁ గొండపై కెక్కుటకును దిగుటకును నను వగు నట్లు దాదాపుగ మూఁడువేల సోపానములను గట్టించిరి. ఇట్టిసంస్కార ముల నెన్నిటినో కావించిరి. ఎన్ని చేసినను వీరిపాలనము జనులకు గంటకముగ నుండి నట్లు తెలియవచ్చెడిని. ఏల యన, వీరు పాలన మునకు వచ్చుటయు తడవుగ నూటికి ముప్పదిరూప్యములవంతున శిస్తు నెక్కువ జేసిరి. అందువలన రైతులలో సంక్షోభము పుట్టెను. మేడూరు, ఉయ్యూరుపరగణాలరైతులు తమ పితృపితామహులనాఁ టినుండి యున్న శిస్తునే యిత్తుము కాని యిట్టి హెచ్చుశిస్తు నీయఁజాల మని దీర్ఘకాలము నూజవీటియందే నివసించి మొఱబెట్టుకొన సాగిరి. కాని వీరిమొఱ యరణ్యరోదన మయ్యెను. అంత రైతు లందఱు రెండు సంవత్సరములవఱకు వ్యవసాయము సేయక మిన్నకుండిరి. అంత రాజాగారు క్రోధచిత్తు లై తమ తండ్రిగారిప్రభుత్వకాలమునుండి

రైతులు బాకీపడి యున్న శిస్తును గూర్చి లెక్కలను గనఁబఱచునటులఁ దమయెస్టేటునఁ గల 288 గ్రామములకరణములను బిలిపించి, నూజవీటనే వారిని నివసింపఁ జేసి లెక్కలను బరిశీలింప నారంభించి ప్రాఁతబాకీలను, గట్టుకట్టిన రెండుసంవత్సరములశిస్తుబాకీలను జేర్పగా నొక్కొక్కరైతు కొన్నివందలవరకు నియవలసివచ్చెను. ఈద్రవ్యమును రైతులసొత్తు నంతయు వేలమువేయించి మిక్కిలి నిర్దయతోఁ రాఁబట్టుకొనిరి. రెండులక్షలు జెల్లు సంస్థానమునకు క్రొత్తపద్ధతివలన నేడులక్షలరూప్యములవఱకును జెల్లునట్లయ్యెను. ఈలెక్కలను బరిశీలించుటచే దీర్ఘకాలము పట్టుచుండినందునఁ గరణములు తామింక నందుండుట కష్టమని విన్నపములను వ్రాసికొన సాగిరి. వారిలో నొకరిట్లు మనవి జేసికొనిరి:—"క॥శీతజలస్నానంబును। భూతలశయనంబు వంట♦పూటశనంబుక్। నాతిగలబ్రహ్మచర్యము। నాతరమా పూటగడుప ♦ నారయభూపా॥"

చరస్థిరాస్తులంతయుఁ గూడిన సంస్థాన మంతయు విభాగింపఁబడవలెనని సోదరులు దెచ్చిన యభియోగము పరిష్కరింపఁబడకపూర్వమే శ్రీరాజా నారయ్యప్పారావుబహదరుగారు 1877 జూలై 19 వ తేదీని స్వర్గస్థులైరి. సంస్థాన విభాగము జరిగినపిమ్మట వీరికి వచ్చిన యాఱవభాగమగు వెంట్రప్రగడయెస్టేటు వీరి పుత్రులు బాలవార్ధావయస్కులగు నంతవఱకును గోర్టు ఆఫ్ వార్డ్సువారి యధీనమునకు దీసికొనిపోఁబడెను.

శ్రీరాజా నారయ్యప్పారావుబహదరుగారికి ప్రథమభార్యయగు వేంకటరమణయ్యమ్మగారివలన సుబ్బమ్మారావుగా రనునొకపుత్రికయును ద్వితీయభార్య యగు లక్ష్మీనరసయ్యమ్మగారివలన రాజగోపాలప్పారావుగారు, రామచంద్రప్పారావుగారు, వరదరాజప్పారావుగారు నను ముగ్గురుపుత్రులు జనించిరి.

ఈముగ్వురకును నూజవీడుసంస్థానములో నాఱవభాగమై వీరి తండ్రిగారికివచ్చిన వెంట్రప్రగడయెస్టేటు మఱల వెంట్రప్రగడ,

మునునూరు, గన్నవరము ననుమూఁడుభాగములుగ భాగింపఁబడి ముమ్వురు సోదరులకును బంచిపెట్టఁబడెను.

ఈముమ్వురుసోదరులలో నగ్రజు లగు శ్రీరాజా రాజగోపాలప్పారావుబహదరుగారు తమకు సంతతిలేనందునఁ దమద్వితీయసోదరు లైన శ్రీరాజా రామచంద్రప్పారావుగారి రెండవకుమారు లగు శ్రీరాజా సింహాద్ర్యప్పారావుబహదరుగారిని దత్తుగఁ దీసికొనిరి. వీరే ప్రస్తుతపు వెంట్రప్రగడయెస్టేటున కధీశులు. వీరు 1892 జులై 31 వ తేదీని జన్మించిరి.

శ్రీరాజా సింహాద్ర్యప్పారావుబహదరుగారు ప్రజారంజకంబుగఁ బాలించుచు బీదబ్రాహ్మణబాలుర కన్యకుల కుపనయనవివాహాది కార్యంబులకు విశేషద్రవ్యసాహాయము జేయుచుఁ బుద్ధిబలమునందును దేహబలమునందును మిన్న లై ప్రజల కృతజ్ఞతను బొగ్గొనుచుఁ దమ యెస్టేటునం దెకొఱంత లే కుండునటుల నేలుకొను చుండిరి.

## ii మునునూరు.

శ్రీరాజా నారయ్యప్పారావుబహదరుగారి ప్రథమపుత్రసంతానమును గుఱించి వర్ణింపఁబడియె. ఇఁక ద్వితీయపుత్రులగు శ్రీరాజా రామచంద్రాప్పారావుబహదరుగారు మునుసూరుజమీా కధీశు లైరి. వీరు నూజవీడు గ్రామపారిశుద్ధ్యసంఘాధ్యక్షు (యూనియన్ చైర్మన్) పదవి నొందిన పిమ్మట గ్రామమునందు దీపస్తంభము లెక్కువ చేయింపఁబడినవి. గ్రామమునందలి రాజమార్గము లన్నియుఁ జక్కగ సంస్కరింపఁబడినవి.

వీరు మిగుల భూతదయాపరు లై తమపూర్వుల యౌదార్య విశేషమును బ్రకటించిరి. నూజవీటిలో వృద్ధాప్యముచేత జీవనోపాధి సంపాదించుకొనలేని బీదకుటుంబీకుల కెందఱకో మనువృత్తులఁ గల్పించి మాసమాసమునకు నిర్ణీతముగఁ దమజీవితాంతముదనుక ద్రవ్యసాహాయము జేసిరి. ఎందఱకో గృహదానములఁ జేసిరి. వీరికి భాషాభిమా

నమును మెండు. వీరికి సంస్కృతాంధ్రతురుష్కాంగ్లేయభాషలయందుఁ బ్రావీణ్యము గలదు. వీరి యాస్థానపండితులలో నొకరగు మరింగంటి రంగాచార్యులుగారు శ్రీరాజాగారి ప్రేరణమున సర్వలక్షణవిశేష భాష్యము, భాష్యార్థసుబోధిని, యతిరాజవాణీస్తవము, ప్రాఘ్నోతి సూత్రార్థదర్పణము, శ్రుతిసత్యవాదము ననుగ్రంథముల వ్రాసిరి. శ్రీవారణాశి రామమూర్తిపంతులుగారు సంగీతశమంతకమణి యను నొక పొత్తమును రచించి శ్రీరాజాగారికి కృతి నిచ్చిరి. శతావధానులు శ్రీతిరుపతి వేంకటకవుల కీరాజావారు నూటపదారులవార్షిక మేర్పఱచిరి.

వీరికిఁ గలముగ్గురుపుత్రులలో ద్వితీయులు దత్తస్వీకారు లైనట్లు వ్రాయఁబడి యుండెనుగదా. ఇఁకఁ బ్రథమపుత్రు లగు శ్రీరాజా నారయ్యాప్పారావుబహదరుగారు 1890 వ సంవత్సరమునందును దృతీయు లగు శ్రీరాజా రాజగోపాలప్పారావుగారు 1898 వ సంవత్సరమందును జన్మించిరి. వీరిలోఁ బ్రథము లగు శ్రీరాజా నారయ్యాప్పారావు బహదరుగారు ప్రస్తుతపు మునునూరుయెస్టేటునకుఁ బరిపాలకులు.

వీరు తండ్రిగారి జీవితమునందే పాలనాభారమును వహించి నాఁటినుండి నేఁటిదనుకఁ బ్రజారంజకముగఁ బాలింపు చుండిరి. వీరి భాషాభిమానము ప్రశంసనీయము. తమపూర్వులకుఁ గృతు లీయఁబడి రచింపఁబడిన పూర్వగ్రంథముల నచ్చొత్తించుటలో మిగుల శ్రద్ధను వహించి యిప్పటికి కుమారధూర్జటికృత మైన యిందుమతీపరిణయమును అణివిళ్ల వేంకటసోమయాజికృత మైన యప్పారాయయశశ్చంద్రోదయమును బ్రకటింపఁ జేసిరి. శ్రీరాజాగారికి హూణాంధ్రభాషలయందుఁ బ్రావీణ్యము గలదు. అయినను సంస్కృతభాషయం దెక్కుడభిలాషగలిగియుండుటచే నిరంతరమును దద్భాషాభివృద్ధి కై పరిశ్రమ చేయు చుందురు. వీరికి వీణానాదనప్రౌఢిమయుఁ గలదు.

## iii గన్నవరము.

ప్రథమద్వితీయులనుగుఱించి చెప్పఁబడెను గదా? ఇఁకఁ దృతీయు లగు శ్రీరాజా వరదరాజప్పారావుబహదరుగారు గన్నవర

మనునెప్పేటును జాగరూకతతోడను ప్రజాహితముతోడను నేలుకొను చుండిరి.

---

## 2 ఉయ్యూరు.

---

(నూజవీడు సంస్థానము.)

సీ॥ వివిధభాషావేది ♦ వేంకటరంగయ
 ప్పారావుబహాదరు ♦ వ్వానితండ్రి
పలుపాఠశాలల ♦ నిలిపినరంగయ
 ప్పారావు వెవని ప్రీతిఁ ♦ బడసినపిత
ఆంధ్రభాషోద్ధర ♦ ణాభిరతుఁడగు సీత
 కాపురీనాథుఁ డే ♦ ఘనుని బావ
భాషాభిలాషులై ♦ పరగు మైలవరాఖ్య
 మేదినీశు లెవని ♦ మేనమామ

తే॥గీ॥ లగుచు విలసిల్లు చుండిరో ♦ యట్టి ఘనుఁడు
విపులసద్గ్రంథరచనావి ♦ వేకధనుఁడు
వేంకటాద్ర్యప్పరాయప్ర ♦ ఖ్యాతలేశుఁ
డాయురారోగ్యములతోడ ♦ నలరుఁ గాత॥

శ్రీకపిలేశ్వరపురాధీశ్వరునిపుత్రులును, స్వర్గీయ శ్రీరాజారంగయ్యప్పారావుబహాదరుగారి దత్తపుత్రులును నగు శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగా రుయ్యూరుసంస్థానాధిపతులు. వీరు 1893 ఏప్రిల్ 29వ తేదీని జన్మించి తమ యెనిమిదవయేట ననగా 1900 ఆగస్టు 13వ తేదిని దత్తస్వీకారపుత్రులైరి.

వీరి పాలకజనకు లగు శ్రీరాజా రంగయ్యప్పారావుబహాదరు గారుతమ బాల్యమునందు హూణవిద్య యంతగాఁ బ్రబలి యుండక పోవుటచే సంస్కృతాంధ్రముల యందును, పర్షియను భాష యందును

మాత్రమె ప్రవీణు లైరి. సంస్థానము స్వాధీన మై నప్పుడు వీరు తమ తండ్రిగారియొద్దనుండియు నన్నగారియొద్ద నుండియు గ్రహించిన లోకానుభవ మెంతయో సాహాయకారి యై రాజ్యపాలనమునకుఁ దోడ్పడెను. ఘనతగాంచిన రాజకీయోద్యోగులుగూడ శ్రీవారి రాజ్యకౌశల్యమును గుఱించి మిక్కిలి పొగడియుండిరి. అందులకు—

* "మార్టిన్ దొరవారి సంస్కరణములను నాచరణములోఁ బెట్టఁ దలచినయెడల శ్రీరాజా రంగయ్యప్పారావుగారి యభిప్రాయములను గమనించినఁ గాని మిక్కిలి సుకరములు గాఁ జాల" నని శ్రీరాజాగారిపాలనమును గుఱించి సంస్తుతించిన కృష్ణాజిల్లాకలెక్టరుగా రగు అట్కిన్సన్ దొరగారి వాక్యంబులే ప్రబలనిదర్శనంబులు. కృష్ణాజిల్లాకలెక్టరుగా రగు జె. జి. హార్సుఫాల్ (J. G. Horsfall) దొరగారు నూజవీడుసంస్థానవిభజనమునకుఁ బూర్వము సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సురక్షణములో నున్నకాలమందు రాజా రంగయ్యప్పారావుగారిని గుఱించి—§ "రాజారంగయ్యప్పారావుబహద్దరుగా రసాధారణగౌరవమున కర్హు" లని నుడివిరి. అందుమీఁద రెవెన్యూబోర్డువారు, దొరగారు చెప్పినదానికి తాము నేకీభవించుచున్నా మనియు, జమీందారుగారి (అలవెన్సు) ను వృద్ధిచేయవలయు ననియును జెప్పిరి.

గోదావరిజిల్లాకలెక్టరుగా రగు హాపెల్ (Mr. W. A. Happel) దొరవారుకూడ శ్రీరాజా రంగయ్యప్పారావుగారిని గుఱించి—
¶ "రాజా రంగయ్యప్పారావుగారు నా కత్యంతమిత్రులు. వారు మిక్కిలి సమర్థులును గౌరవపాత్రులును నని నాయభిప్రాయ" మని సెలవిచ్చి యుండిరి.

---

* "I think that with a little trouble Mr. Martin's scheme can be amended so as fairly to satisfy all the objections, to which end, the hints given by Rajah Rangayya Apparow Bahadur will be of no little service."

§ "Rajah Rangayya Apparow Bahadur deserves special respect."

¶ "I am acquainted with Rajah Rangaiah Apparow, the eldest of the Nuzvid Zamindars and I consider him an able and honorable man."

ఇటులనే మొదట కృష్ణాజిల్లాకలెక్టరుగ నుండి పిమ్మట రాజప్రతినిధిసభలో సభ్యులుగ నుండిన అరండేల్ (Mr. A. T. Arundel) దొరగారు రాజా రంగయ్యప్పారావుబహదరుగారు "కృష్ణాజిల్లాయందుగల జమీందారు లందఱిలోను ప్రాముఖ్యు" (Leading Zamindar of Kistna) లని నుడివిరి. అర్లే మారిస్ (Mr. R. Morris) దొరవారుకూడ ☩ "రాజా రంగయ్యప్పారావుబహద్దరుగారు బహువందనీయు లగుపెద్దమనుష్యు" లని పలికిరి.

కృష్ణవరదలలోఁ బ్రజాసౌఖ్యమున కై మిక్కిలి శ్రమజేసినట్టి యీరాజా రంగయ్యప్పారావుబహదరుగారి యౌదార్యకార్యములను గుఱించి పార్సన్సు (Mr. F. C. Parsons) దొరగారు తమ వివరణపత్రిక (Report) యందు $ "నాకును రంగయ్యప్పారావు బహదరుగారికిని బదమూఁడుసంవత్సరములనుండి యున్న స్నేహము వలన రాజాగారు నిరుపేదలఁ గాపాడుటయం దెప్పుడును ముం దంజవేయునట్టివా రనియు, నేకార్యమువచ్చినను రాజకీయోద్యోగులకు సాహాయము నిచ్చునట్టివా రనియు నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఈ కారణములచే దొరతనమువా రీమహాదాతను గుఱించి మెక్కుడుగ గౌరవింపవలయు"నని యుదహరించిరి.

ఇండియాచక్రవర్తిని యగు శ్రీస్వర్గీయవిక్టోరియా మహారాణీగారి 'గోల్డెన్‌జూబిలి' యొక్క యుత్సవజ్ఞాపకార్థమై శ్రీరాజా రంగయ్యప్పారావుబహదరుగారు బందరులోని హిందూహైస్కూలు నందుఁ జదువుకొనుచుండి తరువాతఁ గళాశాలకు విద్యాభ్యాసార్థమై

☩ "Rangayya Apparow Bahadur is a very worthy and estimable old gentleman."

$ "A friendship extending over 13 years with Rangayya Apparow Bahadur enables me to testify to the fact that he is always ready to come forward in this way to relieve the distressed and assist Government Officers in any benevolent or charitable undertaking, and I think he deserves to be prominently brought to the notice of Government as a public benefactor."

యేఁగెడి యొక్కవిద్యార్థికి విద్య పూర్తి యగునంతవఱకు జీత మును దా మిచ్చున ట్లేర్పఱచి యందుకుఁ గావలసిన మూలధనమును ముందుగనే యిచ్చివేసిరి.

ఈరాజాగారు తమ నూజవీడునందొక సెకండరీస్కూలును స్థాపిం చిరి. అది పట్టణాంతికమున విశాలావరణముగల యొకభవనమునం దుండెను. దీనికి నూతనభవనము నేర్పఱచుట కై ముప్పదివేలరూప్య ములనొసఁగి 1905 వ సంవత్సరము ఆగష్టునెలలోఁ గృష్ణాజిల్లాకలె క్టరుగా రగు పార్సన్సు (Mr. Parsons) దొరవారిచే శంఖుస్థాపనమును జేయించిరి. మఱియు సంవత్సరమున కాఱువేలు వెచ్చించుచుఁ బాఠశా లపోషణార్థమై మూఁడువేలు రాబడిగల మన్తెనగ్రామమును గూడ నిచ్చివేసిరి. ఇవియకాక సెకండుగ్రేడుకళాశాలాభవనమునకై వేలూరు గ్రామమును మఱి యిరువదివేలరొక్కమునుగూడ నొసఁగి యభినవ దానకర్ణుఁడో యనఁ బేరువడసిరి. ఆపాఠశాల; శ్రీవారికిని, నిడద వోలుసంస్థానాధిపులకును గొంతకాలమువఱకు దివాన్జీగా నుండి గతించిన మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారి యాధిపత్యము క్రింద నుంపఁబడెను.

1903 వ సంవత్సరములో నాపాఠశాలనుండి పరీక్షార్థమై పంపఁబడిన పదుమువ్వురిలోఁ బండ్రెండుగురు కృతార్థులైరి. నూజ వీటియొక్కయుఁ, దత్ప్రాంతస్థజనపదములయొక్కయు జనులబీదస్థితి ననుసరించి శ్రీరాజాగారు రూపాయికి పావలాచొప్పునఁ దగ్గించియే వేతనములను దీసికొనున ట్లేర్పాటు చేయుటయకాక మహమ్మదీయ బాలు రుచితముగ విద్య నభ్యసింప నగున ట్లొనర్చిరి. మఱియు బీదబాలు రనేకులు విద్యార్థివేతనము నొందుచుండిరి.

శ్రీరాజాగారు భాషాపోషకత్వమునకై చేసిన మహోప కారంబు లిన్ని యని వర్ణింప నలవికాదు. అయినఁ గొన్నిఁటిమాత్ర మిందుఁ బేర్కొనియెద:—ఉయ్యూరుగ్రామమునందొక లోవరుసెకం డరీస్కూలును స్థాపించి దానిభవనముకొఱకై యయిదువేలరూప్యము

లోసంగిరి. మచిలీపట్టణపురభవనమునఁగల పుస్తకభాండాగారమున కొఱకు వేలరూప్యముల వెలగల గ్రంథసముదాయ మొసంగిరి. అందు సంస్కృతము, ఇంగ్లీషు, తెలుగు, పర్షియన్, ఉరుదుభాషల యందలి యుద్గ్రంథములు చాల గలవు. గుంటూరుమండలములోని నర్సారావుపేటయందుఁగల సంఘ (Club) పుస్తకభాండాగారమును, దిరుచునాపల్లిజిల్లా శ్రీరంగములోని హైస్కూలునందలి పుస్తకభాండాగారమును శ్రీరాజాగారి యశోముద్రితములె. మఱియు గుంటూరు మండలములో నొక సంస్కృతపాఠశాల ద్రవ్యలేమిచే నెత్తివేయఁబడుటకు సిద్ధముగా నున్న సమయమున శ్రీరాజాగారు వలయుధనము నొసఁగి దానిని బునర్జీవింపఁ జేసిరి.

ఈపైనఁ బేర్కొనఁబడినవేకాక విద్యాభివృద్ధి కై శ్రీరాజా రంగయ్యప్పారావుబహాదరుగా రొనర్చిన సత్కార్యము లింక ననేకములు గలవు. చెన్నపురియందు న్యాయవాదిత్వ (B. L.) పరీక్షలకును భిషక్ (Doctor) పరీక్షలకును జదువఁ బోయెడి విద్యార్థులకు వేతనాదివ్యయముల కగు ధనము నిచ్చి విద్యాదానమును జేసిరి. సంవత్సరమునకు నూటయిరువదిరూప్యముల చొప్పునఁ జంతాద్రిపేటలోని బాలికాపాఠశాలకును, నలువది రూప్యములచొప్పునఁ దిరువళిక్కేళిబాలికాపాఠశాలకును విరాళ మొసంగిరి. మదరాసునందలి పేద లగు విద్యార్థులకుఁ బ్రతివత్సరమును భోజన మిడుట కై యర్బత్ నాటుకంపెనీవారివశమున మూఁడువే లుంచిరి. మఱియు నుయ్యూరు సత్రమునకును, వీరంకిలాకు సత్రమునకును బదివేలు నిరాఘాటముగ నిచ్చివేసిరి. నూజవీడుగ్రామమున మార్కెట్ గట్టుట కయి చాలధనము నొసంగిరి. బెజవాడలో బీదసాదలకుఁ బ్రతిదినమును నేబదిమందికి భోజనసౌకర్యము గలిగింప నెంచి యొకయింటిని గట్టించి యిచ్చిరి. దానిని నిర్వహించుట కయి తాము స్వయముగ గణించినట్టి కొలఁటపాడుగ్రామమును, యేపూరు రాయనపాడుగ్రామములలోని కొన్నిభూములను నెనమదలగ్రామమునుండి వచ్చు శిస్తులోఁ బ్రతిసంవత్సరమును నాలువందలరూపాయలను నిచ్చుచు

న్యాబాలగోపాలముచే నన్నదాత యని పేర్కొనఁబడిరి. జిల్లాబోర్డు వారు నూజవీడునందుఁగల వైద్యాలయమును ద్రవ్యలేమిచే నెత్తివేయఁ దలఁచు చుండఁగా శ్రీరాజా రంగయ్యప్పారావుబహదరుగారు ప్రజా సౌఖ్యమునకు భంగము గలుగు నని తలంచి తమసౌధమునందుఁ బ్రత్యే కముగ నొకవైద్యశాల యుంపఁబడినను బైవైద్యాలయమునకుఁ బ్రతి వత్సరము నాఱువందలరూపాయల నిచ్చున ట్లేర్పఱచి వైద్యశాల యెప్పటియట్లు స్థిరీభూతముగ నుండునట్లు చేసిరి. మదరాసునందలి విక్టోరియా ఘోషా ఆసుపత్రిలో రెండువేల రెండువందలరూపాయల వ్యయముమీఁద 'ప్రిన్సు ఆఫ్ వేల్సు' గారిపేర రోగుల కొక శయ్య నేర్పఱచిరి.

శ్రీవా రాంధ్రభాష నభివృద్ధిచేయఁ దలఁచి పండితుల ననవర తము సత్కరించుచునే యుండిరి. వీరిసత్కారము నొందినపండిత బృందము తిరిగి మఱియొక రాజానుగ్రహము నపేక్షింపవలసిన యవ సరము లేకుండెడిది. రాజాగారికి పర్షియాభాషయందుఁ గలప్రావీ ణ్యము తద్భాషయందుఁగల 'షాహనామా' యను పరిషియాదేశపు రాజులచారిత్రమును దెలుఁగున భాషాంతరీకరింప సమకట్టుటనుబట్టియె యెఱుంగ నగును. ఈగ్రంథము మహాభారతమునుబోలిన గొప్ప గ్రంథము. గద్యపద్యాత్మకముగఁ గొంతభాగమును సొంత మొనరించి శ్రీరాజాగారు తమసౌధమునందుగల స్వకీయముద్రణాలయమున ముద్రిం పింపఁ జేసిరి. మఱియుఁ గృష్ణామండలసంఘమువారిచేఁ బ్రతిష్ఠాపింపఁ బడిన కృష్ణాపత్రికానిర్వహణార్థమై ముద్రణాలయమును నెలకొల్పు టకు సహస్రద్వయరూప్యంబు లొసంగిరి.

ఈవిధముగ నెన్నికకువచ్చిన దానవిశేషము లనేకములు గలవు. ఇవిగాక యగోచరము లగుగుప్తదానములును బెక్కులు గలవు. శ్రీరాజాగా రొకసారి సమీపవాసు లగు నొకజమీందారుగారికి పది వేలరూపాయ లొసఁగి వారియాపదనుండి తొలఁగించిరి. ఇది శ్రీరాజా గారి గుప్తదానములలో నొకటి.

"శ్లో॥ దదతో యుధ్యమానస్య। పఠతో పులకోద్భవేత్। ఆత్మ నశ్చ పరేషాంచ। తద్దానం పౌరుషం స్మృతం॥" అను నార్యోక్తి కనుగుణంబుగ శ్రీరాజా రంగయ్యప్పారావు బహద్దరుగారి పవిత్రచారిత్రంబును బఠించుపాఠకుల కేరికి పులక లంకురితంబులు గాకుండును?

1906వ సంవత్సరారంభదినమున దొరతనమువారు శ్రీవారికి 'రాజా' యనుబిరుదంబు నొసంగిరి. ఈబిరుదము బహుకాలమునుండి వంశపారంపర్యముగ వచ్చుచుండిన దయ్యును సంస్థాన మనేకభాగంబులుగ విభజింపఁబడిన దను నెపంబునఁ గొంతకాలంబు నుండి యంత ర్హితం బయ్యెను. అట్టిబిరుదమును దిరిగి దొరతనమువారివలన స్వీకరింపఁ గలుగు నట్లు శ్రీరాజా రంగయ్యప్పారావుబహద్దరుగారు తమ సుగుణపుంజంబుచే దిగంతయశోవిశాలు రయి విరాజిల్లి— తే.గీ. స్వీయ పూర్వార్జితంబయి ♦ వెలయుదాని। వంశపరముగావచ్చుచుఁ ♦ బరగుదాని। 'రాజ' యనుబిరుదము దాని ♦ రంగయప్ప। రావుగారు వహించి రౌ♦రా యనంగ॥ అను జనానుమోదంబున కెంతయు సర్హులైరి.

శ్రీరాజాగారియెడ నిఖిలజనులకును గలగౌరవభావ మీబిరుదము లభించినసమయంబునఁ దమసంతోషసూచకంబుగ నివేదించిన యభినందనపత్రికలవలనఁ దెల్లము కాఁగలదు. అందులోఁ గొన్నింటి నీక్రిందఁ బొందుపఱచెద—

చెన్నపురిగవర్నరుగా రగు లార్డు యాంప్తిల్ (His Excellency the Right Honourable Arthur Oliver Villiers, Baron Ampthill, G. C. I. E.,) దొరగారు— * "మి మ్మీబిరుదమున

* My Dear Rajah!

It gave me very great pleasure to recommend you for the title by which I now address you and on which I now offer you my hearty congratulation.

I trust that you are pleased at the distinction and that you will live long to enjoy the public recognition of your admirable qualities as a land-holder."

కర్తు లని ప్రశంస చేయుటకు నా కెంతయు సంతస మగుచున్నది. ఆ బిరుదముంతో మి మ్మిప్పు డభినందించు చున్నాను. దీని ననుభ వించుటకు మీరు చిరాయువులు గాఁగల రని నమ్ము చున్నాను."

మదరాసుకౌన్సిలులోఁ బ్రథములగు థామ్సన్ (The Honourable Sir J. Thomson, K. C. S. I.) దొరగారు—* "దొరతనము వారు తమకు 'రాజా' బిరుదమును బ్రసాదించినట్లు తెలిసికొని తద్బిరుదమును దాము చిరాయువు లై యనుభవింపఁ గోరుచున్నాను."

వైస్రాయిగారి కౌన్సిలుమెంబ రగు సర్. ఎ. టి. అరండేల్ కె. సి. ఐ. ఇ. (The Honorable Sir A. T. Arundel, K. C. I. E.) దొరగారును, రెవెన్యూమెంబ రగు అట్కిన్సన్ (The Honorable Mr. J. N. Atkinson, C. I. E., *Member, Board of Revenue.*) దొరగారును, గవర్నరుగారి ప్రయివేటు సెక్రటరీయగు విన్చ్ (L. M. Wynch Esquire, C. I. E., *Private Secretary to His Excellency the Governor*) దొరగారును, తంజావూరుజిల్లా జడ్జిగారగు ఓల్డుఫీల్డు (F. D. P. Oldfield Esq., *District Judge of Tanjore.*) దొరగారును, నెల్లూరుజిల్లాకలెక్టరుగా రగు (R. Morris Esq.) మారిస్‌దొరగారును, నింక మఱియెందఱో పాశ్చాత్యప్రముఖులు మన శ్రీరాజా రంగయ్యప్పారావుబహద్దరుగా రొందిన 'రాజా' బిరుదమున కై సంతసించుచు వేనోళ్ళ నభినందించిరి.

ఇటులనే మన దేశీయప్రముఖులు గూడ శ్రీవారిగౌరవమున కభినందించుచుఁ దమ యామోదము ననేకరీతుల వెల్లడించిరి. అందు † శ్రీ శ్రీ బొబ్బిలిమహారాజాగా రిట్లు తంతి నంపిరి:— "మనఃపూర్వక మైన నాయభివందనములను బరిగ్రహింపుఁడు."

---

* "My Dear Sir!

I saw Government had honoured you with the title of Rajah and I hope you will live long to enjoy it."

† "Please accept hearty congratulations."

* మదరాసు హైకోర్టుజడ్జిగా నుండిన భాష్యం అయ్యంగారు పంపిన తంతి—"మీా కర్హ బిరుదము లభించినందులకు నామనఃపూర్వ కాభివందనములను స్వీకరింపుఁడు."

§ శ్రీరంగమునుండి శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహ దరుగా రిట్లు వ్రాసిరి :—"ఇప్పుడే స్వీకరింపఁబడిన తంత్రీవార్తమూల మునఁ దమకు దొరతనమువారు 'రాజా' బిరుదము నొసంగినట్లు తెలియవచ్చినది. కావున మిక్కిలి సంతసించు చున్నాను."

తత్కాలంబున మధుర సబ్ జడ్జిగ నుండిన శ్రీయుత వారణాసి సుబ్రహ్మణ్యముపంతులుగారు—"దొరతనమువారు తమకు 'రాజా' బిరుదము నొసఁగి రని వినుట కెంతయు సంతసించు చున్నాను. మి మ్మాయుష్మంతులుగఁ జేయ భగవంతుని బ్రార్థించుచు నింతకన్న నెక్కుడుబిరుదముల నొందుదురుగాత మని కోరు చున్నాను."

మండలన్యాయమూర్తిపదవినుండి ప్రస్తుతము విరమించుకొనిన మొల్లేపెద్ది జానకిరామయ్యపంతులుగారు—"తమ రీబిరుదమున కెంతయు నర్హు లని నేను మిక్కిలి యభినందించు చున్నాను. తమ రిదివఱకె జననమువల్లను, సముత్కృష్టస్థితివల్లను, బరోపకారపరాయణత్వము వల్లను నీబిరుదమున కర్హులై యున్న త మ్మిప్పుడు దొరతనము వారుగూడ గౌరవించిరి. ఇది సర్వజనసమ్మతము. తమమిత్రుఁడ నైన నా కిది మఱియు సంతోషదాయకము. తమకు భగవంతుఁ డాయు రారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించునుగాక." అను నభిప్రాయముగల లేఖను వ్రాసిరి.

కొంతకాలము చట్టనిర్మాణసభాసభ్యులుగ నుండిన మ. రా. రా. గంజాం వెంకటరత్నముపంతులుగారు :—"మీా కీబిరుదమును దొర

---

* "Accept hearty congratulations on well deserved and appropriate honor"

§ "My Dear Uncle!

Extremely happy to learn from the telegram just now received that the title of 'Rajah' has been bestowed on you by the Government."

తనము వారొసంగినందులకు నే నభినందింప నెల వైసంగుచు. వీరు మనరాజధానియందుఁ గలజమీందారు లందఱిలో నొకమార్గదర్శకులుగ నుండిరి. తమసంస్థానమును మిక్కిలి చాకచక్యముతోఁ బరిపాలింపఁ గలిగిరి. ఈవిషయమై తమ దివాన్‌గా రగు శ్రీ వేంకటేశ్వరరావుపంతులుగారిని గూడ యభినందింపవలసి యున్నది. మీ ధర్మకార్యములు రాజధానియంతటను ప్రఖ్యాతివహించి యున్నవి. వానిలో నొక టగు నూజవీడునందలి హైస్కూలు శాశ్వతధర్మకార్య మై యున్నది. మీ కనవరతాయురారోగ్యములు సంఘటింప భగవంతుని ప్రార్థించు చున్నాఁడను."

కొంతకాలము చెన్నపురిలోని చట్టనిర్మాణసభయందు సభ్యులుగ నుండిన కృత్తివెంటి పేర్రాజుపంతులుగారు కాకినాడనుండి శ్రీ మాడపాటి వేంకటేశ్వరరావుపంతులుగారిపేర నిట్లు వ్రాసిరి:—

"శ్రీరాజా రంగయ్యాప్పారావుబహదరుగా రిట్టియర్హ బిరుదము నొంది నందులకు నే నెంతయు సంతసించి వారికి నాయభివందనముల సమర్పింప మిమ్ము గోరు చున్నాను. నాకు శ్రీవారియెడఁ గలపరిచయము స్వల్పమె యయినను వారియౌదార్యమును మాత్రము చక్కగ గ్రహింపఁ గలిగితిని. శ్రీరాజాగారు కాకినాడలోని నీటిగొట్టములకుఁ (Water-Works.) జేసినసాహాయ్యమువలన మాపురజను లెల్లరును కృతజ్ఞులు."

మదరాసుమెయిల్ పత్రిక యిట్లు వాకొనెను:—* ఇండియాదేశము యొక్క యీభాగములవారు సంపాదించినబిరుదములలో లోకప్రఖ్యాతిగాంచిన నూజవీడు నిడదవోలుల కధీశులుగ నుండిన రంగయ్యప్పారావుగారికి వచ్చి యున్న బిరుదము మిగులఁ బ్రాశస్త్యమును, జనసమ్మతమును గాంచు చున్నది."

* "Of other honors concerning this part of India, the title of Rajah bestowed on Sri D. M. Rangayya Appa Row, the well-known Zamindar of Nidadavole and Nuzvid in the Kistna District, who lately promulgated a scheme of Industrial Scholarships, will be regarded with general satisfaction."

మదరాసు స్టాండర్డుపత్రిక :—* "దానకర్ణుఁ డని ప్రసిద్ధిగాంచిన రంగయ్యప్పారావుజమీందారుగారు రాజా బిరుదమును వహించిరి. కొలఁదిదినములక్రిందటనే శ్రీవారు, జపాన్ దేశమునకుఁ బోయి విద్య నభ్యసించు నేవిద్యార్థి కైనను రెండుసంవత్సరములవఱకు రక్షణీయ మై నట్టి సహస్రత్రయరూప్యముల విద్యార్థి వేతనము నీయ నుండినట్లు సంతసపూర్వకముగఁ దెలియపఱచి యుంటిమి."

హిందూపత్రిక :— † "నూజవీడుసంస్థానాధిపతు లగు శ్రీ రంగయ్యప్పారావుబహదరుగారు 'రాజా' బిరుదము నొందిరి. వారు నవనాగరికులును, నీబిరుదమున కెంతయు నొప్పినవారును నగుదురు."

ఇండియన్ పేట్రియట్ :— ‡ "దేశీయులు బొందిన బిరుదములలో రాజా రంగయ్యప్పారావుబహదరుగా రొందిన 'రాజా' బిరుదము వారియోగ్యగుణమున కెక్కు డర్హ మైనది."

ఇంతియకాక పట్టణములయందును, బల్లెల యందును గొప్ప సభలను గావించి తత్సభాధిపతులద్వారా యనేకులు తమయభివందన పూర్వకము లగు దీర్వానములను నివేదించి యుండిరి. అందులోఁ గొన్ని మచిలీపట్నములోని రావు బహదరు శ్రీపురాణం వెంకటప్పయ్య

* "Rangayya Appa Row, Zamindar, who is known both for his public spirit and philanthropy gets the title of Rajah. Only the other day we had the pleasure to announce that he had offered a scholarship of Rs 3,000 tenable for two years to any student who may go to Japan for the study of an Industry."

† "Mr. Rangayya Appa Row Bahadur, the Zamindar of Nuzvid, has been made a Rajah. He is an enlightened Zamindar and is very deserving of the title now bestowed on him."

‡ Among the purely Indian titles that of Rajah conferred upon Rajah Rangayya Appa Row Bahadur is an appropriate recognition of the public spirit shown by him."

పంతులుగారియొక్కయు, రాజమహేంద్రవరమునందుఁగల శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారియొక్కయుఁ, గాకినాడయందలి శ్రీ కృత్తివెంటి పేర్రాజుపంతులుగారియొక్కయు నాధిపత్యములక్రింద జరిగినసభలును మఱికొన్నియును ముఖ్యముగఁ జేర్పఁదగి యున్నవి.

1906 వ సం॥ జనవరినెలయందు శ్రీ ప్రిన్సు ఆఫ్ వేల్సువారు సతీయుతముగఁ జెన్నపురిని దర్శించినసందర్భమందు జరిగిన సభలో లార్డు యాంప్థిల్ (Lord Ampthill) దొరగారు శ్రీరాజా రంగయ్యప్పారావుబహదరుగారికిని, వారిపుత్రరత్న మగు శ్రీ కుమారరాజాగారికిని శ్రీవారల దర్శనోత్సుకము సంఘటింపఁ జేసిరి.

శ్రీరాజాగారు ధర్మాచరణపరతంత్రులు. ఏ రెట్టిసందర్భముల యం దైనను వెనుదీసి యుండ లేదు. కాకినాడపురభవనమును గట్టుటకును, గాకినాడయందే నీటిగొట్టముల నెలకొల్పుటకును, రాజమహేంద్రవరములోని కంభమువారిచెఱువును మరమ్మతుచేయించుటకును, గుంటూరునం దొకపురభవనము (Town-hall) ను గట్టుటకును, వ్యవసాయవస్తుప్రదర్శనముల జరుపుటయందును, విద్యార్థుల కితరదేశంబు లందు విద్య నేర్పించుటకును మున్నగు ననేకసత్కార్యంబులకు శ్రీరాజాగా రమితధనంబును వెచ్చించిరి.

స్నేహితుల యౌదార్యమును నమ్ముకొని కర్మవిద్య నభ్యసించుట కయి జపాన్ దేశమునకుఁ బోయిన బళ్లారివాసు లగు యస్. రామారావుగారు ద్రవ్యలోపముచేఁ గడు దుస్థితిలో నుండినప్పుడు శ్రీరాజాగారు వేయిరూపాయిల నిచ్చి యుద్ధరించిరి. వెండియుఁ దమసంస్థానోద్యోగియులమన్నన కుఁ బాత్రు లై వివాహాదికార్యము లందు దగుసాహాయ మొనరించు చుండెడివారు.

నూజవీటికోట పట్టణమునకు మధ్యభాగమునం దుండి యన్ని వైపులను విశాలము లగురాజవీధుల్నను గలిగి యున్నది. ప్రతిజమీందారుగారును గోటయందును, గ్రామమునందును గొంతభాగమున కధికారు లై యుండుటచే మన శ్రీరాజా రంగయ్యప్పారావుగారును,

శ్రీ వెంట్రప్రగడ, ముసునూరు పరిపాలకులును గాక తక్కినవారెల్ల రును గోటలోని సౌధము లందే నివాస మొనరించుకొని యుండిరి. రమారమి యేబదివత్సరములక్రిందట శ్రీరాజా రంగయ్యప్పారావుగారు గ్రామమున కొకమైలుదూరమునఁ గల నన్నూఱెకరముల విస్తీర్ణపుఁ దోట యందు లక్షలకొలఁది ద్రవ్యమును వెచ్చించి యొక యున్నత హార్మ్యమును గట్టించిరి. ఆతోఁటయందుఁ బదివేలకుఁ దక్కువగాని ప్రశస్తమైన యంటుమామిడిచెట్లు గలవు. శ్రీరాజాగారి యధీనములో నుండిన జంతుకోటి యంతటిలో ముఖ్యముగ నాలుగుమత్తగజములు ప్రశంసనీయములై యున్నవి.

శ్రీరాజాగారు, తమపినతల్లిగారును నిడదవోలుసంస్థానాధిపు రాలును నగు శ్రీరాణీ పాపమ్మారావుగారికి రాజకీయాలోచనములందు ముఖ్యసాహాయకారులుగ నుండి యాపెయనంతరము తామె యధి కారులై పిమ్మట 1900వ సంవత్సరములోఁ గోర్టువారు రిశీవరుగారి యధీనముసేయునంతవఱకుఁ దామే పాలకులుగ నుండిరి.

ఆఱుభాగములలో నొకటయిన యుయ్యూ రెస్టేటు శ్రీరాజా రంగయ్యప్పారావు బహద్దరుగారి పాలనమునకు వచ్చెనుగదా. శ్రీవారు పాలనమునకు వచ్చినతోడనే నూతులను ద్రవ్వించుట, కాసార ముల నేర్పఱచుట, యడవులను గొట్టి సాగుచేయించుట, సొంతసాగుబడి చేయించుట మున్నగు పురోభివృద్ధికరములగు ననేకసదుపాయంబు లొనర్చి రాజ్యతంత్రకౌశల్యంబు జూపి యభ్యున్నతస్థితికి వచ్చిరి. మఱి యుఁ గృషీవలులయెడ నేవిధమైన రాజ్యాంగవ్యవహారములును లే కుండఁగ మిగుల దక్షతతోఁ బాలించిరి.

శ్రీరాజాగారికి పుత్రసంతానము లేకపోవుటచేఁ గపిలేశ్వరపురా ధీశ్వరు లయిన శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహద్దరుగారి ప్రథ మపుత్రు లగు శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారిని దత్త పుత్రులుగ స్వీకరించిరి. అంతఁ గొంతకాలమున కనఁగ 1906వ సం॥ జులై 20వ తేదిని శ్రీరాజా రంగయ్యప్పారావుబహాదరుగారు వ్యాధి

పీడితు లై డాక్టరు క్లారెన్సుస్మిత్ (Dr. Clarence Smith) దొరగారి వైద్యసహాయ మందుచుండినను స్వర్గాభిముఖులుగాక తప్పినదికాదు. "తే. గీ. రెండ యవతరించిన ధర్మ♦జుండొ యనఁగ । ధర, జనించిన యర్థి మం♦దారమనఁగ । నలరి శ్రీరంగయప్పరా♦యక్షితీంద్రుఁ । డరిగె దివి కెల్లరకు ఖేద♦మలము కొనఁగ॥" ఇట్లా బాలగోపాలము శ్రీరాజా రంగయ్యప్పారావుబహాదరుగారి మరణవార్తను వినవలసివచ్చినందుల కెంతయుఁ జింతాక్రాంతు లై వారికుటుంబమువారికి దమతమహృదయ సంతాపములను బెక్కువిధంబుల వెల్లడించిరి.

అంత యువరాజులుగ నుండిన శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు బహాదరుగారు పాలనార్హవయస్సున లే కుండుటచే సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణములోనికిఁ గొంపోవఁబడెను.

శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారు మూఁడవవర్షమువఱకు రాజాగారిస్కూలునందే విద్య నభ్యసించిరి. శ్రీవారి యప్పటి ప్రత్యేకోపాధ్యాయులు పి. శంకరనారాయణశ్రేష్ఠి యం. ఏ. గారు. సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణములోనికిఁ బోయినపిమ్మట శ్రీరాజాగారు మదరాసునందు విద్య నభ్యసించి 1912వ యేట మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణు లై 1914 ఏప్రిల్ 20వ తేదీని బట్టాభిషిక్తు లైరి.

శ్రీరాజావా రాంధ్రమున మంచి పాండిత్యమును వహింపఁగలుగుటయగాక కవిత్వమునుగూడఁ జెప్పఁ గలరు. శ్రీవారికవితానన్య మనోహరాలంకారభూషితయు, మృదుపదవిభాసితయు, సరసాభిరామయు నై యిం పెసలారుచు నుతిపాత్ర మై యుండును. శ్రీరాజావారిచే నిప్పటికి గోవర్థనోద్ధారణము, దుర్యోధనాంతము, పృథ్వీరాయనియంతము, స్నేహలత, శ్రీశోభనాచలమాహాత్మ్యము నను గ్రంథములను మఱికొన్నిఁటిని రచించిరి. శ్రీవా రనుదినమును దప్పక కొంతకాలమును బండితగోష్ఠి కై వినియోగించెద రన్న నింక శ్రీరాజాగారి భాషాభిలాష నుగుఱించి వేఱుగ వ్రాయ నవసరము లేదు.

ఈరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారు తమమాధ్యాహ్నిక భోజనానంతరమున స్వీయవిశాలసౌధప్రదేశమునందు విశ్రమించి దర్శనార్థులై యేతెంచు నెల్లరకును శేపుమాపనక తప్పక దర్శనమొసంగుచుఁ దమసహజశాంతరసము లొలుక సంభాషింపుచుందురు. పిమ్మట రాజకీయవ్యవహారములఁ జూచుకొందురు. ఆసమయమునం దైనను దర్శనోత్సాహులై యేతెంచు నాగంతికులకు శ్రీవారు దర్శన మిచ్చి స్వయముగనే యుక్తసమయము నెఱింగించి భాషించెదరు. వీరినియమము లన్నియు నవనాగరికంబు లనియు, దేశాభ్యుదయకరంబు లనియు జను లిప్పటికే గ్రహింపఁగలుగుటచే స్వర్గీయ రాజా రంగయ్యప్పారావుబహాదరుగారు లేనికొఱత యీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారి పరిపాలనంబున నంతర్హితం బగుచుండెను. శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు బహాదరుగా రాచంద్రార్క యశోవిరాజితులై చిరకాల రాజ్యసౌఖ్యంబు లనుభవించెదరుగాక.

---

## 3 మీర్జాపురము.

శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారి ప్రథమద్వితీయపుత్రుల చారిత్రంబులు వర్ణింపఁబడెనుగదా. తృతీయపుత్రు లగు వేంకటజగన్నాథప్పారావుగారు సంస్థానవిభాగము గాకమునుపే హైదరాబాదునందు గతించిరి. వీ రశ్వారోహణమునం దత్యంతకౌశలులై తుద కాకారణముననే గతించిరి. కావున వీరిచరిత్ర మేమియు మనకు మిగిలి యుండ లేదు.

ఇఁక జతుర్థపుత్రు లగు శ్రీరాజా వేంకటనృసింహాప్పారావుబహాదరుగారు తమకు లభ్యమైన మీర్జాపురపు టెస్టేటున కధీశులైరి. వీరును జతుర్విధభాషాపరిచయులై యుండిరి. వీరు తండ్రిగారియనుమతిచే సొంతకమతము మొదలైనవ్యవహారము లందు గృషిసేయుచు

సోదరులిందులకు సాహాయకులుగా నుండుటచే భాగములకై కలహింపఁదొడఁగి ప్రీవీకౌన్సిలువఱకును వ్యాజ్యములను నడిపి తుదకు విజయులై సంస్థానవిభజనము జరిగించుకొని ప్రత్యేకభాగముల కధీశులై తమకు లభ్య మైన మీర్జాపురపుయెస్టేటును బాలించుకొనిరి. వీరి ప్రథమభార్య మైలవరపుజమీందారుగా రగు సూరానేని లక్ష్మీరాయణముగారి పుత్రిక యగు వేంకటచిన్నయ్యమ్మారావుగారు. ఈమెవలన ముగ్వురుపుత్రికలను నొకపుత్రుని గాంచిరి. అయినను నీపుత్రుఁడు తన పదునేఁడవయేటనే స్వర్గాభిముఖుఁ డగుటచేఁ దలిదండ్రు లపారదుఃఖాంబుధి మునింగియు వంశాధారమున కై శ్రీరాజా వేంకటనృసింహాప్పారావుగారు ద్వితీయవివాహమును జేసికొని యామెవలన సంతానభాగ్యము లభింప కుండుటచేఁ దృతీయవివాహమును జేసికొనిరి. ఈతృతీయకళత్రము పేరు రాణీ వేంకయ్యమ్మారావుగారు. ఈసాధ్వీమణివలన 1897వ సంవత్సరమునందు రాజా వేంకట్రామయ్యప్పారావుగారిని 1898వ సంవత్సరమున రాజా శోభనాద్ర్యప్పారావుగారిని గాంచిరి.

శ్రీరాజా వేంకటనృసింహాప్పారావుబహదరుగారు నాలు గేనుఁగులను ముప్పది గుఱ్ఱములను విశేషపరివారమును గలిగి తమయెస్టేటును మంచి వైభవముగ నేలుకొనిరి. వీరికి నిడదవోలెస్టేటున నొకభాగమును మేడూరియెస్టేటున నొకభాగమును లభించెను. సామాన్యకుటుంబీకుల నెందఱనో భిక్షాధికారులనుగఁ జేసిన యార్బత్ నాట్ కంపెనీయందు వీరి కెనిమిదిలక్షలరూప్యములు నష్ట మాయెను. అయినను వీరి వ్యవహారదక్షతచేతను, గార్యకౌశల్యతచేతను మంచి ధనాఢ్యులుగనే యుండి 1911వ సం॥ మే 13వ తేదీని స్వర్గస్థులైరి. అంతఁ బాలనార్హ్యవయస్కులుగాని శ్రీరాజా వేంకట్రామయ్యప్పారావుగారును శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారును దమయెస్టేటుతోఁ గూడఁ గోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణమున నుండి కొలఁదికాలముక్రిందటనే పట్టాభిషిక్తులైరి. ఈసోదరద్వయమునకు భగవంతుఁ డాయురారోగ్యంబులఁ గూర్చుఁగాత.

---

# 4 కపిలేశ్వరపురము

(నూజవీడు సంస్థానము)

సీ॥ శ్రీరంగపతిపద♦సేవాభిరతు లయి
జపతపాదులభక్తి ♦ సలుపు నెవరు?
ఇంద్రలోకముబోలె ♦ నెంతయుఁ దనసభా
స్థల మలంకృతముగ ♦ నిలిపి రెవరు?
మిఱుమిట్లుగలిగించు ♦ మెఱపుదీపములచే
నగరంబు దివ మట్లొ♦నర్చి రెవరు?
సహజశాంతౌదార్య♦సద్గుణవ్రజముచే
వినుతచరిత్రు లై ♦ వెలసి రెవరు?

ఆ॥వె॥ సుస్థిరముగ నట్టి ♦ సుగుణు శ్రీవేంకట
రంగయప్పరాయుఁ ♦ బ్రాజ్ఞగేయు
నాయురున్నతు లిడి ♦ యనిశ మాశ్రీశుండు
బ్రోచుఁగాత విపుల♦భూతి వరల॥

యుద్ధనైపుణ్యమునందుఁ బ్రాముఖ్యతవహించిన యోధవీరులచే స్వీకరింపఁబడినదియు, బహుపురాతన మైనదియు నగు నూజవీడుసంస్థానమట్లు 1882వ సంవత్సరమున నాలుభాగములుగ విభజింపఁబడినట్లు చదువరు లిదివఱకే చదివియుంటిరిగదా! ఆయాలుభాగములలో నొకటగు 'కపిలేశ్వరపురము' శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారి పాలనమునకు వచ్చెను. వీరు శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుబహాదరుగారి మైదవకుమారులు. తమబాల్యమునందే శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుగారు తండ్రిగారిశిక్షణమున భాషేతర మగు పరిష్యాభాష నేర్చుకొనిరి. ఆ భాషయందును స్వభాష యగుతెలుఁగునందును మంచి పాండిత్య మలవడుటయగాక కవితారచనశక్తియు లభించి యుండెను.

వీరు నరసారావుపేటజమీందారు లగు శ్రీ మల్రాజు కొండలరావుగారి యేకపుత్రి యయిన శ్రీరాణీ వేంకటరామలక్ష్మీకనకమ్మారావుగారిని బరిణయ మయి యాసాధ్వీమణివలన మనప్రస్తుతకథానాయకులును, శ్రీకపిలేశ్వరపుర వరాధీశ్వరులును నగు శ్రీరాజా వేంకటరంగయ్యప్పా రావుబహదరుగారిని గాంచిరి.

శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహదరుగారు తమ మూఁడవయేటనే తండ్రిగారిని గోలుపోయినందున జమీయొక్క పరిపాలనము శ్రీవారి పినతండ్రిగా రగు శ్రీరాజా సింహాద్ర్యప్పారావుబహదరుగా రవలంబించిరి. కాని పిమ్మట రాజా వేంకటరంగయ్యప్పారావుబహదరుగారిజనని యగు శ్రీరాణీ వేంకటరామలక్ష్మీకనకమ్మారావుబహదరుగారే స్వీకరించిరి. వీరు తమపుత్రునితోఁ గూడ మఱికొందఱు రాజబంధువులను వెంట నిడుకొని మనదేశమునందుఁ గలపుణ్యక్షేత్రంబులకుఁ బోయి తీర్థయాత్రలు సేవించివచ్చిరి. జమీ వీరిపాలనము క్రింద నొకసంవత్సరముమాత్రమె యుండెను. అంతఁ గోర్టు ఆఫ్ వార్డ్సువారు సంస్థానమును దమస్వాధీనములోనికిఁ దీసికొని శ్రీరాజాగారిని విద్యార్థమై ప్రథమమున మచిలీపట్నమునకును బిమ్మటఁ జెన్నపట్నమునకును గొంపోయిరి. అచ్చట పచ్చప్పాస్ కాలేజిలో మెట్రిక్యులేషను వఱకు జదివిరి. శ్రీరాజాగా రిట్లు ఆర్. యు. పాట్సు (Mr. R. U. Potts) దొరగారిసాన్నిధ్యమున నున్న కాలమునందు మనదేశమునందును సింహళద్వీపమునందును గల పెక్కుపట్టణములకుఁ దీసికొనిపోఁబడుటచే శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహదరుగా రసమానబుద్ధివైశద్యంబును, ప్రాపంచికజ్ఞానవిశేషమును సంపాదింపఁ గలిగిరి.

తమ జనకపితామహులం బోలె శ్రీరాజాగారును భాషాభిలాషులగుటయగాక యాంధ్రంబున మంచికవిత్వమునుగూడఁ జెప్పఁగలరు. పరిషియాభాషయందును నిరుపమాన మైనపాండిత్యము గల దనుటకు శ్రీవారిచే భాషాంతరీకరింపఁబడిన "బాబిలోనియా" గ్రంథమే ప్రబల నిదర్శనము. మఱియు శ్రీరాజాగారిచే రమారమి మున్నూఱుపుటలకు

మించి 'ఢిల్లీదర్బారుచరిత్ర' మనుపేర రచింపఁబడిన గ్రంథరాజము వీరికిఁ గలరాజభక్తిని వెల్లడింపఁగలదు.

శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహాదరుగారు స్వానుభవమునఁ గాంచిన దేశపర్యటనఫలితంబుల నీక్రిందివాక్యానుసారంబుగ వివరించిరి:—

"ప్రతిమనుజుఁడును, కూపస్థమండూకముంబోలె నింటనుండి సంతసించుటకంటెఁ దనస్థితిగతులకొలఁది యిలు వెడలి దేశాటనం బొనరించు టుచితము. మనభాగ్యవశమున నే మన మీహిందూదేశమునందు జన్మించితిమి ఏల యనఁ బ్రపంచమునందుఁ గలసకలసృష్టినిర్మాణవైచిత్ర్యంబులును నీదేశమునందు గలవు. ఈదేశమునందే యుష్ణమండలములోని పలు తెఱంగుల వృక్షజాలంబులును, భీకరజంతుసంతానంబును గాన నగును మఱియు శీతమండలంబులంగుసైత ముల్లంబు రంజిల్లఁజేయు నీహారసాంద్రశైలేంద్రంబులును, దేశమును సస్యవంతముగఁ జేసి కనులపండువ గావించు నిర్మలవారిపూరనదీనదంబులును, మనోహరంబులై చూపరుల కచ్చెరువొందఁ జేయు ప్రవాహాపతనంబులును, నిరుపమాన మగుశిల్పకళాద్భుతంబులును గలిగి విభాసిల్లు శోభస్కరంబును గాన నగును. ఇంతియకాక మఱియొకదేశమునకుఁ బోవకయే పెక్కుజాతులవారిని జూచుటయుఁ బెక్కు భాషల వినుటయుఁ దటస్థించును."

శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహాదరుగారు పరిపాలనార్హవయస్కు లగునంతదనుక కోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణమునందుండి తత్కాలమునందు వా రొనరించిన మేలును గొనియాడుచుఁ బెక్కుక్షేత్రముల సేవించుభాగ్యమును దమకుఁ గలిగించినందుల కెంతయుఁ గృతజ్ఞులై యుండిరి.

శ్రీవారు యుక్తవయస్కు లయిన దనే 1894 సెప్టెంబరు 9వ తేదీనిపరిపాలనాభారంబును స్వీకరించి పాట్సు (Mr. Potts) దొరగారి సాన్నిధ్యంబున లభించిన పాండితీపటిమచే దొరతనమువారిసలహాలను శిరసా వహింపుచు మిగుల జనానుకూలంబుగఁ బరిపాలించు చుండిరి.

శ్రీరాజాగా రమితధనంబును వెచ్చించి తమ హార్మ్యరాజంబు నత్యంతశోభాయమానంబుగ నొనరించిరి. మన యార్యుల శిల్పకళా నైపుణ్యంబును జూడవలయు నన శ్రీవారిసౌధమునందే చూడవలయును. ఈసౌధమునందలి సభామంటపము వర్ణనాతీత మై యుండును. రజిత మయ మయి, శృంగారముగ బంగారునీటిపూఁత బూయఁబడిన యున్న తాసనంబు లనేకంబులు గలవు. ఇం దొకొక్కటి దాదాపుగ సహస్రరూప్యంబుల విలువ గలిగి మనోహరంబుగ నుండును. వీని నిర్మాణనైపుణ్య మసమాన మై శ్లాఘనీయంబుగ నుండును. ఇట్టి యాసనంబులం గలిగి యొకవిధ మగుపింగాణివంటి గాజుమీఁద విచిత్ర వర్ణంబులచే నలంకరింపఁబడిన పనితనముగల నలుచదరము లగుపలకలు సభామంటపము (Durbar Hall) నందలి భిత్తికలయందు స్థాపింపఁ బడి యుండుటయు కాక, గవాక్షద్వారోపరిభాగంబు లందుఁ గలశోభా యమానం బగువిచిత్రవర్ణరచనాద్భుతంబును, విద్యుద్దీపికానిర్మాణ వైభవంబును గాంచువార కల యింద్రసభ యిదియే యనుభ్రాంతిని గలుగఁజేయక పోదు. ఈసభారంగశృంగారంబును గాంచిన యొకకవి పుంగవుం డిట్లు వర్ణించెను:—

ఉ॥ బంగరుపూఁత బూయఁబడి ♦ భాస్వదనూనరుచిం జెలంగు ను
త్తుంగమహాసనంబుపయి ♦ తోరపువేడుక విష్ణుమూర్తిభా
తిం గడు ఠీవి మై కొలువు ♦ దీరి ప్రజాపరిపాలనంబు సే
యం గనుఁగొన్నచోఁ బులక ♦ లంకురితంబులు గావె మేనులన్॥

సీ॥ అష్టభోగములచే ♦ నలరు మీ కలసురే
శ్వరుఁ డంపుకొనిన య♦ప్సరస లొక్కొ
మేదురాదరమతి ♦ మేఘేశుఁ డంపిన
కలితవియచ్చర♦కాంత లొక్కొ
నాగాధినాథుఁ డా♦నందుఁ డై తమకీర్తి
గాంచి పంపిన నాగ♦కన్య లొక్కొ
భవదీయపూర్వీకు ♦ లవని పైఁ దమప్రతా
పమున నిల్పినశత్రు♦భామ లొక్కొ

తే॥గీ॥ యనఁగ యంత్రపాంచాలిక ♦ లనవరతముఁ
బార్శ్వభాగంబులను నిల్పి ♦ బంధురముగఁ
గరయుగమున విద్యుద్దీప♦కాంతు లడరఁ
బరగు సొంపు వర్ణింపంగఁ ♦ దరమె యహహా!

తే॥గీ॥ శ్రీమహావిష్ణు మిము పుర♦స్కృతులఁ జేసి
వెనుకఁ దా నుండి యనిశంబు ♦ వివిధరాజ్య
కార్యముల దిద్దు చుండిన ♦ కరణిఁదోప
నిలిపి తౌర శ్రీరంగేశు ♦ నీదువెనుక॥

ఈరాజాగారి తనూజాగ్రజు లగు శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహదరుగారే యుయ్యూరుపురవరాధినాథులు. వీరికి మఱి యిరువురుపుత్రులును, నలువురుపుత్రికలును గలరు. కుమారులపేళ్లు శ్రీమన్నారాయణాప్పారావుగారు, శ్రీనివాసాప్పారావుగారు. మఱియు నాంధ్రభోజుఁ డనియు, నర్థిజనమందార మనియు భరతమాత కనుపారఁ గన్న యనుంగుబిడ్డఁ డనియుఁ బ్రఖ్యాతివహించిన పీఠికాపురాధీశ్వరు లగుశ్రీరాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావుబహదరుగారి సతీవతంస మగు శ్రీమదాంధ్రజాళమ్మగారిరాజాగారి ప్రథమ పుత్రికామణియ.

శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహదరుగారు తమ తండ్రిగారిచే నాచరింపఁబడిన ధర్మకార్యంబుల కావంతేని భంగంబు రానీయక తమశక్తికొలఁది వాని నభివృద్ధి సేయు చుండిరి. వీ రెంతయో దైవభక్తిపరాధీను లై యనుదినంబును బ్రభాతంబుననే స్నానాదివిధులఁ దీర్చికొని జపతపాను లాచరించినఁగాని యన్యవిషయంబులందుఁ బ్రవేశింపరు.

రాజకీయవ్యవహారదక్షు లగు శ్రీయుత సిరివేళ్ళ వెంకోబరావు పంతులు బి. ఏ., బి. యల్., గారు రాజాగారి కెల్లవిషయంబులందును సహాకారులుగ నుందురు. శ్రీరాజాగారికి పంతులుగారియెడ విశ్వాస గౌరవములు మెండు. అందువలన నెల్లకార్యములను శ్రీరాజాగారు

పంతులుగారి యభిప్రాయానుసారముననే యాచరింపు చుందురు. శ్రీపంతులుగారును సమస్తవిషయములను గడు సామర్థ్యముతో నిర్వహింపుచు జనుల స్తుతిపాఠంబులకుఁ బాత్రుఁ లయిరి.

ఇట్లు రాజకీయవ్యవహారనిపుణు లగునుద్యోగియులతో సంస్థానపాలన మొనరించుకొనుచు, రైతులయెడ వాత్సల్యభావంబును గలిగి శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావుబహదరుగారు దైవానుగ్రహంబుచే నఖండైశ్వర్యములతో విరాజిల్లుచున్నారు.

---

## 5 తేలప్రోలు.

శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుబహదరుగారి యాఱవపుత్రులైన శ్రీరాజా సింహాద్ర్యప్పారావుబహదరుగారు తేలప్రోలెస్టేటునకధీశులైరి. కాని వీరీయెస్టేటు నాలుసంవత్సరములు మాత్రమె నేలుకొనఁగలిగిరి. పిమ్మట వీరికుమారు లగు శోభనాద్ర్యప్పారావుగారు మూఁడుమాసముల బాలురైయుండఁగ శ్రీరాజా సింహాద్ర్యప్పారావుగారు 1889వ సంవత్సరమున స్వర్గస్థులైరి. అంత వీరియెస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణమునకుఁ బోయెను. అంతఁ గుమారరాజాగారగు శ్రీశోభనాద్ర్యప్పారావుగారు ప్రథమమున మచిలీపట్నమునందును బిమ్మటఁ జెన్నపట్నమునందును హూణవిద్యాభ్యాస మొనర్చి మెట్రిక్యులేషన్ బరీక్ష యందుఁ గృతార్థులైరి.

శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారు తమయుపాధ్యాయు లగు సి. మారిస్‌దొరవారితో నిండియాయందుఁ గల ముఖ్యపట్టణముల నన్నియుఁ జూచి వచ్చి 1910వ సంవత్సరము ఆగష్టు 15వ తేదీని బట్టాభిషిక్తులైరి. వీరు శ్రీజటప్రోలురాజాగారి పుత్రికను బరిణయమైరి. ఈమె తనయెనిమిదవయేట నొకపెద్దపులిని వేటాడినట్లును నశ్వారోహణమునందు సమర్థురాలనియుఁ జెప్పుదురు. మఱియు నీమె సంస్కృతాంధ్రభాషలే గాక హిందూస్థానీహూణభాషలుగూడ నేర్చి

యుండెను. శ్రీరాజాగారు తమపూర్వీకులచేఁ గట్టింపఁబడిన హనుమ ద్దేవాలయమును నాగిరిపల్లిలోని కొత్తాయిని మఱల నూతనవిధానముగఁ గట్టించిరి. మఱియు వీ రసమానధార్మికబుద్ధిచే నఱువదివేలరూప్యము లవఱకును వెచ్చించి సర్వజనోపయోగ మగునటుల నొక ఘోషా వైద్యశాలను నిర్మింపఁ జేయుచున్నారు. భగవంతుఁ డైశ్వర్య మొసంగి నందులకుఁ దమయైశ్వర్య మిట్టి జనోపయోగకార్యములకు వినియో గించుటచేతనే సార్థక మగును. నూజవీటిగ్రామమధ్యమున వీరి కత్యంత విశాలస్థల మొండుగలదు. ఈస్థలమం దొకదేవాలయమును నిర్మింపఁ దలంచి యొకభక్తు డర్థింపఁగాఁ దత్క్షణము యుచితముగ నొసంగిరి. దీన నాయాభాగము లందు సంస్కృతాంధ్రపుస్తకభాండాగారము, అన్నసత్రము, పఠనమందిరము, దేవాలయము ననునవి నిర్మితము లయ్యెను.

ఇట్టి ధర్మాచరణపరాయణు లగు శ్రీరాజా శోభనాద్ర్యప్పారావు బహదరుగారికి భగవంతుఁ డష్టైశ్వర్యచిరాయువులఁ గూర్చుగాత.

---

## 6 మేడూరు.

శ్రీరాజా శోభనాద్ర్యప్పారావుగారి సప్తమపుత్రు లగు శ్రీరాజా వేంకట్రామయ్యప్పారావుగారు మేడూరియెస్టేటును గైకొనిరి. అటు పిమ్మట వీరి పెదతల్లియు నిడదవోలుజమీందారిణియు నగు శ్రీపాపమ్మా రావుగారివలన దత్తుఁడుగఁ దీసికొనఁబడి రెండుజమీాలను బాలించు కొను చుండిరి. అయినను స్వల్పకాలములోనే గతించుటచే వీరి పుత్రు లగు శ్రీరాజా నారయ్యప్పారావుగారిని మఱలఁ బాపమ్మా రావుగారు దత్తపుత్రునిగ స్వీకరించిరి. కాని వీరు నపుత్రకులుగనే 1894వ సంవత్సరమున గతించుటచే నీమేడూరుజమీాని గుఱించి వ్యా జ్యములు దేఁబడి తుదకు నిడదవో లుయ్యూరుజమీాల నేలు చుండిన

శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుబహాదరుగారి కొకభాగమును మీర్జా పురపు జమీ నేలుకొను చూడిన శ్రీరాజా వేంకటరామయ్యప్పా రావుబహాదరుగారి కొకభాగమును బ్రిటిషు కౌన్సిలువారివలనఁ దీర్మానింపఁ బడి మేడూరియెస్టేటు స్వాధీనపఱుపఁబడెను.

ఇట్లు లభ్యమైన నీమేడూరి యెస్టేటును దమతమ పూర్వార్జిత భాగంబులకుఁ జేర్చుకొని శ్రీయుయ్యూరు మీర్జాపురాధీశ్వరు లఖండైశ్వర్యముతోఁ బ్రజారంజకముగఁ జిరకాల మేలుకొనెదరుగాత.





శ్రీరస్తు.

# చార్ మహల్ సంస్థానము.

(గురజ—కృష్ణాజిల్లా).

సీ॥ చారుమహాలుసం♦స్థాన మేలఁగఁబూర్వు
లిపుడు బొట్టుంపాలె ♦ మేలు నెవరు?
తమవంశజులు మహో♦ద్ధతి రాజ్యమేలిన
గుఱుతుగ నలవెన్నుఁ ♦ గొందు రెవరు?
ధర్మపరులు వీరి ♦ తరతరంబులవార
లను సద్యశంబున ♦ కర్తు లెవరు?
సదసద్విచక్షణ ♦ సమధికు లయి కడు
హూణాంధ్రభాషల ♦ నొప్పి రెవరు?
ఆ॥ వె॥ వినుతచరితు లట్టి ♦ వేంకటవరదరా
ట్శోభనాద్రిరాయ ♦ సూరిగేయు
నాయు రున్నతుల న♦హర్నిశంబును శ్రీశుఁ
డేలుఁ గాక శుభము ♦ లిచ్చుఁ గాక॥

వేగవరబొట్టుంపాలెముల కధీశ్వరు లగు శ్రీరాజా కమదన వేంకటవరదరాజశోభనాద్రిరావుబహాదరుగారి చారిత్రమునుఁ గొండొకకాలమున సుప్రసిద్ధిని గాంచి యున్న దయి శ్రీరాజాగారిపూర్వీకులచేఁ బాలింపఁబడిన దగు 'చారుమహాల్'సంస్థానచారిత్రమే యగును గావునఁ దచ్చారిత్ర మిటఁ బేర్కొనఁబడెడిని.

కృష్ణామండలంబునందుఁ గల గుడివాడ కయికలూరు తాలూకాలలోని యొకగొప్పభాగము పూర్వదినములలో 'చిన్నకోట, కలిదిండి, గుడివాడ, బిత్తరజల్లి'యను నాలుగుపరగణాలుగ నేర్పడి యుండి 'చార్‌మహాల్‌సంస్థాన' మనుపేరఁ బరగి యుండెను. దీనికి దక్షిణమున బందరు, ఉత్తరమున నేలూరు, తూర్పున నర్సాపురము, పశ్చిమమున నూజవీడుతాలూకాలు సరిహద్దులుగ నుండి యయిదుకోటలును, పెక్కుతోఁటలును మేటి యేటికాలువలును, విశాలతటాకంబులును, బచ్చికబయిళ్ళును గలిగి సమస్తసౌభాగ్యశోభిత మై నన్నూఱుచదరపుమైళ్ళ వైశాల్యముతోడను, నిన్నూటఱువదిజనపదంబులతోడను విరాజిల్లు చుండెను.

(ఒరిస్సాలోని పాంచిమహాల్‌దేశప్రభువులును, బల్లవవంశజులును నగు క్షత్రియు లాదియందు దీనిపాలకులుగ నుండిరి. వీరిలోఁ గడపటివాఁ డగు లాంగుల్యగజపతి కొల్లేటికోటను రాజధానిగ నేర్పఱచుకొని 1237 మొదలు 1282 వ సంవత్సరమునఱకును బాలించినట్లు మెకంజిదొరగారు నుడివి యున్నారు.) వీరియనంతరమునఁ గొంతకాలము గడచినపిమ్మట 1328 మొదలు 1424 వఱకుఁ బ్రబలి యున్న రెడ్డివంశజుల యధీన మయ్యెను. * కానుకొల్లుకోట నీరెడ్డిప్రభువులే కట్టిరఁట. పిదప నీకోట 1759 సం॥ మార్చి 3వ తేదీని కేప్టన్ మెక్లీన్ (Caption Maclleane) దొరగారికి స్వాధీన మయ్యెను.

మెకంజిదొరగారు వ్రాసిన ట్లీ చార్‌మహాల్‌సంస్థానము కమదనవారికి నూజవీటిసంస్థానాధిపతులవలన లభించినట్లు తచ్చరిత్రమునందుఁ జెప్పబడెను, గాని యీ రట్లుగాక యోరుగల్లుప్రాంతముల సామంతులుగ నుండి రాజ్యకాంక్షచేఁ గ్రమక్రమముగ నీదేశమున కేతెంచినవారిలో నొకరనియు, నైజాముచే నీజమీని వశపఱచుకొని ప్రప్రథమమునఁ గానుకొల్లుకోటయందును దదుపరి గుడివాడ బేతవోలుగ్రామ

* 'The fort at Kanukollu is said to have been built by the Reddies'. (217 page of Kist. Dt. Manual.)

ము లందును బిదప సంస్థానమధ్యప్రదేశ మగు గురజగ్రామమునందును నివసించుచు నైజాముప్రభువులచే రాజా బహాద రిత్యాది బిరుదముల నంది యున్నట్లును జెప్పుదురు.)

ఈ కమదనకుటుంబములో సుప్రసిద్ధుఁ డయిన కమదన గురవయ్యగారి కిరువురు పుత్రులును, దొమ్మండ్రుమనుమలును, నెనమండ్రు మునిమనుమలును గల యొక పెద్దకుటుంబీకు లై యుండిరి. ఈమనుమలలో నిరువురు 1738 వ సంవత్సరప్రభృతి నైజామువారి పరిచయమును సంపాదించుకొనఁగలిగిరి. వీరిలో మునిమనమ లగు మఱియిరువురు నూజవీడుసంస్థాన మంతకును సన్నదు (పట్టా) లను సంపాదించిపాలింపఁగలిగిరి. ఈ మనుమలయొక్కయు, మునిమనుమలయొక్కయు నలువుర పేళ్లు గల యొక సన్నదు 1757 వ సం॥ రంలో శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావుగారిచే చార్ మహల్ పైనొసఁగఁబడినట్లు కనఁబడు చున్నది. 1759 ఫిబ్రవరి 4 వ తేదీని ఫ్రెంచివారిచే వీరిలో మఱి యిరువురకొసఁగబడిన ట్లింకొకసన్నదు గనిపించు చున్నది. ఆసంవత్సరములోనే మే నెల 28 వ తేదీని సాలబత్ జంగ్ చే మఱియొకసన్నదును స్వీకరించిరి. ఈగురవయ్యగారి సంతతివారె యగు మఱియిరువురు 1765 సంవత్సరములో నేలూరువద్ద జనరల్ కెయిలాడ్ (General Caillaud) దొరగారిని సందర్శించి యింగ్లీషుదొరతనమువారిచేఁ గూడ 1771 ఏప్రిల్ 25 వ తేదీని, 1774 మే 3 వ తేదిని, 1777 మే 25 వ తేదిని సన్నదులను సంపాదించి రాజ్యవిస్తీర్ణము నభివృద్ధిసేయఁ జొచ్చిరి. ఇట్లసామాన్యరాజ్యలక్ష్మిని సంపాదించిన వీరెల్లరును గురవయ్యగారి మనుమలు మునిమనుమలు నై యవిభక్తకుటుంబీకులుగ నుండి సామ్రాజ్యాభివృద్ధి గలిగి యుండిరి.

ఇట్లింగ్లీషువారి పరిచయారంభకాలములో ననఁగా 1770వ సంవత్సరములో మచిలీపట్నములోనిముఖ్యులగు విన్చి (Mr. Wynch) దొరగారు చార్ మహాల్ సంస్థానాధిపతులతో వ్యవహారవిషయాదులఁ బ్రవేశించిరి. దొరతనమువారిచే గుత్త కీయఁబడిన పరగణాలకొఱకై

1771వ సంవత్సరమున మూఁడుసంవత్సరములవఱకు స్వాధీన మొనరించుచు నీమూఁడు సంవత్సరములకు నీయవలసిన కప్పమునకు (పేష్కష్) మొగల్తూరిజమీందారు లగు కలిదిండి తిరుపతిరాజుగారు పూచీపడునట్లు చేసిరి. 1774 వ సంవత్సరములో వైటిహిల్ (Mr. Whitehill) దొరగారిచే మఱియొకనిర్ణయము జరిగెను; గాని గతించినసంవత్సరములలో పేష్కష్ చాల దిగబడుటచేఁ దిరుపతిరాజుగా రామొత్తమును దొరతనమువారికి చెల్లింపవలసివచ్చిరి. అందువలన సంస్థానాధిపతులు తిరుపతిరాజుగారికి (84,000) యెనుబదినాలుగు వేలవరహాలు బాకీపడిరి. ఈఋణవిముక్తికై చార్ మహాల్ సంస్థానము మఱియాఱుసంవత్సరములాయనస్వాధీనములో నుంపఁబడెను.

ఇంతలోఁ దత్సమయమున సంస్థానాధిపతులుగ నున్న యిరుపురిలో నొకరయిన గురవయ్యగారి మునిమనుమఁ డగు అంకప్పగారు 1773 జూలైనెలలో దేహయాత్రను విరమించిరి. అంత వీరి సోదరుఁ డయిన చినపాపయ్యగారు పరిపాలకులుగ వచ్చిరి. ఇఁక రెండవవారును గురవయ్యగారి మనుమలలోఁ గనిష్ఠులునైన పెదపాపయ్యగారు 1774వ సంవత్సర మక్టోబరు నెలలో స్వర్గస్థులైరి. ఈస్వల్పకాలములోనే వీ రనేకధర్మకార్యము లాచరించి పండితాదరణులై కీర్తి గాంచినట్లు తెలియవచ్చు చున్నది. వీరియనంతరమునందు జమీపాలకులుగ రాఁ దగిన వీరికుమారుఁ డగునరసింహరావుగారు పసిబాలురై యుండిరి. ఈదినములలోనే నూజవీడుసంస్థానాధిపతులగు శ్రీరాజా నరసింహప్పారావు బహదరుగారు, చార్ మహాల్ సంస్థానముపైఁ దమకే యధికారము గల దనియు నదియు నూజవీడు సంస్థానమునకు సంబంధించినదే యనియు మున్నగు విషయములతో నొకదావా తెచ్చిరి; కాని దానిని మచిలీపట్నపు కౌన్సిలులోని ముఖ్యాధికారి త్రోసివేసి తమక్రింద దుబాష్గా నుండిన కాంద్రేగుల వేంకట్రాయఁడుగారికి, చార్ మహాల్ సంస్థానమును నదివఱకుఁ దిరుపతిరాజుగారితోఁ గల యాఱుసంవత్సరముల కట్టడి యంత మగుటచే పదివత్సరములవఱకు నొసంగిరి.

మఱియు నప్పుడే బాలుఁడుగా నుండిన యీ కమదన నరసింహారావుగారి పోషకత్వాదియాజమాన్యములు శ్రీరాజా నరసింహాప్పారావుగారికే యొసఁగుచు చార్‌మహాల్ సంస్థానమునుండి సంవత్సరమున కెనిమిదివేలవరహాలను బాలుని సంరక్షణార్థ మివ్వబడినట్లు తెలిసెడిని. ఇంతలోఁ జార్‌మహాల్ సంస్థానమునందుఁ గలవరములు జనింపసాఁగెను. నూజవీడుసంస్థానమునుండి మన నరసింహారావుగారు తప్పించుకొని వచ్చిరి. ఉభయసంస్థానము లందును నించుక కలవరములు గలిగెను.

1783 వ సంవత్సరములోఁ జార్‌మహాల్‌సంస్థానాధిపత్యమును వహించి యున్న కాండ్రేగుల వేంకట్రాయలుగారు చనిపోయిరి. వీరి పిమ్మట దుబాష్‌గా వచ్చిన వీరి పితృవ్యపుత్రుం డగుజగ్గప్పగారు సంస్థానపాలనము జూచుచుండిరి; కాని 1787 వ సంవత్సరములో వీరుద్యోగమునుండి తొలఁగింపఁబడుటచే సంస్థానము మచిలీపట్నములోని యాలోచనసభాముఖ్యుల నిర్వాహకమునకు వచ్చి పిమ్మట మదరాసు దొరతనమువారి యనుజ్ఞచే 1788 జనేవరినెలలో ఓరామ్ (Mr.Oram) దొరగారి యాధిపత్యముక్రింద హవేలీభూములతోఁ జేర్పబడెను.

కోర్టు ఆఫ్ డైరక్టర్సువారు 1791 వ సం॥ లో జార్‌మహాల్ సంస్థానమును దదధిపులైన కమదనకుటుంబమువారికీయవలసినదనియు, నూజవీడుసంస్థానాధిపతులదావాను ద్రోసివేయవలసిన దనియు, దీర్మానించిరి. ఈతీర్మానముప్రకారము మదరాసుదొరతనము వారు కమదన చినపాపయ్యగారు, కమదన నరసింహారావుగారు ననువారలను జమీందారులుగఁ బ్రకటించి వీరిపోషణార్థమై సంవత్సరమునకుఁ బదివేల వరహాలుమాత్ర మిచ్చుచు సంస్థానమును మాత్రము స్వాధీన మొనరింపరైరి. ఇది కమదన వేంకటరా వనువాని కెంతయు నసంతృప్తిగ నుండుటచే నీయన కొంతకలహమునకుఁ గారకుఁ డయ్యెను; గాని తత్కాలమునమాత్రము నిష్ఫల మయ్యెను.

1791 వ సంవత్సరములోఁ గమదన చినపాపయ్యగారు గతించిరి. వీరి కప్పు డిరువురుపుత్రులు గలరు. 1792 వ సంవత్సరములో దొరతనమువారీయిరువురలో నగ్రజుఁడగు శోభనాద్రిరావుగారిపేరను వీరి పితృవ్యపుత్రుఁ డగు నరసింహారావుగారిపేరను సమిష్టిగ జమీ పాలింపఁబడుచుండునట్లొనఁగిరి; కాని నరసింహారావుగా రాయొకసంవత్సరముననే గతించుట తటస్థ మయ్యెను.

కలహకారుఁడుగ నుండిన వేంకటరావుగారి నీసందర్భమున జమీపాలకులుగ నొనరించిన కల్లోలము లడఁగు నని బందరుబోర్డువారు తలంచిరికాని మదరాస్ దొరతనమువా రట్లు సేయుట కంగీకరింపక శోభనాద్రిరావుగారినే సంస్థానాధిపతిగఁ జేసి వేంకటరావుగారిని బందరులోనే యుంచి నెల కయిదువందలవరహాలను సంస్థానమునుండి స్వీకరింప నగున ట్లొనరించి వానిని శాంతపఱచిరి.

రాజా శోభనాద్రిరావుగారు 1792వ సంవత్సరములో సంస్థానాధిపతులుగ వచ్చినప్పుడు దొరతనమువారి కీయవలసిన కప్ప మెంతయో దిగఁబడి యుండెను. దీని నంతయుఁ జెల్లించుట కెంతయో యవస్థపాలు గావలసివచ్చెను. కౌన్సిలులో ముఖ్యాధికారి యగు గార్డినర్ (Mr. Gardiner) దొరగారి సలహా మీఁద 1794వ సంవత్సరములో హసన్ ఆలీఖాన్ యొక్క జ్యేష్ఠకుమారుఁ డయిన కుత్బుమల్క్ (Cutb Mulk) నొద్ద నలువదిరెండువేల వరహాలను ఋణముగఁ దీసికొనవలసివచ్చెను. పిమ్మట నీఋణము నూటికి పదిరూపాయలవడ్డితోఁ గూడఁ దీర్పఁబడెను. సంస్థానక్షైణ్యమున కీపెద్దవడ్డియు నొకకారణ మాయెను.

1798వ సంవత్సరములోఁ గలెక్టరుగా రగు ఓక్సు (Mr. Oakes) దొరగారు సంస్థానసంబంధ మగు నాదాయవ్యవహారమును ఖచితముగ నుంచున ట్లొత్తిడి సేయఁ జొచ్చిరి. అంత జమీందారుగారు కొత్తవరగ్రామనివాసి యైన తాళ్లూరి జోగయ్య యనునొకధనికుని దివానుగ నేర్పఱచుకొనిరి; కాని వీనికాలమునందలి పాలనము మిగుల దూష్యముగను గఠోరముగను నుండెను. సమయము దొరికెఁగదాయని

యీాయన తనప్రతాపమును బ్రజ్వరిల్లఁజేయు చుండెను. జనకంటకు లగు వారు లోకాపవాదమునకు వెనుదీయరుకదా! 'ఈతరుణమునం దడ్డపడి మ మ్మిాజోగయ్యనుండి విముక్తులనుగఁ జేయుమో యంబా'యని గ్రామదేవతపైఁ జెప్పఁబడిన ప్రార్థనారూప మగు పద్యములను నేఁటి వఱకును గుడివాడతాలూకాలోఁ బాడఁబడుచుండెనని మెకంజిదొరగారు వ్రాసి యున్నారు. ఆహా! ఎంతజనకంటకుఁడుగ నుండెనోకదా! రైతులనేకులు దమపొలములను విడిచిపెట్టి పారిపోయిరి. దొరతనమువారికి చెల్లింపవలసినకప్పములు దిగఁబడు చుండుటచే మితిమించి పెఱుగు చుండెను. ఈదుష్టవర్తనుఁ డగుదివానుతోఁబాటు పాపము మనజమిాందారుగారుగూడ బంధీకృతులు గావలసివచ్చిరి. జమిా లాగుకొనఁబడెను. ఆహా! ప్రభువులకుఁ గీర్తిదెచ్చినను నపకీర్తిదెచ్చినను వారిమంత్రులే గదా కారకులు!

మచిలీపట్నము నందుఁ గడచిన యీా తేడుసంవత్సరములనుండి మనువృత్తి నొందు చున్న కమదన వేంకటరావు సమయము చిక్కెఁ గదాయని చాక్‌మహాల్ సంస్థానమును గొంత యల్లరిమూఁకతోఁ బ్రవేశించి జరిగించినయల్లరులు మితిమించి యుండెను. అంత దొరతనమువా రితనిని నైజామురాష్ట్రమునకుఁ దరిమివేసిరి.

1803వ సంవత్సరములో దొరతనమువారి కంతకుఁ బూర్వము దిగఁబడి యున్ననిలువబాకీ లన్నియు విడిచిపెట్టఁబడి సంస్థానమున నూతనముగఁ దిరిగి శ్రీరాజా శోభనాద్రిరావుగారిని నెలకొల్పిరి. అయినను దురదృష్టదేవత వీరి నింకను నావరించియే యుండెను. వీరియొద్దనుండి సంస్థానము నద్దెకుఁ దీసికొనిన దీవువని తిమ్మయ్య బొమ్మదేవర నాగన్న నాయఁడుగార్లకును మనరాజాగారికిని వ్యావహారిక మైనచిక్కులనేకములు దటస్థించెను. ఇంతలో నైజామురాజ్యమునకుఁ బారిపోయిన వేంకటరావుగారు తిరిగి ప్రవేశించి సంస్థానమును దోఁచుకొనుచు నెక్కుడు కలవరమును గావించిరి. అంత దొరతనమువా రితని నెక్కుడు క్రూరముగ దండించెడివారే కాని యీాలోపల నే బందరునందు మృతి నొందెను. శ్రీరాజా శోభనాద్రిరావుగారికింతటితోఁ దమకనుదనకుటుంబ

మునందు స్పర్థగలవా రెవరును లేరు కాని యీవిముక్తి బహుకాలము నకు లభ్య మయ్యెను. అయినను నేమిప్రయోజనము? ఇప్పటికే ఋణములు పెఱిగి పోయెను. దొరతనమువారి నిలువబాకీలకుఁగాను నిరువదివేలవరహాలను దదితరులకు నిరువదియేడువేల వరహాలను నీయ వలసి యుండిరి. ఈకారణములచే 1813వ సంవత్సరములో బ్రితజల్లి కలిదిండి పరగణాలు విక్రయమునకుఁ బెట్టఁ బడెను. బెజవాడ జమీాం దారునిచేఁ గలిదిండిపరగణా 3,525 వరహాలకును, బ్రితజల్లి మైలవరా ధీశ్వరులచే 7,125 వరహాలకును విక్రయింపఁబడెను. వీ రిరువురును మనశోభనాద్రిరాజాగారికి ముఖ్యబంధువు లగుటచేఁ దిరిగి యిచ్చి వేయు దలంపున స్వల్పమొత్తములకే కొనిరి. కాని యట్లొనరించుటకుఁ బూర్వమె వారి జీవితము సరిపోయెను.

చారుమహాల్ సంస్థాన మంత గుడివాడ, విన్నకోట యను రెండు పరగణాలే యయి యుండెను. అప్పుడు కలెక్టరుగారు జమీాని దమ యాధిపత్యమునకుఁ దీసికొని ప్రతిసంవత్సరమును వచ్చు నాదాయ ములోఁ గొంత జమీాందారుగారిఋణతీర్మానమున కై వినియోగించు చుండిరి. ఇట్లు శ్రీరాజా శోభనాద్రిరావుగారి జీవిత మంతయు వ్యవహార మందే నిమగ్న మై తుదకు 1820 సెప్టెంబరు 16వ తేదిని విరతి నెందెను. అప్పటికి శ్రీరాజాగా రార్గురుపుత్రికలును బదిమందిపుత్రు లును గల సంతానవంతు లై యుండిరి.

జమీాయాధిపత్యమును గుఱించి కుటుంబములో 1832 వ సంవ త్సరమువఱకును గలహములు జరుగుచునే యుండెను. పిమ్మట నెట్లనో శ్రీరాజా శోభనాద్రిరావుగారి జ్యేష్ఠపుత్రుఁ డయిన పాపయ్యగారు పరి పాలకులుగ నుంట కంగీకరించిరి. దొరతనమువారుగూడ తమకు రావల సియున్న ఋణమును వదలుకొని యీరెండుపరగణాలకును బాపయ్య గారి నధిపులుగఁ జేసిరి. అయినను విధి బలాఢ్యుఁడుగదా! దొర తనమువారు దమఋణమును దిగనాడిన నేమి? వైరివర్గము నిర్మూల మైన నేమి? ఈ సంస్థానమున కదృష్టదినములు రానే లేదు.

"మ. ధర ఖల్వాటుఁ డొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁడై
త్వరతో డగ్గఱు వెత్తి చేరి నిలచెన్ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్ఛిన్నశబ్దయోగంబుగాఁ
బోరి దైవోపహతుండు వోవు కడకుం బోవుంగదా యాపదల్."

అను భర్తృహరివాక్యానుసారంబుగఁ గష్టంబులు వీరి వెన్నంటియే వచ్చుచుండెను. 1833 వ సంవత్సరములో దుర్భరం బగు క్షామబాధయుఁ దటస్థించెను భూములు ఫలింప వయ్యెను. ఇఁకఁ గప్పము మెట్లు చెల్లఁగలదు? గోరుచుట్టుపై రోఁకటిపోటుంబోలె ద్వితీయ సోదరుఁ డప్పుడె సంస్థానములోని భాగమున కై యొకవ్యాజ్యమును దెచ్చెను. ఇంతియకాక యీసంస్థానక్షైణ్యకారణములలో దొరతనమువారికిఁ జెల్లింపవలసిన కప్ప మధిక మై యుండుటకూడ నొకటి యై యుండెను. * ఈసంస్థానముయొక్క పేష్కష్ మిక్కిలి యెక్కువగ విధింపఁ బడె నని మెకంజిదొరగారు వ్రాసియున్నారు.

ఈ పై కారణములచే దొరతనమువారు 1836 వ సంవత్సరములో జమీని జప్తుచేసి తమయధీనములో నుంచుకొనియు, భావిభాగ్య సూచకము గనిపింప కుండుటచే 1843 వ సంవత్సరములో విక్రయమునఁ బెట్టి మూఁడులక్షలరూప్యములకు దొరతనమువారే స్వాధీన మొనరించుకొనిరి. కాలగతిచే నోడలు బండ్లు బండ్లోడలు నగునుగదా!

"చ॥ లలితనికేతనప్రియవిలాసవతీధవళాతపత్రస
ద్విలసితవైభవం బనుభవింపఁబడుఁ సుకృతానువృత్తిచే
జెలు వగుపుణ్యకర్మము నశించిన నంగజసంగరత్రుట
త్కలితగుణోరుమౌక్తికనికాయము లట్లు దొలంగు సంపదల్."

భర్తృహరి.

1836 వ సంవత్సరములో సంస్థానమును దొరతనమువారు స్వాధీన మొనరించుకొనినదాదిగ శ్రీరాజా పాపయ్యరావుబహదరుగారికిని వారి

---

* "In some cases, especially that of Charmahal, the Zamindars peshcush was fixed too high."

*District Manual.*

సోదరులకును గలిపి నెల కైదువందలరూపాయల మనువృత్తి నిచ్చుచు నుండిరి. వారు తమజమీని దిరిగి తమస్వాధీన మొనరింపవలసిన దని దొరతనమువారికి విజ్ఞాపనమును బంపుకొనిరి కాని కోర్టు ఆఫ్ డైరక్టర్సువారు 1848 నవంబరు 29వ తేదీని దమయసమ్మతమును దెలియఁ బఱచిరి. కాని మనువృత్తిమాత్రము 1843 నవంబరు 20వ తేదీ నుండి నెలకు వేయిరూపాయిలచొప్పున నిచ్చుట కంగీకరించిరి. ఈమనువృత్తి 1850 వ సంవత్సరములో జమీందారుగారికే యిచ్చునట్లుత్తరవు పుట్టెను.

శ్రీరాజా పాపయ్యారావుగారు 1876వ సం॥ జనేవరి 17వ తేదీని స్వర్గస్థు లయిరి. వీరి కప్పటి కిరువురుపుత్రులును నైదుగురుపుత్రికలును గలరు. బోర్డువారు తమ 1982 నెంబరుగల 1876 ఆగస్టు 5 తేదీ యొక్క ప్రొసీడింగ్సులో నా వేయిరూపాయిల మనువృత్తి జ్యేష్ఠు లగు శ్రీరాజా పాపయ్యారావుగారికుటుంబమున కాఱువందలును, నొక్కొక్క కుటుంబమున కొకవందచొప్పున వీరి నాలుగు సోదరకుటుంబములకు నాలుగువందలు నిచ్చునట్లు నిర్ణయించిరి.

శ్రీరాజా పాపయ్యారావుగారికి వేంకట్రామగోపాల జగన్నాథ శోభనాద్రిరావు, వేంకటనరసింహారామచంద్రరావుగారు నను నిరువురు పుత్రులు గలరు. వీరిలో బ్రథములు బుత్రసంతానము లేకయే 1884 మార్చి 17వ తేదీని గతించిరి. ద్వితీయు లగు శ్రీరాజా వేంకటనరసింహారామచంద్రరావుగా రదివఱలోఁదమతండ్రిగారిచేఁ గొనఁబడిన మొర్సగూడెము తాలూకాలోని వేగవరము బొట్టింపాలెము నను రెండెస్టేటులను బాలనము జేసికొని తమపూర్వప్రతిష్ఠను గాపాడుకొనుచుఁ దమరైతుల గౌరవమునకుఁ బాత్రులై 1912 మార్చి 17వ తేదీని స్వర్గస్థులైరి. వీరికి ముప్వురు పుత్రులును నిరువురు పుత్రికలును గలరు. పుత్రసంతానములోఁ బ్రథములును బ్రస్తుత వేగవర బొట్టింపాలెముల జమీందారులును నగు శ్రీరాజా వేంకట వరద రాజ శోభనాద్రిరావు బహాదరుగారు చారుమహాల్ సంస్థానచిహ్నం

బుగ దొరతనమువారిచే నొసఁగఁబడుచున్న మనువృత్తి నందుచు గురజయందే నివసించుచుండిరి. ద్వితీయ తృతీయ సోదరులును స్వస్థానమునందేయుందురు. మైలవరాధిపులైన శ్రీరాజా వేంకటపాపయ్యారావుగా రీసోదరత్రయములో మూఁడవవారగు శ్రీరాజా కమదన వేంకటరామారావుబహదరుగారికి తమ పుత్రికారత్నము నొసంగి పరిణయ మొనరించిరి. వీరును, శ్రీరాజా వేంకటవరదరాజశోభనాద్రిరావు బహదరుగారును దమపూర్వికులసుగుణసంపదలయందునుదీసిపోవక బీద సాదలయందు దయార్ద్రభావము గలిగి మెలంగుచున్నారు. వీరికిని వీరి కుటుంబమునకును భగవంతుఁ డిష్టైశ్వర్యములను నాయురున్నతులనుఁ గూర్చుఁగాత.

---



శ్రీ రాజామంత్రి ప్రెగడ భుజంగరావు బహదర్
జమీందారుగారు.



శ్రీరస్తు.

# మంత్రిప్రెగడవారిసంస్థానము.

ఏలూరు-కృష్ణాజిల్లా.

---

సీ॥ విద్వత్ప్రభుండయ్యు • విద్వత్సభల సల్పి
విద్వాంసులను గౌర • వించు నెవరు?
బహుమతు లిచ్చు స • త్ప్రభుండయ్యు నవధాన
గరిమం దా బహుమతుల్ • గాంచి రెవరు?
సత్కావ్యరచనావి • శారదుం డయ్యును
కృతికన్యకల వరి • యించు నెవరు?
రాజేంద్రుం డయ్యును • రాజభక్తిప్రపూ
ర్ణత గ్రంథరాజముల్ • వ్రాసి రెవరు?
గర్తపురసత్రనిర్మాణ • కర్త యెవ్వ
రట్టి మంత్రిప్రెగడ నిర్మ • లాన్వవాయ
జలధిచంద్రుండై తగు శ్రీభు • జంగరాణ్ణృ
పాలు నాయురున్నతి నీశుం • డేలుంగాత॥

శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహాదరుగారు

"సీ॥ అఖిలరాజాధిరా • జాస్థానజనహృద్య
విద్యావిహారు లా • ర్వేలవారు
కల్పకబలికర్ణ • కలశార్ణవోదీర్ణ
వితరణోదారు లా • ర్వేలవారు

సజ్జనస్తవనీయ ♦ సతతనిర్వ్యాజహా
రిపరోపకారు లా♦ క్వేలవారు
ఘనదుర్ఘటస్వామి ♦ కార్యనిర్వాహణప్ర
వీణతాధారు లా♦ క్వేలవారు
గీ॥ విమతగర్వాపహారు లా♦ క్వేలవారు" అనియు—

"సీ॥ ఒకచేత గోముఖం ♦ బొకచే శిలీముఖం
బెవ్వారు ధరియించి ♦ రేపుమీఱ
నొకవంక వేదంబు ♦ నొకవంక భేదంబు
నెవ్వారు దాల్చి ర♦హీనబుద్ధి
నొకకంట యోగంబు ♦ నొకకంట భోగంబు
నెవ్వారు వరియించి ♦ రిద్ధశక్తి
నొకచో నుపేంద్రుని ♦ నొకచో సురేంద్రుని
నెవ్వారు సేవించి ♦ రింపుతోడ
గీ॥ నాగ్రహానుగ్రహసమర్థు ♦ లైరి యెవరు
శాపమునఁ జాపమున శక్తిఁ ♦ జూపి రెవరు
బ్రాహ్మ్యమున క్షాత్రమునఁ గూడఁ ♦ బ్రబలి రెవ్వ
రట్టివా రాఱువేలవా ♦ రవనియందు॥"

అనియు సనాతనాధునికకవిపుంగవులచేఁ గొనియాడఁబడిన శ్రేష్ఠమగు నియోగిశాఖయం దుద్భవించి కృష్ణాగౌతమీ మండలముల రెంటియందును బ్రసిద్ధము లై యున్న లక్కవరము, జంగారెడ్డిగూడెము, బయ్యనగూడెము, బిల్లుమిల్లి, పెల్ల మొదలగు ముఖ్యగ్రామములకుం బరిపాలకు లై ప్రజలం గన్నబిడ్డల తెఱంగునం గాంచిరి.

వీరిపరిపాలనముక్రింద 48 చతురపుమయిళ్ళ నైశాల్యము గల ప్రదేశము గలదు. దీనిపై సంవత్సరమునకు రు 50,000 ల యాదాయము వచ్చుచున్నది. ఇంకను గృష్ణా గోదావరీ మండలములయం దచ్చ టచ్చట సీనాములు మొదలగు నితరాదాయముగూడ మఱికొంత

వచ్చు చుండును. ఏ ఏటట దొరతనముకుఁ గారి కన్ని బాపతులును గలపి మొత్తము రు 10,000 లు పేష్కషు చెల్లింపఁబడు చున్నది.

ఈవంశమునకు మూలపురుషు లగు మంత్రి పెగడ గుత్తారాజుగారు కులప్రతిష్ఠలం గాంచి శివపూజాధురంధరు లై బంధుమందారు లయి రనుటకు—

"మ॥ అతఁ డేలూరుపురాన శైవు లట తా ♦ మర్చించినంగాని ము
న్నితరుల్ శంభుని బూజసేయవల దం ♦ చేర్పాటుగా దేవతా
యతనం బడ్డఁగ నాగ్రహించి యపుడే ♦ యన్యాలయంబున్ లస
ద్గతిఁ గట్టించి ప్రతిష్ఠఁ జేసె నల మా♦ర్కండేయగంగాధరుఁ॥"

అను నీపద్యమువలన నెల్లరికిఁ దేట తెల్లము గాఁ గలదు. ఇట్లు దైవకార్యములయందును, రాజకార్యములయందును భక్తిశ్రద్ధలు గలిగి యసమానుండని పలువురిచేఁ గీర్తింపఁబడి భోగదేవేంద్రుం డయిన గురురాజామాత్యప్రభువతంసమునకుఁ గీర్తిరాశియు, నశేష సుగుణభూషణుండును, నాశ్రితకల్పద్రుమకుండును నగు నప్పలరాజమంత్రిశేఖరుం డుదయించి—

"శా॥ శ్రీమంత్రి పెగడాన్వయం బవికల♦శ్రీ నొప్పఁ దజ్జాతుఁడై
హేమాద్రిస్థిరధైర్యుఁ డప్పలధరా♦ధీశుండు వైమానిక
స్వామిం గన్నడ సేయుభోగమున భూ♦చక్రంబు పాలించెఁ బ్రో
ద్దామప్రాభవశక్తి నర్థికులమం♦దారం బతం డల్పుఁడే॥"

అను దిగంతవిశ్రాంతకీర్తిం గాంచి మించిన యప్పలధరాకాంతుం డొనర్చిన సకలజనోపయోగంబు లగుకార్యంబు లనేకంబులు గలవు.

"సీ॥ ఏచాఁ గనుగొన్న ♦ నాదయామయు నన్న
సత్రముల్ మృష్టాన్న♦సమితిఁ బెట్టు
నేభూమిఁ గాంచిన ♦ నాభోగి కించిన
కొలఁకులు నిర్మల♦జలము లొసఁగు
నేదిక్కుఁ జూచిన ♦ నాదాత ప్రోచిన
వనపఙ్క్తు లుత్కృష్ట♦ఫలము లీను

నేనేలఁ జుట్టిన ♦ నానేల గట్టిన
దేవళంబులు స్వామి ♦ సేవ లిచ్చు
గీ॥ నేనెలవు నొసంగినను గాని ♦ యానృపాలు
చరిత మానందకంద మై ♦ సజ్జనులకు
వాంఛితార్థంబు లెల్ల స♦ఫలము సేయు
రాజమాత్రుండె యప్పల♦రాజవరుఁడు॥"

ఈమహామహునకు వాక్పటుత్వమును, భూభరణనిపుణత్వమును సత్యసంధతయు, నుదారధైర్యసాహసంబులును గల భుజంగరాయాభిధేయుండు నందనుండై జన్మించె. అయ్యనఘుండు లక్కవరాదిముఖ్యగ్రామపరిపాలకుండై యుండి రాజా బహదూరు బిరుదంబులను సంపాదించి వంశంబునకు వన్నె వెట్టెను.

"సీ॥ నైలింపసైంధవ ♦ నవనవపరిస్ఫూర్తి
సారసపజ్క్తులో ♦ సరస మాడి
మందరాహార్యని♦ర్మథితదుగ్ధపయోధి
డిండీరకాండంబు ♦ డింద పఱచి
పూర్ణిమాచంద్రికా ♦ స్ఫూర్తి విస్ఫుటతర
కైరవసారంబుఁ ♦ గేరడించి
రాజితగిరిచర♦ద్రాజశేఖరగాత్ర
కమనీయకాంతులఁ ♦ గలఁత పఱచి
గీ॥ దశదిశాభిత్తికాసుధా♦దశ వహించి
రాజిలు భుజంగరాయ ని♦ర్మలయశంబుఁ
గనులఁ గాంచిన ముద మందఁ ♦ గల్గుఁ గాక
దాని వాక్రుచ్చు నంత మే♦ధావి గలఁడె॥"

కీర్తిసాంద్రుం డగు భుజంగేంద్రుండు బంధ్వాదరణం బనునాభరణభూషితుండును, దానశౌండత యను రూపవంతుండును, నజాతశత్రుత్వం బనుసుగుణసంపన్నుండును నై

"సీ॥ చిన్నమాదేవితోఁ ♦ జిన్నారిపొన్నారి
చిన్నెలు జూపెను ♦ చిన్ననాఁడు

శేషమాదేవి క♦శేషవిలాసవి
శేషము ల్జూపె వి♦శేషవృత్తి
సీతమాదేవిఁ గా♦శీతలవాహినీ
శీతభోగంబుల ♦ చేతఁ దనిపె
రంగమాదేవిని ♦ రంగారుప్రాసాద
రంగంబులం దల ♦ రంగఁ జేసె

గీ॥ ఇట్లు చతుర్వర్గలక్ష్ముల ♦ నెనసి నట్లు
నల్గు రింతులతోడ మ♦నంబు దనియ
భోగదేవేంద్రుఁ డనఁగను ♦ బొలుపు మీఱె
నితని సామాన్యవిభునిగా ♦ నెంచ వశమె."

సకలవేదశాస్త్రేతిహాసపురాణగాథల యందు నిపుణుండై దుష్టశిక్షణశిష్టరక్షణదక్షుండై బుద్ధికౌశలంబునఁ గోటానకోట్లు ధనంబు సంపాదించి, యగణితంబు లగుసాధరాజంబుల నెలకొల్పి ప్రాభవాధికు లగు రాజన్యులతోఁ దుల్యంబుగ మైత్రి నెరపి జగంబునం బూజ్యతం గాంచెను.

"సీ॥ గోత్రపావనుఁ డయ్యు ♦ గోత్రాధిపతి యయ్యు
భూరిభోగమున గో♦త్రారి యయ్యెఁ
గమలనేత్రుం డయ్యుఁ ♦ గమలాప్రియుం డయ్యు
నౌదార్యమునఁ గమ♦లారి యయ్యె
దానవీరుం డయ్యు ♦ దానశూరుం డయ్యుఁ
బాలనంబున దాన♦వారి యయ్యెఁ
బురపాలకుం డయ్యుఁ ♦ బురుషోత్తముం డయ్యు
నరిఖండనమునఁ బు♦రారి యయ్యె

గీ॥ ననుచు జగదభినుతిఁ గాంచె ♦ నమ్మహేంద్రుఁ
డాకళానిధి యానృపా♦ర్యక్షుఁ డావ
రాజితద్విజరాజమా♦ర్థన్యుఁ డాభు
జంగరాజన్యుఁ డాభృత ♦ సజ్జనుండు॥"

"సీ॥ అఖిలవిపశ్చిజ్జ♦నావళి కెడయక
కాంక్షితార్థము లిచ్చు ♦ కల్పశాఖి
బహుతరప్రత్యర్థి♦బంభరసమితికిఁ
బృథుపుష్పభరతచాం♦పేయశాఖి
దారిద్ర్యసంతాప♦తప్తార్థులకుఁ బత్త్రి
గురుభరం బైన న్యగ్రోధశాఖి
యమితఫలంబుల ♦ నాశ్రితులకు నిచ్చు
సురుచిరవాసంత♦చూతశాఖి

గీ॥ చిత్రము భుజంగరాయఁ డీ♦ చెట్టునందు
మల్లికార్జునపుష్పము♦తల్లి గల్గి
భవ్యమంత్రిపెగడవంశ♦వనము నెల్ల
వాసి మీఱంగ వాసింపఁ ♦ జేసె నహహ!॥"

ఈ భుజంగనృపాలతిలకంబునకు మల్లిఖార్జునపుత్త్రతిలకంబు బుట్టి తండ్రితాతలయశంబులకు వన్నియ వెట్టుటంగాంచి లోకంబున—

"మ॥ ఒనరన్ దానము లొక్కచేత నిడ వే ♦ లుండంగదే మల్లికా
ర్జునరాయండు భుజాసహస్రకముచే ♦ శోభిల్లునో కార్తవీ
ర్యునిపోల్కిం దగ దానవేళ నిదియే♦యూహింప నో వాని య
ర్జునసంజ్ఞాపద మిట్టియర్థమును సం♦సూచించు నం డ్రెల్లరున్॥"

ఈతండు రాజశేఖరుం డై యెల్లెడల నన్నదానసత్రంబులును, భూదానపత్త్రంబులును నిల్పె. హేలాపురంబున మార్కండేయేశ్వరాలయంబున భక్తిప్రపత్తులు రాజిల్ల వీరభద్రేశ్వరుం బ్రతిష్ఠించె. వెల్లమున్నగుపంటపొలంతుల ధర్మనియుక్తిం బరిపాలించె. తనపాలనంబున విజయలక్ష్మిం గైకొని విజయలక్ష్మీవరుం డై యేకపత్నీవ్రతస్థుం డనుబిరుదంబు రాజా బహదూరు బిరుదంబులకు వన్నెయు, వాసియుం గల్పింపం బ్రవర్తిల్లు నమ్మహామహుం గీర్తింపఁ దరంబు గాదు.

"సీ॥ ఎవనిపరాక్రమం । బినుప్రతాపముఁ గ్రిందు
పఱుప భానుఁడు శీత । భానుఁ డయ్యె
నెవనిదానము కల్ప । వృక్షంబు మీఱఁగా
దేవత లెల్ల భూ । దేవు లయిరి
యేసభ్యుకీర్తిన । దీసంగమంబున
వార్ధి యిమ్మహి క్షీర । వార్ధి యయ్యె
నేమహీపాలుండు । భూమిపాలింపంగ
రాజ్యంబు శ్రీరామ । రాజ్య మయ్యె

గీ॥ నతఁ డతిగభీరుఁ డతిధీరుఁ । డ త్యుదారుఁ
డభ్రగంగాప్రవాహాంశు । భ్రాంశుహంస
హీరసీహారఘనసార । సారకీర్తి
మల్లికార్జునరాయాఖ్య । మహితమూర్తి॥"

ధర్మాత్ములా లగు శ్రీమహావిజయలక్ష్మి సహధర్మిణి యై తన సేయుధర్మకార్యంబులకుఁ దో డగుటం జేసి సత్రంబులం గట్టించి యభ్యాగతులకు షడ్రసోపేతభోజనంబు లిడి బీదలదుర్భిక్షభయంబు మాన్పె.

అట్టిదానశీలురును, దయాస్వరూపులును, బంధుహితులును, నిజరాజ్యదేవేంద్రభోగులును నగు దంపతులకు సుగుణసంపన్నుండును, సత్యసంధుండును, విద్యావంతుండును, శాంతస్వరూపుండును నగు భుజంగరాయాభిధేయుండు నందనుం డై విరాజిల్లెను. వీరు 1877 వ సంవత్సరమున నేలూరునందు జన్మించి, యేలూరు సి. యం. యస్. హైస్కూలులో నాంగ్లేయవిద్య నభ్యసించిరి. చిన్నతనంబునుండియు సంస్కృతాంధ్రభాషాభిలాషు లై తత్తద్భాషలయందుఁ బ్రజ్ఞను సంపాదించిరి. హిందుస్థానీభాషనుగూడ నభ్యసించిరి.

ఈ భుజంగప్రభుని బాల్యంబున రాజ్యంబు కోర్టు ఆఫ వార్డ్సు వారి యాధిపత్యంబున నుండి వీరికి విద్యాబుద్ధు లలవడినపిదప నసఁగా 1897 వ సంవత్సరము, ఏప్రియల్ 26వ తేదిని రాజ్యంబు నొప్పఁ

జెప్పిరి. నాఁటంగోలె స్వయముగ ధర్మంబుఁ దప్పక పరిపాలించు చుండిరి. స్వయముగ వీరియాధిపత్యముక్రిందనే పరిపాలనాప్రదేశం బంతయు నుద్యోగిజనంబుల నియమించి కొలిపించి, తొల్లింటి యిజారా పద్ధతిని రైతులయిష్టంబుననే మార్చి రయితువారీపద్ధతిని నెట్టివైషమ్య ములును బ్రజలయందుఁ బుట్ట కుండ శిస్తు కట్టిరి. 1907 వ సంవత్స రమున శ్రీరాజావారు తమ పరిపాలనలోని హనుమాన్‌లంకలో నీటి యంత్రము నొకదానిని స్థాపించి రయితుల కుపదేశముసేయునిమి త్తము వేలకొలఁది ద్రవ్యమును వెచ్చించి పరీక్షలయం దారితేరిన వ్యవసాయపరిజ్ఞాతలను దూరదేశములనుండి పిలిపించి చెఱకు, ఉరల గడ్డలు, వేరుసెనగ, ప్రత్తి మొదలగు పలువిధము లగు సస్యములను బయిరుసేయించి జనంబులకుఁ బ్రదర్శించిరి. తను జమీలోఁ బండించు టకు వీలులేని వనప్రదేశములను బహిరంగ మొనర్చి పుడమిని బంటపొలం తిగ నొనర్చిరి. నిర్జనప్రదేశములును, నిర్జలప్రదేశములును నగు మఱికొన్ని తావులయందు గ్రామంబులు గట్టించి జలాధారంబు లేర్పఱచి భూము లొసంగి సర్వసంపన్నము లగుస్థలములుగా మార్చిరి. శిథిలము లయిన చెరువులను బరిశుభ్రముగా బాగు చేయించి వానికిందగిన నీటికాలవల వాటంబుగ నెలకొల్పి యనేకప్రదేశముల యందుఁ దూములు ము న్నగునాధారంబులు సమకూర్చి రయితులకు మహోపకారం బొనర్చిరి. రయితులకును దమకును నెట్టికలతలును లేకుండుటయే వీరియోగ్య పాలనంబునకు నిదర్శనము.

1900వ సంవత్సరమునఁ గఱవుబాధచే గోయవాండ్రు జంగారెడ్డి గూడెముచుట్టునుంగల గ్రామాదులపయిం బడి బాధించు చున్నతఱి నట్టి కష్టంబును మాన్పుట కై దొరతనమువారు సైనికోద్యోగులఁ బంపఁ దత్సమయంబున శ్రీరాజావారును జంగారెడ్డిగూడెమున నివాసము చేసి కోయవాండ్రదౌర్జన్యము నణంచువిషయమునఁ జాల సాహాయ్యము దొరతనమువారియుద్యోగిజనంబున కొనర్చుటయేకాక, బందిపోటు రాటునం బడి పాడయిన రాష్ట్రజనంబులలోను జాలమందికి వేల కొలఁది ధన ముచితముగను,బదులుగను నొసంగి వారి నెల్లర నాదరించిరి.

"సీ॥ బీదసాదలు సేయు ♦ విజ్ఞాపనంబులు
బింక మింతయు లేక ♦ వినెడివాఁడు
విని పరామర్శకుఁ జే♦ప్పిన వారి వారిలో
మంచిసెబ్బలను గు ర్తించువాఁడు
గుర్తించి ధర్మపు ♦ గురితప్ప కురువ మై
యొసఁగుతీరుపులు దా ♦ నొసఁగువాఁడు
ఒసఁగి తా నొసఁగిన ♦ పసమీఱున్యాయముల్
నడుపఁగా సంతోష♦పడెడువాఁడు

గీ॥ నిజమునకు తాణ నలువరా♦ణికి తికాణ
విడుపునకుఁ డెంకి లుబ్ధుల ♦ విఱుచు వంకి
కరుణకు బిడారు మేల్రాచ♦సిరి గుడారు
తారు సరదారుఁ జమీం♦దారుఁ డరయ."

అని వీరిసద్గుణాతిశయంబుం గూర్చి వే నోళ్ళ నుద్ఘోషించు చున్నారు. మఱియు వీరు గుఱ్ఱపుసవారునందు సమానులనుట కీక్రింది పద్యము నుదాహరించెద—

"సీ॥ పల్లంబుపై నెక్కి ♦ వాఁగె వట్టినఁ జాలు
గోడలు మేడలు ♦ గుప్పళించు
జాళ్ళంబు గోలిపి ను♦వాళించి వదలినఁ
బేటలుఁ గోటలు ♦ పెక్కు దూఁకు
మఱి గరాళించి హు♦మాయించి విడిచినఁ
దరువులు చెరువులు ♦ దాఁటు వాఱుఁ
గళ్లెంబు సడలించి ♦ కావాతరటు గొల్ప
గుంపులుఁ గొండలుఁ ♦ గూల దాఁటు

గీ॥ నౌర యాస్కందితము వారె ♦ ధౌరితమ్మ
యారె ప్లుత మారె రేచిత ♦ మహహా వల్గి
త మ్మనుచుఁ దోడుదొరలు చి♦త్రముసఁ జూతు
రతని జహఁగీరాణబహదు ఖాన్ ♦ కరిది సాటి."

వీరు పురాతన మగు వేగాయమ్మపేటజమీాందారువా రగు మహారాజశ్రీ వాడ్రేవు సుందరప్పగారిమనుమరాలిం బరిణయ మైరి. శ్రీఖాశింకోట పోలవరము జమీాందారులకు బంధువులు. ఏలూరు మునిసిపాలిటీలోను, దాలూకాబోర్డులోను, జిల్లాబోర్డులోను గొంతకాలము సభ్యులుగా నుండి దొరతనమువారిచే గౌరవపత్రముల నందిరి.

"సీ॥ రా జౌట నిజ మయ్యు • రశ్మి కాశింపఁడు
కందు లే దెచటఁ జ•క్రములఁ బ్రోచు
నరసింహుఁడే కాసి • పరుసముల్ వలుకఁడు
శాంతి యొప్పెడు పుణ్య•జనుల నేలు
ఘనుఁడు వాస్తవ మయ్యు • గర్జించి మిను ముట్టఁ
డప్పులు లేవు రా•యంచ లెనయు
నినుఁ డంట సత్యంబు • హృదయభేదము సున్న
స్థైర్య మెక్కుడు చల్ల•దనము నొమ్ము
గీ॥ తాను భోగీంద్రుఁ డగుట త•థ్యంబె కాని
క్రిందఁ గ్రాలఁడు నాలుకల్ • రెండు లేవు
నోట నమృతంబు చిలుకుఁ గ•నుంగొనంగఁ
జిత్రము భుజంగరాయ చ•రిత్రగరిమ."

అని వీరిచరిత్రమును, గుణాతిశయంబులును దేశంబున నెల్లెడల వ్యాపించె ననుట కించు కంతయు సందేహము లేదు. వీ రేలూరులోను, బెజవాడలోను నన్నసత్రములును, గోదావరీమండలమునందలి వీరిపరిపాలనలోని వెల్ల యన్నుగ్రామసమీపమునం గల సావర మను నూర రోగిష్ఠిజనంబులు నివసించుట కొక సత్రంబును నిర్మించుటయ కాక గుంటూరుపురంబున మిషన్ ఘోషా వైద్యశాలాసమీపంబున రుగ్ణజనసౌకర్యార్థంబు ముప్పదికుటుంబంబు లన్యోన్యసమ్మర్దంబు లేకుండ నివసించుట కనువగు నొక్క గొప్పసత్రమును నిర్మించి దిగంతములయందుఁ దమకీర్తిచంద్రికలు వెల్లివిరియ న ట్లొనరించిరి.

"సీ॥ చూచెనా సరసార్థ ♦ సూచనాయతి మృగీ
లోచనాహృదయముల్ ♦ దోఁచి చూచుఁ
జూచెనా కనకాభి♦షేచనాయతదృష్టి
యాచనాగతుల నిం ♦ పారఁ జూచుఁ
జూచెనా క్రూరాగ్ని♦లోచనాహుతిఁ బరా
లోచనాహతముగాఁ ♦ నేచి చూచుఁ
జూచెనా భవబంధ♦మోచనానూనవి
వేచనాశక్తిఁ గా♦విం చి చూచుఁ

గీ॥ జూపు లన నిన్నిచూపులు ♦ సూడ నేర్చెఁ
బేరునకు వేయికన్నుల ♦ వేల్పు గాక
యిట్టిమహిమంబు లతనియం ♦ దేడఁ గలుగు
నింద్రుఁ డెట్లీడు భుజగము♦హేంద్రమణికి."

విద్యావిషయంబున వీరు మొదటినుండియు నాసక్తిగలవారనుటకు వీరు పలుమందివిద్యార్థుల కన్నదానాది సౌకర్యంబు లొనర్చుటయు, నితరదేశంబులకుఁ బలువిధంబులగు విద్యల నభ్యసించువారిం బంపి వారి కగు ధనవ్యయమును సహించుటయుఁ బ్రబలనిదర్శనము.

మఱియు వీరు 1899 సంవత్సరము డిశంబరు 31వ తేది భానువారము మధ్యాహ్నము రెండుగంటలకు వీరిసత్రిభవనమునం దష్టావధానవినోదమును విద్వత్కవిసభయందుఁ గావించిరి. తత్సమయంబున మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారగ్రాసనాధిపత్యము వహించి యుండిరి. అవధానంబున శ్రీవారవలీలగ నవధానంబు లన్నింటిని జక్కఁగ నిర్వహించిరి. పరీక్షకులెల్లరు సరిసరి యనిరి. తర్వాత సభాధిపతిగారు శ్రీవారి యోగ్యతాతిశయంబు సమయసముచితంబుగం బ్రశంసించిరి. మఱియుఁ దమ యానందాధిక్యముం దెలుప శ్రీవారినిగుఱించి తమరచియించిన యమూల్యమయిన బంగారుపద్యంబు లను బాచరత్నంబులం దమరే పఠించిరి. అందలి నొకటిరెండుపద్యముల నిం దుదహరించెద—

బంగారము. "శ్రీహర్షునివలెను ♦ జెల్లఁగు మీరా వంధుమూ
శ్రీహర్షుఁడవె యయి ♦ చెలఁగు చుందు ♦ సిద్ధముగా
విక్రమాదిత్యుని ♦ వితమున నగు మన
నీవె త్రివిక్రమ♦నీతి మింతు ♦ నిరుపమతన్
భోజుని యోజను ♦ బొగ డొందు ముందుమా
భూవిభుధేంద్రుండ ♦ నీవె సుచరి♦తావనతన్
జయి వయి కృష్ణుని ♦ సత్కీర్తిఁ గనుమునా
నతని కన్న యభిఖ్య ♦ నలరె దీవె ♦ యతనికన్న

గీ॥ యత్నమున నేని నిర్ దొర♦యం గలారె ♦ యావిబుధుల్
మానవులమాట యేటికి ♦ మఱికవి యిట ♦ మాన్యతమై
యిట్టు లాశీర్వదించు ని ♦ న్నలమికలిమి ♦ హితముగ నే
క్షమను గ్రహియింపు రాజభు♦జంగరాయ ♦ సద్విధేయ.

బంగారము. వాకట్టుఁ గట్టించి ♦ వరలెద వఁట నీవె
యందఱ కిష్టమృ♦ష్టాన్న భుక్తి ♦ హర్షముగాఁ
గట్టింతు వఁట నీవె ♦ పుట్టంబులనె యొంద
అను ప్రబంధుం డన♦ నెనయ ముదము ♦ ఘనుఁడవుగా
ముసుఁగు వేయించుచు ♦ నెసఁగెద వఁట నీవె
సత్పండితులకును ♦ సాలువులను ♦ శ్లాఘ్యముగాఁ
జేకట్లు కట్టించి ♦ చెలఁగెద వఁట నీవె
కవివరులకుఁ బైఁడి ♦ కడియములనె ♦ ఖ్యాతిగదా

గీ॥ భర్మభూయంత్రములనుస్తం ♦ భన మొనర్చి ♦ వంన్యాఁడె యూ
నా ప్రభాకరునే యాగి ♦ తేఁట యెటువలె ♦ నారసిరో
యొక్కఁ డిక్కవిమణి నీకుఁ ♦ జిక్కె నిపుడు ♦ చక్కఁగాను
సత్కవీశ్వరరాజ భు♦జంగరాయ ♦ సర్వగేయ."

అని పొగడిరి. తదనంతరము మంచి వెలగల స్వీయము లైన రెండుకాశ్మీరపుసాలువుల శ్రీవారికి భూసురాశీర్వచనపూర్వకంబుగఁ గప్పి బహూకరించిరి. అంతియకాక, 'శ్రీమద్విద్వత్కవిరాజునలై

బ్ర॥ మ॥ శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహాదరు జమీం దారువా రష్టావధానబిరుదాంచితు లయి' రని పేర్కొనిరి. ఆయొప్పి దముం గని—

"సీ॥ సిన్నటిమనరాజు ♦ నెగడెను గవిరాజ
నం గళాపూర్ణుం డ♦నంగఁ గొంద
అంతగా దీతఁ డ♦ష్టావధానిగఁ దగె
నిది యచ్చెరువె యంచు ♦ నెంచఁ గొంద
అది యచ్చెరువె మెచ్చి ♦ యాకవివరునకుఁ
గవిరత్న మిచ్చె సా♦ల్గ వనఁ గొంద
అదియెంత వింత ప♦ద్యంబులు బంగార
ములు పంచరత్నముల్ ♦ పోలు పలరెడు
గీ॥ ననఁగఁ గొందఱు భాగ్యమా ♦ ననఁగఁ గొంద
ఱీకను బ్రతిసత్కృతి యదెట్లు ♦ నెగడునొ కన
వలయు ననఁ గవిరాజులు ♦ చెలఁగి రంత
రెండుకన్నులవలెఁ బొల్చి ♦ రొండొరువులు."

ఈవిధంబున సభ్యు లానందకందళితహృదయారవిందు లై యు న్నతఱి రత్నకవిగారికిఁ దిరుగ ననర్ఘ్యంబు లగు సాలుజోడు నొసంగి శ్రీవా రాదరపూర్వకంబుగ గౌరవించిరి.

శ్రీవారు కవితాధోరణి యలవడినపిమ్మటఁ గేవలకవిత్వవిషయ మున నే మనస్సును నిర్బంధపఱుపక పూర్వకవికృతసంస్కృతాంధ్ర గ్రంథముల నామూలాగ్రముగఁ బఠించి వానిసారముం గ్రహించిరి. పఠించుటయేకాక యుత్తమగ్రంథములలో నెన్నికం గన్న పద్యరాజం బులఁ గంఠస్థంబుగ నొనరించుకొని సమయస్ఫూర్తిగఁ బఠించు చుండు నలవాటు గలవారు. బాల్యంబునుండియు గ్రంథరచన యందు దారితేరి సద్గ్రంథనిర్మాణమునకుం గడంగినవారు. వీరు శ్రీవిక్టోరియామహారా జ్ఞీగారిచరిత్రమును వసంతకుసుమ మనుప్రబంధంబుగ రచియించు నప్పు డిట్లు తాము తమగ్రంథరాజమున నుడివి యున్నారు—

సీ॥ కవిత నా నున్మాద♦కల్ప మీ యది గల్గ
సాగింప కుండంగ ♦ శక్య మగునె
యది నాకు విద్యల ♦ నభ్యసించుచు నుండఁ
గల్గి బాల్యంబుతోఁ ♦ గలసి కొఱఁతఁ
గన నీయ కుంట శృం♦గారరసప్రవా
హిని నలనాటక♦మును మొద లగు
గ్రంథముల్ రచియించి ♦ కాలాంతరమున స
త్కవికావ్యరత్నముల్ ♦ గాంచి యందు

గీ॥ ధ్వనిరసచమత్కృ యాదుల ♦ మనము నంటి
నా యపాండితి రసవిహీ♦నత మొద లగు
లోపము లెఱింగి గ్రంథవి♦లోకనమ్మొ
కర్జముగఁ గొంతకాలము ♦ గడపి మఱియు."

మంజువాణీముద్రాక్షరశాల నొకదాని స్థాపించి జీర్ణములు కానున్న యనేకము లగుపురాతనసంస్కృతాంధ్రగ్రంథముల నుద్ధరించి ముద్రింపించి సర్వజనోపయోగముగఁ బ్రకటన మొనరించి నట్లీదిగువ పద్యమువలనఁ దెలియుచున్నది—

"గీ॥ సంస్కృతాంధ్రకృతుల్ గొన్ని ♦ చదువఁ జగువ
వాని యం దభిలాష మ♦నూన మగుట
ఘనత మంజువాణీపత్రి♦కాముఖమునఁ
బ్రకట మొనరించు చుంటిని ♦ వానిఁ బిదప."

ఈవసంతకుసుమమును రచించుటకుఁ బూర్వమే యనేకగ్రంథముల నొనర్చిరి.

"సీ॥ లోకానుకారస♦మాకలితంబుగా
నలవరించితి రాజ♦హంసి నొకటి
కమనీయమృదుకథా♦రమణీయ మై యుండ
రచియించితిని మనో♦రమ నొకండు

వారనారీసుష్టభావంబు లెఱుఁగింపఁ
గావించితిని వారకాంత యొకటి
కల్మషంబుల నెల్లఁ గడకొత్తఁగా రచిం
చితిని మార్కండేయశతక మొకటి

గీ॥ యమరఁ దారావళులును బ్రహసనములును
జేసి యష్టావధానంబుఁ జేసి వేడ్క
మఱియు విక్టోరియారాజ్ఞిమహితచరిత
చంపువును జేయఁ గడగితి నింపుగులుక."

అని శ్రీవారు రచించినపోల్కిఁ దమకవితాశయ్య పరిపాకదశం జెందినయనంతరం బింపుగుల్కు నాటకంబు లెన్నియో రచియించి క్రైస్తవవేదగ్రంథ మగు బైబిలును రసవంత మగు శైలిని బద్యకావ్య ముగ నెక్కుడుయుత్కృష్టగ్రంథమును రచించి సర్వపండితాదరణమును వహించిరి. గౌరవార్థంబుగ లార్డు బిషఫ్ (Lord Bishop) దొరగారు శ్రీవారి కొక స్వర్ణమయాలంకారచిహ్నము (gold Locket) నొసంగి సన్మానించిరి.

వసంతకుసుమమును రచించునప్పటికే పూర్వరాజన్యచరిత్రంబు లన్నియుఁ బండితులచే గ్రంథస్థము లగుటం జేసి—

"మ. ధరణిం బూర్వమహీశసత్కథలు పెద్దల్ కావ్యము ల్సేయుటన్
విరచింపం దొరకొంటి నే నిపుడు శ్రీవిక్టోరియారాజ్ఞిస
చ్చరితం బాధునికావనీపతులలోఁ జర్చింపఁగా నీమెతోన్
సరి యేవారు లభించు టబ్బురము శశ్వత్కీర్తిసంపత్తులన్."

అని రాజభక్తియు—

"శా॥ ఆరాజ్ఞీమణిసచ్చరిత్రమును గావ్యంబుగా రచింపంగ నే
నారంభించితి సాహసించితిఁగదా హాసాస్పదం బొదునో
గౌరీనాథుఁడు వంశదైవతము మార్కండేయశంభుండు నా
కారాధ్యుండయియుండ బెగ్గిలఁగ నేలా యిందుమున్మున్నుగాన్"

అని దైవభక్తియుఁ బ్రకటించుచు నేతద్గ్రంథము నాస్వామివారికే యంకితమొనర్చిరి. పదంపడి శ్రీజార్జిప్రభువువారి పట్టాభిషేకసమయసూచకంబుగ నాఁటిదినంబున భక్తజనాహ్లాదంబుగ భక్తసులభుండగు మార్కండేయేశ్వరస్వామివారిమండపముం గట్టించి యుత్సవంబు నెరపిరి.

ఈ యుదారసాహసవిద్యాసంపన్నుండగుభుజగేంద్రుం డిరువదియేడుపద్యకావ్యంబులను, బదినాటకంబులను, బదునాలుగువచనకావ్యంబులను, మూఁడాంగ్లేయగ్రంథంబులను రచియించెను. ఇతరపండితకవులచే రచియింపఁబడిన నేఁబదిగ్రంథములకుఁ గృతినాథుఁడై తత్తద్గ్రంథకర్తల ఘనంబుగ గౌరవించెను. మఱియు వీరు పదునేను పురాతనకవికృతకావ్యరాజంబుల నచ్చొత్తించిరి.

1903 సంవత్సరపు జనవరి 1వ తేదిని శ్రీ యెడ్వర్డుచక్రవర్తిగారి పట్టాభిషేకమహోత్సవసమయమున శ్రీవారి విద్యాపరిశ్రమముం గూర్చి సంతసించి శ్రీభారతనమువారు గౌరవపత్త్రంబు నొకదాని సమహనీయున కొసంగిరి.

1910వ సంవత్సరమున కొల్లూరు విబుధవిద్యాసంవర్థనీసభకును 1916వ సంవత్సర మున గుంటూరులో జరిగిన యైదవసంవత్సరచెన్నపురాంధ్రసాహిత్యపరిషన్మహోత్సవసభకునుఁ అగ్రాసనాధిపత్యమును వహించిరి.

శ్రీవారు రచించిన గ్రంథములలోఁ గొన్నింటిని భారతనమువారు పాఠశాలాపఠనగ్రంథములుగా నంగీకరించి యున్నారు.

1909వ సంవత్సరమున శ్రీవారికి బావమఱఁదులును, దొడ్డమపేటజమీందారులును నగు శ్రీరాజా వాసిరెడ్డి విశ్వసుందరరావు బహద్దరు జమీందారువారి పరిణయోత్సవసమయమున బందరులో నొకవిద్వత్కవిపండితసంఘముం గూర్చి శ్రీ భుజంగరాయబహద్దరు జమీందారువారు చాల సత్కరించి విశేషఖ్యాతి నందుటయేకాక 1913వ సం॥ డిశంబరున వీరి ప్రథమపుత్రికారత్నవివాహసంతోషసమయమునఁ

గూడ నొక గొప్పవిద్వత్కవిపండితసమావేశముం జేసి మితిలేని ద్రవ్యమును విద్యావిషయమై సంతోషపూర్వకముగ వినియోగపఱచి తత్తత్కవికృతపద్యరత్నంబుల నెల్ల నొక యుద్గ్రంథముగాఁ గూర్చి కవుల జీవితములతోఁ గూడ ముద్రింపించి రెండువందలముప్పదిముగ్గురు పండితకవులకు నాగ్రంథముల నుచితముగా నొసంగి వారి యౌదార్యమును బ్రకటించిరి. తత్సమయంబునఁ గవినిచయంబున కొనర్చిన బహుమానంబులు వేనోళ్ళ నుద్ఘోషింపంబడియె. ఆవివాహ మైదుదినములు నే యింటఁ జూచిన నేలూరునంచుఁ బండితకవులతో నిండి యుండెను. అప్పుడు శ్రీవా రొనర్చిన యన్నదానముం గూర్చి గొప్పగఁ జెప్పకొననివారే లేరు.

"క॥ రాజాభుజంగరాడ్కవి। భోజుఁ డహా! దేవదుందు♦భుల మ్రోగిం చెన్। భూజనములఁ బూజనముల। భోజనములఁ దనిపి ప్రథమ♦పుత్త్రిక పెండ్లిన్."—అనిమహాకవీంద్రు లెల్లరునైకకంఠ్యముగఁ గొనియాడిరి. మఱికొందఱు కవీంద్రులు తమయానందాతిశయంబులను బట్టఁ జాలక—

"చ. కల రిల నెంద రేని నృప♦కాంతు లుదారులు మిమ్ము మించి ప్రో
జ్జ్వలదురుదేశదేశపరి♦పాలనముం బొనరించు నట్టి నే
తల నొక రైన నిట్లు కవి♦తాదరముం గని రే కవీట్పురి
త్రలఁ బ్రచురింప నెంచిరి న♦రాధిప! సత్కవి పీవ యౌటచేఁ."

ఇవ్విధమునఁ బలువురు పలువిధముల నీనృపాలోత్తముని గుణగణంబుల నెన్ని కొనియాడి యున్నారు. అప్పుడు కాదు; ఇప్పు డేని యీసుగుణరాశిని సంతోషపూర్వకముగాఁ బండితులు ఫలాపేక్షనుగా కుండఁ బొగడి రచించినపద్యంబుల నన్నింటిని జేర్చి ముద్రింపించితిమా యొకయమూల్య మగు నుద్గ్రంథము గాక పోదు.

ఈ రాజన్యుని ప్రథమపుత్త్రికాపరిణయోత్సవమునకుఁ జాలదూరమునం గల హైదరాబాదు, మైసూరు, గంజాము, విశాఖపట్టణము, నెల్లూరు, చెన్నపురి మున్నగుప్రదేశములనుండి పండితు లేతెంచిరి. వచ్చినపండితుల కెల్లరకు బహుమానముల నొసంగుటయే కాక ప్రయాణంబునకు రాఁకపోఁకల కయినధనం బంతయు నొసంగిరి.

"సీ. తావకసత్కీర్తి ♦ ధావళ్యమున కోడి
యింధుబింబము కళా♦హీన మయ్యె
నీధైర్యరమఁ గాంచి ♦ చలువకు చలియించి
వైశాఖగిరి పరి♦భ్రమణ మందె
నీదానవిఖ్యాతి ♦ నెగడినభీతిచే
సురమహీజము తోట♦కరకుఁ జేరె
క్షమ నీకు సాటి రా♦కమె యచలం బయ్యె
నవని యంతయుఁ గంప ♦ మందఁ దొడఁగె

గీ. నీసమానుఁడ వీవె యా ♦ భాసమాన
నిర్మలసుకీర్తి భుజగావ♦నీపమణి
సారసుకవిసమాజమం♦దారభూజ
మంత్రిపెగ్గడసద్వంశ♦మండనంబ."

అని బహుభంగుల గుణరత్నాకరుం డగు భుజంగరాయరత్నాకరపాలకుం గొనియాడి పండితు లాశీర్వదించిరి.

ఇట్లే శ్రీవారు తమద్వితీయపుత్రికావివాహోత్సవమునం గూడ సర్వపండితమండలంబును గౌరవించి విద్యాభోజుం డని యెల్లరుఁ గొనియాడ యశశ్చంద్రికల నెల్లెడల వెదజల్లిరి.

శ్రీవారు విద్యాభిమానమును లోకమునకు వెల్లడించుటయేకాక దొరతనమువారియెడఁ దమకుఁ గలవిశ్వాసమును విక్టోరియాతారావళి, వసంతకుసుమము, విక్టోరియాస్వర్గయాత్ర, కారొనేషన్ ఓడ్ము మున్నగు గ్రంథములే తెలుపఁ గలవు. శ్రీజార్జిచక్రవర్తిపట్టాభిషేకసమయమున నీ కారొనేషన్ ఓడ్ము గ్రంథములను బదివేలచ్చువేయించి కంటికిఁ గాన్పించిన ప్రజ కెల్ల మానవునకు నొసంగిరి. తత్పట్టాభిషేకోత్సవసందర్భమున వీరికి దొరతనమువారు దర్బారుపతకమును గౌరవపూర్వకముగ నొసంగిరి. ఈ కారొనేషన్ ఓడ్ము నందలి ముఖాంతపద్యముల రెండింటి నీక్రిందఁ బొందుపరచెద.—

"శా. శ్రీమేరీరమణీకటాక్షరుచిరశ్రీమీాభిగాతదిక్పాలక
స్తోమానంతకిరీటదీధితిప్రజాస్తోకప్రమోదోర్మికల్
భూమీకాంతనితాంతశాంతియుసంసామ్మ్రాజ్ఞగ ఢిల్లీపురి
సామ్రాజ్యంబువహించుజార్జికిడుశన్ సమ్మోదముల్ వేదముల్."

మ. స్థిరకారుణ్యయశఃపయోధి వయి బ్రిస్విగ్వంశభూషుండ వై
గురుధర్మాభిరతుండ వై సమధిక క్రోధైకసంహర్త వై
పురుకుత్సున్నలునిం బురూరవుని రాముం గార్తవీర్యార్జునున్
భరతుం బోలి సమస్తభూస్థలయమందం బొప్పం బాలింపుమీా."

ఈ కుశాగ్రబుద్ధులగు శ్రీరాజాగారు ఏలూర నొకరత్నకంబళముల నేయు కార్ఖానాను నెలకొల్పి మంచిమంచిపనివాండ్రచే జిత్రవిచిత్రము లగురత్నకంబళముల నేయించి చిత్రవస్తుప్రదర్శనసంఘంబులకుం బంపి యనేకము లగు గౌరవపతకముల నంది పేరందియున్నారు. వీరు నేయించిన రత్నకంబళములను జెన్నపురి దొరతనమువారు పనివానితనమునకు మెచ్చి పుచ్చుకొనుచుండెడివారు. ఇంకను నమెరికా, యింగ్లండు మున్నగుప్రదేశములకుంగూడఁ బంపుచుండెడివారు.

ఇప్పటికి సుమారిరువదిసంవత్సరములక్రిందటనే యనఁగా 1897 వ సంవత్సరమున శ్రీవారు శారదావిలాస పుస్తకభాండాగారము నొకదానిని తమభవనంబున నుంచి యున్నారు. 1918 సంవత్సరము జనవరి 1వ తేదిని శ్రీరాజా భుజంగరాయ పుస్తకభాండాగారమను పేర (శ్రీ)వారిసౌధంబున నొకపెద్దచావడి (హాలు) కట్టించి సర్వజనోపయోగంబుగ నుంచిరి. ఈపుస్తకభాండాగారమున సంస్కృతాంధ్రాంగ్లేయగ్రంథములు 3000 లకు మించి యున్నవి.

పరోపకారప్రవణమతులును, విద్యాభిమానులును, నిగర్వచూడామణులును, సర్వసద్గుణసంపన్నులును, నుదారస్వభావులును, బ్రాహ్మణప్రభువులును నగు శ్రీరాజా మంత్రిపెగడ భుజంగరావు బహద్దరు జమీాందారువారు చిరాయువులై పుత్రపౌత్రసంపద్రాజిచే భోగదేవేంద్రులై యాచంద్రార్కస్థిరయశోభిరాముఁలైపురుషోత్తమఖ్యాతి నుల్లసిల్లుదురుగాతమని త్రికాలములయందును భగవంతుని బ్రార్థించుచున్నాను.

---



శ్రీరస్తు.

# మైలవరసంస్థానము.

(కృష్ణాజిల్లా)

సీ॥ తమ్ముల సహితభా♦నమ్మునఁ జూచు నా
ప్రథితరాజాఖ్యుఁ డే♦పాటిరాజో ?
గోత్రాభ్యుదయమున♦కుసు బ్రతికూలుఁ డౌ
శతముఖుఁ డేటిశ♦శ్వర్ధనుండో ?
గురునింద్యచరితుఁ డై ♦ పరగ జనించిన
బుధనాముఁ డెక్కడి ♦ బుధవరుండో ?
కువలయద్వేషంబు ♦ గూర్ప జంకని లోక
బాంధవుం డెంతటి ♦ బాంధవుండో?

తే॥ గీ॥ యనుచు సహజవాత్సల్యగు♦ణాంచితులును
వంశవర్ధనులును బుధ♦ప్రకరనుతచ
రిత్రులును సర్వలోకసం♦ప్రీతికరులు
నగుచు మించిరి మైలవ♦రాధిపతులు॥

ఈ మైలవరసంస్థానము కొండపల్లిపరగణాయందుఁ గల హావేలి స్థలములలో నొకగొప్పభాగము నాక్రమించుకొని యున్నది. హావేలి యనఁగ నింగ్లీషులో 'డిమీన్' (Demesne) అని యందురు. బహుశః యిది తురుష్కపద మై యుండును. పూర్వకాలమం దొకప్రభువు స్వోపయోగమున కై యుంచుకొను ప్రదేశముల కీపేరు వాడఁబడు చుండెడిది. ఇట్టి హావేలీప్రదేశములు కొండపల్లిసర్కారునందుఁ బెక్కులు గలవు. ఈ హావేలీభూములు 1802 డిశంబరు నెలయందు విక్రయింపఁబడెను. బహుమతిగ నొసంగఁబడిన దివి (తాలూకా)

మాత్ర మట్లు విక్రయింపఁబడక 1807వ సం॥లో జమీందారీస్వామ్య ముగ పైబస్ (Mr. Pybus) దొరగారి దుబాషయిన కాంౘ్రడేగుల జోగిపంతులుగారికిని వారి కుమారునకును పిమ్మట మనుమ డయిన కాంౘ్రడేగుల గోపాలరావుగారికిని నొసఁగఁబడెను. జోగిపంతులుగారు దుబాష్‌గా 1765వ సంవత్సరప్రాంతము లం దుండిరి. ఈ దివి కొంత కాలమువఱకు జామీందారిగా నుండి పిమ్మట 1853 సం॥ మార్చి 25వ తారీఖున విక్రయమునకుఁ దేఁబడి రూ 25,000 లకు దొరతనమువారి వలనఁ గొనఁబడెను. మిగిలిన కొండపల్లిహవేలీభూములను, నిజాము పట్నపుహవేలీభూములను, బందరుదగ్గఱఁ గల యాకులమన్నాడు- ఇను గుదురు హవేలీలను వాశిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారును; బెడనహవే లీని జల్లపల్లిజమీందారు లగు యార్లగడ్డ నాగేశ్వరనాయఁడుగారును; గొండవీడుహవేలీలను రేపల్లిజమీందారుగారును; వల్లూరు—గూడూరు హవేలీలను బొమ్మదేవర నాగన్ననాయఁడుగారును గొనిరి. రేపల్లి జమీందారులుగాక మిగిలినవా రెల్లరు నిప్పటివఱకు నఖండైశ్వర్యము లతోఁ దమభూములఁ బాలించుకొనుచునే యుండిరి.

ఇట్టి హవేలీభూములలో నొక టయిన కొండపల్లి పరగణాలోఁ జేరి యుండినభూభాగమును మైలవరపుజమీందారులు స్వాధీన మొన రించుకొనిరి. వీరికి మూలపురుషుఁడు నల్లసూరానాయఁ డనియు, నీయన వేంకటగిరిసంస్థానమువారికి మూలపురుషుఁ డని చెప్పఁబడిన బేతాళనాయనిసంతతిలోఁ బంౘ్రెండవతరమువాఁ డనియు వెలుగోటి వారి వంశచరిత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. బేతాళనాయనివంశ వృక్షము శాఖోపశాఖలుగ విజృంభించినపిమ్మటఁ బలువురు పలుతావుల కేఁగి నూతనరాజ్యముల స్థాపించుకొనఁ దొడఁగిరి. వారిలో నీమైలవరము వా రొకరు. వీరు బదునాఱవశతాబ్దాంతమునఁ గొండపల్లి పరగణా లోని కొంతభాగమును స్వాధీన మొనరించుకొని యేలు చుండిరి.

ఆదినములలోఁ గొండపల్లి మహోన్నతదశ యందుండెను. ప్రాచీన మై నట్టిదియుఁ జారిత్రాత్మక మై మనోహర మై నట్టిదియు

నగు కొండపల్లి దుర్గము బెజవాడతాలూకాయందు మిగులఁ బ్రసిద్ధిని గాంచి నేఁటివఱకును దన శిథిలచిహ్నంబులచేఁ బూర్వోన్నత్యంబులను సూచించుచునే యుండెను. ఇది కొండవీడు నేలు చుండిన రెడ్డివంశజు లయిన యనవేమారెడ్డివలన 1360 వ సంౘలోఁ గట్టఁబడెను. ఈరెడ్డి వంశజు లోరుగల్లురాజ్యనాశనానంతరమున రాజ్యాధిపత్య మవలం బించి వచ్చినవిధాన మించుక మునగాలచరిత్రయందు వివరింపఁబడి యుండెను. ఈదుర్గమును గట్టుటకు నలయుప్రదేశమును రెడ్లప్రభువు లకుఁ గొండఁ డనునొకగొల్లవానిచేఁ జూపఁబడిన దగుటచే దానికి కొండపల్లి యనునామము గలిగెను. రెడ్లవంశానంతరమున నిది యొరిస్సారాజులపా లయ్యెను. అంత 1471వ సంవత్సరములో రెండవ మహామ్మద్‌షాచేఁ దీసికొనఁబడెను. ఇతఁడు బహామనీరాజులలో నొకఁ డయి 1463 వ సంవత్సరము మొదలు 1482 వఱకు నుండెను. ఈమహా మ్మద్‌షాహాచేతిలోని కిది రాకపూర్వ మట నొరిస్సారాజయిన యంబర రాయఁడు తనతమ్ముఁడగుమంగళరాయనిబాధ కోర్వఁజాలక మహామ్మద్ షా ముఖ్యమంత్రి యగుమహామ్మద్‌గవానుని సాహాయ్య మర్థించి పిమ్మట నీకొండపల్లిని, రాజమహేంద్రవరమును వానియధిపుఁ డగుమహా మ్మద్‌షా కొసంగెను. పిమ్మట 1515 సంవత్సరములోఁ గృష్ణరాయలవశ మాయెను. అయినను రాయలవారును నొరిస్సారాజులును గృష్ణానదిని సరిహద్దుగా నేర్పఱచుకొనుటచే నిది తిరిగి యొరిస్సారాజులవశ మయ్యెను. పిమ్మట 1512 నుండి 1543 వఱకుఁ బాలించిన కులీకుతుబ్ షాహా యీకొండపల్లిని గూడిన తెలుఁగునా డంతయు నాక్ర మించుకొనుటచే నిది తిరిగి 1530వ సంవత్సరప్రాంతములో నాతని యధీన మయ్యెను. అ ప్లైబదివత్సరములవఱకు నది మ్లేచ్ఛాధీనము లోనే యుండెను. హిందూస్థానసామ్రాజ్యమునం దున్న కొండపీటిదుర్గ మును దురుష్కు లీకొండపల్లిదుర్గముయొక్క గోడలమీఁదనుండి చూచుచుండెడివా రఁట. ఇది శత్రురాజన్యులకు సమీపమునం దుండి నను గోలకొండరాజయిన యిబ్రహింషాకుఁ బ్రియనివాసముగను నతనిపౌత్రుఁ డగు సుల్తాన్ అబ్దుల్లాకు రాజధానిగను నుండుటచే నందు

'బాలహిస్సార్' అను నొక సౌధరాజము బర్మాదేశపు టేకికలపచే మనోహరముగఁ గట్టింపఁబడెను. ఇది 1687 వ సంవత్సరము జులయిలో నౌరంగజేబుఫాదుషాయొక్క సైనికులవశ మాయెను. పిమ్మట నింగ్లీషు వారికిది 1766వ సం॥ మార్చి 10వ తేదిని జనరల్ కెయిలాడ్ (General Caillaud) దొరగారిచే స్వాధీన మొనరింపఁబడెను. ఇచ్చట విశాల ప్రదేశము గలదు. కావున దీనిని గాపాడుట కై కొంతసైన్యమేకాని కొద్దిదండు చాల దనియును బెజవాడకనముల రక్షణార్థ మీవిశాల ప్రదేశమం దొకకోటను గట్టవలె ననియు స్టైవెన్సు (Chpt. Stevens) అనునొక యింజనీయరు వచించెను. అయినను స్వల్పసైన్యమును మాత్రమే యుంచి 1859 వ సంవత్సరములో దానినిగూడఁ దీసివేసిరి. అప్పుడు సిపాయిల నివాసశాలలుగ నుండిన విప్పుడు బాటసారుల విశ్రాంతిభవనములుగ నుండెను.

పూర్వ మొకప్పుడు మహోన్నతదశ నంది యున్న యీకొండ పల్లియుదంత మిట నప్రస్తుతమే యయినను జరిత్రప్రసిద్ధ మైన దగుటచే నించుక వివరింపఁబడెను.

అట్లు కొండపల్లిఖిల్లాదారులయొద్దనుండి కొన్నిగ్రామములను గుత్తకుఁ దీసికొనినవారిలో సూరానేని వేంకటపతిగారు 'ముస్తజార్' అనుబిరుదము గైకొనిరి. వీరితరువాత వీరికుమారుఁ డగునారాయణుఁడు గారు జమీందారుబిరుదును వహించి పాలనాధికారు లై మైలవరము లోనికోటను గట్టిరి. వీరియనంతరమున వీరిసోదరపుత్రుఁ డగు వేంకట పతిరాయణింగారు సంస్థానాధిపత్యమును వహించి యిరువదియొనిమిది వత్సరములు పాలించిరి. వీరికాలములోనే రుస్తుమలీఖాన్ దండు వెడలి యొకసారి వీరికోటపైఁ బడెను. అంత నీజమీందారుగారు నూజవీడునకుఁ దప్పించుకొనిపోయి యచ్చటనే గతించిరి.

ఈ రుస్తుమలీఖాన్ మొగల్చక్రవర్తుల యనంతరమున గోల కొండరాజ్య మార్కాటు, కడప, కర్నూల్, రాజమహేంద్రవరము, శ్రీకాకుళములను నయిదుభాగము లై యాయానవాబుల యధికారమున

నుంచఁబడినప్పు డీకృష్ణాజిల్లాతోఁ గూడుకొనియున్న రాజమహేంద్రవరము 1725 వ సంవత్సరము మొదలు 1741వఱకుఁ బాలించిన ప్రస్తుతార్కాటు నవాబునకుఁ బూర్వీకుఁడగు అన్వరుడ్డీన్ నవాబుక్రింద నొక ఖిల్లాదారుఁడుగనుండి మిగుల పరాక్రమవంతు డై పేరు గాంచెను.

పిమ్మట నీమైలవరసంస్థానము కొంతకాలమువఱకు దొరతనము వారియాధిపత్యములోనే యుంచఁబడినను 1746వ సంవత్సరములో సూరానేని బుర్ర వేంకటాచలముగారి పాలనాధిపత్యమునకు వచ్చెను. వీరితరువాత సూరానేని పోతన్నగారు రాజ్యభారమును వహించి 1756 మొదలు 1768వ సంవత్సరమువఱకును బాలించిరి. అంత వీరికుమారుఁడగు వేంకటరామారావుగారు బాల్యప్రాయులగుటచేఁ దనసోదరుఁ డగు నరసింహారావుగారిని బోషకులుగ నియమించి పోతన్నగారు స్వర్గస్థులైరి. పిమ్మట దొరతనమువారివలనఁ బొఱపాటుచేఁ దత్సంస్థానమున కిరువురును సమానాధికారులుగఁ బరిగణింపఁబడిరి. దీనిచేఁ గుటుంబములోఁ గలహములు తఱచుగఁ బ్రబల మయ్యెను. ఈకారణమున సంస్థానమును, వేంకటరామారావుగారు పాలనార్హ వయస్కు లయిన పిమ్మట నిరువురకును విభజింపఁబడు నటుల1788 వ సంవత్సరములోఁ దీర్మానింపఁబడెను. ఈతీర్మానమువలనఁ గలహములు మఱింత ప్రబలమయ్యెను. 1755 వ సం॥లో వేంకటరామారావుగారు తమప్రతాపోన్నతులను జూప సాగిరి; కాని ప్రయోజనము లేకపోయెను.

1779 వ సంవత్సరములో నరసింహారావుగారు పరమపద మందుటచే వేంకటరామారావుగారే సంస్థానమున కంతకును బరిపాలకులైరి. కాని కొలఁదికాలములోనే దొరతనమువారికి చెల్లింపవలసిన కప్పము దిగబడి బాకీ యేర్పడుటచే సంస్థానము దొరతనమువారి యాధిపత్యములోనికి బోయెను. 1783 వ సం॥లో వేంకటరామారావుగారు, దూరపుజ్ఞాతివర్గములోనివా రగు సూరానేని గోపాలరావుగారిని సూరానేని వేంకటపతిరావుగారిని గలిపి సమిష్టిగా సంస్థానమును బాలించునట్లు నియమించి యపుత్రకులుగనే స్వర్గస్థు లైరి. వీ రిరువురును దొరతనమువారిచేఁ గూడ సమిష్టిజమీందారులుగఁ బరిగణింపఁ

బడిరి. వీరికాలములోఁ గూడ దొరతనమువారికప్పములు దిగబడు చునే యుండుటచే నయిదుసంవత్సరములకుఁ గృత్తివెంటి వేంకటాచల మనునాయనకు గుత్త కీయఁబడెను. ఆయన కీర్తివైభవము విశేషకాలము నిలువక 1788 వ సంవత్సరములో నాయనతోఁగూడ నదృశ్య మై పోయెను. పిమ్మట సంస్థానము, హావేలీభూములపైఁ గలెక్టరుగ నుండిన ఓరాం (Mr. Oram) దొరగారి యధికారమునకుం గొంపోవఁబడెను.

1792వ సంవత్సరములో సమిష్టిదారులలో నొక రగు సూరా నేని వేంకటపతిరావుగారు దేహయాత్రను గడపుటచే మిగిలిన గోపాల రావుగారు సంస్థానపాలనాధికారమును వహించిరి. వీరియనంతరమునం దనఁగ 1799వ సం॥లో దూరస్థజ్ఞాతి యగు సూరానేని లక్ష్మణరావు గారు జమీాపాలనమును వహించిరి. వారికాలములోనే దొరతనము వారిచే శాశ్వతజరాయితీహక్కు (Permanent Settlement) లొసఁగఁ బడెను. ఈ లక్ష్మణరావుగారు మిగుల జాగరూకతతో రాజ్యపాలన మొనరించుచుఁ గ్రమక్రమముగ ధనాగారము నభ్యున్నతస్థితికి దెచ్చిరి. వీరిపుత్రికారత్నములలో నిరుపురను శ్రీ చారుమహాలుసంస్థానాధిపతు లగు శ్రీరాజా శోభనాద్రిరావుగారిపుత్రద్వయమున కిచ్చి యమితవైభవ ముతో వివాహ మొనరించిరి. ఈబాంధవ్యకారణమున నే శ్రీరాజా లక్ష్మ ణరావుగారు క్షైణ్యదశకు వచ్చుచుండిన చారుమహాల్ సంస్థానముయొ క్క బిత్తరుజల్లిపరగణాను 1813 వ సంవత్సరములో దొరతనమువారి కప్పములుదిగబడుటచే విక్రయమునకుఁ దెచ్చినప్పుడు తాము కొనిరి. అటులఁ గొని తిరిగి తమజామాత కాపరగణా నీయ నిశ్చయించిరికాని య ట్లొనరించుటకుఁ బూర్వమె 1814వ సంవత్సరమునందు స్వర్గాభిముఖులు గావలసివచ్చెను. ఆహా! తా మొకటి దలఁచిన దైవ మిం కొకటి దలఁచునుగద! ఈరాజాగారు కేవలబంధుప్రీతిచేఁ గాకపోయినను—

"ఆ॥ వె॥ కీర్తిలేనిదాని♦కిని జీవనంబు ని।రర్థకంబుసూవె ♦ యవనిమీాఁద।
నిత్య మయినధనము ♦ నిర్మలకీర్తియ। యట్టికీర్తి వడయు ♦ టశ్రమంబె॥
క॥ ఇలఁ గీర్తి యెంతకాలము। గలిగి ప్రవర్తిల్లె నంత ♦ కాలంబును
ని।త్యులకారె కీర్తిగలపు।ణ్యులు కీర్తివిహీనుఁ డెందు♦నుం బూజ్యుండే॥"

అను భారతనీతి వాక్యానుసారంబుగఁ బడిపో నున్న సంస్థానంబును నిలువఁబెట్టి కీర్తిగాంచవలె నని ప్రయత్నించిరి కాని నిష్ఫల మయ్యెను.

వీరి కిరువురు పుత్రులు గలరు, కాని వారు పాలనార్హ్వావయస్కులు గాకపోవుటచే సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సువారి పాలనములోనికిఁ బోయెను. పిమ్మట వారిలో నగ్రజుఁ డగు రాజా వేంకటపతి రావుగారు పాలనమునకు వచ్చినప్పుడు సంస్థానము వారి కొప్పగింపఁబడెను. ద్వితీయు లగు రాజా రామచంద్రుఁడుగారు యుక్తవయస్కులయినపిమ్మట వారికి రాజ్యభాగ మొసంగుటకు వేంకటపతిరావుగా రంగీకరింప కుండుటచే నొకవ్యాజ్యము తేఁబడెను. అందుమీఁద 1826 వ సంవత్సరములో సంస్థానము విభజింపఁబడవలయు నని తీర్మానించిరి. అయినను ద్వితీయు లగు రాజా రామచంద్రుఁడుగారు 1840 వ సంవత్సరములో స్వర్గస్థు లగుటచే రాజా వేంకటపతిరావుగారే సంస్థానమున కంతకును ప్రభువు లయిరి. వీరు పిమ్మటఁ దొమ్మిదివత్సరములు మాత్రము రాజ్యపాలన మొనరించి ప్రజానురాగముగలవా రయి 1849 వ సంవత్సరములో స్వర్గస్థు లైరి: వీరికి రాజా సూరానేని జగన్నాథలక్ష్మణరావుగారు, రాజా సూరానేని వేంకటగోపాల నరసింహారావుగారు నను నిరువురుపుత్రులు గలరు. వీ రిరువురును గొంతకాలమువఱకు సమిష్టిగనే రాజ్యపాలన మొనరించుకొనిరి; కాని పిమ్మట 1855 వ సంవత్సరములో సంస్థానమును విభజించుకొనఁ బ్రయత్నించిరి. ఇంతలో ననఁగా 1859 వ సంవత్సరములో నగ్రజు లగు శ్రీ రాజా సూరానేని జగన్నాథలక్ష్మణరావుగారు స్వర్గస్థు లైరి. వీరిసహధర్మచారిణి లక్ష్మివేంకమ్మారావుగారు. ఈ మెవలనఁ గలిగిన వేంకటచిన్నయ్యారావుగా రను బుత్రికారత్నమును నూజవీడు జమీందారులలో మీర్జాపుర పరిపాలకు లైన స్వర్గీయ రాజా వేంకటనరసింహాప్పారావు బహదురుగారు పరిణయ మైరి.

అంత మఱికొంతకాలము గడచినపిమ్మట 1866 వ సంవత్సరములో సివిల్ కోర్టువారు లక్ష్మివేంకమ్మారావుగారికిని రాజా వేంకటగోపాలనరసింహారావుగారికిని సంస్థానమును విభజించి యొసఁగిరి. అట్లు

తమకు లబ్ధమైనసంస్థానమును రాజా వేంకటగోపాలనరసింహారావు గారు ప్రజారంజకముగఁ బాలించి తమదేహయాత్రను గడపిరి. వీరికి శ్రీరాజా వేంకటపురుషోత్తమజగన్నాథ గోపాలరావు బహదరుగారు, శ్రీరాజా వేంకటపాపయ్యారావు బహదరుగారు, శ్రీరాజా వేంకటనారాయణరావు బహదరుగారు నను మూవురుపుత్రులు గలరు. ఈసోదరత్రియమును మఱలఁ దమసంస్థానమును 1896 వ సంవత్సరమున విభజించుకొని ప్రజానురాగముగను, శాంతయుతముగను నేలుకొను చుండిరి. ఇట్లుండ నిదివఱలో వీరిపెదతల్లిగారికి చెంది యున్న భాగముగూడ 1912 వ సంవత్సరములో నీమువ్వురకును లభించెను.

జ్యేష్ఠసోదరు లగు శ్రీరాజా వేంకటపురుషోత్తమజగన్నాథగోపాలరావు బహదరుగారు డాంబికరహితులై తమరైతుల గన్నబిడ్డలవలెఁ బ్రోచుచుఁ దమజమీ నేలుకొను చుండిరి. ద్వితీయు లగు శ్రీరాజా వేం. కటపాపయ్యారావుగారు నాటకాభిలాషులై సుప్రసిద్ధులైన నటకుల కధిక వేతనము లొసంగుచు, నమితధనవ్యయ మొనరించి బెజవాడయందొక నాటకశాల నెలకొల్పి జీర్ణదశయం దుండిన మనయాంధ్రదేశ నాటకకళావిధానమున కెంతయు నూతనవికాసమును గలిగించు చుండిరి. గ్రంథావలోకనమును, లోకానుభవమును లేని పామరజనులకుసైతము నీతిదాయకములైన ప్రదర్శనములచే సన్మార్గ మలవడఁ గలదు. అట్టిప్రదర్శనములు మనోరంజకములుగ నుండవలయుఁ గావున నిట్టి ధనాధికుల ప్రోత్సాహ ముండినఁ గాని యట్టినాటకసంఘములు వెలువడఁజాలవు. ఇందులకు శ్రీరాజా వేంకటపాపయ్యారావుబహదరుగారు మార్గదర్శకులై యుండి రనుట నిస్సంశయము. తృతీయసోదరు లగు శ్రీరాజా వేంకటనారాయణరావు బహదరుగారును నిర్మలవర్తనమునను నిష్కల్మషచిత్తమునను బ్రజాగౌరవమునకుఁ బాత్రులుగ నుండిరి. ఈ సోదరత్రయమునకు భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యములఁ గూర్చుఁ గాత.

---



శ్రీరస్తు

# బొమ్మదేవరవారిసంస్థానము.

(వల్లూరు—కృష్ణాజిల్లా.)

సీ॥ పులిమీాసములఁ బట్టి ♦ మెలివెట్టఁ గలయట్టి
యతులితవిక్రమా♦న్వితుఁ డనఁగ
నిమ్నజలాశయా♦నీకస్థనక్రాళిఁ
బాలకేళిఁ బాధించు ♦ బాలుఁ డనఁగ
సారంగవరబద్ధ♦శకటాధిరోహణుం
డయి విహారము సేయు ♦ నలఘుఁ డనఁగ
వ్యాఘ్రభల్లూకస♦త్వశ్రేష్ఠముల నెల్ల
మేటియై చెండాడు ♦ మృగయుఁ డనఁగఁ

తే. గీ. బరగు బొమ్మదేవరవంశ♦వార్ధిచంద్రుఁ
డూతగుణసాంద్రుఁ వల్లూరు♦భూతలేంద్రు
వేంకటనృసింహరాయ స♦ద్విబుధగేయు
శ్రీశుఁ డాయురున్నతుల ర♦క్షించుఁ గాత.

ఈజమీా నైశ్వర్యమునందును నాగరికతావిశేషమునందును నుత్తరసర్కారులందు మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవానిలో నొకటి యయి యున్నది. ఈసంస్థానప్రారంభకుఁడుగ నుండిన శ్రీబొమ్మదేవర నాగన్న నాయఁడుగారు 1798-99 సంవత్సరములలో మైసూరు నేలుచుండిన టిప్పుసుల్తానుకు మన బ్రిటిషుదొరతనమువారికి దటస్థించినయుద్ధము నందు యుద్ధభటులకు వలయు వస్తుసామగ్రిని నాయత్తపఱచుటకై

యేర్పఱచఁబడిన వ్యవహారికశాఖ (Transport Department) యందు ముఖ్యుఁడుగ నుండి క్రమక్రమమునఁ దనకార్యకౌశల్యముచే యుద్ధరంగ మందలి సైనికులకు వలయు సామగ్రిని మోసికొనిపోవఁగల యెడ్లను సమకూర్చుటకై తగు బాధ్యతగల యుద్యోగమున కర్హుఁడుగ నెన్నఁబడునట్లుగఁ దన నైపుణ్యమును సామర్థ్యమును గనఁబఱచి యట్టి పదవి నచిరకాలముననే వహించెను. ఇందువలన శ్రీనాగన్న నాయఁడు గారు గొప్పధనికు లగుటయేకాక 1803 వ సంవత్సరమునఁ గృష్ణానదీ వామభాగమునఁ గల వల్లూరుయొక్క హవేలీభూములను మచిలీ బందరునకుఁ బశ్చిమమునఁ గొలఁదిదూరమునఁ గల గూడూరును గొనఁ గలిగిరి.

అంత 1807 వ సంవత్సరము ఫిబ్రవరినెల యందు శ్రీనాగన్న నాయఁడుగారు మద్రాసుదొరతనము వారితో నొకనిబంధనను జేసికొనిరి. ఇందువలన మచిలీబందరు హైదరాబాదులమధ్యమున నొక మాసము దినములవ్యవధిలోఁ బదునైదువందల యెడ్లను, బండ్లకుప యోగపడు మఱియొకవైదువేల యెడ్లను బదివేల బ్రింజారీలను గాని, పక్షము దినములవ్యవధిలో నీ పైనఁ జెప్పఁబడినవానిలో నర్థసంఖ్య నటుకుఁగాని సిద్ధపఱచఁగలుగు నట్లు నియమితు లైరి. ఈనిబంధనవలన శ్రీనాగన్న నాయఁడుగారి కెట్టిజనవశీకరణమును సామర్థ్యమును గలిగి యుండినదియుఁ దెల్లము కాఁగలదు. ఇందువలన దొరతనమువారు మచిలీబందరునుండి యెట్టిమోఁద నెచ్చటికైనను సైనికులకు వలయు వస్తుసామగ్రిని సమకూర్పఁ గలయుద్యోగమును వీరి కొక్కరికే యిచ్చి యుండిరి. దీనిని వీరును వీరితరువాతివారును నూటయర్థశతాబ్దము వఱకు నెఱవేర్చిరి.

పిమ్మట 1808 వ సంవత్సరమున శ్రీనాగన్న నాయఁడుగారు స్వర్గస్థు లైరి. వీరికాలములోనే వీరిముగ్వురుపుత్రులును సంతానహీను లై గతించుటచే బాలుఁడుగనుండిన వీరిచతుర్థపుత్రుఁ డగు రాజా నరసింహులునాయఁడుగారు జమీాపాలనమును వహించిరి. వీరిపరి

పాలనాదినంబులం దేకాక వీరిబాల్యమునందును దొరతనమువారి వ్యవహారమును (Transport business) స్వంతవ్యవహారమును జక్కఁగ నిర్వహింపఁబడెను. అటుతరువాతఁ గొంతకాలమున కనఁగా 1842 వ సంవత్సరములో శ్రీరాజా నరసింహులునాయఁడుగారు గతించుటచే బాలుఁడుగ నుండిన శ్రీరాజా నాగన్న నాయఁడుగారు జమీాపాలకు లైరి. వీరు బాలురుగ నుండినను వీరిపరివారముచే దొరతనమువారి వ్యాపారాదులు జక్కఁగ నిర్వహింపఁబడుచునే యుండెను. పిమ్మట వీరు గోదావరీమండలములోని దివ్యతరము లైన యస్టేటులు నాల్గింటినిగొని తమతాతగారిచేఁ గొనఁబడినవానితోఁ జేర్చి జమీాని విపుల మొనరించుకొనిరి.

ఇంతలో నఁనగా 1857 వ సంవత్సరములో శిపాయిలకలవరమునకు సంబంధించిన శ్రమలు దటస్థించినసమయమునందు దొరతనమువారికి వలయు వస్తుసాహాయసంపదలను మచిలీబందరునుండి హైదరాబాదు, జాల్నా, కాంప్టీలకు నమర్చుటలో నణుమాత్రమే నలుకొలుతలే కుండ శ్రీరాజా నాగన్న నాయఁడుగారు సిద్ధపఱచి యుంచుటలో మిగుల శ్రద్ధవహించి పాటుపడి యుండిరి. మఱియు సింహాళమునుండి సముద్రమువిూఁద మచిలీపట్నమునకు 1857 వ సంవత్సరము డిశంబరు నెలలో వచ్చియుండిన యైరోపీయసేనాదళము (Royal Regiment) లోని యుద్యోగీయులకు శ్రీరాజా నాగన్న నాయఁడుగారు తృప్తికరముగ విందులను గావించి సైనికదళము వెంటనే సికిందరాబాదు చేరఁగలుగుటకుఁ దగుసాహాయ మెల్ల జరిగించి యుండిరి. సైనికదళమునకు వలయు సామగ్రిని మచిలీపట్నమునుండి హైదరాబాదునకుఁ బంపు సందర్భమందును నించుకేనియు నాటంకము గలుగకుండునట్లు మిక్కిలి సమర్థతతో నిర్వహించి యుండిరి. బ్రింజారీలు ముం దంజవేయక వెనుదీసినట్టియు, మేజర్ జనరల్ వైట్‌లాక్ (Major General Whitlock) దొరగారి సైనికవర్గమునకు వలయువస్తువాహన సన్నాహమునకు లోపము వాటిల్లి చెదర నున్నట్టియు విషమావస్థయందు శ్రీరాజాగారు సమయానుకూలమైన సాహాయ మొనరించి సర్ జార్జి వైట్‌లాక్

(Sir George Whitlock) దొరగారు మధ్యరాష్ట్రము (Central India) నుండి వెంటనే ప్రయాణముసాగింపఁ గలుగునటులఁ దోడ్పడియుండిరి. ఈవిధముగ దొరతనమువారికి జరిగించియుండిన సమయానుకూల కార్యములకు సంతసించి పారితోషికముగ నొకస్వర్ణభూషణమును, (భుజబందు) రెండు సుందరములైన శాల్వలను సమస్తగౌరవములతో మచిలీపట్నమునందు 1860 వ సంవత్సరము నవంబరు మూడవ తేదీని శ్రీరాజా నాగన్ననాయఁడుగారికి దొరతనమువారు ప్రసాదించిరి.

ఈవిధముగ నిరువదియెనిమిదివత్సరములు దమ కార్యకౌశల్యముచే మెప్పొంది శ్రీరాజాగారు 1869వ సంవత్సరము ఏప్రియల్ 30వ తేదీని బరమపదమందిరి. వీరికి శ్రీరాజా వేంకటనరసింహానాయఁడు బహాదరుగారు, శ్రీరాజా భాష్యకార్లునాయఁడుబహాదరుగారు నను నిరువురుపుత్రులును మఱి యిరువురుపుత్రికలును గలరు. వీరిలో జ్యేష్ఠపుత్రు లగు శ్రీరాజా వేంకటనరసింహానాయఁడుబహాదరుగారు పాలనాభారమును వహించిరి.

శ్రీరాజాగా రుత్తరసర్కారులందుఁ గలజమీందారు లనేకులలో నొకానొక ప్రత్యేకవిఖ్యాతి కెంతయుఁ దగి యుండిరి. శ్రీవారు సత్వసామర్థ్యమునందును బుద్ధికుశలతయందు నేకాక మృగయావిహారాదుల యందును మిగులఁ బ్రసిద్ధిని గాంచి యున్నారు. ఇంతియ కాక వీరికి చేతిపనులయందును నెక్కు డుత్సాహము గలిగియుండుటచేఁ దదభివృద్ధికిని బ్రోత్సాహమును గలిగించు చుందురు. వీరిచే స్వయముగ నిర్మితములైన వీణె లెన్నియో కలవు. అవి మనోజ్ఞనాదము గలిగి మంచి నేర్పరులచేఁ జేయఁ బడిన వానికి దీసిపోవకుండును. కావున సంస్థానగాయకులచే నప్పుడప్పుడు నిట్టి వీణెలను వాయింపఁజేసి వినోదించుచుందురు. వీరిజమీలోని దయిన పంగిడిగూడెమునుండి భీమడోలువఱకును నొక ధూమశకటమార్గమును * నిర్మింపఁజేసిరి. తత్కాలమున వేల్సు రాకొమారులుగ (Prince of Wales) నుండిన స్వర్గీయ సప్తమెడ్వర్డుచక్రవర్తి

* సంస్థానమున మోటారుబండ్లు వెలయుటచేఁగాఁబోలుఁ బ్రస్తుత మిది తీసివేయఁబడెను.

గారు 1875వ సం॥రం డిశంబరు నెలలోఁ జెన్నపురికి వచ్చి యున్న సందర్భమందు శ్రీరాజా వేంకటనృసింహనాయఁడుబహాదరుగారు శ్రీచక్రవర్తిగారిదర్శనార్థ మై యేఁగుచు సుశిక్షితము లైన నాలుగు హరిణములచేఁ జక్కఁగా లాఁగఁబడు చుండిన యొకబండిని వెంటఁదీసికొనిపోయిరి. అంత రాజాగారిచేఁ బ్రోలఁబడుచుండఁగాఁ జక్రవర్తిగా రాశకటమం దధిష్ఠించి గిన్డి పార్కు (Guindy Park) నందు విహారము వెడలిరి. అంత నాశకటమును నింగ్లండునకుఁ దీసికొనిపోఁ బడునట్లు శ్రీరాజాగారు కోరఁగా శ్రీచక్రవర్తిగారిచే నట్లొనరింపఁబడెను.

శ్రీరాజాగారిమృగయావిహారము మిక్కిలి యద్భుతంబును బ్రశంసనీయమును నై యున్నది. వీ రొకసారి యొక మదించిన యేనుఁగు స్వాధీనముతప్పి యూరుమీఁదఁ బడిపోవుచుండఁగా శ్రీరాజాగా రాయేనుఁగు వచ్చుచుండినమార్గ మందలి యొకవృక్షము నెక్కియాం చెట్టుక్రిందుగా నామజము పోవుచున్న సమయ మందు హఠాత్తుగా దానిపై దుమికి పిమ్మట దాని లొంగఁదీసిరి. మరియు బళ్లారిప్రాంత మందలి యరణ్యములకుఁ బోయి పలుమాఱు సివంగి వేఁటను జరిగించి స్వయముగా సివంగులను బట్టుకొనుచుండెడివారు. శ్రీరాజాగారు జీవముతోఁ బట్టిన పెద్దపులుల సంఖ్యకు లెక్కయే లేదు. శ్రీరాజాగారు వేఁటయం దత్యంతకుతూహలము గలవారయి యిప్పటికిని దుష్టమృగములను జెండాడుచునే యుందురు. వీరి వేఁటనుగుఱించి వర్ణించినచో నొక పెద్దగ్రంథమగును. వీరి సంస్థానమున నిప్పటికిని రెండుశివంగులు, నాలుగు వ్యాఘ్రములు, ఒక మొసలి, మఱికొన్ని ఘాతుకజంతువులును రాచఠీవికనుగుణ్య మైన కొన్నియొంటెలు, ఏనుఁగులు, శ్రేష్ఠ మైన తురంగములు గలవు.

శ్రీరాజాగారు 1911 వ సంవత్సరమున బందరులో జరిగిన శ్రీజార్జిచక్రవర్తిగారి పట్టాభిషేకసందర్భమునఁ దమయేనుఁగుల నంపి మిక్కిలి వేడుకతో నుత్సవమును గావింపఁ జేసిరి. నైజాములో 'శ్రీరాజా నాగన్ననాయఁడుగారిదేవిడి' యనుపేరిటఁ బరగు నొక యెస్టేటుగూడ వీరికి చెంది యుండెను.

ఈ రాజాగారికి వేటయందుగల కుతూహలమును వేఱుగ వర్ణించుటకంటెఁ దమ నివాసస్థానమును సంస్థాననామము వహించినది యును నగు వల్లూరును విడిచి వేటాడుట కనువగు నరణ్యములుగల హంగిసిగూడెం మనునొక కుగ్రామమందుఁ దాము దమ పరిజనమును నివాసయోగ్యములగు గృహముల నేర్పఱచుకొని యుండె శ్రీరాజా గారు తమ యావజ్జీవితమును గడపిరని వ్రాసినఁజాలును. శ్రీ రాజాగారు దమ వార్ధికదశయందును మృగయార్థము (వేట) వెళ్లుచునే యుండిరి.

జరాభారము దేహమును కృశింపఁజేయ మొనమొన్న నే యనఁగా 1918 వ సం॥ జూన్ 6 వ తేదిని గాలధర్మము నొందిరి. వీరి సుత ద్వయ మగు శ్రీ రాజా నాగన్న నాయఁడు బహదరుగారును శ్రీరాజా వేంకటరాయులు నాయఁడు బహదరుగారును దమ సుగుణపుంజముచే నిదివఱకే ప్రజానురాగమును బడసినవా రగుటచే వీరిపాలనము వీరి పౌరులకు సంతోషదాయకము గాఁగల దను నాశయము గలదు. వీరికిని వీరి కుటుంబమునకును భగవదనుగ్రహంబుచే నాయురభీష్టసిద్ధులును, సకలశుభంబులును జేకూరుఁగాత.



# దక్షిణపల్లూరు.

సీ॥ విద్వాంసులను గౌర ♦ వించుగోర్కి శతావ
ధానముల్ జేయించు ♦ ధన్యు లెవరు?
రాజవీవి సెలంగ ♦ బ్రథితాశ్వహస్తిసం
తతులఁ బెక్కులు గొన్న ♦ చతురు లెవరు?
మృగయావినోదసం ♦ ప్రీతులై వన్యస
త్వభయంబుఁ బాపెడి ♦ దక్షు లెవరు?
సమయానుకూలోత్స ♦ వములచేఁ బౌరుల
సంతసింపఁగ జేయు ♦ సరసు లెవరు?

తే. గీ. అట్టి బొమ్మదేవరసత్కు ♦ లాబ్ధిచంద్రు
సత్యనారాయణవరప్ర ♦ సాదరాయు
ననవరతము శ్రీసత్యనా ♦ రాయణుండు
కృపఁ జిరాయుసంపదల ర ♦ క్షించుఁ గాత.

శ్రీరాజా వేంకటనృసింహనాయఁడుబహదరుగారును వారిసోదరులగు శ్రీరాజా భావ్యకార్లునాయఁడుబహదరుగారును జాలకాలము కలసిమెలసి పరస్పరానురాగముతో నుండిరి. కాని కొంతకాల మైన పిమ్మటఁ గారణాంతరములచేఁ దటస్థించిన చిక్కులవలన యభిప్రాయభేదములు జనించినందున జమీని విభజించుకొనఁ దలఁచి శ్రీరాజా భావ్యకార్లునాయఁడుబహదరుగారు జమీవిభాజ్యమునకై 189 వ సంవత్సరమున నొకదావాను దెచ్చిరి. ఈదావావలన నుభయులకును గలిగినధనవ్యయ మింత యని చెప్పుటకంటె నీద్రవ్యముచే మఱియొక క్రొత్తజమీని గొనవచ్చు నని వ్రాసినఁ జాలును. ఈవ్యాజ్యము ప్రీవీకౌన్సిలువఱకును జరిగెను. అంత ద్వితీయులైన శ్రీరాజా భావ్యకార్లు



శ్రీరాజా బొమ్మదేవర సత్యనారాయణవరప్రసాదరావు బహద్దరుగారు,

వల్లూరు.

నాయఁడుబహాదరుగారి కనుకూలముగఁ బరిష్కార మగుటచే జమీ రెండుభాగములుగ భాగింపఁబడి 'దక్షిణవల్లూ' రను పేరిటిభాగము 1900వ సంవత్సరము ఫిబ్రవరినెలలో శ్రీవారికి స్వాధీన మొనరింపఁ బడెను. అటుపిమ్మట శ్రీరాజా వేంకటనృసింహానాయఁడుబహాదరుగారి ప్రథమపుత్రు లైన శ్రీరాజా నాగన్ననాయఁడుబహాదరుగారు తమ తండ్రిగారిచేఁ దేఁబడిన వ్యాజ్యములో సరియైన విచారణ జరుగఁబడి యుండ లేదనియు, జమీ యవిభాజ్య మైన దనువిషయమును మఱల విచారింపఁబడవలెననియు రాజమహేంద్రవరమునందలి మండలన్యాయ స్థానమున (District Court) నొక క్రొత్తదావాను దెచ్చిరి. కాని వీరి కుటుంబమునకు బంధువులుగ నుండిన గోపిశెట్టి నారాయణస్వామి నాయఁడుగారును బందరులో సుప్రసిద్ధన్యాయవాదు లయి దక్షిణ వల్లూరుభాగమునకు దివాన్‌జీగా నేర్పడినవా రగు శ్రీయుత వేమూరి వేంకటసుబ్బారావుపంతులు బి. యే. గారును విశేషప్రయత్నము చేసి తమబుద్ధికుశలతచే నిరువురకు ననుకూలముగ సంధ సేసిరి.

అంత శ్రీరాజా భాష్యకార్లునాయఁడుబహాదరుగారు శ్రీసుబ్బా రావుపంతులుగారి సాహాయ్యనైపుణ్యాదులచేఁ దగురీతిని దమజమీని జక్కఁగఁ బరిపాలించుకొనుచు 1906వ సంవత్సరము సెప్టెంబరు నెలలోఁ గాలధర్మము నొందిరి. శ్రీరాజాగారు శాంతస్వభావులును బరులకష్టం బులే తమకష్టంబులుగ భావించు దయామయులును ధార్మికులును నగుటచే వీరివియోగము వీరిపౌరులకే కాక వీరి నెఱింగియుండిన యశేషజనమునకును మిగుల సంతాపకర మయ్యెను. వీరిరైతులు దమ కష్టసుఖంబులను స్వయముగా మనవి సేసికొనఁ దలఁచి వచ్చినప్పుడు, శ్రీరాజాగా రేతరుణమునం దైనను వినుటకు సావధానులగుచు, దయతో వారిమనవులను జిత్తగించి తగురీతిని సాహాయ్యము జేయుటలో మిగుల నౌదార్యమును జూపుచుండెడివా రని ప్రఖ్యాతిని గాంచిరి.

పూర్వచరిత్రలయందు మిక్కిలి ప్రసిద్ధిఁగాంచిన 'పెదవేగి' యను నొకగొప్పగ్రామమును గొని వేగిసంస్థానాధీశ్వరు లని పేరు గాంచిరి. శ్రీరాజాగారి దివాన్జీగా నుండి వ్యవహారము జరిగించు

చుండిన శ్రీసుబ్బారావుపంతులుగారి కార్యకౌశల్యముచే సంస్థానపు రాఁబడి హెచ్చఁ జొచ్చెను. రైతులు సౌఖ్యముతోఁ గాలమును గడుపఁ గలిగిరి. శ్రీరాజాగారిపరివారమును, నుద్యోగిజనంబును శ్రీవారి యందు విశేషగౌరవాభిప్రాయములు గలిగి యుండిరి. ఇందువలన శ్రీరాజాగారికి తటస్థించెడి యెట్టిచిక్కులైనను హృదయపూర్వకముగఁ బాటుపడెడి శ్రీవారియుద్యోగిజనంబుచే మటుమాయము చేయఁబడు చుండెను.

శ్రీరాజా భాష్యకార్లునాయఁడుబహదరుగారు మచిలీపట్టణ మందు ఆంప్థిల్ (Lady Ampthil) దొరసానిగారిపేరిట నెలకొల్పఁ బడిన బాలికాపాఠశాల కొకదివ్యభవన మొసఁగిరి. ఈపాఠశాలను లోవర్ సెకండరీ స్కూలుగా మార్చులకుఁ దగువసతుల నేర్పఱప నై యున్న సమయమునఁ బౌరులదురదృష్టముచే శ్రీవారు స్వర్గస్థులైరి. ఈలోపమును వీరిపుత్రరత్నము లనఁ దగు ప్రస్తుతరాజాగారు విద్యాభిమాను లగుటచేఁ దండ్రిగారిసదుద్దేశమును నెఱవేర్పఁగల రని యాశ యము గలదు.

శ్రీరాజా భాష్యకార్లునాయఁడుబహదరుగారికి శ్రీరాజా సత్యనారాయణవరప్రసాదరావు బహదరుగా రను నొక పుత్రరత్నము జనించెను. తమతండ్రిగారి యిష్టదైవ మగు శ్రీసత్యనారాయణమూర్తి ప్రసాదమున జనించినవా రగుటచే వీరి కీనామ మొసఁగ బడెను. వీరు 1897వ సంవత్సరము నవంబరు 24వ తేదీని జన్మించిరి. వీరికి జ్యేష్ఠకనిష్ఠసోదరీమణు లిరువురు గలరు. శ్రీవారు, శ్రీరాణీ వేంకట రత్నమ్మబహదరుజమీందారిణిగారి గర్భశుక్తిముక్తాఫలము లనఁ దగి సంస్థానపాలనార్హవయస్కు లగు నంతదనుక కోర్టు ఆఫ్ వార్డ్సువారి రక్షణముననుండి 1916వ సంవత్సరమున మచిలీపట్నమును బ్రవేశించిరి. ఆసంవత్సరముననే మేనెలలో వీరికి పరిణయ మత్యంతవైభవముతో జరుపఁబడెను. వీరికన్యామణిని జెట్టపట్టుటకుఁ బూర్వ మీసంబంధమును గుఱించి తల్లిగారు సూచించినంతనె శ్రీరాజాగారు దమ యంగీకార మును దెలియఁబఱచిరి. అంత మఱికొంతకాలమున కీసంబంధమును

దప్పించి శ్రీపెదరాజాగారిమనుమరాలిని నిప్పింపవలయు ననుదలంపున శ్రీవారి జననియు, బంధువులును, స్నేహితులును ప్రబల ప్రయత్నములను జేసిరి. కట్నముగా గ్రామములను, ఏనుగులను, లొట్టిపిట్టలను విశేషధనమును నిప్పించెద మని చెప్పిరి. ఎవ రెంతప్రయత్నముచేసి నొక్కి చెప్పినను శ్రీరాజాగారు తాము ప్రప్రథమమున నంగీకారమును దెలిపి తిరిగి యుద్దేశమును ద్రవ్యకాంక్షచే మార్చుకొనుట యుచితము గాదని యేకదీక్ష వహించి యుందువలన బంధువులు, స్నేహితులు తోసగువారు విరోధు లగుటయకాక విశేషించి మనస్సంకటమును గూడ గలిగించుచుండి రని యట్టివారిని దమ సౌధమునుండి వెడలఁజేసి శ్రీరాజాగారు తమవాగ్దానమును నెఱవేర్చుకొనిరి. ఇందువలన శ్రీరాజా గారిపట్టుదల, నిశ్చలహృదయము వెల్లడికాఁగలదు. వీరియదృష్టవశమున శాంతస్వభావయు, సుశీలయు, నిష్కళంకచరిత్రయు, విద్యావతియు నగు శ్రీరాణీ వేంకటలక్ష్మీనరసమాంబగా రను కళత్రము లభించెను. అటుపిమ్మట ననఁగా 1917 వ సంవత్సరము నవంబరు 24వ తేదిని శ్రీరాజాగారు పాలనాభారమును వహించిరి.

శ్రీరాజా సత్యనారాయణవరప్రసాదరావుబహదరుగారు హిందూ దేశ మందలి ప్రసిద్ధపట్టణంబుల నన్నింటిని జూచి యుండుటచే మాతృ దేశాభివృద్ధియం దభిరుచిగలవా రయి తదితరులకు మార్గదర్శకులుగా నుండిరి. శ్రీవారు సింహాళము, బర్మా మున్నగు నన్య దేశములను గూడఁ జూచి యుండిరి. ఇట్లు దేశసంచార మెంత చేసినను స్వమతనిరసనమును మాత్రము సేయక యార్యమతాభిమానము గలవా రగుటచే మతాభి వృద్ధి కై తగు సాయ మొనరించు చుందు రనునాశయమును గలదు.

నోబిల్ కళాశాలావిద్యార్థులకు శరీరవ్యాయామసందర్భమున నొసఁగిన బహుమతులవలనను గలకత్తానగర మందలి శాస్త్రవిచారణ సంఘమున కేర్పాటు జేసిన వార్షికములవలనను, లేడీ ఆంప్థిల్ బాలి కాపాఠశాలకు వీరు పాలనార్హవయస్కులు గాని కాలముననే కోర్టు ఆఫ్ వార్డ్సువారికి వ్రాసి యిప్పించిన యేబదిరూప్యముల మాసవిరాళము వలనను శ్రీరాజాగా రౌదార్యవంతు లనియు, భాషాభిమాను లనియు

నీస్వల్పకాలములోనే ధ్రువపడు చున్నది. భాషాభివృద్ధికై వీ రింకను ముందు ధారాళ మైన యౌదార్యమును జూపఁగలుగుదు రని తోఁచు చున్నది. మఱియు సంసారికోత్సవాదుల యందుఁ గేవలఖేల నాదులచేఁగాక వీరు జరిగించుచుండిన పండితసభలయందుఁ బెక్కండ్రు కవిపుంగవుల రావించి పారితోషికము లొసంగు చుండుటచే స్వభాష యందు వీరికిఁ గలయభిరుచి విస్పష్ట మగు చున్నది.

ఇంతియకాక శ్రీరాజాగారికి శరీరపరిశ్రమలయందును నభిరుచి మెండుగాఁ గలదు. అశ్వారోహకు లై యతివేగమునఁ బెక్కు మైళ్ళు స్వారి చేయఁగలరు. ఎట్టి నూతనాశ్వమ్మునైన స్వాధీన మొనరించుకొని సుశిక్షణమున నుంచఁగల నేర్పు వీరికి కలదు. మఱియు వీరిపెద తండ్రిగారివలెనే వీరికిని వేఁటాడుటయం దత్యంతకుతూహలము గలదు. పాఠశాలాబాలురకు వ్యాయామములయందు బహుమతుల నేర్పఱచి బాలుర శరీరసౌష్టవము నిలుపుటకై ప్రోత్సాహము గలిగించుటలో శ్రీరాజాగారి కెక్కు డభిలాష గల దని తెలియు చున్నది.

వీరు సంస్థానపరిపాలనాభారమును వహించి యిప్పటికి కొలఁది కాలమే యైనను రైతుల కష్టసుఖంబుల నాలించుటకును వలయు సౌకర్యంబులఁ గలిగించుటకును దమజమీలోని యనేకగ్రామములను స్వయముగాఁ జూచి వచ్చిరి. వీరికి దయామయుం డగుభగవంతుఁ డాయురభీష్టసిద్ధులచే సంతతంబును గాపాడుచుండుఁ గాత.

---



శ్రీరాజా మోతే గంగరాజుగారు,
ఏలూరు.



శ్రీరస్తు.

# విసన్నపేటసంస్థానము.

(ఏలూరు - కృష్ణాజిల్లా.)

సీ॥ శ్రీరమాలోలపా♦దారవిందద్వంద్వ
పూజనాసక్తిప్ర♦పూర్ణమతులు
భూరిక్షుధార్తిప్ర♦జారక్షణీయస
ద్యంత్రాలయస్థాప♦నాభిరతులు
నానాదిశాగంతు♦కానీకవిశ్రాంత
సత్రసంస్థాపన♦సచ్చరితులు
ఆంజనేయాదిదే♦వాలయోచ్చయపరి
ష్కృతనిశ్చయైకప్ర♦కీర్తియుతులు

తే. గీ. మోతెవంశాబ్ధిపూర్ణ సో♦ములునునైన
వేంకయాభిఖ్య గంగరా♦డ్విబుధసఖ్య
వారిసంతతి నిష్టదై♦వంబు శ్రీమ
దాంజనేయుండు ప్రోచుఁ జి♦రాయువొసఁగి.

విస్సన్నపేటసంస్థానము ప్రప్రథమమున వరిగొండవంశజులైన విప్రవర్యులచేఁ బాలింపఁబడెను. వీరిలోఁ బ్రథము లగు వరిగొండ నీలంరాజుగారు తత్కాలమునఁ బ్రభువులుగా నుండిన మహమ్మదీయుల యొద్ద జమలవాయి పరగణాకు దేశపాండియుద్యోగమున నుండెను. ఈదేశపాండియుద్యోగము బహుశః యిప్పటి తహశీల్ దా రుద్యోగము వంటి దగును. ఇటుల దేశపాండియుద్యోగమునుండి జమీందారు

హక్కులతోఁ గొన్నిగ్రామములను సంపాదించి విస్సన్నపేటసంస్థానమనుపేరిటఁ దమజమీని జిరకాలము నేలుకొనఁ గలిగిరి.

వీరియనంతరమున వీరిసంతతిక్రమములోఁ బదునాలవపురుషుఁడగు వరిగొండరామన్నగారపుత్రకులుగ గతించుటచే వీరివంశములో దూరస్థజ్ఞాతియగు రమణప్పగారిని దత్తపుత్రునిగ స్వీకరించిరి. శాశ్వతజిరాయతీహక్కు (Permanent Settlement) కాలమునాఁటికి విస్సన్నపేట జమీంపాలకులుగ నీరమణప్పగారుండిరి. పదునేనవ పురుషులగు నీరమణప్పగారు హేలాపుర (ఏలూరు) వాస్తవ్యులగు కావలి వేంకటసుబ్బయ్యగారి పుత్రికారత్నమైన లక్ష్మీదేవమ్మ యనునామెను బరిణయమైరి.

ఈమెసోదరులు వరిగొండ రమణప్పగారికిని వారియనంతరమునఁ దమసోదరియైన లక్ష్మీదేవమ్మగారికిని ద్రవ్యమును బెట్టుబడి పెట్టుచుండిరి. ఈఋణతీర్మానమునకై తృతీయసోదరుఁడైన లక్ష్మయ్యగారు 1838 వ సంవత్సరమునఁ దమసోదరిపై నొక వ్యాజ్యమును దెచ్చి ముప్పదిసంవత్సరముల కనఁగాఁ బ్రీవీకౌన్సిలువారి కడసారితీర్మానమైన 1867 వ సంవత్సరమునఁ గృతకృత్యుఁడయ్యెను.

ఇట్లు కావలివారు తమహస్తగతమైనజమీని స్వల్పకాలము మాత్రమే యేలుకొనిరి. తరువాతివారు జమీవిభజననిమిత్తమై దావాలలోదిగి కోర్టుల కెక్కిరి. అందు ముఖ్యరాజధాని యగు విస్సన్నపేటయు మఱికొన్నిగ్రామములును జెన్నపట్టణవాస్తవ్యులగు కావలి చినవేంకటసీతారామయ్యగారికి రాఁబడి తదాది వారి పరిపాలనములో నుండెను. అటుపిమ్మట ననఁగా 1886 వ సంవత్సరములో వీరినుండి విస్సన్నపేట, తాతగుంట్ల, కొర్లమండ యను మూఁడుగ్రామములను నీగ్రామములతో సంబంధించిన యెనిమిది శివారుగ్రామములను నేలూరుపురవాస్తవ్యులును, వైశ్యవంశసంభూతులును, ధనాఢ్యులును నగు మోతేవారివలనఁ గొనఁబడెను. అప్పటినుండి నీ మోతేవారు విస్సన్నపేటజమీందారులుగ దొరతనమువారిచే స్థిరపఱుపఁబడిరి.

వీరీయెస్టేటును గొనినవెంటనే యాగ్రామములలో మిక్కిలి జీర్ణస్థితిలో నున్న పంటచెరువులు మొదలగువానిని మిగుల ధనమును

వెచ్చించి సంపూర్ణ మైన మరమ్మతులను జేయించి యెల్లప్పుడును బాట లవిచ్ఛిన్నముగఁ బాడుటకుఁ దగిన నీటివసతుల నేర్పఱచిరి. ఆగ్రామములో శిథిల మయి యున్న దేవాలయమును బాగుచేయించి మంచిస్థితికిఁ దెచ్చిరి. పరిపాలనవిషయములోఁ దమ యెస్టేటులోని ప్రజల కనేకము లైనసౌకర్యములఁ గావించి ప్రజలసౌఖ్యమును వృద్ధిపఱచిరి. ఇంత మురుగు లనుమాట లేకుండ వ్యవహరించుచుఁ బ్రజాసౌఖ్యమును గాపాడు చుండుటచే వీరి యెస్టేటులోని ప్రజలకు వీరియం దత్యంతగౌరవము గలదు. వీరికిని నీగ్రామాదులయాదాయము వృద్ధి గలిగియుండెను.

ఈకుటుంబమువారు దామరతింపరగ వర్ధిల్లుచుండినను నవిభక్త కుటుంబీకు లై పరస్పరానురాగము గలిగి యుండిరి.

ఈ మోతేవారు తమనివాసస్థానమయిన యేలూరు పురంబున వ్యాపారవృద్ధి గావించి లక్షలకొలఁది ద్రవ్యమును నార్జించుటంబట్టి మిగుల ధనవంతు లనుప్రసిద్ధిని గాంచిరి.

ధర్మకార్యములవిషయములో లక్షలకొలఁది ద్రవ్యము చేరునట్లుగ నేలూరువర్తకసమూహమువారివలన జరిగింపఁబడు చున్న వర్తకములమీఁదఁ బలువిధము లైన కట్టుడుల నేర్పఱచి యందువలన, లక్షలకొలఁది రాఁబడినద్రవ్యముచే నేలూరువైశ్యవర్తకబృందము వారిపేరిట నొకధర్మసత్రమును, మఱియొకనిరతాన్నసత్రమును, చలివేంద్రయును శ్రీకన్యకాపరమేశ్వరీనగరేశ్వరుల దేవాలయములను గట్టించి యందు ప్రతిష్ఠలు సేయించి నిత్యనైవేద్యదీపారాధనోత్సవాదులను మిగుల భక్తిశ్రద్ధలతో జరుగునటులఁ దగినయేర్పాటు జేయించిరి. ఇవి శాశ్వతముగ జరుగునటుల స్థిర మైనవసతులను గూడ నేర్పఱచిరి. ఇట్లు లక్షలకొలఁది వెచ్చించి యేర్పఱుపఁబడిన యీదేవాలయాదులకుఁ బ్రథమము నుండియు నీకుటుంబమువారే ధర్మకర్తలుగ నుండి తగినకట్టుబాటులతో యాజమాన్యము సేయుచుండిరి. వీరి యాజమాన్యమునఁ గొంత మూలధనమును సమకూడెను. దీనివలనను మఱికొంతధనమును సమకూ


మోతే జగ్గయ్యగారు
రత్నంగారు
అప్పన్నగారు
వేంకటస్వామిగారు
గంగరాజుగారు
జగ్గయ్యగారు
కృష్ణయ్యగారు
అచ్చయ్యగారు
వేంకన్నగారు
ఆంజరాజ్యలక్ష్మి
ఆండ్రాళమ్మ
వేంకటసుబ్బారావు
సూర్యనారాయణ
నల్వురుపుత్రికలు
నరసింహారావు
నారాయణరావు
కృష్ణారావు (జ్యేష్ఠపుత్రిక కుమారుడు—దత్తుడు,
వేంకటసుబ్బారావు
సూర్యప్రకాశరావు

చ్చియు శ్రీజనార్దనస్వామియాలయమును నిర్మాణము చేయించిరి. ఏలూరునందు వీరు గొప్పధనవంతులుగను గొప్పవర్తకులుగను నుండుట చేతనేగాక నీగ్రామమందు వీరు పూనుకొని చేయుచున్న ధర్మకార్యములచేతను వైశ్యబృందమేగాక యితరపురప్రముఖులును వీరియం దత్యంతగౌరవము గలిగి యుందురు.

వీరిలో దాదాపుగఁ బదిసంవత్సరము లప్పన్నగారు పురపారిశుద్ధ్యసంఘమున సభ్యులుగ నుండిరి. వేంకటస్వామిగారును నెడతెగక ముప్పదిసంవత్సరములు పురపారిశుద్ధ్యసంఘసభ్యులుగను హానరెరీ మేజస్ట్రీటుగను దాలూకా బోర్డు మెంబరుగను నుండి వీరు ప్రజలకనేకోపకారంబులఁ గలిగించి యుండిరి.

ఈ ముగ్గురుసోదరుల యనంతరమున వీరిసంతతి వారైకమత్యమును గలిగి పరస్పరానురాగముతోఁ దమ జమీాయొక్క స్థితిగతులను విచారించుకొనుచుఁ దమ యెస్టేటులోనిప్రజలకు సౌఖ్యకరముగను దమకు లాభకారియగునటులను బాలించుకొనుచుండిరి. ఒక జమీాపాలనవిషయములోనేకాక వ్యాపారమునందును ధనాభివృద్ధి గాంచఁ గలిగి యీజిల్లాలో మిక్కిలి ధనవంతు లనిపించుకొనిరి. మఱియు నెర్నగూడెముతాలూకాలోఁ జేరి దంతులూరి పెదవేంకటజగన్నాథరాజుగారిదైన గుండేపల్లి యెస్టేటును నేలూరు సబార్డినేటుకోర్టువారివేలములో వీరిచేఁ గొనఁబడెను. అందు గుండేపల్లి, క్రొత్తచోడవరము, ప్రాఁతచోడవరముయొక్క పూర్వపాయ యనుగ్రామములు గలవు. ఈగ్రామములం దత్యంతశిథిలస్థితిలో నున్న నెఱ్ఱకాలువసంబంధ మగు సేటివనరునకు దాదాపుగఁ బదివేలరూప్యముల వెచ్చించి స్థిర మైనమరమ్మతును జేయించిరి. ఇందువలన రైతులకును విశేషలాభకారి యగుటచే నాగ్రామస్థులు వీరియం దత్యంత భక్తిశ్రద్ధలతో గౌరవమును జూపుచుందురు. వీరు దొరతనము వారి కాదాయపుంబన్ను (ఇన్కంటాక్సు) గఁ బదివేలును, జమీాలపేష్కష్ క్రింద నైదువేలును, నితరభూములు మున్నగు వానికి రెవెన్యూ శిస్తులక్రింద నాలుగువేలును బ్రతిసంవత్సరమును జెల్లింపుచుందురు.

ఈకుటుంబమువారు దమతండ్రిగార్లచే నెలకొల్పఁబడిన ధర్మ కార్యములను వృద్ధిపఱచుచు నింక ననేక నూతనధర్మకార్యములను గావించుచు మిగుల ఖ్యాతిని బడయు చున్నారు. వీరితండ్రిగార్ల కాలములో నిర్మింపఁబడిన జనార్దనాలయమును వర్తకసమూహము వారిచే ననేకము లైనకట్టడముల నేర్పాటుచేయించి యందువల్ల ధన మును వృద్ధిపఱచి దివ్యస్థల మగునటుల లక్షలకొలఁది వెచ్చించి యనే కాలయములను నిర్మింపఁ జేసిరి. అందు శ్రీజనార్దన శ్రీరంగనాయక స్వామివార్ల ప్రతిష్ఠలను జేయించిరి. మఱియు నిత్యనైవేద్యభోగరాగ కల్యాణోత్సవము లత్యంత వైభవముగ జరుగు నటుల స్థిర మైన భూవసతుల నేర్పఱచిరి. ఈయాలయములకును శ్రీకన్యకాపరమేశ్వరీ నగరేశ్వర దేవాలయములకును ధర్మసత్ర నిరతాన్నదానసత్రాదులకును నీకుటుంబమువారే ధర్మకర్తలుగ నుండి వ్యవహరించుచు మంచి స్థితిలో నుంచిరి. ఇటుల దైవభక్తి పరాయణు లై తమ భక్తిశ్రద్ధలను జూపుటయకాక శ్రీజనార్దనాలయమునందు శ్రీయాంజనేయదేవాలయ మొండు నిర్మించి, యందు బహుసుందర మైన పాలరాతివిగ్రహమును బ్రతిష్ఠించి నిత్యనైవేద్యదీపారాధనాద్యుత్సవములను వీరు స్వంతముగ జరిగించుచు శ్రీయాంజనేయస్వామిని దమయిష్టదైవముగాఁ బూజించు చుందురు.

స్వలాభమున కై వీరిచేఁ గావింపఁబడు చున్న వ్యాపార బాహుళ్యమును బరోపకారముగనే పరిణమించు చుండెను. ఎట్లన నేలూరుపురమునఁ బ్రప్రథమమున నుప్పుడుబియ్యము జేయు నొక యంత్రశాల (రైసుమిల్లు) ను రెండులక్షలధనమును వెచ్చించి నిర్మా ణము సేసిరి. ఇందు ప్రతిదినమును బదివందల బియ్యపుబస్తాలు దయారు చేయఁబడును. దీన వందలకొలఁది కూలిజనమునకు జీవనో పాధి గలిగెను. వీరికిని నెక్కుడు ధనాదాయమును గూర్చెను. ఈ గ్రామమున కే డెనిమిదిమైళ్లదూరమునఁ గొల్లే రనుసరస్సు గలదు. అది యేలూరు గుడివాడ కయికలూరు తాలూకాల పల్లపుగ్రామముల నంటి, ముప్పది రెండుమైళ్ల పొడవును బండ్రెండుమైళ్ల వెడల్పును

గలిగిన పల్లపుమురుగుప్రదేశమై యుండెను. కృష్ణాగోదావరీనదుల నుండి వచ్చెడిమురుగునీరీప్రదేశమున నిలిచి సముద్రమునఁ గలియు చుండును. ఈజలమయప్రదేశమం దక్కడక్కడ కొన్నిలంక లేర్పడి విస్తీర్ణము గలిగి యున్నవి. మెరకతావులయందుఁ జిన్నచిన్నగుడిసెలు గల కొన్నిగ్రామములును గలవు. ఈగ్రామస్థులు లంకలయందు నీటి నేతాములతోఁ దోడుకొని కొద్దిగా సాగుచేసి జీవించు చుందురు. దీని నీకుటుంబమువారు గనిపెట్టి ప్రథమమునఁ గైకలూరుతాలూకా లోని గుడివాకలంకగ్రామముతాలూకు పదివందల యెకరముల భూమిని దొరతనమువారివలనఁ గౌలునకుఁ బుచ్చుకొని యందు మిగుల ధనమును వెచ్చించి నీరు తోడు మంచిసామర్థ్యముగల గొప్పయింజను దెప్పించి వానిసాహాయమున సాగు చేయించు చుండిరి. ఇందువలనఁ బంటలు విశేషముగఁ బండి రైతులకును దదితరప్రజకును మహోపకారము గలిగెను. కొల్లేటిసరస్సులోని మొదటియింజ నిదియ. పిమ్మట మఱి రెంటిని దెప్పించి సాగు సేయించుచుండిరి. వీరిమార్గము ననుసరించి మఱికొందఱు కొన్నియింజనులను బెట్టించిరి కాని వానియన్నిటిలో నివియ గొప్పవియై దినమునకు నూఱెకరములనుసైతము దడుపు చుండెను. ఇందువలనఁ బ్రజలకు మహోపకారమును దమ కాదాయ వృద్ధియుఁ గలిగెను. ఇట్టిదియె మఱియొకటి గలదు. అదేదన వీరి ప్రోత్సాహముచే నేలూరున నెలకొల్పఁబడిన ప్రత్తిజనపనారల యంత్రశాల (Kistna Jute & Cotton Mills) స్వలాభకారి యగు టయ కాక పరజనోపకారియు నై విరాజిల్లు చుండెను. ఎట్లన నీయంత్రశాలయం దనవరతమును బదునైదువందల స్త్రీపురుషాదు లైన కూలిజనమునకుఁ బని గలిగి వారి జీవనమున కాధారముగ నున్నది. ఈ యంత్రశాలాస్థాపనార్థమై వీరు భాగస్వాములుగ నుండి యొసంగిన యేబదివేలరూప్యములుగాక స్వల్పవడ్డితో మూఁడునాలుగులక్షల ద్రవ్యమును ఋణ మొసంగిరి. ఆ బదులు మొత్తము తీర్మానింపఁబడి ప్రస్తుత మిది పదిపంద్రెండులక్షలవఱకు వృద్ధి గావింపఁబడెను. ఇందు గోఁగునారను బదును జేయుట, దారములను వడకుట, గోతాలు

చేయుట మొదలైనపనులు గావింపఁబడు చుండును. విద్యుద్దీపికాంతి తోడను, యంత్రవిశేషములతోడను, నీ శాలయంతయు నేత్రపర్వమై కనిపించును. ఈయంత్రశాలను స్థాపించువిషయమునను నింతవఱకు నుంచి యున్నతస్థితికి దెచ్చువిషయమునను మోతే గంగరాజుగారు మిగుల శ్రమ సేసిరి. ప్రారంభములోఁ గొందఱు నూఱురూప్యములు వెలగల తమభాగములను నేబదిరూప్యములకే యమ్ముకొనఁ జూచిరి; కాని యిప్పు డిన్నూఱేబదిరూప్యము లిచ్చినను భాగము నమ్ముకొనువారు లేరైరి. ఇప్పుడు భాగస్వాముల కత్యంతలాభకారిగ నుండెను. ఇది యంతయు గంగరాజుగారి కార్యకౌశల్య మని భాగస్వాములెల్లరును గొనియాడు చున్నారు. ఈ కంపెనికి బ్రథమమునుండియు గంగరాజుగారే కార్యదర్శకులుగను ధనాగారాధిపతులుగను నుండి వ్యవహరించు చుండిరి.

ఈ కుటుంబమువారు మొదటినుండియు ధర్మపరాయణులై 'యద్దదాతి యదశ్నాతి తదేవ ధనినాంధన' మనువాక్యార్థ మెఱింగి పెక్కు ధర్మకార్యము లొనరించు చున్నారు. వానిలోఁ గొన్నిఁటి మాత్ర మీదిగువ నుదహరించెదను. తమ నివాసస్థానమైన యేలూరులో నొకవిశాలప్రదేశమం దిరువదియైదువేలరూప్యముల వ్యయముతో నొక గొప్పసత్రమును నిర్మింపఁ జేసిరి. ఇందు బాటసారులనేకులు దమకుటుంబములతో నివసించుటకు విశాలములైన గదులుగల సత్రశాలయును, గౌరవనీయులు నివసించుటకుఁ దగిన విశాల సౌధమును, నొక నిరతాన్నసత్రమును నిర్మాణము సేయించిరి. ఇందు దిగువారికి పాకపాత్రలు మొదలగునవియు నియ్యఁబడును. మఱియు నిం దనేకపరికరముల నేర్పఱచి యీధర్మసత్ర మవిచ్ఛిన్నముగా జరుగుటకుఁ గొంతమూలధనము నుంచిరి. ఇది బాటసారుల కత్యంత సౌఖ్యదాయకముగ నుండెను.

వీరికి బ్రాహ్మణభక్తి మెండు. కాశీక్షేత్ర మందు బ్రాహ్మణులకు రాత్రిభోజనము దొరుకు టరు దని యం దొకయన్నసత్ర ముంచి సుమా రెనిమిదిసంవత్సరములనుండి పోషించు చుండిరి. ఏలూరుపురమున

సర్వజనోపయోగార్థమును బసువులకొఱకును మంచినీటివసతిగల నొక తటాకమును ద్రవ్వించిరి. అచ్చట నొకముసాఫుఖానాయును నొక విశ్రాంతిశాలయును నెలకొల్పఁబడెను. అట్లే కొల్లేటిసరస్సు మధ్య నున్న యనేకగ్రామప్రజలకు వేసవికాలమందు మంచినీటివసతి లేమిఁ గనిపెట్టి యం దైదాఱువేలరూప్యములవ్యయముతో నొక గొప్పతటాకమును ద్రవ్వించి పసుకోటికిని బ్రజాసమూహమునకును మహోపకారమును గావించిరి. ఒకబ్రాహ్మణుఁడు గృహమున కై యాచింపఁగ నాలుగువేలరూప్యముల వెచ్చించి యొకనూతనగృహ మును నిర్మింపఁజేసి సమస్తపరికరములతో దాన మొసంగిరి. ఇంక బ్రాహ్మణు లనేకులకు భూదానాదు లొసంగి స్థిరజీవనోపాధి కలుగఁ జేసిరి. తదితరులకును వివాహగృహనిర్మాణాదుల కని వచ్చి యాశ్ర యింపఁగఁ దగురీతి సాయ మొనరించు చుండిరి.

బందరులోని జాతీయకళాశాలకు బదునాలుగువందల రూప్యము లొసంగిరి. ఏలూరులో ఘోషా ఆసుపత్రి (స్త్రీలకొఱకై ధర్మవైద్య శాల) గట్టించునెడల నిరువది వేల రూప్యముల విరాళ మొసంగెద మని వాగ్దాన మొనరించిరి, కాని దొరతనమువా రీయుద్యమమును బ్రస్తుతఘోరసంగ్రామకారణమున నింకను బ్రారంభింప రైరి.

వీరి మహాదార్యములలోఁ బ్రశంసనీయ మగు మఱియొకవిష యము గలదు. పదిపంద్రెండు సంవత్సరములనుండి ప్రతిదినమును బగలు మూఁడుగంటలవఱకు గూలినాలి చేసికొను బీదజనమునకును గుంటి గ్రుడ్డి మొదలగువారికిని నూకలజావను గాయించి పోయించుచు నిందు కొఱకై తగిన శాశ్వతపునౌకర్లను బరికరములను స్థలమును నేర్పఱచి ప్రతిదినమును నసంఖ్యాకు లగు బీదల క్షుదార్తిని బోఁగొట్టు చుండిరి.

ఏలూరులో వీరిచే నేర్పఱుపఁబడిన తోఁట యొకటి మిగుల రామణీయకము గలిగి నానావిధఫలపుష్పభరితంబు లైన వృక్షరాజం బులచే నేత్రపర్వ మై యుండును.

ఇట్లు సర్వజనోపయోగకార్యము లేగాక విద్యావిషయమునం

దును నీ రెక్కుడుధనమును వెచ్చింపుచున్నారు. బెజవాడలోని శ్రీకన్యకాపరమేశ్వరీహైస్కూలున కొకసహస్రరూప్యము లొసంగిరి. ఏలూరులోని దొరతనమువారి బాలికాపాఠశాలకు నెలకుఁ బది రూప్యముల వేతనముచొప్పున నొకసంగీతబోధకుని నేర్పఱచి యిప్పటికి మూఁడునాలుగుసంవత్సరములనుండి బాలికలకు సంగీతవిద్య గఱపించుటయ కాక యిట్లే చిరకాలము జరుగున ట్లేర్పాటు సేయ నుండిరి. "సైద్ అహమ్మద్ మిమోరియల్ ప్రెసిడెన్సి చాంపియన్ షిప్పుటూర్నమెంటు" నకు సంబంధించిన టెన్నిసునకు 'షీల్డు' అను నొకరజితమయచిహ్నము నొసంగిరి. ఏలూరులోని "హిందూయువజనసభ" యను పుస్తకభాండాగారమున కైనూఱురూప్యములు వెలగలగ్రంథము లొసంగిరి. ఆర్యవైశ్యవిద్యానిధికి పదివేలరూప్యములను ధారాళముగ నొసంగి తమయౌదార్యమును వెల్లడించిరి. రాజభక్తియందును వీరు వెనుదీయనివారై ప్రస్తుతయుద్ధనిధికై పదునైదువేలఋణము (War-Loan) నొసంగిరి. తా మొసంగుటయకాక పౌరులచేఁ బెద్దమొత్తము నిప్పించుటలో వీరు చూపినశ్రద్ధకు దొరతనమువారు సంతసించి యొక యోగ్యతాపత్రిక (Certificate) నొసంగిరి. ఇట్లే వీరు శ్రీ జార్జిచక్రవర్తిగారి పట్టాభిషేకసందర్భమునందు డిల్లీకి వెళ్ళి దొరతనమువారిచే యోగ్యతాపత్రికల నంది యుండిరి.

కుటుంబజ్యేష్ఠు లైన వెంకన్నగారు పది పండ్రెండు సంవత్సరములనుండి యేలూరుపురపారిశుద్ధ్యసంఘసభ్యులుగా నుండి పురజనుల కెన్నియో సదుపాయములఁ జేయు చుండిరి. గంగరాజుగా రెక్కుడు ప్రసిద్ధిని గాంచి బెజవాడలోని శ్రీకన్యకాపరమేశ్వరీహైస్కూలున కధ్యక్షులుగను, ఏలూరుపురయువజనపుస్తక భాండాగారమునకును నన్నదానసమాజమునకును గోసంరక్షణసభకును ధర్మకర్తలుగను, బళ్ళారిలో జరిగిన యార్యవైశ్యమహాజనసభకు నధ్యక్షులుగను నుండిరి. మఱియు నీ గంగరాజుగారు డిస్ట్రిక్టు బోర్డు మెంబరుగ నిదివరలో నాలుసంవత్సరము లుండి యిప్పుడు తిరిగి యాపదవి నలంకరించిరి. పదునైదువత్సరముల నుండి ఆనరెరీ మేజస్ట్రీటుగఁ గూడ నుండిరి.

నెల్లూరులో జరిగిన సప్తమార్యవైశ్య మహాజనసభ కాహ్వానసంఘాధ్యక్షులుగ నుండి మిక్కిలి దీక్షతో కార్యభారము నిర్వహించిరి.

నారాయణరావుగారు తరుణవయస్కు లయ్యుఁ గీర్తికరములైన కార్యములకుఁ దోడ్పడుచు నెల్లూరు హిందూయువజనసంఘమునకు వైసు ప్రెసిడెంటుగ నుండి సంఘముకొఱకు మిగులఁ బాటుపడుచుండిరి. మఱియు వీరు హూణభాషాలంకృతులై యొకసారి పాశ్చాత్యదేశమునకును వెళ్లి వచ్చిరి.

ఈ మోతేకుటుంబమువా రివ్విధంబున నెల్లకాలమును నవిభక్తకుటుంబీకులుగ నుండి పరస్పరైకమత్యంబును విడనాడక సర్వజనానురంజనముగ వర్ధిల్లునట్లు సర్వేశ్వరుం డగు, శ్రీమన్నారాయణమూర్తి కరుణించుఁ గాత.





శ్రీరస్తు.

# కొచ్చెర్లకోటవారిసంస్థానము.

పోలవరము (గోదావరిజిల్లా).

సీ॥ కవుల కాశ్రయ మిచ్చి • కవులపాలిటికల్ప
కం బనుసత్కీర్తిఁ • గాంచి రెవరు?
సంస్కృతాంగ్లాంధ్రభాషావేత్తలై పెక్కు
గ్రంథముల్ దెలుఁగున • వ్రాసి రెవరు?
కవిపోషకులెగాక • కవులును దా రయి
పండితప్రభు లనఁ • బరగి రెవరు?
భాషాభిలాషచేఁ • బ్రాచీనగ్రంథాళి
వెలయింపఁ బత్రిక • నిలిపి రెవరు?
తే॥ గీ॥ రాజభక్తి సూచింప 'సరస్వతి' యను
పత్రికాత్మజ శ్రీజార్జిప్రభున కర్ప
ణం బొనర్చి రెవ్వా రట్టి • నయవిశారదు
లిరత మాయురున్నతిఁ గల్గి • నెగడు మెందు.

శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావుబహద్దరు బి. ఏ. గారు తమ యసమానపాండితీవిభవంబుచేతను, సహజౌదార్యాదిసుగుణసంపదలచేతను సుప్రసిద్ధిగాంచిన ప్రభువరులై యున్నారు. ఉత్తరసర్కారుల (Northern Circars) యందుఁ గల జమీందారులందఱిలో వీ రొక్కరె ప్రప్రథమమునఁ బట్టపరీక్షయందుఁ గృతార్థులైనవారు. జనోపయోగంబు లగు సత్కార్యముల నాచరించుటయందు

వీరికిం గల యభినివేశమే వీరి యశోవల్లరికి ముఖ్యావలంబనము. శ్రీరాజాగారిచే సంకల్పింపఁబడి యాచరింపఁబడ నున్న ప్రతికార్యమును సోత్సాహముగను, నిర్విఘ్నముగను, సాంగోపాంగముగను నెఱవేర్పఁబడు చుండును. శ్రీవారిచే నెలకొల్పఁబడి రమారమి పదియాఱువత్సరముల నుండి నిర్విఘ్నముగను, సర్వజనశ్లాఘాపాత్రముగను నడుపఁబడు చుండిన సరస్వతీపత్రికారాజమే యింగులకుఁ బ్రబలనిదర్శనము.

ఏవంశమునం దీజమీందారుగా రుద్భవించిరో యావంశము గొప్ప రాజకీయాధికారముగలిగినదియు, మహదైశ్వర్యయుతమైనదియు నై యలరారెను. ఈవంశజులలో నొకరగు శ్రీవేంకటరాజుగారు కృష్ణాగోదావరీజిల్లాలలో మిగుల సుప్రసిద్ధు లగుటయకాక గౌరవస్థానమగు శిరస్తాదారుపదవి నధిష్ఠించిరి. వీరు లక్ష్మీకటాక్షవైభవంబు కల్మిఁ గృష్ణాజిల్లాలో నొక జమీని సంపాదించిరి. ఆజమీని వీరికింగల వేంకటరాయఁడుగారు, రామన్నగారు, పెదసుబ్బారాయఁడుగారు, చినసుబ్బారాయఁడుగారు నను నల్వురుపుత్త్రులలో జ్యేష్ఠు లగు శ్రీవేంకటరాయఁడుగారు దమకుఁగల బుద్ధికుశలతచేతను, సామర్థ్యాతిశయముచేతను నవిభక్తకుటుంబీకులుగనే యుండి సంస్థానము నెక్కుడభివృద్ధిలోనికిం దేఁ గలిగిరి. అనతికాలంబుననే వీరి దానశీలత్వాది సద్గుణగణంబులు నలుదెసలఁ బ్రసరింప సాగెను. వీరి ధర్మాచరణము లం దన్నింటిలో వీరినివాసస్థాన మగు రాజమహేంద్రవరము నుండి వారణాసిదనుకం గల మార్గమధ్యంబునం దచ్చటచ్చట నెలకొల్పఁ బడిన సత్రశాల లాచంద్రార్కయశోవిరాజితంబు లై శ్రీరాజాగారి మహోదార్యగుణంబును బ్రకటింపు చున్నవి. మఱియు వీరు రెండు పర్యాయములు సువర్ణంబుతోఁ దులాభారంబునఁదూఁగి తద్ద్రవ్యంబును దమమండలంబుననుఁగల విప్రశ్రేష్ఠులకును నన్నాతురు లగు నిరుపేదలకును బంచిపెట్టి యభినవదానకర్ణుఁడో యన నైహికఖ్యాతియు, నాముష్మికసుఖంబును బడయఁగలిగిరి. సంస్థానము ఋణబాధాపీడితమై యున్నకాలంబున వీరు తమపేదరైతులయొద్దనుండి పన్నులను జుకొన కుండెడివా రని తత్సంస్థానకృషీవలులు నేఁటిదనుక వేనోళ్ళఁ

గీర్తింపు చుండుటచే వీరు కీర్తికాముక లనియు, మృతజీవులనియుఁ బ్రశంసింపఁ బడు చుందురు.

ఇట్లు సర్వజనశ్లాఘాపాత్రంబుగ జరించి దేహయాత్రను విరమించినపిదప వీరియర్థాంగలక్ష్మి సంస్థానకార్యభారంబును వహించెను. అయినను సంస్థానము విశాలమైనదగుటచేతను వ్యవహారదక్షత యామెకు లేకుండుటచేతను ననతికాలములోనే సంస్థానమును గోలుపోవలసినదాయెను. ప్రస్తుత ముండినపోలవరము, తాడువాయి, జంగారెడ్డిగూడెము, గణపవరము, గూటాలపరగణాలు వేంకట్రాయఁడుగారి సమీపజ్ఞాతియగు జగన్నాథరావుగారి సొంతము లయ్యెను. ప్రస్తుతకాలమునందువలెఁ బూర్వ మివి యంతగా నాదాయసమృద్ధిగలవి గా కుండుటచేఁ దదధిపతుల కెక్కుడు లాభకారులుగ నుండక పోయెను. వేంకటరాయనింగారిపరా బీకుటుంబమును జిరకాలమునుండి యాశ్రయించుకొని యుండి నందున గూటాలపరగణా సర్వాధికారంబులతో నాయన కొసఁగఁ బడెను. పూర్వకాలమునుండియు నవిభక్తముగ నుండిన కుటుంబ మాతరుణమునందే విభజింపఁబడఁ బ్రయత్నములు సాగుచుండెను. జగన్నాథరావుగారు తమ సొంతమునకై పోలవరముజమీనుంచుకొనిరి. రంగారెడ్డిగూడెము, తాడువాయిపరగణాలు సుబ్బారాయఁడుగారి యధీనము లయ్యెను. గణపవరము రామన్నగారికిలభించెను. ఈతుదిరెండుజమీలంగూను జాలభాగము విక్రయింపఁబడెను. మిగిలిన స్వల్పభాగముసైతము దొరతనమువారికి గోలుపోఁబడెను.

పోలవరమున కధిపతులుగ నుండిన జగన్నాథరావుగారు రామచంద్రకృష్ణారావుగా రను బుత్రకుని గాంచిరి. వీరును దమబాల్యదశయందే సుగుణాభిరాము లై తండ్రిగారిచే సుశిక్షితులు గాఁ బడి యుండుటచే వారియుక్తవయస్కాలమునందును బ్రజాగౌరవంబున కెంతయుఁ బాత్రతఁ గాంచఁ గలిగిరి. వీరికి వేంకటజగన్నాథరావుగారనునొకపుత్రుఁడును మఱియొకపుత్రికయును గలదు. ఈవేంకటజగన్నాథరావుగారు తల్లిదండ్రుల కనుంగుబిడ్డఁడై యమందానందమును గూర్చుచుండెను గాని దైవాజ్ఞ నుల్లంఘింపఁ జాలక తన యిరు

వదియైదవయేటనే స్వర్గాభిముఖుఁడు గావలసివచ్చెను. నిజపతివియోగ దుఃఖసాగరనిమగ్నయై యున్న కామాయమ్మగారు భర్తచే నిచ్ఛకు వచ్చిన బాలు నొక్కని దత్తపుత్రకునిగ స్వీకరించుకొనఁ దగునట్లనుజ్ఞ వడసి యున్నకారణంబునఁ దమసోదరీపుత్రులును, మనప్రస్తుతకథానాయకులును నగు శ్రీరాజా రామచంద్రవేంకటకృష్ణారావుగారిని బుత్రస్వీకార మొనరించుకొనిరి. ఈరామచంద్రవేంకటకృష్ణారావుగారున్నత వంశోద్భవు లనుట నిస్సంశయము. వీరిపూర్వులు రాజకీయోద్యోగంబులం దున్నతపదవుల నధిష్ఠించి యుండిరి. శ్రీవారి పెదతాతగారగు శ్రీ పెద నగరాజరావుగారు మచిలీపట్నమునం దుండెగల న్యాయసభాస్థానంబున (ప్రొవిన్షల్ కోర్టు) నగ్రన్యాయవాదిగ (Bar-at law) నుండి తదితరన్యాయవాదిబృందంబునకు మార్గదర్శకులుగ నుండిరి. వీరు న్యాయార్జనంబునందేకాక యసమానపాండిత్యపటిమయందును బేరు గాంచిరి. సంస్కృతాంధ్రభాషల యందు మంచికవిత్వమును జెప్పఁగల రనుటకిందు సంస్కృతమునుండి వీరిచే నాంధ్రీకరింపఁబడిన 'శాకుంతలాపరిణయము' ను, సంస్కృతగ్రంథంబులలోఁ బెక్కింటికి వ్రాయఁబడిన వ్యాఖ్యానంబులను బేర్కొనఁ జాలును.

శ్రీయుత కామాయమ్మగారు పూర్వాచారపరాయణలవలెఁ గాక తన దానశీలత్వంబున నవనాగరికప్రపంచమున నగ్రగణ్యురాలుగ నెంచఁబడెను. విద్యార్థుల కెందఱకో ద్రవ్యసాహాయ్య మొనరించి విద్యాదాన మొసంగుటయ యాయమ చేసినమహోపకారము. ఈ సాధ్వీమణిసాహాయ్యంబునఁ బట్టపరీక్షయం దుత్తీర్ణులై యున్నతోద్యోగంబుల నానందించుచుండినవా రామండలంబునందు నేఁటికిని నామెమహోపకారంబును సంస్మరించుచునే యుందురు. ఇట్లొకవిద్యా విషయంబునందేకాక సర్వజనోపయోగంబు లగుసత్రములు మున్నగున వెన్నియో యామెయౌదార్యభావంబును జాటుచునే యున్నవి.

శ్రీరాజా రామచంద్రవేంకటకృష్ణారావుగారు 1871 వ సంవత్సరము నవంబరు 11 వ తేదీని గోదావరీమండలములోని స్వసంస్థానమయిన పోలవరములో జనన మందిరి. తమయైదవయేట శ్రీయుత కామా

యమ్మగారిచే దత్తతఁ జేసికొనఁబడిరి. ఇంగ్లీషుతోఁ పాటు సంస్కృతాంధ్రభాషల నభ్యసించుచుఁ బ్రవేశవిద్యను స్వసౌధమునందే ప్రారంభింపఁ గడంగిరి. అయినను జెన్నపురిదొరతనమువారు, రాజకీయవ్యవహారకార్యభారమును నిర్వహించుటలో శ్రీకామాయమ్మగారి సామర్థ్యాతిశయములకు సంతసించియును శ్రీకుమారరాజాగారికి సరియైన విద్యాభివృద్ధి గలుగు చుండుట లే దని సూచింపఁ దొడంగిరి. కుమారునియందుఁ గలయనురాగవిశేషంబుచే నెడఁబాసి యుండుట కష్టతర మని ప్రప్రథమమున భావించియును లోకమునందలి ధనికులలోఁ గొందఱు ప్రేమ యనునెపంబునఁ దమయాత్మజులకు సరియైనవిద్యాబుద్ధులఁ గఱపక తుదకుఁ దమకుఁదా మె పగతు రగు నట్లుగాక సుదకు విద్యాభ్యాసమున కై 1884 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున కుఁ బంపక తప్పినదికాదు. ప్రేమాతిశయముచేఁ బ్రారంభమున నొకించుక శంకించినను విద్యయే జ్ఞాననేత్ర మని యెఱిఁగి యున్నదగుటచేఁ దదుపరి నొక్క రాజమహేంద్రవరమునకే కాక దూరస్థ మగు జెన్నపురి మొద లగు పట్టణరాజంబులకును బంపి సంపూర్ణవిద్యావంతునిగఁ జేయ నెక్కుడు పట్టుదలను వహించియుండెను.

ఇట్లు రాజమహేంద్రవరమునందలి పాఠశాలయందుఁ బ్రవేశించి యుపాధ్యాయులమెప్పు నడయునట్లును, సహపాఠకులకు మార్గదర్శకులుగ నుండునట్లును బఠించుచుఁ దమ పదియాఱవయేట ననఁగా 1887 వ సంవత్సరమునందే ప్రవేశపరీక్ష (Matriculation Examination) యందు జయ మందిరి. శ్రీకృష్ణారావుగారు తమదృష్టిపథమునందుఁ గలప్రతివిద్యను బట్టుదలతో నభ్యసింప నుత్సాహముగలవారగుటయ కాక, నభ్యసింప మొద లిడినప్రతివిషయము నందును గృతార్థు లగుచునే యుండిరి. శ్రీవారికి గణితశాస్త్రమునందును, భాషావిషయమునందును నభిలాష యెక్కుడుగ నుండెను. అంతియే కాక దేశచరిత్రలయందుఁ గనఁబఱచిన యభినివేశమునుబట్టి భాషాప్రపంచమునం దగ్రస్థానమును దప్పక శ్రీవా రధిష్ఠింపకపో రనువిషయమును దమవిద్యార్థికాలమునందే సూచించిరి. అంత 1888 వ సంవత్స

రమున రాజమహేంద్రవరమునందుఁ గల కలాశాలలో యఫ్. ఎ. (F, A.) చదువుటకుఁ బ్రారంభించిరి. కాని యాసంవత్సరమునందే (ఆగస్టునెలలో) పాలకిజనని యైన కామాయమ్మగారు పరమపద మందుటచే శ్రీరాజాగారి విద్యాభ్యాసమున కొంకింత యాటంకము గలిగెను. అంత నటుసంవత్సరమునఁ దిరిగి కాలేజిలోఁ బ్రవేశించిరి. కాని యాసంవత్సరమునందుఁ గూడఁ గొన్నియసందర్భములు దటస్థ మాయెను. ఈకుటుంబమునకు నేమియుసంబాధము లేని వేంకటరాజు గారను నొకరు శ్రీకృష్ణారావుగారిదత్తత చెల్లఁ దగినది కాదని యొక దావాను దెచ్చిరి. ఈవ్యాజ్యములోఁ జిక్కుకొనవలసివచ్చుటచేతను దీర్ఘవ్యాధిపీడితులగుటచేతను 1891వ సంవత్సరమువఱకు విద్యాభ్యాస మొనరించుట కవకాశము చిక్కినది కాదు. విధిబలము చాలనిదినముల యందుఁ గష్టము లన్నియు నొక్కసారియె పైకొనుచుండునుగదా!

1891 వ సంవత్సరాంతమున శ్రీరాజాగారి కనుకూలముగనే వ్యవహారసంబంధ మగువిషయము లన్నియుఁ బరిష్కరింపఁ బడెను. మనశ్శాంతి గలిగి తిరిగి విద్యాభ్యాస మొనరించుట కవకాశము లభించెను. ఎన్నియాటంకములు దటస్థ మైనను బట్టపరీక్షయందు జయ మందవలయు ననుదృఢనిశ్చయములోఁ జెన్నపురియందుఁ గల క్రిస్టియన్ కాలేజిలో యఫ్. ఏ. తరగతియందుఁ బ్రవేశించి 1893 వ సంవత్సరములో నుత్తీర్ణు లైరి. ఆమఱుసటిసంవత్సరమునందు బి. ఏ. చదువ నారంభించి 1896వ సంవత్సరమునం దుభయభాషలయందును సంపూర్ణజయ మందిరి. ఇఁక విశ్వచరిత్రయందుఁ గృతార్థత గాంచ వలసినభాగముమాత్రము మిగిలి యుండెను గాని యాసంవత్సరముననే సెప్టెంబరునెలలో దేహారోగ్యము చెడుటయేకాక జీవితాశ వదలుకొన వలసినంతపని కి వచ్చిరి. 'విద్యానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ' మనునట్లు భాషావేది యగు నిట్టివిద్వత్ప్రభుండు భాషాసేవకుల పరి శ్రమ లాలించి తత్తదుచితానుసారంబుగ నొనర్పవలసిన మహోప కారంబు లెన్నియో మిగిలి యున్న వనునాశము దయామయుఁ డగు భగవానుఁ డెఱుఁగనిది కాదు. కావునఁ దిరిగి క్రమక్రమముగా మన

శ్రీరాజాగారి కారోగ్యదశ సంప్రాప్త మయ్యెను. అంత దేశచరిత్రల (History branch)యందును జయ మొందఁ గోరి పరీక్షకు వెళ్లి యీసంవత్సరమునం దనఁగా 1900వ సంవత్సరమునఁ గృతార్థు లైరి. ఇట్లు పట్టపరీక్షయందు సంపూర్ణజయ మంది పదంపడి సంస్థానమును స్వపాలనమునకుఁ దీసికొని కాకినాడను నివాసస్థానముగ నేర్పఱచుకొనిరి.

శ్రీరాజా రామచంద్ర వేంకటకృష్ణారావుగారికి దేశచరిత్రలయందుఁ గల యత్యుత్సాహముచే వీరు హిందూదేశమునందుఁ గల ముఖ్యపట్టణముల నన్నిటిని దర్శించి యుండిరి. మనపూర్వీకులు తీర్థయాత్రాసేవన మను నెపంబున దేశసంచారమున కెంతయు నుద్రేకంబును గలిగించి యవకాశ మొసంగి యుండిరి. ఇందలి యాముష్మికవిషయము నటుండ నిచ్చినను, నైహికవిషయమునందుఁగూడ నొకగొప్ప యాదర్శము లేకపోలేదు. దేశసంచార మొనరించువారికి భూతదయయును, బరోపకారపరాయణత్వంబును, లోకానుభవజ్ఞానవిశేషంబును నిరుపమానము లని వేఱుగఁ బ్రశంసింప ననవసరము.

శ్రీరాజాగారు పునహాలో నున్న సైన్సు కాలేజీ (Science College) యెడ సదభిప్రాయులై యది మంచి యుపయోగస్థితియందున్న కళాశాల యని వాకొనిరి. ఫెర్గూసన్ కాలేజీ (Ferguson College) యందుఁ గూడ నట్టి యభిప్రాయమునే సూచించిరి. మఱియు సర్వజనిక్ సభను గూర్చి "జనోపయోగంబున కంతగా నుపకరింపక జనుల నుచ్ఛృంఖలదశకుఁ దీసికొనివచ్చుట కావంతేనియుఁ బాటుపడని కొన్ని దక్షిణదేశసభలవలెఁ గాక యీసభ దేశభక్తిపూరితమై జనసామాన్యము నత్యంతోన్నతపదవికిఁ దెచ్చుటకై మిగులఁ బాటుపడుచున్న" దని సెల విచ్చిరి.

ఇట్లు గావింపఁబడిన దేశసంచారవిశేషముననో లేక విద్యాప్రభావముననో కాని సంస్కరణశీలు రై దేశాభ్యుదయకరము లయిన ప్రతియుద్యమమునందును ముందంజ వేయువా రైరి. ఉన్నతవిద్యాభ్యాసమున కై యింగ్లాండుదేశమునకుఁ బోవఁ గృతనిశ్చయు లై వలయు

వస్తులనుఁ బరికరములనే కాక టిక్కెట్టును గూడఁ గొని సంసిద్ధులై యున్న సమయమునఁ గొందఱు భిషగ్వరులు (Doctors) తద్దేశకాలానుకూల మైన యారోగ్యదశకుఁ దగినస్థితిలో లేకుండుటను నెఱింగించుటచేఁ బ్రయాణము నాపుకొనవలసి వచ్చెను. జాతీయసభను (National Congress) గుఱించి 'రాజకీయాందోళనము చట్టముల ననుసరించియును మితము దప్పకుండఁగను జేయఁబడవలయు' నని శ్రీకృష్ణారావుబహదరుగారి యభిప్రాయ మై యున్నది. జాతీయసభాసభ్యులు కొందఱు మితము నతిక్రమించుట కలదనియుఁ దాముమాత్ర మీయుద్యమమునందుఁ బరిపూర్ణసానుభూతి నొందుచుంటి మనియుఁ దెల్పుచున్నారు. హిందూదేశపు రాజ్యపరిపాలనాస్వాతంత్ర్యవిషయములో నెక్కువపట్టుదలతోఁ బనిసేయు ఎ. ఒ. హ్యూమ్ (A.O. Hume) దొరగారియెడల వారికిఁ గడుగౌరవము గలదు. సాంఘికమహాజనసభోద్దేశముల విషయమునఁ గూడ వారి కట్టిగౌరవమే కలదు. కాని యందు జేయఁబడు దీర్మానములు చాలవఱకు నాచరణలోఁ బెట్టఁబడు చుండనందున నా యీసంఘములు విశేషజయప్రదములుగ లే వని వారు సందేహపడు చుందురు. తమయభిప్రాయానుసారంబుగ ధైర్యసాహసంబులతో వర్తింపఁగలవా రొక్క కందుకూరి వీరేశలింగముపంతులుగారే యని వారియెడల శ్రీరాజాగారికి విశేషగౌరవభావము గలదు. శిథిలస్థితి యం దున్నయాంధ్రభాషను బునరుద్ధారణ మొనరించుటకయి 1895 వ సంవత్సరమున "ఆంధ్రభాషోజ్జీవని" యనుపేర నొక సంఘము స్థాపింపఁబడెను. ఆసంఘమునకు గౌరవనీయు లగు శ్రీయానందాచార్యులుగా రగ్రాసనాధిపతులుగ నుండ శ్రీరాజాగా రుపాధ్యక్షులుగ (Vice President) నుండిరి. మఱియుఁ గందుకూరి వీరేశలింగముపంతులుగారిచేఁ జెన్నపురిలో స్థాపింపఁబడిన యనాథశరణాలయంబునకు వీరు సహస్రరూప్యవిరాళమును నిరాటంకముగ నొసఁగి యుండిరి. స్వసంస్థాన మైన పోలవరములో జనోపయోగమున కై యొకచికిత్సాలయమును నెలకొల్పిరి. ఈచికిత్సాలయము తత్ప్రాంతస్థగ్రామవాసుల కెంతయు నుపకారకారిగ నుండెను. స్వర్గీయకామాయమ్మగారిచేఁ

గాకినాడకు సమీపమునందుగల క్రొత్తపల్లి గ్రామంబునఁ గట్టింపఁబడిన సత్రమును శ్రీరాజాగారు నిరాక్షేపముగ నేఁటిదనుకఁ బోషింపుచునే యున్నారు. విద్యావిషయికప్రయత్నము లసమానము లని చదువరులు ముందు గ్రహింపఁ గలరు.

శ్రీయుత న్యాపతిసుబ్బారావుపంతులుగారిచే రాజమహేంద్రవరమునందు ప్రచురింపఁబడు చుండిన యొకియాంధ్రపత్రిక చెన్నపురిలోనున్న శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారి యాజమాన్యమునకుఁ గొంపోవఁ బడుటచే మనశ్రీకృష్ణారావుగారు 189౮ వ సంవత్సరమున 'సరస్వతి'యనుపేర నొకపత్రికను బ్రచురింపఁ బ్రారంభించి యంతకు బూర్వము ప్రచురింపఁబడు చున్నపత్రిక చెన్నపురికి మార్పఁబడిన దను లోపము గానరాకుండఁ జేయుటయేకాక యంతకు వేయిరెట్లధిక ఖ్యాతిగలదానినిగఁ జేసిరి. మఱియు నీపత్రికావతంసంబునందు సర్వజన శ్లాఘాపాత్రంబులును బూర్వాధునికకవిపుంగవకృతంబులును, నముద్రితంబులును నగు గ్రంథరాజంబులను బెక్కింటిని బ్రకటించి, యాంధ్రభాషామతల్లి కొకనూతనాలంకారము గలిగింపుచుండిరి. శ్రీరాజాగారు కేవల కవిపండితపోషకు లగుటయకాక, తాము పండితప్రభువులును గవిపుంగవులును నైయుండుటచేఁ బత్రిక నిట్టియుచ్చదశలో నడుపు చుండు టొక వింతగాదు.

మఱియుఁ దమ యసమానప్రజ్ఞావిశేషంబుచే లోకప్రసిద్ధిని గాంచినవారును శతావధానులును నగు బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వర కవివరులు శ్రీరాజావారియాస్థానకవు లయి యుండుటచే నింకఁ బత్రిక యొక్క ప్రాశస్త్యంబును గుఱించి యిచ్చట వేఱుగ వర్ణింప నవసరము లేదు. ఈ పత్రికయందు జక్కనిపద్యకావ్యములు, భాషాంతరీకరణ మొనరింపఁబడిన నాటకములు, చరిత్రములు నూతనశోభాస్పదము లగువింతకథలు (Novels) మున్నగునవి ప్రకటింపఁబడు చుండును. నెల కేబదిపుటలు చొప్పున సంవత్సరమున కయిదారు దివ్య మగుగ్రంథములు సమకూడు చుండును. మరియుఁ బత్రిక స్థాపింపఁబడిన యీ పదియాఱువత్సరములనుండి నేఁటిదనుక రమారమి

నూఱుసంపుటములకుఁ దక్కువ గాకుండ వెలువడి యున్నవి. ఈకార్య స్థానము నందు శ్రీనాథుఁడు, మారన, అనంతభూపాలుఁడు, కందుకూరి రుద్రయ్య, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు మున్నగు పూర్వమహాకవిప్రణీతంబులును దిరుపతి వేంకటేశ్వరకవులు, వడ్డాది సుబ్బారాయకవి, మున్షి షేక్ అల్లీ సాహేబు, కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు యం.ఏ., మున్నగునాధునికకవిపుంగవప్రణీతంబులు నగు నుద్గ్రంథంబు లిందు గలవు. మఱియు నేతత్పత్రికాధిపతులును, మనకథానాయకులును నగు శ్రీరాజా రామచంద్ర వేంకటకృష్ణారావు బహదరు (బి. ఏ.) గారిప్రణీతములు గూడ నిందుఁ బెక్కులు గలవు. వానింగూర్చి యీక్రింద నించుక సంక్షేపముగఁ బొందుపఱచు టప్రస్తుత మని మాచదువరులు దలంప కుండెదరుగాక.

1 రాజతరంగిణి:—ఇది సంస్కృతభాషలోఁ గల్హణపండితునిచే వ్రాయఁబడిన కాశ్మీరదేశప్రభువులచరిత్రము ననుసరించి తెలుఁగున నిర్దుష్ట మగుశైలిలో రచింపఁబడినది. ఇది యిన్నూటేబదిపుటలతో రెండు సంపుటములుగను, సప్తతరంగములుగను విభజింపఁబడి యున్నది. ఈ గ్రంథమునుగుఱించి గ్రంథవిస్తరభీతిచే నెక్కుడు విపులముగ వివరింప నోపక, యాయా తరంగప్రారంభంబుల రచింపఁబడినపద్యము లెంతయు మనోహరంబులుగ నుండుటచే వానిలోఁ గొన్నింటినిమాత్ర మీక్రిందఁ బొందుపఱచు చున్నాఁడను—

"గీ. భూమ ణాహిఫణారత్న♦భూరికాంతి । తనదునెమ్మేన నిచయమై♦తనరుచుండ
శీనముక్తావళీరాజ♦మాన మగుచు । నలరు హారకల్పవృక్షము♦నాశ్రయింతు.

సీ. ఏమహామహుఫాల♦సీమఁ జెన్నలరారు, వహ్నిశిఖాంక వి♦భ్రమముతోడ
నేధన్యుకర్ణంబు♦లెసకంబు వహియించు, జృంభితకుండలి♦శ్రీలతోడ
నేవేల్పువక్షమిం♦పావహిల్లఁగఁ జేయు, సురుచిరాహీన కం♦చుకముతోడ
నేగణ్యుకంధరా♦భాగంబు చెలువారు, స్వచ్ఛమౌ జలధిజ♦చ్ఛాయతోడ

తే. నేమహాదేవుఁ డర్ధనా♦రీశుఁడగుచు । వృషభవాహనుఁడని ఘన♦ వినుతికెక్కి
పరగు నాతని దక్షిణ♦వామభాగ । ములను నేదేని సిరులిచ్చి♦ప్రోచుఁగాత.

మ. అజగోశృంగములన్ ఘటించి పిలు సే♦యం బాలునో గుర్వుఁడా
త్మజు దేహంబునఁ గూర్చెనో గురుఁడు మ♦త్యర్థిత్వంబు దంతిత్వమున్
నిజదేహంబునఁ దాల్చెనో యెవఁడు త♦న్వీపుంస్వరూపంబు ల
ట్టి జగన్మాన్య విచిత్రకార్యకుశలుం ♦ డెందంబున న్నిల్పెదన్.

చ. కలదిభకృత్తి దీని తొల♦పాఁదు కుచోచిత మౌక్తికాళి కే
లలికగతాగ్ని? దీనఁ గొన ♦ రాఁ గనుగోయుక్తిఁ గాటు కంచు నె
చ్చెలి వపురర్థసంఘటన ♦ సీయుతితోం బ్రతిసెప్పి యింక జి
ల్వాలు వలదన్న మాగ్వలుకు♦పద్ధతి నెంచు హరుం దలంచెదన్.

మ. శిరమం దున్న ఫణీంద్రు మేలికిరి దా ♦ స్త్రీమూర్తిసంశ్లేషము
న్నొగవె న్నేర్మి నెవంతు నైజఘనవే♦ణీవేష్టనాలంకృతిన్
గిరిపుత్రీతనువల్లితో సరిగ నే♦కీభావముం గొన్న యా
హరు నిమ్మేను నిరంతరాయముగ విరా ♦ కానందముం గూర్చుతన్.

ఉ. సాములు నీకుకుల్ రుచిఁ ♦ బాత్రము లే నుదపుంస్వికంబు నా
గోరుగు తావకీనగళ ♦ గహ్వులకున్ వికసించెఁ బూని వి
సాములదృష్టి యంచు నిక ♦ వాక్యము ద్వ్యర్థిగ నిర్వరాదు న
ట్లీమెయిఁ బల్కు నర్థదని♦తేశ్వరునాలుక నమ్ముఁ బ్రోవుతన్.

ఉ. గాలియు నాకులుం దినుచుఁ ♦ గానలలోఁ దప మున్న దాని నే
నేఁ లనుకోరు పట్టితివె సు♦గిరా చిలువల్ వృషభంబు వాని నేఁ
జాలెనె; ప్రేమచేతఁజుమి ♦ సామెయి నీ కిదె భర్తఁ డంచు స్వ
స్త్రీలు నుతింపఁగా నలరు ♦ శీతగిరీంద్రకుమారి నెన్నెదన్.

చ. నిను జననిన్ సృజించె విధి ♦ నిర్మల మౌ పితృవంశమందు నీ
వనువుగ సంధ్యవేళల జ♦సాధరపాళికయొద్ద నుందు వం
చును గిరిపుత్రి యీ సెడపు♦చుం గపటస్తుతిఁ జేసి సంధ్యకున్
మనమున మ్రొక్కు నీశ్వరుఁడు ♦ మాకుగ లోకము లేలుఁగావుతన్."

2 సాహసికకథార్ణము:— ఇందు రాజపుత్రస్థానములోని కొన్ని చక్కనికథలు మనోహరముగు శైలిలో వర్ణింపఁబడి యున్నవి.

3 అపవాదతరంగిణి:— ఇది షెరిడనుయొక్క 'స్కూల్ ఫర్ స్కాండల్' అను నింగ్లీషునాటకమునుండి యాంధ్రీకరింపఁబడిన వచన

రూపముగ నున్న యొక నాటకము. ఇది నీతిబోధకమును హాస్యరసప్రధానమును నై మిగుల సులభశైలిలో రచింపఁబడినది.

4 ప్రభువిశ్వాసము:— ఇందు హూణరాజ్యారంభమునుండి నేటిదనుక మనదేశమునకు లభించుచుండిన మహోపకారంబు లెన్నియో విస్పష్టంబుగ వర్ణింపఁబడి యున్నవి. ఈగ్రంథాంతమున నీదిగువ పద్యమును గలదు:—

"ఉ॥ స్వస్తి నిజాధిరాజ్యతలసంతతభాగ్యవిమూర్తికిన్ ద్రిలో
కస్తవనీయకీర్తి సిరిగర్వవిజృంభణతానివర్తికిన్
నిస్తులధర్మవర్తికి ననింద్యసమానదయాప్రపూర్తికిన్
శస్తజనానువర్తికిని జార్జిసమాహ్వయచక్రవర్తికిన్॥"

ఈ పైనఁ బేర్కొన్న గ్రంథములను గాక మిల్లర్, కాటన్ మున్నగు సత్పురుషుల జీవితములను, మఱికొన్ని చిన్నపొత్తములను రచించి యుండిరి. శ్రీరాజాగారి కిట్లు భాషావిషయమునందేకాక రాజకీయవిషయములందును నెక్కుడభిరుచి గలిగి యుండుటచే వీ రనేకసభల కాహ్వానింపఁబడి గంభీరోపన్యాసముల నిచ్చుచుందురు. వీరి రాజభక్తి స్తవనీయమైనదని 1911వ సంవత్సరమునందుఁ బ్రకటింపఁబడిన 'సరస్వతి' పదమూఁడవసంపుటము పంద్రెండవసంచిక వలనఁ దెల్లమగుచున్నది. అందు శ్రీజార్జి చక్రవర్తిగారిపట్టాభిషేకసందర్భమును గుఱించి యాంధ్రదేశమునందుఁ గల సమస్తకవిపుంగవులచేతను బద్యముల వ్రాయింపఁజేసి ప్రకటించిరి. ఈ సంపుటమునందు నూర్గురుకవులు రచించిన భిన్నరుచులుగలపద్యము లనేకములు గలవు. ఇట్లు సంచిక యంతయు రాజభక్తిపూరితమై పట్టాభిషేకవిషయమును గుఱించి రచింపఁబడిన దగుటచే దీనికి 'కారొనేషన్' సంచిక యని పేరిడి శ్రీజార్జిప్రభువు కర్పణముసేయు తమయుద్దేశము నీదిగువపద్యద్వయముచే స్పష్టపఱచిరి.

"మ॥ పదమూఁడేఁడుల యీడువచ్చెఁ జదివెన్ భాషాప్రపంచంబు దొ
డ్డది మాబ్రాహ్మవివాహకాల మది దాటం జేయఁగారాదు, నీ

పదదాస్యం బొనరించుచున్ ముదమునన్ వర్థిల్లఁగా నెంచు చు
న్నది జార్జీశ్వర! మాసరస్వతిని గాన్యం జేతుఁ గై కొంగదే॥

ఉ॥ పుట్టిన దాదిగా నురుసుపోకలజోలికిఁ బోక, ముద్దుగాఁ
బుట్టినయింటికిం బరువు పొంపిరి వోవఁ జరించి నట్టి మా
పట్టిని మాసరస్వతిని బట్టపురాజవు నీవు కూర్మిఁ జే
పట్టుట మాయదృష్టపరిపాకము గాదొకో జార్జిభూపతీ॥"

శ్రీరాజాగారి యౌదార్యగుణమును మఱి రెండుపద్యములు వ్రాయ నుత్సాహపడు చున్నాను. వీరు భాషాసేవకుల నాదరించుటలో నగ్రగణ్యు లని చెప్పక తప్పదు. తమ్మాశ్రయింపవచ్చిన వారి కైనను నెట్టిసమయమునం దైనను దర్శన మిచ్చుటయందును, దనుపరి వారి వారివిజ్ఞాపనముల నాలకించుటయందును సదా సంసిద్ధు లై యుండుట యేకాక తత్తదుచితానుసారంబుగ నాదరించుచునే యుందురు. శ్రీవారి దర్శన మొనరించి విఫలమనోరథు లై యేఁగినవా రొక్కరును నుండ రని దృఢముగఁ జెప్పవచ్చును.

ఇట్టి యర్థిజనమందారులును, భాషాపోషకులును నగు శ్రీరాజా రామచంద్ర వేంకటకృష్ణారావుబహదరుగారికి దయామయుఁ డగుభగ వానుఁ డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసఁగి రక్షించుఁగాత.



శ్రీరస్తు.

# శ్రీవత్సవాయసంస్థానము.

(గోదావరి జిల్లా, తుని.)

సీ॥ తగుకీర్తిఁ బెంప నిత్యంబన్నదానాది
సకలసత్కర్మ లొనర్చు సదమలాత్మ
తమనాశదీపకోద్ధామసత్కళల వ
ర్ణించెడి కవులఁ బోషించు మిన్న
తతకీర్తనీయసద్వర్తనప్రాప్తరా
జ్ఞీమహాబిరుదసందీప్తమాన
స్వీయాశ్రితాశేషశేముషీవరజాల
పోషితానవరతపుణ్యశీల
తే॥ గీ॥ యైన శ్రీవత్సవాయాన్వయప్రసిద్ధ
భవ్యచారిత్రముల కెల్లఁ బట్టుకొమ్మ
వేంకటసుభద్రయమ్మ సత్ప్రేమ జిమ్మ
శ్రీరమేశుఁ డాయురభీష్టసిద్ధు లిడుత.

కొత్తాంజమీ యని చెప్పఁబడు నీయస్టేటు ముప్పదియెనిమిది గ్రామములు గలిగి దొరతనమువారి కిరువదియాఱువేల రెండువందల పందొమ్మిది (26219) రూప్యముల పేష్కష్ చెల్లించుచున్న యొకజమీ యైనను బూర్వ మొకప్పుడు మహదైశ్వర్య మనుభవించి యవక్రపరాక్రమచరిత్రముచే విరాజిల్లిన పెద్దాపురసంస్థానముయొక్క-

శేషచిహ్న మగుటచే సికోతాంజమీ నెపంబునఁ బూర్వోక్త పెద్దాపుర సంస్థానచారిత్ర మిం దొకింత వర్ణింప నవకాశము గలిగెను. ఇందును గుఱించి తదన్వయులచే విపులముగ వర్ణింపఁబడి యుండుటచేఁ జర్విత చర్వణము గాకుండు నటుల నిందు సంక్షేపముగ వర్ణింపఁబడెడిని.

(ఈ సంస్థానాధిపులు సూర్యవంశసంభవు లగు క్షత్రియులనియు, వీరికి మూలపురుషుఁడు సాగి పోతరా జనియుఁ బూర్వకవిప్రణీత గ్రంథములవలనఁ దెలియు చున్నది.) ఈ సాగిపోతరాజు నందిగామ తాలూకాలోని గుడిమెట్టను దనకు రాజధానిగఁ జేసికొని యాప్రాంతము నేలి నట్లు లక్ష్మణకవి తన రామవిలాసమునందు:—

“గీ॥ సహ్యజాతీరమునకు భూషణ మనంగ
సిరుల కిర వగు గుడిమెట్ట • పురముఁ దనకు
రాజధానిగ సత్కళా•భోజరాజు
సాగి పోతక్ష్మాభర్త • జగతి యేలె॥”

అనిచెప్పెను. (ఈ సాగి పోతరాజు పల్నాటివీరయుద్ధమున నలగామ రాజునకు సాహాయముగా వచ్చి యున్నట్లు చెన్నపట్నమునందలి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందుఁ గల పల్నాటివీరచరిత్రమను గ్రంథమునఁ గానవచ్చు చున్న దనియు నాయుద్ధము 1178—1182 సంవత్సరముల మధ్యను జరిగి నట్లును స్థానికచరిత్రమయిన పెద్దాపుర సంస్థానచరిత్రమునందుఁ జెప్పఁబడి యుండుటచే నీ సాగి పోతరాజు గారును నాసంవత్సరప్రాంతముననే యుండిరని చెప్ప నగును.)

ఈ సాగి పోతరాజు ప్రథమమునఁ గాకతిగణపతి దేవచక్రవర్తికాలమున సామంతమండలేశ్వరుఁడుగా నుండి గుడిమెట్టదుర్గమున కధీశ్వరుఁడై త్రిపురాంతక కాశ్మీర మల్లేశ్వర విశ్వనాథ చోడ నారాయణస్థానంబులఁ గనకకలశంబులను బెట్టించి, సింహగిరియందు నృసింహస్వామికి సాగి పోతసముద్రం బను జెఱువును త్రవ్వించి శ్రీశైలమల్లికార్జునాలయమున నందికేశ్వరుని బ్రతిష్ఠించి దేవభోగముల కై కంభముపాడు, ముచ్చింతల బూదవాడ మొదలగు గ్రామముల నిచ్చి మహాప్రఖ్యాతిని గాంచి

యుండెను. ఈ సాగి పోతరాజునకు నరసింహారాజును నీ నరసింహా రాజునకు మనుమపోతరాజు మాచరాజు నను నిరువురుపుత్రులును జనించి నట్లు రామవిలాసములోని నీ దిగువపద్యములవలనఁ దెలియఁ గలదు:—

" క॥ ఆ సాగి పోతనృపతికి
భూసురరక్షకుఁడు మదరి♦పుత్రాసదబా
హాసత్త్వుఁడు నరసింహుఁడు
భాసురతేజుఁడు జనించి ♦ ప్రజలఁ బ్రోచెన్.

ఉ॥ ఆ నరసింహభూపతి క♦హార్పతి యామవతీశతుల్యతే
జోనిధు లశ్వసీతనయ♦సుందరు లిద్దరు గల్గి రాత్మజుల్
భూనుతకీర్తి యౌ మనుమ♦పోతమహీతలనాథచంద్రుఁడున్
మానధనాగ్రగణ్యుఁ డగు ♦ మాచనృపాలుఁడు వంశవర్ధనుల్॥"

ఈ మనుమపోతరాజు గుడిమెట్టయందును బెజవాడయందును బెక్కు దేవాలయములఁ గట్టించి నట్లు తెలియు చున్నది. వీనిసోదరుఁ డగుమాచరాజు రాజ్యభారమును వహించి మిక్కిలి పరాక్రమమును జూపించెను. ఈ మాచనృపాలున కెఱపోతరాజును వీనికి దెలుఁగు రాయఁడు రామరాజు నను నిరువురుపుత్రులును జనించిరి. ఈ రామ రాజు యవనాధీశ్వరులఁ బెక్కండ్రను జయించి వారిచే మదగజరత్నా భరణాంబరాదులఁ గానుక లంది యర్థిజనమందారుఁ డై వత్సవాయ నగరంబును రాజధానిగఁ జేసికొని యెను. ఆకారణముచేఁ దదాది నీ సాగివంశమునకు వత్సవాయనామము గలిగెను. ఈవత్సవాయ రామరాజునకుఁ గల నల్వురుకుమారులలోఁ దెలుఁగురాయఁడు మేరు సమానధీరుఁ డై రేకపల్లిదుర్గమును సాధించి విద్వత్ప్రియుఁ డై విక్ర మార్కచరిత్రం బను నొకయుత్తమకావ్యమునకుఁ గృతిపతి యై నట్లు లక్ష్మణకవి:—

"మ॥ అచలాధీశ్వరధీరు రేకపలిదు♦ర్గాధ్యక్షు విద్వేషిరాట్
ప్రచయోద్వేల బలావలేపతిమిర♦ప్రద్యోతనున్ విక్రమా

ర్క-చరిత్రోత్తమ కావ్యనాయకుని వేడ్క-ఁ బ్రస్తుతింపం దగున్
సుచరిత్రాఢ్యుని వత్సవాయ తెలుఁగుక్ష్మాశేశచూడామణిన్॥"

అని వర్ణించి యుండెను. ఇట్లీవత్సవాయాన్వయమునందుఁ బెక్క-ండ్రు వీరాగ్రగణ్యు లుద్భవించి తమ పరిపాలనమును వీర్యవంతముగఁ జేసికొను చుండిరి. ఇట్లు కొంతకాలము స్వతంత్రులుగను మఱికొంత కాలము పరతంత్రులై మహమ్మదీయుల పక్షమునను మఱికొంతకాలము గజపతుల పక్షమునను నుండి వైరివీరుల నుగ్గాడుచు నం దందు బలిష్ఠములైన దుర్గంబుల నెలకొల్పి రాజ్యవిస్తారమును గావించుకొను చుండిరి. ఇంతలో ననఁగా క్రి॥ శ॥ 1323 సంవత్సరములో నోరుగంటి ప్రతాప రుద్రగజపతి ఢిల్లీషాహుపాచేఁ గొనిపోఁబడుటచేఁ దద్రాజ్యము దురుష్క-లవశ మయ్యెను. నంత నీ కాకతీయప్రభుత్వమున సర్వాధికారులుగ నుండిన రాచవారనేకు లం దందుఁ గలదుర్గములను స్వాధీన మొనరించుకొని తద్భాగముల కధీశు లయిరి. అట్లే రెడ్డినాయకులును, బద్మనాయకవీరులును రాజ్యవిస్తారములను గాంచఁ గలిగిరి. పిమ్మట 1326 వ సంవత్సరమున మంచికొండ కూనారెడ్డి యనువీరుఁడు రాజమహేంద్ర వరమునుండి తురుష్క-వీరులను దఱిమి కోరుకొండకోటను గట్టి కృష్ణాగోదావరీమండలములలోని యుత్తరభాగములను స్వాధీన మొనరించుకొని కోరుకొండరాజధానిగఁ బరిపాలింపఁ దొడఁగెను. దీని కిప్పటికిని రెడ్డిసీమ యనుపేరు గలదు. ఇట్లే ప్రతాపరుద్రు ననంతరమున మఱియొక రెడ్డివంశములోనివారు కొండవీటిసీమ నాక్రమించుకొని తత్ప్రాంత మవక్రవిక్రమంబున నేలికొనిరి. ఇట్లు కోరుకొండరెడ్లును గొండవీటిరెడ్లును బరస్పర సాహాయ్యకారులై కృష్ణా గోదావరీమండలప్రాంతము నేలుకొనిరి. ఇట్లొకశతాబ్దము జరిగిన పిమ్మటఁ గొండవీటిరెడ్డిప్రభువులపాలనము క్షీణింపఁ జొచ్చెను. గజపతుల పరాక్రమము విస్తరిల్లఁ జొచ్చెను. ఆదినములలోనే మహమ్మదీయుల దండయాత్రలు ప్రబలఁ జొచ్చెను. అంత గతానుగతికముగ వచ్చు చుండిన దుర్గములఁ బాలించుకొనుచు రెడ్డివంశవీరుఁడై రాజమహేంద్రవరదుర్గము నందుండి తత్ప్రాంతము నేలుకొనుచుండిన వేదా

ద్రిరెడ్డియొద్ద రెండువేలసైన్యంబునకు సరదారుఁడుగ నుండిన వత్సవాయ ముసలి తిమ్మజగపతిరాజుగారు పెద్దాపురదుర్గమును సంపాదించి నట్లు పెద్దాపురసంస్థాన చరిత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. పూర్వ మీ పెద్దాపురపరిసరభూమిని కిమ్మీరుఁ డనురాక్షసుఁడు పాలించి నట్లును వానిపేరిటనే కిమ్మీరుదుర్గము గట్టఁబడి నట్లును నాకారణముచే నీప్రదేశము కిమ్మీరుసీమ యని వ్యవహరింపఁబడు చుండి నట్లును జెప్పుదురు. అటుపిమ్మట నీసీమ రెడ్లపరిపాలనమునకు వచ్చెను. అల్లాడ వేమారెడ్డిసంతతివాఁడైన రెడ్డివెంకటప్ప యనునాతఁడు కిమ్మీరు ప్రోలనాడులకుఁ బాలకుఁడుగా నుండఁగా వానియొద్ద సరదారుఁడైన యిసుకపల్లి పెద్దాపాత్రుం డనునాతఁడు కిమ్మీరుసీమకుఁ జేరిన తమిరె యను గ్రామమునకు నుత్తరభాగమున రెండు గుట్ట లుండఁగా వానిని లోపుజేసికొని కోటను గట్టించి, మట్టిగోడను బెట్టించి, వానిపైఁ జుట్టును బురుజులను దీర్పించి దానికి దక్షిణమునఁ బెద్దాపుర మనెడి పేటను నీపెద్దాపాత్రుఁడు గట్టించి నట్లు చెప్పుదురు. వీనియనంతరమున మఱి కొంతకాలమునకు విస్సమ్మ యనురెడ్డివనిత యీసీమలను బాలింపుచు రెడ్లకడ రెండువేలసైన్యమునకు సరదారుఁడుగ నుండిన మన వత్సవాయ ముసలితిమ్మజగపతిరాజుగారియొద్దఁ గుదువ పెట్టెనఁట. ఆమెయనంతరమున ముసలితిమ్మజగపతిరాజుగారు బలవంతులై పెద్దాపురపు గోఁటను స్వాధీన మొనరించుకొని, రెడ్డివీరులకును గజపతులకును దురుష్కులకును బ్రబలసంగ్రామములు దటస్థించినప్పుడు తన యవక్రపరాక్రమమును జూపుచు ననేకయుద్ధములలోఁ బోరాడి నట్లు రామవిలాసమున నిట్లు వర్ణింపఁబడి యుండెను—

"సీ॥ రణమున గుఱ్ఱంపు ♦ రౌతులఁ బరిమార్చి
వాసిగా నెఱజెర్ల ♦ వాక లోనఁ
బెద్దాపురంబున ♦ బిరుదాంకపురిలోన
యవనవీరులఁ బరా♦హతులఁ జేసెఁ
బ్రబలఘటించునరేంద్ర ♦ సుతుని దర్ప మడంచెఁ
దిరుపతిచెంత భూ♦వరులు మెచ్చఁ

దూరుపునాట శ♦త్రుతుత్రనక్షత్ర
రుచిరూపు మాపె సూ♦ర్యుం డనంగ
తే॥గీ॥ వంగవంగకళింగచో♦ళాదిదేశ
వసుమతీనాథ సభలలో ♦ వాసి కెక్క
వత్సవయపేర ధారుణీ♦శ్వరునిసుతుఁడు
రమ్యగుణశాలి శ్రీతిమ్మ ♦ రాజమౌళి॥"

మఱియు నీతిమ్మజగపతిరాజుగా రనేకసత్కార్యములఁ గావించి నట్లీదిగువపద్యము సెప్పు చున్నది:—

"సీ॥ బిరుదాంకపురిని సు♦స్థిరముగా నిర్మించెఁ
బాలమున్నీటిని ♦ బోలుచెఱువు
తిరుపతివల్మీక♦గిరి నూలపల్లిని
ఫలవృక్షవనముల ♦ నిలిపెఁ జాల
నృహరిగేహతటాక ♦ నిక్షేపవనములు
గొమరుగాఁ బెద్దాపు♦రమున నుంచె
విశ్వనాథకవీంద్ర♦విరచిత శేవధ
ర్మప్రబంధము సాద♦రముగ నందె
తే॥గీ॥ విశ్వవంశప్రతిష్ఠలు ♦ వెలయఁ జేసెఁ
బుత్రులను గాంచె నీతిని ♦ బుడమియేలె
వత్సవాయాన్వయమునకు ♦ వన్నె దెచ్చె
హెచ్చెఁ బేరయతిమ్మ ధా♦త్రీశ్వరుండు."

వీరు షేర్‌మహామ్మదువలన నొకఖడ్గమును బహుమతిగా నొంది నట్లు రామవిలాసములో వర్ణింపఁబడి యున్నది. ఈ (షేరుమహామ్మదనునాతఁడు శ్రీకాకుళమునకు నవాబుగ 1657 వ సంవత్సరప్రాంతమునం దుండుటచే నీ తిమ్మజగపతిరాజుగారు నాకాలములోనివారే యై యుందురు ; కాని, స్థానికచరిత్రాదు లందు 1607 వ సంవత్సరముతో వీరిపరిపాలనాదినంబు లంత మైనట్లు చెప్పఁబడి యున్నది. ఎట్లున్నను వీరు పదియేడవ శతాబ్దమున నుండినదిమాత్రము సత్యము.) వీరు పె

ద్దాపురమునే కాక మన్నెము, తోటపల్లి, జడ్డంగి సైతముగా ముల్లేరు, చాగలనాడు, కిమ్మూరుపరగణాలను సంపాదించి యేబదిరెండు సంవత్సరములు పాలించి 1607 వ సంవత్సరమునఁ గాలధర్మము నొందిరి.

వీరి యనంతరమున వీరికిఁగల ముప్పురు కుమారులలోఁ బ్రథములగు రాయపరాజుగారు పాలనమునకు వచ్చిరి. ఈ రాయపరాజుగారు— "అలరు జగదేకవీర రా♦జాధిరాజ। రాయవేశ్యాభుజంగాది ♦ రమ్య బిరుద। శాలి శ్రీతిమ్మభూపాల♦మౌళి సుతుఁడు। వత్సవయ రాయప కుమా♦వల్లభుండు" అనునట్లు బ్రసిద్ధి గాంచి కిమ్మూరు, బిక్కవోలు, తుని, కోతాము, మొల్లేరు, పిఠాపురము లను బాలించి నట్లు జెప్పఁబడి యుండెను. ఈ రాయపరాజుగారును బెక్కు సత్కార్యములను గావించుటయ కాక కవిజనానురాగు లయి—'ప్రపన్నమగు హరి భక్తిసుధోదయం బను మహాకృతిరత్న మంగుకొనిరి' నఁట. వీరును బెక్కు యుద్ధములను గావించి తమపరాక్రమమును వెల్లడించినట్లును, గోలకొండనవాబైన అబ్దుల్ హసేన్ కుతుబ్‌షాహచేతను వీని మంత్రులైన యక్కన్నమాదన్నగార్లచేతను గౌరవము లందిన ట్లీ దిగువ పద్యములవలనఁ దెలియఁగలదు—

"సీ॥ దర్పాంధయవనమ♦స్తకముల బురుజులఁ
గట్టించె నమ్మయ్య ♦ గట్టుచెంత
లొంపకి లోవలో ♦ గుంపులు గొని పోర
వచ్చిన దొరల గ♦ర్వం బడంచెఁ
జెలఁగి పోత్రరాజును ♦ జేపట్టి రాఘవ
రాజుదేశమునకు ♦ రాజుఁ జేసె
శరభరాజును గుహాం♦తరవాసుఁ గావించి
యతని గూడెంబు వీ♦రన్న కిచ్చె
తే॥గీ॥ గడుసుమన్నీల భృత్యులు♦గా నొనర్చె
నిగ్రహానుగ్రహంబులు ♦ నెగడఁ జేసె
వత్సవయతిమ్మధారుణీ♦శ్వరునిసుతుఁడు
రాజమాత్రుండె రాయప ♦ రాజశౌరి॥

మ॥ సులతాన్ శాహ బహద్ద రబ్దులహసన్ ♦ క్షోణీంద్రుచేఁ బూజ్య పిం
గళమాదన్న బుధేంద్రుచేత బహుసత్ ♦ త్కారంబు లందెన్ నవా
బులు సాధింపఁగ లేని దుర్గనికరం ♦ బుల్ లీలచే గెల్చె, ది
క్కుల కీర్తుల్ వెలయించె రాయపమహా ♦ క్షోణీశ్వరుం డున్నతిన్॥"

ఇట్లు చెప్పఁబడి యుండుటచే నీ నవాబురాజ్యకాల మసి సుయెల్ దొరగారి లిస్ట్సు ఆఫ్ ఆంటిక్విటీసు (Lists of Antiquities, Madras, Part II, Page 167) నందుఁ జెప్పఁబడిన 1611-1672 సంవత్సరముల మధ్యభాగముననే మన రాయపరాజుగారును బాలన మొనరించి యుందురు.

వీరియనంతరమునఁ దిమ్మరాజుగారు సంస్థానపాలనమునకు వచ్చిరి. ఈ తిమ్మరాజుగారు రాయపరాజుగారికిని సూరాంబకును జనించిన ముప్వురుపుత్రులలోఁ బ్రథములు. వీ రమితశౌర్యధను లై కావించిన యుద్ధవిశేషము లిట్లు వర్ణింపఁబడి యుండెను:—

"సీ॥ రాజులు మెచ్చఁ బ ♦ ర్లాకోట సాధించి
నరహరిదేవు దు ♦ ర్నయ మడంచెఁ
గుదు రైన బావిణీ ♦ కోట లగ్గలు వట్టి
యోదాళో టంతయు ♦ నుర్విఁ గలిపె
దుగరాజు మొద లైన ♦ దొరలను భంగించి
విశ్వంభరుని యుద్ధ ♦ విరతుఁ జేసెఁ
దగఁ బూసపాటి సీ ♦ తారామభూపాలుఁ
డభినుతింపఁగ విజ ♦ యంబు గాంచె
తే॥గీ॥ సరసమతు యవనాధీశుఁ ♦ దురగపతిని
గయ్యమున గెల్చె లోకవి ♦ ఖ్యాతిఁ జెందె
వత్సవాయాన్వయమునకు ♦ వన్నె దెచ్చె
రాయపనృపాలు శ్రీతిమ్మ ♦ రాజమౌళి."

ఈ వత్సవాయాన్వయజులు భాషాభిమాను లై పెక్కు గ్రంథములను గృతు లంది కవుల సత్కరించినట్లు వీరిచరిత్రము లందుఁ దఱ

చుగాఁ గాననగును. వీరును వీరి తాతదండ్రులవలె భాషాపోషకులై భర్తృహరిసుభాషిత మందలి పద్యకావ్యరచయితయును రామవిలాస కర్తయును నగు నేనుఁగు లక్ష్మణకవితాత యైన లక్ష్మణకవి తిమ్మరాజున కంకితముగా ద్రౌపదీపరిణయమును రచించినట్లు కలదు. కాని యీ గ్రంథ మిప్పు డెచ్చటను గానరాదు. ఈ తిమ్మరాజుగారి సోదరుఁడగు బలభద్రరాజుగారు గూడఁ గిరాతార్జునీయమును గృతి నందుటయ కాక తాము శ్రీరామశతకమును రచించి పేరు గాంచిరి.

ఈ తిమ్మజగపతిరాజుగారి కాలములోనే యుంచుమించుగాఁ గాలచక్రభ్రమణమువలన దేశములో ననేకము లైన నూతనరాజ్యస్థాపనములకుఁ బ్రారంభదశ గలుగుచుండెను. పోర్చుగీసు, డచ్చి, ఇంగ్లీషు ఫ్రెంచివారలు దేశములో వర్తకవ్యాజమునఁ బ్రవేశించిరి. 1686 వ సంవత్సరములో నౌరంగజేబు గోల్కొండమీఁదికి దండెత్తి వచ్చి యచ్చట నవాబుగ నుండిన 'అబూ హుసేన్ కుతుబ్ షాహా'ను జెఱ బట్టి గోల్కొండ రాజ్యనాశనకారకుఁ డయి తాను మొగల్ రాజ్యమును స్థాపించెను. ఈ నవాబునే మంచిరా జనునర్థ మిచ్చు తానాషాహా (తానీషా) యను నామమునఁ బిలిచెదరు. ఈ నవాబు హిందూ మహమ్మదీయభేదము లేక యెల్లర సమానభావమున నాదరించుచు నక్కన్న మాదన్న యను వారలకు బ్రధానోద్యోగంబు లిచ్చిన పుణ్యశాలి. ఈ బ్రాహ్మణు లిరువురును స్వమతాభిమానకారణమున మహమ్మదీయ ద్వేషానలంబున కాహుతులై దేశమందలి కల్లోలములకుఁ గారకులై తుదకుఁ దమ జీవితమును దమ రాజ్యమును మొగలుల కర్పించిరి. అంత మొగల్చక్రవర్తి యైన యౌరంగజేబు హైదరాబాదునందుఁ దన ప్రతినిధి నుంచి ఢిల్లీకి వెళ్లిపోయెను. ఈ ప్రతినిధి దక్కన్ సుబేదారుఁ డను పేరఁ బరగుచుఁ దుదకు హైదరాబాదు నైజా మయ్యెను.

దేశములో ని ట్లెన్నిమార్పులు గలిగినను నాయా పరగణాల నిధిపులుగా నుండినవారు మాత్ర మేచలనము లేక తమ పైయధికారులకు సువిధేయులై తమ పరగణాలను జక్కఁగఁ బాలించుకొను చుండిరి. అంత 1688 వ సంవత్సరములో నీ తిమ్మరాజుగా రపుత్రకులుగనే

గతించుటచే వీరిసోదరపుత్రు లగు రాయపరాజుగారు పాలనమునకు వచ్చిరి. వీరు బలభద్రరాజుగారి కుమారులు. ఈ రాయపరాజుగారి యనంతరమున వీరి ముప్వురుపుత్రులలో జ్యేష్ఠు లగు దిమ్మరాజుగారు పాలనమునకు వచ్చిరి.

ఈ తిమ్మరాజుగారి జీవితము మిగులఁ గష్టతరముగఁ గడచెను. ఈయన పాలనారంభమునఁ బది సంవత్సరముల ప్రాయమున నుండుటచే వీరి జనని యగు రాగమ్మగారు స్వజనసాహాయముచే రాచకీయవ్యవహారములఁ జూచు చుండెను. ఇంతలో మొగల్ రాజ్య మంతరించుటయు, దక్కనుసుబేదారుఁ డయిన కుమ్రుద్దీన్ అసఫ్ జా యను నాతఁడు నైజామ్ ఉల్ ముల్కు అను బిరుదముతో స్వాతంత్ర్యుఁడై గోల్కొండ సుబాకుఁ జేరిన యార్కాటు, కర్నూల్, రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారు లంతఁ దనకుఁ బ్రతినిధులుగ నవాబులఁ గొందఱ నుంచి తాను హైదరాబాదును రాజధానిగఁ జేసికొని పాలించుటయుఁ దటస్థించెను ఇట్లు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులకు అన్వారుద్దీన్ నియమింపఁబడెను. ఈ యన్వారుద్దీన్ జమీాందారులయొద్దనుండి యంతవఱకుఁ జెల్లింపఁబడక నిలువ యున్నకప్పములను రాబట్టుకొనుటకై 'రుస్తుంఖాన్' అనునాతనిఁ బంపించెను. ఈరుస్తుంఖానుఁడుఁ సైన్యసమేతుఁడై వచ్చుచుండఁగఁ గొందఱుజమీాందారు లెదిరించియుఁ బరాజితులై పెద్దాపురమునకుఁ బలాయితులై వచ్చి మఱికొందఱసాహాయమును దీసికొని తిరిగి 1734 వ సంవత్సరమున నెదిరించి మఱలఁ బరాజితులైరి. ఈసందర్భములో శత్రుపక్షమువారికి సాహాయకుఁడయ్యె ననుసీర్ష్యచే రుస్తుంఖానుఁడు మన తిమ్మరాజుగారిని గపటోపాయముచేఁ దన శిబిరమునకు రప్పించుకొని వారిని జిత్రవధ గావించెనఁట. ఈ దుఃఖవార్త విని పెద్దాపురములో నున్న వీరి జననియగు రాగమ్మగారును దదితరశుద్ధాంతకాంతాజనమును దురుష్కునిచే నెట్టి పరాభవమును గలుగకుండు నటుల నగ్నిప్రవేశ మొనర్చిరి.

ఇట్లగ్నిప్రవేశ మొనర్చుతఱి రాగమ్మగారు తనమనుమఁడును తిమ్మరాజుగారిపుత్రుఁడును నగు జగపతిరాజను నేడాదియీడు గల బాలుని వితంతు వగు నొకబ్రాహ్మణాంగన కొప్పగించి విజయనగరము నం దున్న పూసపాటి విజయరామరాజుగారి భార్యయు వాత్సల్యమున సోదరీసమానురాలును నగు చంద్రయమ్మగారి కీ యుదంత మెఱింగించి బాలునామెవశ మొనరింపఁ బంపించెను. అయినను మార్గమధ్యమున నెన్ని యో యంతరాయమ్ములు దటస్థించెను. కొందఱు తురుష్కులీమెను నిరోధించి బాలుఁ డెవఁ డని యడుగఁగా నామె యీబాలుఁడు తనకుమారుఁ డని బొంకి వారి సంశయవిచ్ఛేదమున కై యొక ఫలము నా బాలునిచేఁ గొఱికించి యా యుచ్ఛిష్టశేషమును దాను భుజించి తప్పించుకొని మఱికొంతదూర మేఁగెను. అయినను సత్యము బయల్పడుటచే మఱికొందఱు తురుష్కులా బ్రాహ్మణిని బట్టుకొని బాలుని దమవశమున నుంచుకొని కడు జాగ్రతతోఁ గాపాడుచుఁ జెఱ నుంచిరి. అంతఁ బెద్దాపురసంస్థానము మహమ్మదీయుల యధికారమునకుఁ వచ్చెను.

ఇట్లు రుస్తుంఖానుఁడు దన ప్రతాపమును 1732 మొదలు 1739 వఱకుఁ బ్రజ్వరిల్లఁ జేసి రాజమహేంద్రవరపుసర్కారును నేలుకొనెను. అంత నితనిసుతుఁ డగు నూరుద్దీన్ హుస్సేన్ ఖానుఁడు తండ్రిని వధించి తా నా స్థానము వహించెను. ఇతఁడు రాజమహేంద్రవరమునకేకాక, జయించినచోఁ గళింగదేశాధికారమునుగూడ నొంద నగునట్లు ఫర్మానాను సంపాదించి కళింగదేశమునకు దాడి వెడలు చుండఁగా విజయనగరాధీశు లైన పెదవిజయరామరాజుగారు నలువదివేలసైన్యమును వెంటఁ దీసికొని యీ నూరుద్దీన్ హుస్సేనును జయించి చెఱలో నున్న జగపతిరాజుగారిని విడిపించి తమ నగరమునకుఁ దీసికొనిపోయి తమ యన్నకుమారుఁ డైన యానందగజపతిరాజుగారితోపాటు పెంచుచుండిరి. ఈజగపతిరాజుగారు పైనఁ జెప్పఁబడిన విజయరామరాజుగారిభార్య యయిన చంద్రయమ్మగారికి మేనకోడలికుమారులు.

ఇట్టు విజయనగరమునఁ బెరుగు చుండిన జగపతిరాజుగారును నానందగజపతిరాజుగారును వయస్సునందును శౌర్యస్థైర్యగాంభీర్యాది గుణగణంబునందును బరస్పరము దీసిపోవనివారై మెలఁగు చుండిరి. కాని స్నేహభావముమాత్ర మంకురించినది కాదు. అయినను నేకొంతయుఁ గలుగ కుండఁగ జంద్రయమ్మగారు మన జగపతిరాజుగారిని సంరక్షించుచునే యుండిరి.

విజయరామరాజుగారికిఁ బడిపోయిన పుద్దాపురసంస్థానమును మఱల నిలువఁ బెట్టవలె నను దీక్షచే విశ్వప్రయత్నములను జేసియు, మహమ్మదీయులకు లంచము లిచ్చియు సఫలీకృతమనోరథులై తుదకు 1749 వ సంవత్సరమున షోడశవర్షవయస్కులగు జగపతిరాజుగారిని బునరభిషిక్తులుగఁ జేసి వత్సవాయసంస్థానపునస్థాపనాచార్య లను గీర్తిని గాంచిరి.

ఆతరుణమున ముస్తఫానగరు (కొండపల్లి), ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళముసర్కారులను జాఫరాలీ యనునతఁడు పాలించు చుండెను. ఇతఁడు తన క్రిందితాబేదారులు లంచముఁ గొని పెద్దాపురమును వదిలిపెట్టి రని మండిపడి కొంతసైన్యముతో మన జగపతిరాజుగారిపైఁ బడి ఘోరసంగ్రామ మొనర్చి యోడిపోయెను. ఈవిషయమై లక్ష్మణకవి యిట్లు వర్ణించెను—

"సీ॥ కన్నుల నుగ్రాంధ ♦ కారంబు వలెఁ గ్రమ్మ
గట్టుపుట్టలు చెట్లు ♦ గాన నీక
కఱకుగుత్తంపు గ్రొత్త ♦ గములసంకిలిజోడు
హత్తినగతి హజ్జ ♦ లాడ నీక
చెవులఁ దాళం బమ♦ర్చినమాడ్కి బాధించి
లేమలమొల్లి లా♦లింపనీక
లలినాఁటి యున్న గుం♦డెలలో నిగాలమై
యూర్పుల సడలింప ♦ నోప నీక

తే॥ గీ॥ వత్సవయజగపతిమహా♦వసుమతీశ
విజయధాటీసమాటీక♦విజితవిముఖ
జాఫరలిఖానమానస♦స్తంభనప్ర
గల్భరూఢభయావేశ♦గాఢతమము॥"

ఈ కాలములోనే యుత్తరసర్కారులు మహమ్మదీయుల నుండి ఫ్రెంచివారికి స్వాధీన మగుటయు నాబాలగోపాలముచే గానరూపమునఁ గీర్తింపఁబడు చున్న బొబ్బిలియుద్ధము జరుగుటయుఁ దటస్థించెను. విజయరామరాజుగారి యనంతరమున రాజ్యమునకు వచ్చిన యానందగజపతిరాజుగారు ఫ్రెంచివారిని ద్వేషించుచు నింగ్లీషు వారి కిష్టుఁడై తత్సాహాయ్యమున ఫ్రెంచివారిని దేశమునుండి వెడల గొట్టించుటకును జెన్నపట్టణము నందును గలకత్తాయందును నుండిన యింగ్లీషువారి నీప్రాంతములకు రప్పించి వారిపతాకము నధిష్ఠింపఁ జేయుటకును గృతనిశ్చయు లై రాయబారములను బంపి యింగ్లీషువారికి సర్వవిధముల సాహాయ్యకు లై తుదకు గృతకృత్యు లైరి. ఇట్లానంద గజపతిరాజుగారు స్వసామర్థ్యముచేతను నింగ్లీషుసైన్యముల సాహాయ్యము చేతను బ్రబలు లై రాజ్యవిస్తారమును గావించుకొనుచుండిరి. ఇట్లొక నాఁడు పెద్దాపురముమీఁదుగఁ బ్రయాణము సేయుచు నల్లచెఱువు గ్రామ సమీపమున దండు విడిసి జగపతిరాజుగారిని వంచింపఁ దలఁచి తమ శిబిరమునకు బిలిపించుకొనఁగ వారు వచ్చియు నీకృత్రిమంబు నెఱింగి తప్పించుకొని పోయి యానందగజపతిరాజుగారిచేఁ బరిభవింపఁ బడకుండు నట్లు బలవన్మరణము నొందనున్నతఱి నానందగజపతిరాజుగా రరుదెంచి జగపతిరాజుగారికి—"మీ కుమారుఁడైన తిమ్మరాజు గారిని, మీ రాజ్యమును మా యధీన మొనర్చి మీ యిష్టమైన యేస్థలమున నైనఁ బోవచ్చు' నని రాయబార మంపి రఁట. అంత జగపతి రాజుగా రట్లొనర్చి యసువు లుంచిన యెడలఁ బైసంగతిఁ జూచుకొన వచ్చునని గోదావరి దాటిపోయిరి. అంతఁ బెద్దాపురసంస్థానము విజయ నగరమువారి యధీన మయ్యెను.

అటుల గోదావరి దాటిపోయిన జగపతిరాజుగారు కంభముమెట్టు నకుఁ బోయి యట నుండి వేలుపుకొండ కరిగి యందుండి కొంతబల గమును సమకూర్చుకొని పెద్దాపురప్రాంతమునకు నాలుగునెలలలో వచ్చి చేరి శ్యామలకోట సమీపగ్రామమైన యుండూరువద్ద నానంద గజపతిరాజుగారి నెదుర్కొనిరి. కాని దైవబలము చాలమిచే యుద్ధ భూమిని బడి వీరశయనము నొందిరి. వీరి సహధర్మచారిణి యగు సీతమ్మ గారు భర్తృమరణంబునకు మిగుల దుఃఖించి, తమ కుమారులును బూర్వోక్తరీతి విజయనగరమువారి యధీనములో నున్నవారును నగు తిమ్మరాజుగారిని గుఱించి వ్యసనాక్రాంతచిత్త యై యనకాపల్లిజమీం దారుఁడగు రామభద్రపాయకరాయనింగారికి తమకుమారరక్షణ భారము నొప్పగించి భర్తదేహముతోఁ పాటు చితిపై కెక్కి సహగమన మొనర్చిరి. అట్లు సహగమన మొనరించుతఱి నానందగజపతిరాజుగారి భార్య లీ సీతమ్మగారికి పసుపుంగుంకుమలను బంపఁగా నాపతివ్రతా శిరోమణి పరాభవానలదందహ్యమానమానస యై "కొలఁదిదినములలో మీరు నిట్టి క్రియ కే పాల్పడఁ గలరు. కావున నీపసుపుంగుంకుమల నప్పటి కుంచుకొనుఁ"డని చెప్పి త్రిప్పి వేసె నఁట. ఇది జరిగినమూఁడు మాసములకే యానందగజపతిరాజుగారు స్ఫోటకముచేఁ గాలధర్మము నొందుటయు వారిపత్ను లిరువురును సహగమన మొనరించుటయుఁ దటస్థించెను.

ఇట్లు జరిగినపిమ్మట వత్సవాయవంశజు లైన రాచవారు విజయ నగరములో నున్న తిమ్మరాజుగారిని విడిపించుకొనిపోయి పెద్దాపుర సంస్థానమున కభిషిక్తుని జేసిరి.

ఈ తిమ్మరాజుగారును విజయనగరపాలకు లైన విజయరామగజ పతిమహారాజుగారును సమకాలికు లై పరస్పరస్నేహపాశానుబద్ధు లై యుండిరి. ఈ తిమ్మరాజుగారి యాస్థానమున నేనుఁగు లక్ష్మణకవియు విజయరామగజపతిమహారాజుగారియాస్థానమున నడిదము సూరకవియు నుండిరి. ఈ సూరకవి తమ ప్రభువుతోఁ బెద్దాపురమునకు వచ్చి రాజసభయందుఁ దనప్రభువు నుద్దేశించి :—

"ఉ॥ రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీను డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతరసీమవర్తి వి
భ్రాజిత పూసపాడ్విజయరామనృపాలుఁడె రాజుగాక యీ
రాజులు రాజులా వెనుతరాజులు గాక ధరాతలంబునన్॥"

అను పద్యమును జెప్పె నఁట. అందుల కారాజు లీపద్యచతుర్థచరణము తమ్ము గుఱించి చెప్పి నట్లు భావించి కోపదృష్టింజూడఁ బోవఁగాఁ బద్యార్థమును జెప్పి వారిని శాంతచిత్తులుగఁ జేసె నఁట.

ఈ తిమ్మరాజుగారి కాలమున ననఁగా 1766 వ సంవత్సరమున నుత్తరసర్కారులు సంపూర్ణముగ నింగ్లీషువారిస్వాధీనము లయ్యెను. అంత మఱికొంతకాలమున కింగ్లీషువారు సర్కారులందు జమీందారు లీయవలసిన కప్పములను నిర్ణయించుట మొదలగు రాజ్యకార్యవిధానములను బ్రవేశపెట్టఁ దొడఁగిరి. ఇట్లుండఁగా 1797 వ సంవత్సరమునఁ దిమ్మరాజుగారు స్వర్గస్థులైరి. వీరి యనంతరమున వీరికుమారులైన రాయజగపతిరాజుగారు పాలనమునకు వచ్చిరి. వీరి కాలములోనే దొరతనమువారిచే శాశ్వతపు జిరాయితీహక్కు (పర్మనెంటు సెటిల్‌మెంటు) ప్రవేశపెట్టఁబడెను. ఇందువలన గోదావరిజిల్లాలోని విశేషభాగము పెద్దాపురసంస్థానమునఁ జేర్పఁబడి రమారమి యేడులక్షలరూపాయల పేష్కషు విధింపఁబడెను. ఇంతలో వీరు 1804 వ సంవత్సరమునఁ బరమపద మందిరి.

ఈ రాయజగపతిరాజుగారికి మూవురు భార్యలు గలరు. వీరిలోఁ బ్రథమపత్నీవతంస మగు లక్ష్మీనరసయ్యమ్మగారి కొక పుత్రుఁడు జన్మించి యాఱవయేటనే గతించుటచే రాయజగపతిరాజుగారు తమ యవసానకాలమున దత్తస్వీకారమున కనుజ్ఞ యిచ్చి దేహవిముక్తులైరి. అంత లక్ష్మీనరసయ్యమ్మగారే పాలన మొనరించుచుఁ దమ సన్నిహితజ్ఞాతి యైన నొక బాలుని బెంచుకొనిరి కాని యీ బాలుఁడును దురదృష్టవశమున స్వల్పకాలములోనే గతించెను. అంత నీయమ మఱియొక బాలుని దత్తస్వీకార మొనరించుకొనఁ బ్రయత్నించుచుండఁగా

నప్పు డున్న వత్సవాయ వంశజులందఱిలో దగ్గఱవారసులును భీమవర పుగోట నివాసులును నగు వత్సవాయ జగన్నాథరాజుగారు ద్వితీయ దత్తస్వీకారము చెల్లదని దావా తీసికొని రాఁగా బందరులోని ప్రొవిన్షియల్ కోర్టువారు విచారించి యీ ద్వితీయదత్తస్వీకారము శాస్త్ర సమ్మతము గాదని తీర్పు చెప్పిరి. అంత మఱల జగన్నాథరాజుగారు పెద్దాపురసంస్థాన మవిభాజ్యసంస్థాన మగుటచే స్త్రీ పరిపాలనము చెల్ల రాదనియుఁ దాము సమీపపువారసు లగుటచే జమీ తమవశ మొన రింపవలసిన దనియు దావాను తెచ్చిరి. ఈ వ్యాజ్యమును రాజమహేంద్ర వరపు జిల్లాకలెక్టరుగారు విచారించి యీ రాణిగారియనంతరమున జ మీని స్వాధీన మొనరించు నట్లును, నంతవఱకు నీజమీలోని దయిన కొత్తాము పరగణా నిచ్చునట్లును రాజీనామా కుదిర్చిరి. ఈ రాజీనామా ప్రకారము 1810 వ సంవత్సరమున జగన్నాథరాజుగారు కొత్తాము పరగణా కధీను లైరి.

లక్ష్మీనరసయ్యమ్మగారు 1814 వ సంవత్సరమున గతించిరి. అంత శ్రీరాయజగపతిరాజుగారి ద్వితీయ భార్యయైన బుచ్చి సీతయ్యమ్మ గారు పాలనమునకు వచ్చిరి. కాని జగన్నాథరాజుగారు తమతోఁ గలెక్టరుగారు చేసియున్న రాజీనామా ప్రకారము సంస్థానము దమకు రావలసియున్న దని దావాను దెచ్చిరి. ఈ దావా పదునాలుగు సంవత్సరములు జరిగెను. అంతవఱకు జమీ దొరతనమువారి యధీనమున నుంపఁబడెను. ఎట్టకేలకు రాణుల యనంతరమున నేగాని వారసులకుఁ జెందఁగూడ దని తీర్పు చెప్పఁబడెను.

అంత బుచ్చిసీతయ్యమ్మగారు మఱల 1829 వ సంవత్సరములోఁ బాలనాభారమును వహించిరి. ఈమె సలిపిన సత్కార్యములన్నిటిలోఁ బెద్దాపుర సత్రనిర్మాణమును, ఒంటిమామిడి గ్రామసత్రనిర్మాణమును ప్రశంసనీయములు. ఈ రెండవసత్రము కారణాంతరములచే నట నుండి కత్తిపూడిగ్రామమునకు మార్చఁబడెను. ఈ రెండు సత్రముల యందును వర్ణభేదము లేక రెండుపూటలయందును నన్నదాన మొన రింపఁబడును. పెద్దాపురసత్రమునకు మూఁడు వేలనన్నూఱు రూప్యముల

రాఁబడిగల భూవసతియుఁ, గ_త్తిపూడి గ్రామసత్రమునకు మూఁడు వేలరూప్యముల రాఁబడిగల భూవసతియుఁ గలిగి ప్రస్తుతమున నీరెండు సత్రములును దొరతనమువారి యధీనములో నుండి చక్కఁగా నిర్వ_ర్తింపఁబడు చున్నవి.

ఈమె యనంతరమున శ్రీరాయజగపతిరాజుగారి తృతీయకళత్ర మగు బుచ్చి బంగారయ్యాదేవిగారు రెండు సంవత్సరములు మాత్రమే జమీాందారులుగ నుండి గతించిరి. అంత నీ సంస్థానము శ్రీవత్స వాయ జగన్నాథరాజుగారి జ్యేష్ఠపుత్రు లైన శ్రీ సూర్యనారాయణ జగపతిరాజుగారికి పూర్వోక్తతీర్మానానుసారముగ స్వాధీన మయ్యెను. అయినను నాకాలమున దేశములో దారుణ మైన క్షామము దటస్థించు టచే దొరతనమువారికి చెల్లవలసిన పేష్కష్ నిలిచిపోయెను. ఈ కారణముచే 1847 వ సంవత్సరమునఁ బెద్దాపురసంస్థానములోఁ జేరిన కిర్లంపూడి, దొంతమూరు, వీరవరము, కోలంక, గొల్లప్రోలు, జగ్గంపేట, పలివెల, గోపాలపురము, కపిళేశ్వరపురము, కోటపల్లి మొదలగు గ్రామములు వేలము వేయఁబడి విక్రయింపఁబడెను. ఇట్టుల దొరతనము వారి పేష్కష్ దిగఁబడుట, యాకారణముచే గ్రామములు విక్రయింపఁ బడుట మున్నగు నవస్థలు పలుమాఱుఁ దటస్థించుటచే నీబాధలు పడలేక సూర్యనారాయణ జగపతిరాజుగారు పెద్దాపురసంస్థాన చిహ్నముగఁ గొత్తాము పరగణాను మాత్ర ముంచుకొని మిగిలిన భాగమును దొరతనమువారి వశ మొనర్చిరి. ఈమాత్రముచే వత్సవాయాన్వయో ద్భవులు తమ సామ్రాజ్యమగు పెద్దాపురసంస్థానము పతన మైన దని యనుకొనుట కంతగా నవకాశము గానరాదు. ఏల యనఁ బ్రథమ మున గుడితిప్పయు, రాజ్యవిస్తారము బెం పొందినకాలమునఁ బెద్దాపురమును ముఖ్యస్థానములుగ నుండినట్లు ప్రకృతకాలంబున నీకొత్తా మున్నదె నని యేల యనరాదు!

సూర్యనారాయణజగపతిరాజుగారియనంతరమున వీరిద్వితీయ పుత్రు లగు శ్రీరాజా వత్సవాయ వేంకటసింహాద్రి జగపతిరాజుగారు కొత్తాముజమీాందారులు లైరి. వీరు 1853 వ సంవత్సరమున జన్మిం

చిరి. ఈరాజాగారికి సంస్కృతాంధ్రభాషలయందేకాక హిందూస్థానీభాషయందును ప్రావీణ్యము గలదు. మృగయాఖేలనమునం దత్యంతాసక్తిగలవారని ప్రసిద్ధిగలదు. తమ పూర్వీకులచేఁ గోల్పోవఁబడిన సంస్థానమును మఱల దయచేయింప వలసినదని దొరతనమువారి కొక విజ్ఞప్తిని బెక్కువిషయములతో విన్నవించుకొనిరి. కాని ప్రయోజనము లేక పోయెను.

శ్రీరాజావారు తునిలో నొకసత్రమును నెలకొల్పిరి. మఱియు నీరు లేడీ డఫరిన్ ఫండు (Lady Dufferin Fund) నకు రెండువేల రూప్యములను, విక్టోరియాజ్ఞాపకనిధికి వేయిరూప్యములను నొసంగియుండిరి. తమస్వస్థానమునందుఁగల యెనిమిది దేవళములను బోషించుచు నుత్సవసమయములం దన్నప్రదానము విశేషముగ జరుపుచుండిరి. 1899 వ సంవత్సరప్రాంతములోఁ దటస్థించిన దారుణక్షామ సమయమున దొరతనమువారికోరికచేఁ బదివేలరూప్యముల వెచ్చించి చెరువులను గాలువలను బాగుచేయించిరి.

వీరియనంతరమున వీరిసహధర్మచారిణి యగు శ్రీరాణీ వత్సవాయ వేంకటసుభద్రయమ్మ జగపతిదేవిగారు సంస్థానమును బాలించుకొనుచుఁ దమభర్తగారిచే నెలకొల్పఁబడిన ప్రతిష్ఠాపనముల నన్నింటిని జక్కఁగ నెఱవేర్చుచుండిరి. శ్రీరాణీవారి యోగ్యపాలనమునకు సంతసించి వంశపారంపర్యముగ వచ్చుచుండిన రాణీ బిరుదమును దొరతనమువారు నైతము మఱలఁ బ్రసాదించి యీ 1918 వ సంవత్సరారంభ గౌరవము నందఁజేసిరి. ఈసందర్భమునఁ బౌరులును మఱికొందఱు విద్యాధికులును శ్రీరాణీవారికి లభించిన గౌరవమున కై యానందించుచుఁ దమయామోదమును బలురీతుల వెల్లడించిరి.

శ్రీరాణీవారి యేకపుత్రికావతంసమును బరిణయ మైన శ్రీచింతలపాటి వరహాలు రాజుగారు సహజగాంభీర్యౌదార్యాది సద్గుణపుంజంబుచేతనుమనోహరాకారంబుచేతను విరాజిల్లుచుసంస్థానపాలనావిధానంబు నందుఁ దోడ్పాటుజూపుచుండ శ్రీరాణీవారు ప్రజారంజకముగ నేలుకొనుచుండిరి. వీరికి భగవంతు డిష్టైశ్వర్యాయు రున్నతులఁ గూర్చుఁగాక.



శ్రీ రాజా శ్రీనివాస రాజమణి రాజదేవ్ బహదరుగారు,

మందసా, గంజాంజిల్లా.



శ్రీరస్తు.

# మందససంస్థానము.

మందస (గంజాంజిల్లా.)

---

సీ॥ అతులిత్రైలోపాను • హాయుద్ధమునఁ దమ
సర్వస్వ మర్పింపఁ • జాలి రెవరు?
తమక్షాత్రధర్మంబుఁ • దలఁచి యాహవభూమి
కేఁగ నెంతయు నుత్సహించి రెవరు?
మేరాదరమతి • బీదసాదల మొఱల్
విని వారిఁ దృప్తిఁ గా • వించి రెవరు?
ప్రజలహితము దీర్పఁ • బ్రభవించినట్టి లో
కేశుసేవకుల మం • చెంతు రెవరు?
తే॥గీ॥ రాజమాన్యులు కీర్తివి • రాజమాన
శేముషీధను లెవ రట్టి • శ్రీనివాస
రాజమణిరాజదేవు శ్రీ • రమణుఁ డాయు
రున్నతులఁ గూర్చి రక్షించు • చుండుఁ గాత.

గంజాంజిల్లాయందుఁ గల ప్రాచీనసంస్థానములలో మందససంస్థాన మొకటియై యున్నది. ఈసంస్థానాధిపులు పూర్వకాలంబునఁ బెక్కుయుద్ధభూములయందు జయించి రాజ్యవిస్తీర్ణమును సంపాదించుకొనియుండి విఖ్యాతి గాంచి యుండినట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. ప్రస్తుతమందససంస్థానాధిపులైన 'సాహెబ్-మేహార్బాన్

ఐ-గోస్టార్ శ్రీరాజా శ్రీనివాసరాజమణిరాజదేవుగారు విశాల హృదయమును, జనానురాగమును గలవా రగుచు యభ్యున్నతస్థితి సహించి సర్వజనసమ్మతముగఁ బరిపాలన మొనరించుకొనుచున్నారు. వీరియెడ మండలాధికారులకును, రాజధానిపాలకు లగుప్రభుత్వము వారికిని గౌరవాస్పదమైన సదుద్దేశము గలదు.

ఈరాజన్యులమూలపురుషుఁడు చంద్రవంశములోని యొక గొప్ప క్షత్రియవీరుఁ డగు వామన్‌సింగు. సూర్యవంశస్థు లనియుఁ జంద్ర వంశస్థు లనియు క్షత్రియులలో గల నీ రెండుతరగతులవారు క్షాత్రము నందును శౌర్యసాహసౌదార్యాదిసుగుణపుంజమునందును సమానులు గనే యుందురు.

ఈవామన్‌సింగుగారు పెషావరునుండి పదమూఁడవశతాబ్దమున నీప్రాంతములకు వచ్చి ప్రఖ్యాతి వహించిరి. నాఁటనుండియు నీవంశ మువారిచేతనే మందసాసంస్థాన మవిచ్ఛిన్నముగఁ బాలింపఁబడు చున్నది. వీరినిగుఱించి ప్రస్తుతరాజావారి కంకిత మీయఁబడిన మత్కృతప్రియదర్శికాభిఖ్యగ్రంథంబున నిటుల వర్ణింపఁబడియె—

ఉ॥ శ్రీమదశేషసద్గుణధురీణుఁడు, సర్వనృపాలపాలనో
ద్దామపరాక్రమాన్వితుఁడు, ధర్మగుణైకరతుండు, కామినీ
కాముఁడు, దీనపోషకుఁడు, కామవిరోధిపదార్చకుండు నా
వామనసింహుఁ డొప్పుఁ బరిపంథివితానమదేభసింహుఁడై॥

చ॥ సమధికధైర్యధుర్యుఁడు పెషావరురాజ్యకనిష్ఠపుత్రకుం
డమితయశస్కరుం డరిభయంకరుఁ డాహవదోహలుండు నై
క్రమమునఁ జేరె నుత్కళ మఖండబలోద్ధతి రాజ్యకాంక్ష నీ
హిమకరవంశవర్ధనుఁ డహీనజయోత్సుకుఁడై తిరంబుగన్॥

ప్రస్తుతరాజాగారి ప్రపితామహులగు శ్రీరాజా శ్రీనివాసరాజ మణిరాజదేవుగారు వారి సహజసుగుణసంపదవలనను ధార్మికభావంబు వలనను మిగులఁ బ్రసిద్ధిని వహించి యుండిరి. వీరిదాతృత్వ మసమాన మని వీరిచే నెలకొల్పఁబడిన యగ్రహారములవలనను దేవళములవలనను

జనోపయోగకరము లగు దదితరఘనకార్యములవలనను లోకవిదిత మైయున్నది. వానిలో నొకటి యగు హరిపురమునందలి సత్రము కాశీరామేశ్వరయాత్రికుల కెంతయో యుపయోగకరముగ నుండె నను టకు నిదర్శనముగ నున్నది.

ఈరాజాగారు ప్రజారంజకులును రాజోచిత మగు నున్నతాదర్శములు గలవారును నగుటచే వీరియెడఁ బ్రజల కెంతయో విశ్వాసగౌరవాభిప్రాయములు గలవు. అందువలన మండలాధిపతు లగు ముఖ్యాధికారులకు సమస్తవిషయములందును సహకారులు గాఁగలుగు నంతకుశలతయు సామర్థ్యమును గలవారుగ నుండిరి. ఆప్రాంతములం దెప్పుడేని యల్లరిమూఁకలవలనఁ గలిగింపఁబడెడి కలవరమును నడచివేయుటకు వీరు తక్షణమే యాయుధపాణు లగు దమసైనికులఁ బంపి శాంతమును నెలకొల్పుటయా దణుమాత్ర మైనను జాగు సేయక పాటుపడు చుండెడివారు. తిరగబాటుదారులను, బందిపోటుగాండ్రను దొరతనమువారిపక్షమునఁ బట్టుకొని శిక్షించు చుండుటచే మదరాసు దొరతనమువారు శ్రీరాజాగారిని దమరహస్యాలోచనవర్గములోనివారుగ భావించుకొన నగు నంతటి విశ్వాసపాత్రులుగ నుండిరి. ఒకానొకసందర్భమున దీసంస్థానప్రాంతమునందు గల యొకజమీందారీలోఁ దిరస్కారములు మున్నగుకలవరములలో నిండి యుండుట దొరతనమువారి విచారణమునకు వచ్చెను. అయినను దా మెవరియం దెక్కుడు గౌరవాభిప్రాయము లుంచిరో యట్టి మందసరాజావారు పూచీపడుటచేఁ దా మేమియు జోక్యమును గలిగించుకొనక దొరతనమువారూర కుండిరి.

ఈరాజాగారు కవిజనపోషకులును ధర్మపరతులును నై నట్లు పూర్వోక్తప్రియదర్శికయందలి యీదిగువ పద్యము సెప్పుచున్నది.

సీ॥ ఏరాజు ఘనతతోఁ ♦ దారుఁ డై బహుళాగ్ర
హారముల్ స్వీయరా♦జ్యమున నొసఁగె
ఏరాజు కీర్తివి♦స్తారుఁ డై హరికి కో
వెలలు గోపురములు ♦ వెలయఁ జేసె

ఏరాజు మహాదుపకారుఁ డై హరిపుర
ప్రాంతంబునందు సత్రంబు నుంచె
ఏరాజు దీనమందారుఁ డై వార్షికం
బు లొనర్చి బుధకోటి నలరఁ జేసె
తే॥గీ॥ అతులితోగ్ర ప్రతాపదావానలమున
నెవఁడు రిపుకీర్తిలతల దహింపఁ జేసె
నట్టి యాహావదోహలుఁ డమితభుజప
రాక్రముఁడు శ్రీనివాసభూరమణుఁడొప్పె॥

శ్రీరాజా శ్రీనివాసరాజమణిరాజదేవుగారియనంతరమున వీరి కుమారులును ప్రస్తుతరాజాగారి పితామహులును నగు శ్రీరాజా జగన్నాథరాజమణిరాజదేవుగారు పరిపాలకు లైరి. వీరు విద్యాధికులును, చిత్రకళావిశారదులును, రాజకార్యధురంధరులును నై యుండిరి. బ్రిటీషుదొరతనమువారియెడ వీరికి వంశపారంపర్యముగ వచ్చుచుండిన నిరుపమాన మగు రాజభక్తియుఁ సంస్థానపాలనములోఁ గల చాకచక్యమును దొరతనమువారిని జాల సంతృప్తిపఱచెను. అందువలన 1878వ సంవత్సరారంభదినమున శ్రీవిక్టోరియామహారాణిగారి నలువదియొకటవ సాంవత్సరికోత్సవజ్ఞాపకార్థముగ శ్రీరాజాగారికి— "హిందూరాష్ట్రములోని మిత్రుఁడు" అను నర్థమిచ్చు—"కంపేనియన్ ఆఫ్ ది ఇండియన్ ఎంపైర్" (Companion of the Indian Empire) అను బిరుద మొసంగిరి.

ఇంతియేగాక వీరి పరిపాలనము నందలి నైపుణ్యమునకు సంతృప్తిని జెంది శ్రీరాజావారు రెండుశతఘ్నుల (ఫిరంగుల) నుంచుకొను నధికారముగల యాజ్ఞాపత్రము * (License) తోఁ ఫిరంగులనుగూడ నొసంగియుండిరి.

---

* "No. 49.

GOVERNMENT OF INDIA,
HOME DEPARTMENT, PUBLIC,
*Simla, the 22nd August 1887.*
LICENSE.

With reference to rule 12 of the rules made by the Governor- General

శ్రీరాజాగారికి 1887 వ సంవత్సరమందు 'రాజా' అను బిరుదమును దొరతనమువా రొసఁగి యుండిరి. ఆసందర్భమున మదరాసు గవర్నరువా రగు శ్రీ గ్రాంట్ డఫ్ (M. E. Grant Duff) దొరగారు మదరాసునుండి శ్రీ రాజావారికి, "ఇప్పటికి తమ్ము 'రాజా' యను బిరుదమున నంకితము సేయఁ గలుగు చున్నాను. ఇట్లొనర్చుట నా కెంతయు సంతోషదాయకముగ నుండె నని నొక్కి వక్కాణించుచున్నాను.

ఘనతవహించిన తమ సంస్థానప్రజాక్షేమముకొఱకును, నిట్టి గౌరవాదులచేఁ దమ రింకను నానంద మొందుటకును చిరకాలజీవు లై యుండెదరుగాక" యను నభిప్రాయ మిచ్చునటు లొక * లేఖను వ్రాసి యుండిరి.

ఈ శ్రీరాజా జగన్నాథరాజమణి రాజదేవుగారికిని గవర్నరుగారగు గ్రాంట్-డఫ్ (M. E. Grant-Duff) దొరగారికిని గలస్నేహాధర్మమతివిశేషము. వీ రెల్లప్పుడు నేదో యొక విషయమై యుత్తరప్రత్యుత్తరములను జరుపుకొనుచునే యుందురు. అందులో నొకదాని

in Council under the Indian Arms Act, 1878, and published in the notification of this department, No. 518, dated the 6th March 1879, the Zamindar of Mandasa in the Ganjam District of the Madras Presidency is hereby licensed to possess two cannon.

By Order of His Excellency,
The Viceroy and Governor-General,
(Signed) A. P. MACDONNELL,
Secretary to the Government of India."

---

*Madras, January 6th, 1886.*

"My Friend,

Now at last I am able to address you as 'Rajah' officially and I need hardly say that it gives me very great pleasure to do so.

Long may you live to enjoy honors and to benefit your people on your noble estate.'

Believe me to be,
Your sincere friend,
(signed) M. E. grant-Duff."

యొక్క యభిప్రాయము నీదిగువఁ బొందుపఱచెదను. * "తమవార్తల నుదెలిసికొనుటకు నాకు నిరంతరమును మిగుల సంతోషకరముగ నుండును. మఱియు నేను యూరోపునం దుండునపుడు సైతము తమ క్షేమసమాచారములు దెలియజేయఁబడుచునే యుండునని విశ్వసించు చున్నాను.

మందసానుండి యొక లేఖతో నిన్నటిదినమున వచ్చి చేరిన యొకచక్కని శిల్పచాతుర్యముగల బుడ్డిని బంపినది తమరే యై యుందు రని తలంచు చున్నాను.

ఇచ్చట నాజీవితమును గుఱించి ప్రకటింపఁ బడిన యొక గ్రంథ మును, హిందూదేశమందలి నా దగు జీవితమునకు సంబంధించిన మఱియొక గ్రంథమును దమకుఁ బంపుకొనుట కనుజ్ఞ నిచ్చెదరా?

తమరు నన్నంతదయతోఁ దమ ప్రాచీన మైన కోటలోని కాహ్వాన మొసరించి యుండుట నా కెంతెయు గౌరవదాయక మని తలంచు చున్నాను.

ఇట్లు,

తమ మనఃపూర్వకమైన మిత్రుఁడు,

(సంతకము) యం. ఇ. గ్రాంట్-డఫ్"

ఇట్టి యుత్తరములవలన శ్రీరాజాగారియెడ దొరతనమువారి కెట్టిగౌరవాభిప్రాయము లుండినదియు స్పష్టపడఁగలఁ దని యిందు బొందుపఱచితిని.

---

November 6th 1886,

* "MY DEAR RAJAH. Guindy.

It is always a great pleasure to me to hear from you and I trust that when I am in Europe I may now and then have tidings of your welfare.

I think it must be you who have sent me a very pretty little carved bottle which came yesterday from Mandasa with a letter.

Will you permit me to offer two books of myself-the one published and relating to my life here-the other privately printed and belonging to my pre-Indian life.

I should feel it a great honour to be thus represented in your ancient castle where you so kindly received me. I am,

With every good wishes,

Your most sincere friend,

(Signed) M. E. Grant-Duff."

తత్కాలమున యువరాజుగా నుండిన స్వర్గీయచక్రవర్తిగారి యాధిపత్యమున లండనులో జరిగిన పరిశ్రామికవస్తుప్రదర్శనసందర్భమున శ్రీరాజాగారు శిల్పచాతుర్యము గలిగి మిక్కిలి సుందరములైన కొన్ని పెట్టెలను బంపి యుండిరి. అందులకు మఱల గౌరవార్థము రెండు పతకములు (Medals) శ్రీరాజాగారికి బంపఁబడినవి.

గంజాంజిల్లాలోఁ బ్రథమమున నింగ్లీషుపాఠశాలను స్థాపించిన దీ రాజాగారే గనుక వీరియెడఁ బ్రజలకుఁ గల గౌరవాభిప్రాయమున కిదియు నొకకారణ మయ్యెను. శ్రీరాజాగారు విద్యావిషయమై కనబఱచు చున్న నిరుపమానాభిరుచికి సంతసించిన జి. యస్. ఫోర్బ్సు (G. S. Forbes) దొరగా రభినందించుచు నిట్లు వ్రాసిరి :—

"పాఠశాలాప్రతిష్ఠాపనమువిషయములోఁ దమరు జూపి యున్న యున్నతౌదార్యమును దక్కుంగలజమీందారు లెల్లరు ననుసరించెదరుగాక యని కోరు చున్నాను. తమరు సంతృప్తికర మగుపనుల నొనరించు చుండి రనియు, నందువలనఁ దమసంస్థానములోని సమస్తగ్రామానులవారు జక్కనిలాభము నొందఁగల రనియుఁ గోరుచున్నాను."

మన హిందూదేశమునకు ఘనతవహించిన వేల్సురాకుమారుఁడు దయచేసి యున్న సందర్భమందు శ్రీరాజాగారు, "దీ ప్రిన్సు ఆఫ్ వేల్సు స్కాలర్ షిప్" (The Prince of Wales Scholarship) అను పేరిట నొకవిద్యార్థివేతనమును శ్రీవారిగౌరవార్థముగ నీయ నంగీకరించి యుండిరి.

మదరాసుగవర్నరు వా రగు యం. ఇ. గ్రాంట్-డఫ్ (M. E. Grant-Duff) దొరగారు బెజవాడయందు జరిగించి యుండిన యొక బహిరంగోపన్యాసమునందు మందసాధీశ్వరుని, విజయనగర బొబ్బిలి మహారాజాగార్లతోడను బిఠాపురరాజాగారితోడను జతపఱచి— "ఈ పూర్వోత్తరమండలములందు విజయనగరము మహారాజాగారివలెనె, మందసాబొబ్బిలిసంస్థానాధీశ్వరులు దమప్రాంతమువారి జ్ఞానాభివృద్ధి కనేకమార్గములఁ గృషి సేయుచున్నా"రని ప్రశంసించి యుండిరి.

శ్రీరాజాగా నగు శ్రీజగన్నాథరాజమణిరాజదేవుగారికి గల జన హితైకభావమునకును, బ్రిటీషుదొరతనము వారియెడఁ జూపుచుండిన రాజభక్తికిని దార్కాణముగ మదరాసుదొరతనము వారు 1877వ సంవత్సరమునం దొకయోగ్యతాపత్రికను బంపి యుండిరి. అందు —

"శ్రీ గవర్నర్ జనరల్ వారి యాజ్ఞానుసారముగ, మహాఘనతవహించిన హిందూదేశచక్రవర్తినియగు శ్రీవిక్టోరియామహారాణీగారి పేరిట మందస సంస్థానాధీశ్వరులును శ్రీనివాసరాజమణిరాజదేవుగారి కుమారులును నగు శ్రీజగన్నాథరాజమణిరాజదేవుగారు, వారిసంస్థానమునం దుండి పోవుచున్న యొకరస్తా (Road) కు వలయుప్రదేశమును నుచితముగ నొసఁగుటయే కాక ప్రజాక్షేమముకొఱకును, రాజభక్తిప్రదర్శకత్వము కొఱకును బెక్కువిధములఁ బాటుపడు చుండి సందులకు గౌరవార్థముగ నీయోగ్యతాపత్రిక యొసఁగఁబడు చున్న"దని వ్రాయించిరి.

వీరినిగూర్చి ప్రియదర్శికయం దిట్టులఁగలదు. —

ఉ. ఈనరపాలుఁ డాగ్లధరణీశుల కెంతయు దోడునీడ యై
పూనె శతఘ్నికాయుగళముం బిరుదంబుగ 'రాజ'శబ్దముం
మానితవై ఖరిం సకలమండలనాథుల కూర్మినేస్తముం
దీనజనానురాగము సుధీజనవంద్యవిశుద్ధశీలముం.

శ్రీ జగన్నాథరాజమణిరాజదేవుగారి ముగ్గురుకుమారులలోను జ్యేష్ఠు లైన లక్ష్మీనారాయణదేవుగారు బాల్యమునందే స్వర్గస్థు లగుటంజేసి ద్వితీయు లైన వాసుదేవరాజమణిరాజదేవుగారు మందసాసంస్థానాధీశు లైరి. వీరు తమ తండ్రిగారియొక్కయుఁ దదితరోపాధ్యాయులయొక్కయు మిక్కిలి జాగ్రత్తతోఁగూడిన పరిశీలనమువలనను శ్రద్ధవలనను సంస్కృతము, బంగాళి, తెలుఁగు, ఇంగ్లీషు, ఉరుదుభాషలయందు బ్రవీణు లైరి.

వీరు బ్రిటీషుదొరతనమువారియెడఁ దమకుఁ గల రాజభక్తిని గనపఱచుట కై సమయముకొఱకు వేచియుండి దక్షిణాఫ్రికాలో బోయరుయుద్ధము జరుగు చుండినసందర్భ మందు 'రాష్ట్రీ'మునం దవ

కాలముగల ప్రతివారును యుద్ధరంగమునం దుపకరించుటకుఁ గావలసి యుండి రనునభిప్రాయము సూచింపఁబడినప్పుడు శ్రీరాజాగారు తక్షణమే మదరాసుదొరతనమువారికి తమసంస్థానపాలనము నొప్పగించి తాము యుద్ధరంగమునందుఁ బనిసేయు చుండినదినములలోఁ బాలన మొనరించు నట్లుగఁ జేయవలసినయేర్పాటు లన్నియు నత్యంతాతురతతోఁ జేయ మొదలిడిరి; కాని యుద్ధరంగమునం దంతగా నవసరము లేనట్లు తెలిసినవెనుక తా మదివఱకుఁ జేసియుండిన ప్రయత్నము నుండి విరమించుకొని నాఁటనుండి యుద్ధవిషయిక విజయవార్తలను విను చుండి నపు డెల్ల దమ మందససంస్థానములోని దేవళములం దభిషేకములు, ప్రార్థనలు మున్నగువానిని జరిపించుచు మిగుల నానందమును గనఁబఱచిరి.

మహాఘనతవహించిన శ్రీవిక్టోరియామహారాణిగారి మరణవార్తను వినినమీఁదట శ్రీరాజాగారు తమహృదయపూర్వకమైన సానుభూతిని బలుతెఱంగులఁ గనపఱచిరి. శ్రీ స్వర్గీయ మహారాణీగారి జ్ఞాపకార్థముగ నొక యౌషధాలయమును నెలకొల్పిరి. వీ రదివఱకుఁ బోషించు చుండినదానినేగాక ఘోషాఆసుపత్రియందు మఱియొక శయ్యను నెలకొల్పిరి. మఱియు విక్టోరియామహారాణిగారి జ్ఞాపకార్థమై యేర్పఱచఁబడిన నిధి (Fund) కి పూర్వపురాణిగారును (Dowager-Ranee) ప్రస్తుతరాణిగారును రెండువేలరూప్యము లొసంగిరి. ఈవిషయమునుగుఱించి 1901 అక్టోబరు 3వ తేదీని హెచ్. ఇ. లార్డు ఆంప్టిల్ (H. E. Lord Ampthill) ద్వారగా రీక్రిందివిధముగల లేఖను బంపియుండిరి.

*"విక్టోరియామహారాణిగారి జ్ఞాపకార్థమై స్త్రీజనోపయోగమునకయి నెలకొల్పఁబడు చున్న నిధిని బోషించుటలోఁ దమ కుటుంబము

---

* "To

THE ZAMINDAR OF MANDASA,

Dear Sir

I wish, in reply to your letter of the 26th September last, to thank you most sincerely for the generosity with which your family has come forward,

వారు ముం దంజ వేయుచుఁ గనబఱచిన సూదార్యమునకు సెప్టెంబరు 26వ తేదీగల తమయుత్తరమునకు జవాబుగఁ బంపఁబడు చున్నయిం దత్యంతమనఃపూర్వక మైన వందనము లర్పించుటకుఁ గోరు చున్నాను. తమరాణీగారికిని, పెదరాణీ (Dowager Ranee) గారికిని నా కృతజ్ఞతను శ్రుతపఱచెదరుగాక."

శ్రీరాజాగారు విద్యార్థుల వసతిగృహముల కై యెక్కువ శ్రద్ధను దీసికొనిరి. బ్రహ్మపురమునందలి విద్యార్థివసతిగృహమున (Hostel) కధికముగఁ జేర్పబడియున్న భాగ మీరాజాగారి దాతృత్వమే.

మఱియుఁ జెన్నపురమునందు విక్టోరియాచక్రవర్తినిగారి పేరఁ గట్టఁ బ్రయత్నించిన పురమందిరము (Town-Hall) నకు మూఁడు వేలరూపాయిల విరాళ మొసంగుటయగాక తమ స్నేహకోటియు నిందులకుఁ దోడుపడునటులఁ బ్రోత్సాహ మొనరించిరి.

వీరు బాలురవిద్యాభివృద్ధికొఱకై యొక బాలికాపాఠశాలను' సంస్కృతపాఠశాలను, ప్రథమతరగతిపాఠశాలను (Primary School) లోవర్ సెకండరీపాఠశాలను బోషించుచుండుటయేగాక పర్లాకిమిడుకాలేజినుండికాని కల్లికోటకాలేజినుండికాని యఫ్. ఏ. తరగతియందు కృతార్థులై విజయనగరములోని కాలేజీయందు బి. ఏ. తరగతిలోఁ బ్రవేశించు నొక విద్యార్థి యొక్క వేతనమును భరించుచుండున ట్లేర్పఱచిరి.

1897వ సంవత్సరములో నిండియాదొరతనమువారు శ్రీరాజాగారి కార్యకౌశల్యమునకును డికాలువిషయములోఁ బ్రత్యేకముగఁ గనఁబఱచిన యభిలాషకును సంతసించి యొక మన్ననపత్రమును * (Certificate) బంపి యుండిరి.

---

to support the Women's Victoria Memorial Fund. Will you be so good as to express my gratitude to the Dowager Ranee and to your lady the Ranee of Mandasa.

Believe me,
Yours very truly.
(Signed) AMPTHILL."

* "By command of His Excellency the Viceroy and Governor-General in Council, this certificate is presented in the name of Her Most Gracious

ఈ రాజాగారికుమారులే శ్రీరాజా శ్రీనివాసరాజమణిరాజదేవు గారనుపేరఁ బరగుచుండిన ప్రస్తుత మందససంస్థానాధీశ్వరులు. వీరు తమపూర్వీకులచే నెలకొల్పఁబడిన ప్రతిష్ఠాపనములఁ బోషించుచుండుటయేగాక తమసంస్థానమున 'అనాథాంధకశరణాలయ' మనుపేర దిక్కులేనివారికిని, గ్రుడ్డివారికిని నొక నివాసగృహము నేర్పఱచి యందు శరణాగతులైనవా రాజన్మమును బోషింపఁబడఁగలుగున ట్లుపాధిని గల్పించి 'జనుషాంధః ప్రకరావనానుపమదీక్షాలోలురై' యున్నారు. మఱియు ననుదినమును బ్రాతఃకాలంబున ద్వారాంతికమునకు వచ్చి శ్రీవారి దర్శనార్థమై యేతెంచి యుండిన దీనులును నన్నాతురులును నగు నిరుపేదలను స్వయముగ వీక్షించి కుశలప్రశ్నము లడిగి ద్రవ్యవస్త్రదానాదులచేఁ దృప్తిగావించుచుండుట వారి యనుదినవిధాయక కృత్యములలో నొకటిగ భావించి య ట్లొనర్చుచున్నారు. శ్రీరాజాగారు ప్రజాక్షేమమును గూర్చుటకే భగవంతుఁడు తమకిట్టి యుచ్ఛపదవిని గలిగించె ననియు, నట్టి తమవిధాయకమును నెఱవేర్పకుండినయెడల భగవదాజ్ఞను మీఱినటులే యనియుఁ దలంచి నిరంతరమును బ్రజాహితైకతత్పరులై వర్తించుచుండెదరు. ఇదియే వీరిసుగుణరత్నములకు నాయకమణి. శ్రీరాజాగారు మృగయావినోదపరులు. వేఁటాడుటయందు వీరి కత్యంతసామర్థ్యము గలదు. వీరిప్పటి వఱకు నిరువదిపులులకుఁ బైగా వేఁటాడి యుండిరి. వీరిచే సజీవముగాఁ గొనిరాఁబడిన రెండుపెద్దపులు లిప్పుడు కోటలో బెంపఁబడుచున్నవి.

ప్రస్తుతము జరుగుచుండిన యైరోపామహాయుద్ధరంగమునకేఁగి తమ యసమానపరాక్రమమును రాజభక్తిని జూపఁగోరి దొరతనమువారికి దెలియఁజేసినవారిలో వీ రొకరు.

శ్రీరాజావారి స్వభాష యుత్కళ(ఓఢ్రము) మైనను సప్తభాషాపరిచయము గలిగి యుండుటయకాక యాంధ్రభాషయం దెక్కుడభి

---

Majesty Queen Victoria, Empress of India, to Sahib-i-Mehrban-i-Dostan, Sri Vasudeva Rajamani Raja Deo Garu, Zamindar of Mandasa, son of Sri Jagannadha Rajamani Raja Deo, in recognition of his services as a member of the District Board of Ganjam and of the special interest taken by him in vaccination."

లామగలవారయి నాచే రచింపఁబడిన ప్రియదర్శిక యను నొక నవలకుఁ గృతిపతులై తమకుం గల యన్యభాషాభిమానమునుగూడఁ బ్రకటించిరి. శ్రీరాజావారిని గుఱించిన ప్రియదర్శికలోని రెండుమూఁడు పద్యములతో నీచరిత్ర మింక ముగించెద.

సీ. తమకీర్తి వర్ణింపఁ ♦ దగు నందఱునుగాని
  యింద ఱేటి కఁటన్న ♦ యీసు లేదు
అర్థించుకవికోటి ♦ కాశ్రయం బిడుఁ గాని
  మావల్లఁగా దను ♦ మాట లేదు
ఎన్నిసార్లడిగిన ♦ నిచ్చు చుంటయకాని
  నాస్తియ న్వచన మే♦నాఁడు లేదు
అనిశంబు దీనార్తి ♦ నాలించుటయకాని
  పెడచెవిఁ బెట్టు టె♦న్నఁడును లేదు
తే. గీ. ఇట్టి సుగుణాళిచే రాజ్య ♦ మేలు చుండు
  కీర్తిచంద్రుండు మందస♦క్షితివరుండు
  దానరాధేయతుల్యుండు ♦ శ్రీనివాస
  రాజమణిరాజదేవధ♦రావిభుండు॥

సీ॥ అనుపమారోగ్యభా♦గ్యం బనవరతంబు
  నొప్ప బ్రహ్మాంత♦యాయువును గలిగి
యింద్రవైభవమున ♦ కెన యైన విభవాతి
  శయముచే మీరు రా♦జ్యంబు గలిగి
దోసపంటవిధానఁ ♦ దోర మై సుగుణాళిఁ
  దులలేని పుత్రపౌ♦త్రులును గలిగి
సప్తసంతానాది ♦ సత్కృతుల్ కతమున
  దశదిశవ్యాప్తస♦ద్యశము గలిగి
తే॥గీ॥ పండితౌఘంబు లెడఁ గవి♦ప్రవరు లెడల
  మేదురాదరమతి గల్గి ♦ మించు మయ్య
  దీనమందార మను పేరు ♦ బూనుమయ్య
  మందసారాజ రాజస♦న్మాన్య తేజ॥